శ్రీ

శ్రీ రాజరాజేశ్వరీ దేవ్యైనమః

# గుప్త మంత్ర, యంత్ర, తంత్ర రహస్యములు




సిద్ధాంతి - శిరోభూషణ - పండిత

స్వర్గీయ శ్రీ దోగుపర్తి స్వామి గుప్త సిద్ధాంతి

వేటపాలెం

శ్రీ

శ్రీ రాజరాజేశ్వరీ దేవ్యైనమః

# గుప్త మంత్ర, యంత్ర, తంత్ర రహస్యములు


సిద్ధాంతి - శిరోభూషణ - పండిత

స్వర్గీయ **దోగుపర్తి స్వామి గుప్త సిద్ధాన్తి**

వేటపాలెం



ప్రకాశకులు

**వేంకటేశ్వర పబ్లికేషన్స్**

నెహ్రూ నగర్, 6వ లైను, మెయిన్ రోడ్, గుంటూరు - 1.

✆ 2322 303, 2224 211

మూల్యం : Rs. 600/-

# మంత్ర-యంత్ర-తంత్రముల వివరణము

1. **మంత్రము అనగా : శ్రీ పాంచరాత్ర విష్ణుతిలక సంహిత** యందు -

శ్లో॥ మననాత్ ప్రాణినః త్రాతి యతో మంత్ర ముదీర్యతే ।

తా॥ మననమున తలచినంత మాత్రముననే ఎయ్యది సకల జీవులనూ రక్షించునో - దానిని '**మంత్రము**' అందురు !

2. **యంత్రము అనగా :** నియమ - నిష్ఠలతో నియంత్రించు దానిని '**యంత్రము**' అందురు.

3. **తంత్రము అనగా:** చెడుచేయుట; రహస్యముగా కుట్ర పన్నుట అను అర్థములో నేటి దినములలో చాలామంది వాడుచూవున్నారు కానీ అదియదార్థమైన అర్థము కాదు ! ఆవిధము వాడదానిని 'కుతంత్రము' అనవలెను ! తంత్రము అనుపేరు ఔషధ ప్రయోగమునకునూ, రాజ్యపాలనము నకునూ, దేవాలయ నిర్మాణ-ఉత్సవ-నిత్యారాధనల వివరములు తెల్పు వానికినీ ప్రసిద్ధముగా కలదు !

4. వేదమునకు కూడా **వైదికీ; తాంత్రికీ** అను రెండు పేర్లు కలవు ! అని '**కుల్లూక భట్టు**' తన మనుస్మృతి వ్యాఖ్యలో తెల్పినాడు !

(అ) ఆయుర్వేద వైద్య శాస్త్రమున **వాజీకర తంత్రము, అగద తంత్రము** మున్నగు పేర్లు కలవు !

(ఆ) రాజ్య పాలన విషయమున - **రాజ్యతంత్రము** అనీ **యుద్ధతంత్రము** అనియునూ పేర్లు కలవు !

(ఇ) దేవాలయ ఆగమ శాస్త్రములకు '**తంత్రములు**' అను పేర్లు కలవు !

**శ్రీ పాంచరాత్ర పాద్మ సంహిత యందు -**

శ్లో॥ తనోతి విపులా నర్థాన్ తంత్ర-మంత్ర సమన్వితాన్ ।
త్రాణం చ కురుతే యస్మాత్ : తంత్ర మిత్యభిధీయతే ॥

తా॥ మంత్రముల యందలి రహస్యములను వివరించి, వివిధమగు అర్థములను విపులముగా తెలిపి ఎయ్యది జీవులను కాపాడి వృద్ధి పొందించునో - దానికి 'తంత్రము' అని పేరు కలిగినది !

## మా వద్ద లభించు గ్రంథములు

(కీ॥శే॥) శ్రీ దోగుపర్తి స్వామిగుప్త సిద్ధాంతి గారిచే రచింపబడిన గ్రంథములు

గుప్త వైద్య ప్రకాశిక

గుప్త వాస్తు

గుప్త వాస్తు సామ్రాట్

గుప్త జ్యోతిష్య ప్రభావము

## మా వద్ద లభించు ఇతర గ్రంథములు

శ్రీనివాస ఆరాధన సుధార్ణవము (ఇది అర్చక భిక్షుక సర్వస్వము)

శ్రీ పాంచరాత్ర అర్చక రక్ష 1 వ భాగము

శ్రీ పాంచరాత్ర నిధి 2 వ భాగము

భిక్షుక కాంతి గ్రంథములు 3 వ భాగము

శ్రీ లక్ష్మీ వాస్తు వైభవము

మహిష మర్దని శ్రీ మహాలక్ష్మి

(రచయిత: శ్రీ చిట్టకవి లక్ష్మీ నరసింహాచార్యులు)

## ముఖ్య సూచన

ఈ గ్రంథములందలి విషయములు - పూర్వులైన మహర్షులూ పండితులూ ముఖ్యంగా చాల మంది తెలుపబడి నేటి వరకునూ ఆచరింపబడుచూవున్నవి. వీటిని ఆచరించినందువలన కలుగుచుండునవి మేలునకుగాని, కీడునకు గాని రచయితలూ, ప్రచురణ కర్తలూ ఏ మాత్రమునూ బాధ్యత వహించరని సవినయముగా తెలియపరచుచూ వున్నాము.

ఇట్లు

పబ్లిషర్స్

# మంత్ర - యంత్ర - తంత్ర రహస్యములు

## గణేశాష్టకమ్

ఈ గణపతి అష్టకమును చదువువారు సమస్త విఘ్నములు తొలగిపోయినవారై కార్యసిద్ధిని పొందుదురు. సమస్త పాపములు తొలగిపోయి అనంతరము రుద్రలోకమున కేగుదురు.

శ్లో॥ ఏకదంతం మహాకాయం తప్తకాంచన సన్నిభం,
లంబోదరం విశాలాక్షం వందేఽహం గణనాయకమ్. ౧
మౌంజీకృష్ణాజినధరం నాగయజ్ఞోపవీతినం,
బాలేందు విలసన్మౌళిం వందేఽహం గణనాయకమ్. ౨
అంబికాహృదయానందం మాతృభిః పరిపాలితం,
భక్తప్రియం మదోన్మత్తం వందేఽహం గణనాయకమ్. ౩
చిత్రరత్న విచిత్రాంగం చిత్రమాలా విభూషితం
చిత్రరూపధరం దేవం వందేఽహం గణనాయకమ్. ౪
గజవక్త్రం సురశ్రేష్ఠం కర్ణచామరభూషితం,
పాశాంకుశధరం దేవం వందేఽహం గణనాయకమ్. ౫
మూషికోత్తమ మారుహ్య దేవాసుర మహాహవే,
యోద్ధు కామం మహావీర్యం వందేఽహం గణనాయకమ్ ౬
యక్ష కిన్నెర గంధర్వ సిద్ధవిద్యాధరైస్సదా,
స్తూయమానం మహాత్మానం వందేఽహం గణనాయకమ్ ౭
సర్వవిఘ్నహరం దేవం సర్వవిఘ్న వివర్జితం
సర్వసిద్ధి ప్రదాతారం వందేఽహం గణనాయకమ్ ౮

## శ్రీ లలితా పంచకమ్

ఈ లలితా పంచకమును ప్రభాత సమయములలో చదువుచుండు వారికి ఐశ్వర్యము లభించును. విద్య, శ్రేయస్సు, అపారమైన సౌఖ్యములు, అనంత కీర్తియు లలితాదేవి అనుగ్రహము వల్ల లభించును.

శ్లో॥ ప్రాతః స్మరామి లలితావదనారవిందం
బింబాధరం పృథులమౌక్తిక శోభినాసమ్
ఆకర్ణదీర్ఘ నయనం మణికుండలాఢ్యం
మందస్మితం మృగమదోజ్జ్వల ఫాలదేశమ్. ౧
ప్రాతర్భజామి లలితాభుజ కల్పవల్లీం
రత్నాంగుళీయ లసదంగుళి పల్లవాఢ్యాం
మాణిక్య హేమ వలయాంగద శోభమానాం
పుండ్రేక్షు చాపకుసుమేక్షు సృణీర్దధానామ్. ౨
ప్రాతర్నమామి లలితా చరణారవిందం
భక్తేష్టదాననిరతం భవసింధుపోతం,
పద్మాసనాది సురనాయక పూజనీయం
పద్మాంకుశధ్వజ సుదర్శన లాంఛనాఢ్యమ్ ౩
ప్రాతః స్తువే పరశివాం లలితాం భవానీం
త్రయ్యంతవేద్య విభవాం కరుణానవద్యాం,
విశ్వస్య సృష్టి విలయ స్థితి హేతుభూతాం
విశ్వేశ్వరీం నిగమ వాఙ్మనసాతిదూరామ్ ౪
ప్రాతర్వదామి లలితే తవ పుణ్యనామ
కామేశ్వరీతి కమలేతి మహేశ్వరీతి,
శ్రీశాంభవీతి జగతాం జననీ పరేతి
వాగ్దేవతేతి వచసా త్రిపురేశ్వరీతి । ౫

## మంత్ర సాధకులు, ధ్యానయోగ సాధకులు, గమనించవలసిన విశేష నియమములు

1. సాధకుడు మంత్రమును జపించుటకుగాని, ధ్యానయోగ సాధన చేయుటకుగాని, కూర్చొను స్థలము ఏకాంతముగా నుండవలెను. ఇతరులు లోపలికి వస్తూపోతూ వుండ కూడదు. ఆ స్థలములో ఇతరములగు శబ్దములు వినబడ కూడదు.

2. అత్యవసరముగ చేయవలసిన పనులను వదలిపెట్టి జపమునకుగాని, ధ్యానయోగాభ్యాస సాధనలకుగాని కూర్చొనకూడదు. ఏలనగా ఆకార్యములయందే తలంపు వుండి ఏకాగ్రతకు నిశ్చల చిత్తమునకు భంగము కలుగును.

3. మంత్రజపమునకుగాని, ధ్యానయోగాభ్యాస సాధనలకు గాని కూర్చొనునప్పుడు యితరములగు కార్యములపై మనస్సును పోనియక చేయుపనియందే మనస్సు లయమగునట్లుగా చేయవలెను.

4. ఎంత అవసరము వచ్చినప్పటికి మంత్రజపము నుంచిగాని, ధ్యానయోగాభ్యాస సాధనలనుంచి గాని సాధకుని పిలువ వద్దని యింట్లో వారితో ముందుగానే చెప్పి వుండవలెను.

5. మంత్రమును అనుష్ఠించు రోజులయందుగాని, ధ్యానయోగాభ్యాస సాధనలయందున్న రోజులయందుగాని పూర్తిగా బ్రహ్మచర్యమును పాటించవలెను. సత్యము-అహింస మొదలైన మంచి నియమములను విధిగా పాటించవలెను.

6. మంత్రములుగాని, ధ్యానయోగాభ్యాస సాధనలుగాని సాధించే రోజులలో తేలికగా జీర్ణమగు ఆహారమును తీసుకొనుచుండవలెను. విశేషముగా పండిన పండ్లను తినుచుండవలెను.

7. బద్ధకము చేత ఒక్కపూటైనా మంత్రజపముగాని, ధ్యానయోగ సాధనముగాని మానకూడదు. మానినయెడల ఎన్ని రోజుల నుంచియో శ్రమపడుచున్న దంతయు మొదటికి వచ్చును.

8. మంత్రజపముగాని, ధ్యానయోగాభ్యాస సాధనగాని ప్రారంభించిన కొద్ది రోజులలో అనారోగ్యముగాని, వ్యాధి లక్షణములుగాని, శరీరమునందుగాని, కుటుంబమునందుగాని కలుగుచున్న యెడల సాధకుడు అధైర్యపడ కూడదు. అయినారోగ్యమంతయు సాధన వృద్ధి పొందుచున్న కొలది తొలగిపోవును.

9. ఇంట్లోగాని బంధువులలోగాని విచారకర వార్తలు వినబడిన యెడల సాధకుడు అధైర్య పడకూడదు. అయినారోగ్యమంతయు సాధన వృద్ధి పొందుచున్న కొలది తొలగిపోవును. ఇంట్లోగాని, బంధువులలోగాని విచారకరవార్తలు వినబడిన యెడల అట్టి సంఘటనలకు సాధకుడు దుఃఖపడకూడదు. సాధన విడువకూడదు.

10. మంత్రానుష్ఠానము ధ్యానయోగ సాధన చేయుచున్న

## సంతానవృద్ధి కలిగించు సంతానకవచమ్

ఈ సంతానవృద్ధి కరమైన సంతానకవచమును చదువుచుండుట వల్ల సంతానవృద్ధి, గర్భరక్షణము కలుగును. గొడ్డుబోతు (వంధ్యా) స్త్రీకి కూడ సంతానము కలుగును. కాకవంధ్య, మృతవత్సయగు స్త్రీ కూడ దీర్ఘాయువుగల బిడ్డలను కనును. రజస్వలకాని బాలికలు రజస్వలలగుదురు. గర్భిణీ స్త్రీలు సుఖముగా ప్రసవింతురు. మూత్ర ప్రేతాది బాధలు, కుల దోషము వల్ల కలిగెడి బాధలు గ్రహబాధలు, దేవబాధలు, శత్రువులే కలిగిన బాధలు సమస్త వ్యాధులు, సమస్త బాలగ్రహబాధలు సంపూర్ణముగా తొలగిపోయి సుఖింతురు. దీనిని చదువు వారికి సంతానవృద్ధి యగును.

శ్లో॥ పూర్వేరక్షతు వారాహీ చాగ్నేయ్యామంబికా స్వయం
దక్షిణే చండికా రక్షే నైరృత్యాం శవవాహినీ ।
వారాహీ పశ్చిమే రక్షే ద్వాయవ్యాం చ మహేశ్వరీ
ఉత్తరే వైష్ణవీ రక్షే దీశా నే సింహవాహినీ ।
ఊర్ధ్వంతు శారదా రక్షే దధో రక్షతు పార్వతీ
శాకంభరీ శిరోరక్షేన్ముఖం రక్షతు భైరవీ ।
కంఠం రక్షతు చాముండా హృదయం రక్షతా చ్ఛివా
ఈశానీచ భుజౌ రక్షే త్కుక్షిం నాభించ కాలికా ।
అపర్ణా హ్యుదరం రక్షే త్కటిం వస్తిం శివప్రియా
ఊరూ రక్షతు కౌమారీ జయా జానుద్వయం తథా ।
గుల్ఫౌ పాదౌ సదా రక్షే ద్బ్రహ్మాణీ పరమేశ్వరీ
సర్వాంగాని సదారక్షే ద్దుర్గా దుర్గార్తి నాశినీ ।
నమోదేవ్యై మహాదేవ్యై దుర్గాయై సతతం నమః
పుత్ర సౌఖ్యం దేహిదేహి గర్భరక్షాం కురుష్వమే

ఓం హ్రీం హ్రీం హ్రీం శ్రీం శ్రీం శ్రీం ఐం ఐం ఐం మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీ రూపాయై నవకోటి మూర్త్యై దుర్గాయైనమః ॥ హ్రీం హ్రీం హ్రీం దుర్గార్తినాశిని సంతాన సౌఖ్యం దేహి దేహి, వంధ్యత్వం మృతవత్సత్వంచ హర హర, గర్భరక్షాం కురుకురు, సకల బాధాం కులజాం బాహ్యజాం కృతాం అకృతాంచ నాశయ నాశయ సర్వగాత్రాణి రక్షరక్ష గర్భం పోషయ పోషయ, సర్వోపద్రవం శోషయ శోషయ స్వాహా ॥

సూచన ॥ ఋతుస్నానానంతరము పై కవచముతో ఏడు పర్యాయములు అభిమంత్రించిన నీటిని త్రాగినచో ఆ స్త్రీ గర్భమును ధరించును. గర్భము పోవుచున్న స్త్రీ ఈ మంత్రముతో అభిమంత్రించిన నీటిని త్రాగినచో గర్భము పోదు. గర్భసంబంధమైన బాధలు గల స్త్రీలు ఈ కవచముతో అభిమంత్రించిన నీటిని శరీరముపై న చల్లుకొనినచో ఆ బాధలు అన్నియూ తొలగిపోవును. ఈ మంత్రముతో అభిమంత్రించిన ఎర్రదారమును నడుముకు కట్టుకొనినచో సత్సంతానము కలుగును.

---

## ఋణ విమోచక అంగారక స్తోత్రమ్

### ఇది చేసి ఫలితమును నిదర్శనము చూచుకొనుడు

ఋణగ్రస్తులైనవారు, ఎంత శ్రమపడినప్పటికిని ఋణ విముక్తి పొందలేకున్న వారు ఈ దిగువ చెప్పిన విధముగా అంగారకుని పూజించి స్తోత్రము చేసిన యెడల క్రమ క్రమముగా ఆదాయము వృద్ధియై ఋణమంతయూ పూర్తిగా తీరిపోవును. దారిద్ర్య బాధలు ఉండవు. ధనభాగ్యములు వృద్ధి చెందును. ఇది అనుభవసిద్ధమైన విధానము, దీనిని చేసి ఫలితమును పొందుడు. ఒక పీటమీద ఎర్రని గుడ్డపరచి దానిపై అంగారకుని పటమునుగాని, విగ్రహమును గాని పెట్టి మధ్యలో మూడుకోణాలుగా ఎర్రని కుంకుమతో త్రిభుజాకారముగా వేసి, ఎర్రని గంధము ఎర్రని పువ్వులతో ఈ దిగువను వ్రాసిన అంగారకుని నామములతో పూజించి సాంబ్రాణి వత్తిని వెలిగించి ధూపమువేసి చంద్ర బొగ్గులు అనగా చంద్ర కర్ర కాల్చిన బొగ్గుతో ఈ దిగువను వ్రాసిన విధముగా గీతలుగీసి ఆ గీతల మధ్య వారు ఇవ్వదలచిన, ఎందరెందరికు ఎంత ఎంత మొత్తములు అప్పులు పడి వున్నారో ఆ ఋణముల మొత్తమును అంతయువ్రాసి స్తోత్రమును, భక్తితో చేతులు జోడించు కొని చదువుచు తన ఎడమ అరికాలిని మడమతో సహితంగా ఆ గీతలపై నను ఆ ఋణసంఖ్య పైనను పెట్టి తుడిచి వేయవలెను. తరువాత అర్ఘ్యం ఇవ్వవలెను. బెల్లమునుగాని, బెల్లముతో కలిపిన అన్నమునుగాని నివేదన చేయవలెను. ఈ విధముగా ప్రతినిత్యము నలభై రోజులు చేసిన యెడల క్రమక్రమముగ పూర్తిగా ఋణవిముక్తిని పొందుటే గాక సకలైశ్వర్యములు పొందుదురు.

### ఈ నామములతో పూజించవలెను

ఓం మంగళాయనమః ఓం భూమిపుత్రాయనమః ఓం ఋణహర్త్రేనమః ఓం ధనప్రదాయనమః ఓం స్థిరాసనాయ నమః ఓం మహాకాయాయనమః ఓం సర్వకామఫలప్రదాయ నమః ఓం లోహితాయనమః ఓం లోహితాక్షాయనమః ఓం సామగాన కృపాకరాయనమః ఓం ధరాత్మజాయనమః ఓం కుజాయనమః ఓం భౌమాయనమః ఓం భూమిజాయనమః ఓం భూమినందనాయనమః ఓం అంగారకాయనమః ఓం యమాయనమః ఓం సర్వరోగాపహారకాయనమః ఓం వృష్టికర్త్రే నమః ఓం వృష్టిహర్త్రే నమః ఓం సర్వదేవ పూజితాయ నమః అని పూజించి నివేదన చేయవలెను. తరువాత ఈ దిగువ చూపిన విధముగా చంద్ర బొగ్గుతో గీతలు గీసి ఋణసంఖ్యలు వ్రాయవలెను.

రు. 3465-00

దిగువన ఈ దిగువ చెప్పబడిన స్తోత్రమును పఠించుచూ గీతలను ఋణసంఖ్యను ఎడమకాలి పాదముతో పూర్తిగా తుడిచి వేయవలెను.

స్కంద ఉవాచ ।

ఋణగ్రస్త నరాణాంతు ఋణముక్తిః కథంభవేత్ ।

బ్రహ్మోవాచ ।

వక్ష్యేఽహం సర్వలోకానాంహితార్థం హితకామదమ్ ।

ఓం అస్య శ్రీ అంగారకస్తోత్ర మహామంత్రస్య గౌతమ ఋషిః, అనుష్టుప్ఛందః, అంగారకోదేవతా, మమ ఋణ విమోచనార్థే జపే వినియోగః, ధ్యానమ్ రక్తమాల్యాంబర ధరః శూలశక్తి గదాధరః, చతుర్భుజో మేషగతో వరదశ్చధరా సుతః మంగళో భూమిపుత్రశ్చ ఋణహర్తా కృపాకరః। ధరాత్మజః కుజోభౌమో భూమిజో భూమినందనః। అంగార కోయమశ్చైవ సర్వ రోగాపహారకః వృష్టి కర్తాచ హర్తాచ సర్వదేవైశ్చ పూజితః। ఏతాని కుజనామాని నిత్యం యః ప్రయతః పఠేత్ । ఋణం నజాయతే తస్య ధనం ప్రాప్నోత్య సంశయః । అంగారక మహీపుత్ర భగవన్ భక్త వత్సల నమోస్తుతే మమాశేష ఋణమాశు విమోచయ । రక్త గంధైశ్చ పుష్పైశ్చ ధూప దీపై ర్గుడోదనైః । మంగళం పూజయిత్వాతు మంగళాహని సర్వదా । ఏకవింశతి నామాని పఠిత్వాతుతదంతికే । ఋణరేఖా ప్రకర్తవ్యా అంగారేణ తదగ్రతః । తాశ్చ ప్రమార్జయేత్పశ్చా ద్వామపాదేన సంస్పృశన్ । మూలమంత్రః । అంగారక మహీపుత్ర భగవన్ భక్త వత్సల। నమోస్తుతే మమాశేష ఋణమాశు విమోచయ । ఏవం కృతే నసందేహో ఋణం హిత్వా ధనం లభేత్ । మహతీం శ్రియ మాప్నోతి హ్యపరో ధనదోయువా । అర్ఘ్యమ్ । అంగారక మహీపుత్ర భగవన్ భక్తవత్సల । నమోస్తుతే మమాశేష ఋణ మాశు విమోచయ । భూమిపుత్ర మహాతేజ స్స్వేదోద్భవ పినాకిన ॥ ఋణార్తస్త్వాం ప్రపన్నోఽస్మి గృహాణార్ఘ్యం నమోస్తుతే ।

ఈ విధముగా స్తోత్రము చేసి లోపలితో మూడుసార్లు అర్ఘ్యముతో నీళ్ళు విడిచి పెట్టవలెను.

అభిమంత్రించి దృష్టిదోషము తగిలిన వారికిగాని భూత ప్రేత పిశాచ బాధలుగలవారికిగాని నోసటను బొట్టుపెట్టి కొంతెము పొట్టకు వీపుకు వ్రాసి మిగిలిన విభూతిని గాలిలోకి ఊదిన యెడల ఎంతటి దృష్టిదోషమైనా తగ్గిపోవును. ఈ విధముగా ఉదయం సాయంకాలము చేయుచుండిన యెడల భూతప్రేత పిశాచ బాధలు పూర్తిగా కొద్దిరోజులలోనే తగ్గిపోవును.

## ముట్టుదోషము తగిలిన బిడ్డలకు మంత్రము

మూలమంత్రము : ఓం నమోభగవతి హ్రాం హ్రీం హ్రూం అఘోర వీర శరభ శార్దూల ప్రళయ కాల రుద్ర వీరావతార విశ్వరూపాయ ఖేం ఖేం ఖేం భూత భేతాళ ప్రేతపిశాచ శాకినీ ఢాకినీ బ్రహ్మ రాక్షస గ్రహ భయ హారణాయ భ్రోం భ్రోం రాం రాం హుం ఫట్ స్వాహా ।

విధానము : ఈ మూలమంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన సిద్ధించును. తరువాత ఈ మంత్రముతో మూడుసార్లు విభూతిని బ్రహ్మదండి వేరును మంత్రించి ఆ విభూతిని తిలకముగా నుదుటను పెట్టి, వీపుకి కడుపుకి కొంతెము వ్రాసి, ఆ బ్రహ్మదండి వేరును కుడిచేతికి దారముతో కట్టిన యెడల ముట్టుదోషము గ్రహదోషములు భూత పిశాచ బాధలు మొదలైన అన్ని బాధలు సందేహము లేకుండా తొలగిపోవును.

## స్ఫోటకము తగిలిన వారికి శీతలా దేవత మహామంత్రము

మూలమంత్రము : శీతలే త్వం జగన్మాతః శీతలే త్వం జగత్ పితా శీతలే త్వం జగద్ధాత్రి శీతలాయై నమోనమః । ఓం హ్రీం శీతలే స్ఫోటకాం వినాశయ వినాశయ । శమయ శమయ । తంతూన్ ఛేదయ ఛేదయ । జ్వరం హర హర వ్యష్టం కురుకురు । ఓం హ్రీం శీతలే స్వాహా । ఓం హ్రీం శ్రీం శీతలాయైనమః । ఓం హ్రీం హ్రాం హ్రూం ఖేం ఖేం హ్రైం భ్రాం భ్రాం హ్రాం హ్రాం శ్రీం శ్రీం శ్రీం శీతలే ధం ధం జ్వల జ్వల ఠః ఠః ఫం ఫం ధుం ధుం హుం హుం దుర్గింఫట్ స్వాహా । శ్రీ శీతలా పరమేశ్వరీ దేవతాయై నమః ।

విధానము : ఈ మూలమంత్రమును నూట ఎనిమిది సార్లు జపించినయెడల సిద్ధించును. తరువాత స్ఫోటకము తగిలిన వారికి వేపమండలతో విసురుచును మంత్రమును మూడుసార్లు లేక అయిదుసార్లు గాని మనస్సులో పఠించుకొనుచుండవలెను. ఈ విధముగా ఉదయం సాయంకాలము మూడు రోజులు చేసిన యెడల ఎంతటి ఉధృతమైన మసూరికము స్ఫోటకము అయినా శీతల దేవతా కృపవలన పూర్తిగా తగ్గిపోవును. సందేహము లేదు.

## మారీ స్ఫోటక ప్రయోగాది బాధా నివారణకు శీతలాపరమేశ్వరీ మహామంత్రము

స్తోత్రం : వందే గురుపద ద్వంద్వ మవాఙ్మానస గోచరం, రక్త శుక్ల ప్రభామిశ్రమ తర్క్యం త్రైపుర మహః శ్రీ పాదాదిగురుత్రయం గణపతిం పీఠత్రయం భైరవం, సిద్ధౌఘం బటుకత్రయం పదయుగం దూతీక్రమం మండలం, వీరాద్యష్ట చతుష్క షష్టి నవకం వీరావళి పంచకం, శ్రీమన్ మాలినీ మంత్రరాజ సహితం వందేగురోర్మండలం । నమామి శీతలాందేవీం రాసభస్థాం దిగంబరాం, సూర్యచంద్రకళో పేతాం సూర్పాలంకృత పాండవాం, రక్తమాల్యాంబరధరాం రక్తాభరణ భూషితాం । త్రిశూలం డమరుంచైవ కపాలం ఖడ్గ పాణినీః । దంష్ట్రాకరాళవదనాం వైరి ప్రాణాపహారిణీం । యాం స్మృత్వా నివర్తంతే స్ఫోటకం భయనాశినీం । స్ఫోటకాది ప్రశమనీం వందేహం శీతలాంభజే ।

మూలమంత్రము : ఓం హ్రీం శ్రీం శీతలేస్ఫోటకాదీన్ వినాశయ వినాశయ విదాహం శమయ శమయ శమయితుం ధం యం యం ఖేం ఖే (గోత్రనామధేయస్య) శరీర ఉపద్రవ నానావిధ ప్రయోగ గ్రహాన్ భూతప్రేత పిశాచ బ్రహ్మ రాక్షస సకల ప్రబలంధక గ్రహాన్ సర్వ కూరాది కృత్రిమ సకలరోగ గ్రహాన్ ఖేం ఖేం యం యం ధం ధం తంతూన్ ఛేదయ ఛేదయ జ్వరం జ్వరం హర హర పం పం కురు కురు ఓం హ్రీం హ్రూం శ్రీం శీతలే పరమేశ్వరీ దేవతా సర్వోపద్రవాన్ ఛింది ఛింది ఖేం ఖేం ఘే ఘే హుం హుం ఫట్ ఫట్ స్వాహా ।

స్తోత్రం : ఓం పరమపదనాధ! పరమాత్మ! పరమ పురుష! విరజయము నీ చరణం చేరుహాములు స్మరణ చేసెద మీ కృపామృతము నాసి కరుణతో బ్రోవు పరబ్రహ్మపరమ పురుషా ।

విధానము : పైన వ్రాసిన స్తోత్రము మూల మంత్రము పూర్తిగా నూట ఎనిమిదిసార్లు పఠించిన యెడల సిద్ధించును. తరువాత విభూతిని గాని ఉదకమును గాని ద్రాక్షారసము గాని పటిక బెల్లముగాని మూడుసార్లు గాని లేక ఐదుసార్లుగాని పైన వ్రాసిన స్తోత్రముతో మంత్రించి వ్యాధిగ్రస్తునకు ఇచ్చుచున్నయెడల సర్పభూతం, విరిగా మసూరం, శిరశ్శూలం మొదలగు కూడవ్యాధులు, మారీ, స్ఫోటకాది వ్యాధులు, భూత ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ మొదలగు గ్రహబాధలు, సర్వ జ్వరాలు, కలరా, ప్లేగు మొదలగు వ్యాధులు, చిల్లంగి చేతబడి మొదలుగాగల ప్రయోగ బాధలు పూర్తిగా నయమయి పోవును.

పైన వ్రాసిన మూలమంత్రములో గోత్ర నామములు అను చోట మంత్రసిద్ధిని చేసుకొనువారు వారి గోత్ర నామములను చెప్పుకొని జపము చేసి సిద్ధిచేసుకొనవలెను. తరువాత రోగికి మంత్రించి యిచ్చుచున్నప్పుడు ఆ రోగి గోత్ర నామములను చెప్పి మంత్రించి యివ్వవలెను.

## సర్వోపద్రవములు శాంతింపచేసి అద్భుత ఫలితముల నొసంగు శూలినీ దుర్గాదేవతా మహామంత్రము

మూలమంత్రము : ఓం నమో భగవతి జ్వల జ్వల శూలినీ (దేవదత్తం) బాధిత సకల దుష్టగ్రహాన్ నాశయ నాశయ ఐం హ్రీం క్రోం శ్రీం క్లీం బ్లూం ఐం హ్రీం క్రోం హుంఫట్ స్వాహా । ఓం హ్రీం దుం జ్వల జ్వల ప్రతి క్రియా శూలినీ దుర్గాదేవతాయై నమః । ఓం హ్రీం హ్రాం హ్రాం శ్రీం శ్రీం శూలినీ ధం ధం జ్వల జ్వల ఠః ఠః వం వం దుం దుం హుం హుం దుర్గే ఫట్ ఫట్ స్వాహా । ఓం నమో ఆదిపరంజ్యోతి అంతర్యామాయై మహాకాశ వ్యరూపాయై అనంతకోటి మహామండలే మండిత ప్రకాశ తేజోమయాయై । అనంత విద్యా విలాసాయ, అనంత బ్రహ్మాండ భాండోదరాయ, అనంత కళ్యాణ గుణామృత వాక్పూరా భూషణాయ । మమ హృదయాంతర నివాసాత్మనం । మహాకాళీ దరితాయ । క్లీం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం సర్వబ్రహ్మాయ మహారాజాధి విద్యుత్ సహా సర్వ సహాయాం స్థితి ప్రక్షాం మమవశంకురు కురు । సర్వేషాం శత్రువాదినాం జిహ్వా స్తంభనం కురు కురు । అనంత మహాశక్తి సంయుక్త ముక్తి స్వరూపాయ మమ సర్వాభీష్ట ఫలప్రదాయ మమసకల కార్యసిద్ధిం కురు కురు । సర్వనాథాయ నమోనమః స్వాహా ।

ఓం దుర్గాదేవ్యైచ విద్మహే । ఓం దుష్టారిష్టాయధీమహి । ఓం తన్నోదుర్గా ప్రచోదయాత్ । ఓం సరోజమహాపదం । ఓం విశ్వరూపాయ విద్మహే విరాట్ రూపాయ ధీమహి తన్నో దుర్గా ప్రచోదయాత్ సరోజమహాపదం । ఓం ప్రతిక్రియాయై విద్మహే ఓం ప్రతికూలిన్యైచ ధీమహి తన్నో దుర్గా ప్రచోదయాత్ । సరోజమహాపదం । ఓం ఆదిశక్త్యైచ విద్మహే ఓం అమృతాంబరాయై ధీమహి । తన్నో దుర్గా ప్రచోదయాత్ । సరోజమహాపదం ।

ఇది మోక్షమంత్రమున్నా శ్రీ భగవానుని మంత్రము. ఇది దీర్ఘాయుష్యు, కాంతి, ఐశ్వర్యము, తృప్తి, తుష్టి, మోక్షముల నిచ్చును.

నీ జన్మదినమున ఈ మంత్రమును ఒక లక్షసార్లు ఉచ్చరించుము. లేదా పదివేలసార్లైన ఉచ్చరించుము. హోమము చేసి సాధువులకు, దీనులకు, రోగులకు అన్నదానము చేయుము. అట్లు చేసిన నీకు ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రాప్తించును.

## శ్రీ పద్మావతీ మంత్రము

మూలమంత్రము : "ఓం హ్రీం నమః"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును.

ఫలము : తరువాత పై మంత్రమును ప్రతి నిత్యము నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచున్న యెడల సర్వజన వశ్యకర్షణం, ధనలాభము, కార్యసాఫల్యము కలుగుచుండును. సాధకులకు ఈ మంత్రము కల్పవృక్షము వంటిది. సాధనచేయు కొలది ఇట్టి ఫలితములను అధికముగ కలుగు జేయుచుండును.

## స్థావర విషహర మంత్రము

మూలమంత్రము : "కో సం హసః హంసః"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రము చేత నూట ఎనిమిది సార్లు అభిమంత్రించబడిన మంచినీటిని విషగ్రస్తులచే త్రాగించుచున్న యెడల నాభి, పాషాణము, నల్లమందు మొదలైన విషములను తిన్నవారిని మరణావస్థ నుండి రక్షించును.

పిప్పళ్ళు, సైంధవలవణము, మిరియాలు, వేపగింజలు, సమ భాగములుగా చేర్చి, నీళ్ళతో మర్దించి, మూడు తులముల ప్రమాణము చొప్పున మూడేసి గంటలకొకసారి చొప్పున త్రాగించుచుండిన యెడల అన్నిరకములగు పాము విషములను హరింపజేయును.

## సర్ప విషహార మంత్రము

మూలమంత్రము : "ఓం నమో రత్నత్రయాయ అమలే విమలే! స్వాహా !"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత, పై మంత్రముతో నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన మంచినీటిని, త్రాగించి సాధకుడు తన చేతి వేళ్ళతో పాముకాటుపై నుండి దిగదుడిచిన ఎడల సర్వసర్ప విషములను హరించును.

## సర్పము కరవకుండా వుండేందుకు మంత్రము

మూలమంత్రము : "క్షి"

విధానము : సర్పము కనబడినప్పుడు, పై మూల మంత్రమును, మనస్సునందు స్మరించుచుండిన యెడల సర్పము కరవకుండా దూరముగా పారిపోవును.

## పగబట్టిన పాము రాకుండా వుండేందుకు మంత్రము

మంత్రము : "ఓం కురుకుల్లే ! మాతంగేబరాయ శీఘ్రం వారయ వారయ హ్రీం ఫట్ స్వాహా !"

విధానము : పదివేలసార్లు జపించిన యెడల మంత్రము సిద్ధించును. తరువాత పై మంత్రముచేత నూట ఎనిమిది సార్లు అభిమంత్రించబడిన యిసుకను ఇంటి చుట్టూ చల్లిన యెడల పగబట్టిన పాము ఇంట్లోకి రాకుండును. యిళ్ళ దొడ్లలో వుండేసర్పములు కూడా పారిపోవును.

## తేలు విషనివారణ మంత్రము

మూలమంత్రము : "ఓం కం ఖం ఫట్ స్వాహా !"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత, పై మంత్రముచేత, ఇరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన నీళ్ళను త్రాగించిన యెడల తేలుకుట్టినచోట కూడా బాధలేకుండా వెంటనే తగ్గును.

## తేలు విషం హరించుటకు తంత్రము

పత్తిరుంపను మొత్తగానూరి తేలుకుట్టినచోట వేసి కట్టిన యెడల కుట్టినచోట కూడా బాధలేకుండా నిమిషములమీద తగ్గిపోవును.

## తేలు కాటుకు విచిత్ర మంత్రము

మూలమంత్రము : "ఓం హృదయే ఠః ఠః !"

విధానము : పై మంత్రమును భ్రూమధ్యస్థానమును చూచుచు పదివేలసార్లు జపించినయెడల సిద్ధించును. తరువాత కొంచెం వెన్న చేతను తీసుకుని పై మంత్రము చేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి ఆ వెన్నతో తేలుకాటు నుంచి శరీరముపైకి దిగదుడిచిన యెడల విషము పై కెక్కును. ఆ వెన్నతో క్రిందికి దిగదుడిచిన యెడల విషము క్రిందికి దిగిపోవును.

## కుక్క కాటుకు మంత్రము

మూలమంత్రము : "ఓం ఠః ఠః స్వాహా !"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాతపై మంత్రముచే ఇరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన మంచినీటిని పిచ్చికుక్క కరచిన వారిచేత త్రాగించి, సాధకుడు కాటుపై తనచేతితో తుడిచిన యెడల పిచ్చికుక్క విషము హరించును.

## కామెర్లు హరించుటకు మంత్రము

మూలమంత్రము : "ఓం రాం రీం రూం రైం రౌం ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత ఇరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన నీళ్ళను త్రాగించుచుండిన యెడల కామెర్ల వ్యాధి వారము రోజులలో హరించిపోవును.

## తలనొప్పికి మంత్రము

మూలమంత్రము : "ఓం క్లాం క్లీం క్లైం హ !"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత ఇరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన మంచినీళ్ళను త్రాగించిన యెడల తలనొప్పి వెంటనే హరించును.

## పార్శ్వపు నొప్పికి మంత్రము

మూలమంత్రము : "ఓం ఉదితోభగవాన్ సూర్యః పద్మాక్షి వృక్షకేతను అదిత్యస్య ప్రసాదేన అముకస్యార్ధ పాదవం / పార్శ్వ బాధాం । నాశయ నాశయ స్వాహా !"

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రములో అముకస్య అనుచోట పార్శ్వపు తలనొప్పి వచ్చిన వారి పేరును చేర్చి ఈ మంత్రమును, కుంకుమ పువ్వు నూరిన రసముతో, ఒక కాగితము పై వ్రాసి, వారిపేరుతో మంత్రము వ్రాయబడినదో వారి చెవికి కట్టిన యెడల పార్శ్వపు తలనొప్పి తగ్గుముఖమై తగ్గిపోవును.

## కడుపు నొప్పి పోగొట్టే మంత్రము

మూలమంత్రము : "ఓం ఇటి మిటి భస్మంకరి స్వాహా"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచే యిరవై ఒక్క సార్లు అభిమంత్రించబడిన మంచినీటిని త్రాగించు చుండిన యెడల అన్నిరకములైన కడుపు నొప్పులు, శూలలు నిమిషంలో తగ్గిపోవును.

## గుర్రపు వాతము పోగొట్టే మంత్రము

మూలమంత్రము : "ఓం చంద్రపరిశ్రమః చంద్ర పరిశ్రమః స్వాహా !"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత మూరెడు ప్రమాణముగల రెల్లుగడ్డిని తీసుకొని పై మంత్రముచే యిరవై ఒక్కసార్లు అభిమంత్రించి, ఆ రెల్లు పుల్లతో వీపుపై నెమ్మదిగా మూడుసార్లు కొట్టవలెను. గుర్రపు వాతము వెంటనే తగ్గును. ఈ ప్రకారముగా యిరవై ఒక్క రోజులు చేసిన యెడల గుర్రపు వాతము నిశ్శేషముగా హరించును.

## మొండి కురుపులు, గడ్డలు, పుండ్లు హరించే మంత్రము

మూలమంత్రము : 'ఓం క్షేమస్వాహా యః యః యః ఫట్ స్వాహా'

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లుజపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన నేతిని కురుపులు, గడ్డలు, పుండ్లపై లేపన మొనరించిన యెడల వ్రణాదులు బహాత్వరగా మానిపోవును.

## శాకినీ, ఢాకినీ నివారణ మంత్రము

మూలమంత్రము : 'ఓం హ్రీం గ్రాం హంఫట్ స్వాహా !'

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రము చేత యిరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన నీళ్ళను దయ్యములు పట్టిన వారి నెత్తిపై జల్లిన యెడల శాకినీ, ఢాకినీ భూత గ్రహములు విడిచిపోవును.

## భూత నివారణ తంత్రము

కొంతి కొమ్మును నీళ్ళతో సన్నగా నూరి వాళ్ళచిక్కలు ముక్కులో వేసిన యెడల భూత, ప్రేత, పిశాచాది గ్రహములు పారిపోవును. మరియు పై ఔషధమును, రెండు తులముల ప్రమాణము భూతగ్రస్తుంచేత త్రాగించవలెను.

## దయ్యమును వదలించే మంత్రము

మూలమంత్రము : "క్లైం వ్లీ వ్లీ స్వాహా"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రము చేత యిరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన నీళ్ళను దయ్యము పట్టిన వారిపై జల్లు చుండిన యెడల దయ్యములు వదలిపోవును.

మూలమంత్రము : "ఓం ఆపదివ్రతేనేవ్ నివృత్తాయ స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లు జపించినయెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత అరవై వాళ్ళ బహాలింజలను అభిమంత్రించి దయ్యము పట్టినవారి తలచుట్టూ త్రిప్పి బహాలను నీళ్ళతో నిండిన మూకుడులో వేయవలెను. నీళ్ళపై తేలినగింజలు సరిసంఖ్యలో ఉన్న యెడల శాకినీ గ్రహమనియూ బేసిసంఖ్యలో వున్న యెడల భూత గ్రహమనియూ తెలుసుకొనవలెను. ఒక బహాగింజ గూడా నీళ్ళపై తేలని యెడల దయ్యము పట్టలేదని తెలుసుకోవలెను. తరువాత పై మంత్రముచేత ఒక రోజును ఏడుసార్లు అభిమంత్రించి చీపురుకట్టతో కొట్టుచున్న యెడల దయ్యము అరుచుచూ అడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పి తిరిగి రాకుండా పారిపోవును. ఇది అనుభవమంత్రము.

## నిద్రలో పళ్ళుకొరకటం హరించే మంత్రము

మూలమంత్రము : క్లీం హర హర భ్రమ భ్రమ చక్రుః స్వాహా

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లు జపించిన సిద్ధించును. తరువాత రెండు పోకచెక్కలను, పై మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి బుగ్గను పెట్టుకొని నిద్రించిన యెడల రాత్రి నిద్రలో పళ్ళు కొరకటం వ్యాధి హరించును.

## కారాగార విమోచన మంత్రములు

మూలమంత్రము : "ఓం హిలి హిలి నమః స్వాహా"

విధానము : పై మంత్రమును ప్రతి నిత్యము వెయ్యిన్నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచుండిన యెడల మూడు వారములలో కారాగారము నుండి విమోచనము కలుగును.

మూలమంత్రము : "క్లైం నమోరత్నత్రయాయ మోచిని మోచిని! మోక్షణి మోక్షణి! మిలి మిలి మోక్షయ మోక్షయ జీవం స్వాహా"

విధానము : పై మంత్రమును ప్రతినిత్యమూ అనుక్షణమూ విడవకుండా జపించుచుండిన యెడల ఒక వారం రోజులలో కారాగారము నుండి విమోచనము కలుగును.

మూలమంత్రము : "ఓం చాముండే! జ్వలహానే! హుంఫట్ ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును ప్రతి నిత్యమూ వెయ్యిన్నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించు చుండినయెడల కారాగార విమోచనము లభించును.

## చేతబడి పోగొట్టే మంత్రము

మూలమంత్రము : 'ఓం హరిశ్లీం గరుడశ్లీం చాముండా శ్లీం దుష్టపీడన చిలచిలాంత ఉచ్ఛ్వసాపా"

పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన మంచినీళ్ళను త్రాగించిన యెడల పరమంత్ర, పరయంత్ర, పరతంత్రములు, చేతబడులు సమూలంగా హరించి పోవును.

## దారిద్ర్యము, వ్యాధులు, అకాలమరణములు హరించే మంత్రము

మూలమంత్రము : ఓం నమోభగవతే ఓంకారనాథాయ తంత్రే ఉపసూనాని ఠఃఠఃఠః, జీరాదా సిమా ఇహ అభిధయంతు స్వాహా

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత ప్రతి నిత్యము నూట ఎనిమిదిసార్లు జపించుచుండవలెను. పై మంత్రము చేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన యిసుకను గాని, అక్షతలను గాని ఇంట్లో జల్లిన యెడల ఆ ఇంట్లో వ్యాధులు లేకుండా పోవును. పై మంత్రమును కుంకుమ పువ్వు రసముచే ఒక కాగితము పైన వ్రాసి, ఆ కాగితమును ఇంట్లో ఒక స్తంభమునకు కట్టిన యెడల ఆ ఇంటియందు దారిద్ర్యము లేకుండా అపమృత్యువులు జరుగకుండా కాపాడుచుండును.

## సభావశీకరణ మంత్రము

మూలమంత్రము : "ఓం క్రోం స్వాహా ।"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రమును ఆదివారమునాడు కుంకుమ పువ్వు, గోరోజనము కలిపి నూరిన రసముతో ఒక కాగితముపై వ్రాసి ఒక రాగితాయెత్తులో పెట్టి సాధకుడు ఆ తాయెత్తును తన కుడిచేతికి కట్టుకున్న ఎడల సభల యందు గౌరవము, అధికారి వశీకరణ, ఎక్కడికి వెళ్ళినా జయము లభించును.

## సర్వజన వశీకరణ మంత్రము

మూలమంత్రము : ఓం హ్రీం క్రోం హ్రీం హ్రాం ఫట్ స్వాహా.

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత యిరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన తాంబూలము, పండు లేక పువ్వులు ఎవరిచేత కిచ్చిన, వారు సాధకునకు నిశ్చయముగా వశ్యమయ్యెదరు.

## సుఖ ప్రసవకర మంత్ర తంత్రములు

మూలమంత్రము : "ఓం హ్రీం శ్రీం ర్లీం కలికుండ దండస్వామిన్ అగచ్ఛ గచ్ఛ పరవిద్యాచ్ఛేదం కురు కురు స్వాహా ।"

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత యిరవై ఒక్కసారి లేక నూట ఎనిమిది సార్లు అభిమంత్రించబడిన నువ్వుల నూనెను ప్రసవించలేక కష్టపడుచున్న స్త్రీ యొక్క బొడ్డుపై నొసట మొనరించి వంటికి కూడా రాసిన ఎడల వెంటనే సుఖముగా ప్రసవించును. మరియూ వెదురు చెట్టు వేరును, బియ్యపుకడిగిన నీళ్ళతో నూరి త్రాగించినా ప్రసవించలేక కష్టపడుచున్న స్త్రీ వెంటనే సుఖముగా ప్రసవించును.

## వాది ముఖస్తంభన మంత్రము

మూలమంత్రము : "ఓం చిని చిని స్వాహా ।"

విధానము : పై మంత్రమును పదివేల సార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత పై మంత్రము చేత యిరవై ఒక్కసారి అభిమంత్రించబడిన త్రాడును సాధకుడు తాను పడుకునే మంచంకోడుకు కట్టి సభలో వాదించుటకు వెళ్ళిన ఎడల ప్రతివాదుల నందరిని ఓడించి జయము పొందును.

## సర్వగ్రహ శాంతి మంత్రము

మూలమంత్రము : "ఓం హ్రీం సర్వగ్రహాః సోమ సూర్యాంగారక బుధ బృహస్పతి శుక్రశనైశ్చర రాహు కేతు సహితా మమ సానుగ్రహా భవన్తు ఓం హ్రీం అసి ఆ ఉసా స్వాహా ।"

విధానము : పై మంత్రమును వెయ్యినూట ఎనిమిదిసార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత ప్రతినిత్యమూ నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచున్న ఎడల సర్వ గ్రహములకు శాంతి కలిగి సాధకునకు పీడను కలుగజేయకుండా గ్రహములన్నియూ శుభఫలములనే యిచ్చుచుండును.

## దృష్టి దోషములు హరించు మంత్రము

మూలమంత్రము : "దృష్టి మహాదృష్టి నిర్దృష్టి స్వాహా ।"

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత పై మంత్రముచే యిరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన కుంకుమను నుదుట బొట్టుపెట్టిన యెడల సమస్తమైన దృష్టిదోషములు పరిహరింపబడి ఆరోగ్యము కలుగును.

## సర్వజన వశీకరణ మంత్రము

మూలమంత్రము : "క్లీం రాజా ముఖి రాజాదిముఖి వశ్య ముఖి వశ్యాదిముఖి వశ్యాదిముఖి ఓం శ్రీం హ్రాం క్లీం క్లాం సర్వజనవశ్య ముఖద్వయం మమవశం కురుకురు స్వాహా ।"

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత ప్రాతఃకాలమున దంత ధావనానంతరము పై మంత్రముచే దోసెడు నీళ్ళను ఏడుసార్లు అభిమంత్రించి ఎవరిపేరు చెప్పి ముఖము కడుగుకొనెదరో వారు సాధకునకు నిస్సందేహముగా వశ్యులయ్యెదరు.

మూలమంత్రము : "ఓం నిత్యే నిత్యే నిగో నిత్యేబుగ మగ స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత సాధకుడు తన వాయిక చివర ముందు చొంగను కుడిచేతి ఉంగరపు వ్రేలుతో తీసి పై మంత్రముచే యిరవై ఒక్కసారి అభిమంత్రించి నుదుట అరోముఖముగా తిలకము బెట్టుకొన్న ఎడల సర్వజన వశీకరణము కలుగజేయును.

## తలనొప్పిని నివారించే మంత్రము

మూలమంత్రము : "ఓం కహెం కహెం మహేషి సిమహే పిప కరాముసాహెటీమ ఉలార ఘాలన ప్రచండ వీర్ కిక్క ఫుర్"

విధానము : పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత యిరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన నీటిని త్రాగిన ఎడల తలనొప్పి తక్షణమే హరించిపోవును.

## శ్రీ వర్ధమాన సిద్ధ విద్యామంత్రములు

### మొదటి విద్య

మూలమంత్రము : "ఓం బుద్ధాయనమః ।"

విధానము : పై మంత్రమును వెయ్యిన్నూట ఎనిమిది సార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత మార్గ మధ్యమున పోవుచూ రోడ్డుపై నున్న దుమ్ముమూని, వాల్లు కంకర రాళ్ళనుగాని పై మంత్రముచేత యిరవై ఒక్కసార్లు అభిమంత్రించి తన చుట్టూ నాలుగువైపులకు విసిరివేసిన ఎడల శత్రువులవలనగాని, చోరుల వలనగాని బాధకలుగకుండా రక్షించును. ఆ సాధకుడు నిరపాయముగా ప్రయాణము చేయవచ్చును.

### రెండవ విద్య

మూలమంత్రము : "ఓం అటవి అరరాటవి అటేహి మహాటబే లోకపాలేశ స్వాహా ।"

విధానము : పై మంత్రమును ఎనిమిదివందలసార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత ప్రతినిత్యమూ నూట ఎనిమిది సార్లు చొప్పున జపించుచున్న ఎడల దారిద్ర్యమును, వ్యాధులను పోగొట్టును. సంతానాభివృద్ధి కీర్తి, ధన లాభమును కలుగజేయును. నిత్యపాపమును హరించి పుణ్యము ను అభివృద్ధి చేయుచుండును.

### మూడవ విద్య

మూలమంత్రము : "ఓం సంభవే మహాసంభవే సంభూవి మహాసంభావితే ఠః ఠః స్వాహా ।"

విధానము : ఈ మంత్రమును ఎనిమిదివందల ఎనిమిది సార్లు జపించినయెడల సిద్ధించును. తరువాత ఈ మంత్రము చేత పదకొండుసార్లు అభిమంత్రించబడిన గంధమునుగాని, సుగంధ తైలమునుగాని, పండ్లు, పువ్వులుగాని, ఎవరి చేతి కిచ్చిన వారు సాధకునకు వశ్యులయ్యెదరు.

## నాల్గవ విద్య

మూలమంత్రము : "ఓం నందనే అభినందనే సునందనే మహానందనే ఠః ఠః స్వాహా !"

విధానము : పై మంత్రమును వెయ్యి, నూట ఎనిమిది సార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత పై మంత్రము చేత పదకొండుసార్లు అభిమంత్రించబడిన నీళ్ళతో ఎవరి పేరు జెప్పి ముఖము కడుగు కొనెదరో వారు సాధకునకు వశ్యమయ్యెదరు.

## అయిదవ విద్య

మూలమంత్రము : "ఓం నమోసుమవి సుమ భసుమణసే సుసుమణోసే ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యి నూట ఎనిమిది సార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత రాత్రి పడుకొన బోయేటప్పుడు నూట ఎనిమిదిసార్లు జపించి నిద్రించిన ఎడల రాత్రి కలలో 'సుమణస' దేవత సాక్షాత్కరించి సాధకుడు అడిగిన ప్రశ్నలకు భూత భవిష్య ద్వర్తమానములను చెప్పుచుండును.

## ఆరవ విద్య

మూలమంత్రము: "ఓం పమే మహాపమే పతముత్తరే పతముప్పలే పతమువరే పతమసిరి ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును ఎనిమిది వందలసార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత యిరవై ఒక్కసారి అభిమంత్రించబడిన తామరపుష్పమును సాధకుడు తన చేత ధరించి సభలకు వెళ్ళిన ఎడల సర్వజనాకర్షణము, సభయందు గౌరవము లభించును. పై మంత్రము చేత యిరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన తామరపుష్పము ఎవరికి ఇచ్చిన వారు సాధకునకు వశ్యులయ్యెదరు.

## ఏడవ విద్య

మూలమంత్రము : "ఓం హాసే సుహాసే అన్యహాసే మహాహాసే మహాహాసే ఠః ఠః స్వాహా !"

విధానము : పై మంత్రమును వెయ్యి నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత సాధకుడు పై మంత్రముచే తన శరీరమును పదకొండుసార్లు అభిమంత్రించుకొని నిద్రించిన యెడల రాత్రి కలయందు శుభాశుభములు, భూత భవిష్యద్వర్త మానములు తెలియు చుండును. సర్పములు, క్రూర మృగములు, సాధకుని దగ్గరకురాకుండా దూరముగా తొలగిపోవును. ప్రయాణము చేయు సమయములలో ఈ మంత్రమును జపించుచుండిన యెడల అన్ని విధముల రక్షణ కలుగును.

## ఎనిమిదవ విద్య

మూలమంత్రము : "ఓం చందే సుచందే చందప్పహే సుప్పహే అయిప్పహే మహాయప్పయే ఠః ఠః స్వాహా !"

విధానము : పై మంత్రమును వెయ్యి నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచే ఏడుసార్లు అభిమంత్రించబడిన నీళ్ళతో ఎవరి పేరు జెప్పిముఖము కడుగుకొనిన యెడలవారు సాధకునకు వశ్యులయ్యెదరు. మరియు ఒక కన్య పౌర్ణమినాడు రాత్రి ఒక అద్దమును చంద్రునికి ఎదురుగాపెట్టి పై మంత్రము చేత ఆ అద్దమును నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి తనకు కాబోయే భర్త విషయమై ప్రశ్నించిన యెడల ఆ అద్దములో కనబడే చంద్రుడు ఆ కన్యకకు కాబోయే భర్తపేరు తద్వివాహ శుభాశుభఫలితములను ఆ కన్యకు వివరముగా చెప్పును.

## తొమ్మిదవ విద్య

మూలమంత్రము : "ఓం పుష్పే పుష్పే మహాపుష్పే పుష్ప దంతే ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యి నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు మంత్రించబడిన తాంబూలమును గాని, పండ్లు లేక పుష్పములుగాని ఎవరికి యిచ్చినను వారు సాధకునకు నిశ్చయముగా వశ్యులయ్యెదరు. మరియూ పై మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన ఆహారము ఎవరి శిరస్సుపై జల్లిన యెడల వారు సాధకునకు వశ్యులయ్యెదరు.

## పదియవ విద్య

మూలమంత్రము : "ఓం సీయలేహా పవం భేవ్య ఏ విమ్యాటేవిమ్య ఇతినమోభగవ తవి ఠః ఠః స్వాహా !"

విధానము : పై మంత్రమును వెయ్యి నూట ఎనిమిది సార్లు జపించినయెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన మంచినీటిని త్రాగించిన యెడల కడుపునొప్పి, చెవినొప్పి, కంటిబాధ, తలనొప్పి, గడ్డలు, వ్రణములు, మశూచికము, అటలమ్మ, పొంగు వగైరా వ్యాధులు వెంటనే తగ్గిపోవును.

## పదకొండవ విద్య

మూలమంత్రము : ఓం సిల్లంసే సిల్లంసే సుసిల్లంసే మసిల్లంసే సేయంకరే మహాసేయంకరే సహాంకరే సుసహాంకరే ఠః ఠః స్వాహా.

విధానము : పై మంత్రమును వెయ్యి నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత కృష్ణపక్షములో అష్టమినాడు రాత్రి నూట ఎనిమిది తామర పుష్పములతో హోమము చేయవలెను. ఇట్లు చేసిన యెడల మహారోగములైన మొండి వ్యాధులు హరించి ఆరోగ్యము కలుగును. మరియూ పై మంత్రమును ప్రతినిత్యమూ ఎనిమిదిసార్లు చొప్పున జపించుచున్న యెడల కారాగారము నుండి విమోచనము కలుగును.

## పన్నెండవ విద్య

మూలమంత్రము : "ఓం హాసుపుత్రే సుపుత్రే మహాపుత్రే అజపుత్రే పుత్రరీహే ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యి ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత రాత్రి పడుకొనబోయే టప్పుడు నూట ఎనిమిదిసార్లు జపించి నిద్రించిన యెడల భూత భవిష్యద్వర్త మానములు రాత్రి స్వప్నములో నిజముగా కనబడుచుండును.

## పదమూడవ విద్య

మూలమంత్రము : "ఓం అమలే విమలే కమలే కమలిణి విమ్మలే ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యి నూట ఎనిమిది సార్లు జపించినయెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత ఏడుసార్లు అభిమంత్రించబడిన పుష్పములచే ఒక అద్దమును పూజించి ఆ అద్దములో సాధకుడు చూచిన యెడల సాధకుడు తలచిన ప్రశ్నలకు సమాధానములు దృశ్యరూపములుగా కనబడుచుండును. కనబడిన దృశ్యములన్నియూ సత్యముగా జరుగుచుండును.

## పదునాల్గవ విద్య

మూలమంత్రము : "ఓం దమ్మేసు దమ్మే దమ్మ చారిణే సుజయమ్మే తపనదమ్మే అగమదమ్మే దమ్మధారిణే దమ్మదమ్మే తపనదమ్మే ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును ఉపవాసముండి వెయ్యి నూట ఎనిమిదిసార్లు జపించినయెడల సిద్ధించును. తరువాత పై మంత్రము చేత గురువు తన శిష్యునియొక్క శ్రవణము నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించిన యెడల గురువు యొక్క విద్యలన్నియూ శిష్యుని

చెవిలో వినబడుచుండును. మరియూ జరగవలసిన కార్యము లన్నియూ శిష్యునకు సత్యముగా కనబడుచుండును.

### పదిహేనవ విద్య

మూల మంత్రము : "ఓం నమో అనంతే కేవల వాలే అనంతే వలవాహాలే అనంతేగమే అనంతే జేవందరంపనే ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యూ నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత శాస్త్రారంభము శాస్త్రవాదము చేయబోయేముందు రాత్రి ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించి నిద్రించిన యెడల ప్రతివాది చేయబోయే వాదమంతయూ రాత్రి కలలో తెలియు చుండును.

### పదహారవ విద్య

మూలమంత్రము : ఓం సంతి సంతి వసంతి ఉపసంతి సర్వంపాపం ఉపసమేహి ఠః ఠః స్వాహా

విధానము : పై మంత్రమును వెయ్యూ నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన గుగ్గిలమును పొగ వేసిన యెడల దేశమందలి గ్రామముల యందలి మశూచికము కలరా మొదలైన వ్యాధులు వెంటనే హరించి పోవును. ఆవులు గుఱ్ఱములు గేదెలు మొదలైన పశువులకు సంభవించిన ఉపద్రవ వ్యాధులు కూడా హరించిపోవును మరియు పచ్చకర్పూరము మంచిగంధముచే రెండూ కలిపి సూరిసరసములో పై మంత్రమును ఒక కంచు పళ్ళెములో వ్రాసి, తామర పువ్వులతో పూజించుచున్న యెడల లాభము శాంతి కల్గును.

### పది హేడవ విద్య

మూలమంత్రము : ఓం కుంభం దుకుంఠే దుకుంకుంఠే కీదకుందుము ఠః ఠః స్వాహా

విధానము : పై మంత్రమును, వెయ్యూ నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రము చేత ఏడుసార్లు అభిమంత్రించబడిన రొట్టె దుమ్మును ఎవని మీద చల్లిన యెడల వారియొక్క గ్రహబాధలు, భూత, ప్రేత, పిశాచములవల్ల జ్వరాది రోగములు వెంటనే హరించి పోవును. శుభములు కలుగును.

### పద్దెనిమిదవ విద్య

మూలమంత్రము : "ఓం అరణే అరణే అవరణే సయాణే ఏ ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యూ నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రము చేత యిరవై ఒక్కసారి అభిమంత్రించబడిన మంచినీళ్ళను త్రాగి సభకు పోయిన యెడల సర్వజనాదరణము అధికారి వశీకరణము కలుగును. పై మంత్రముచేత యిరవై ఒక్కసారి అభిమంత్రించబడిన పండ్లు లేక పుష్పములు ఎవరికి యిచ్చినను వారు సాధకునకు వశ్యులయ్యెదరు.

### పందొమ్మిదవ విద్య

మూలమంత్రము : "ఓం మల్లి సుమల్లి మహామల్లి జయమల్లి అప్పరమల్లి ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యూ నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రము చేత యిరవై ఒక్కసారి అభిమంత్రించబడిన వస్త్రములనుగాని, ఆభరణములనుగాని, పూలు, పండ్లుగాని ఎవరికి యిచ్చినను వారు సాధకునకు నిశ్చయముగా వశ్యమయ్యెదరు.

### ఇరువదవ విద్య

మూలమంత్రము : "ఓం సువ్య ఏ మహాసువ్య ఏ అనువ్య ఏ మహావ్య ఏ వ ఈ మహాదివాదిత్యే ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యూ నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత క్రూరమృగములైన పెద్దపులి చిరుతపులి, సింహం, తోడేలు, మొదలైన జంతువుల యొక్క మాంసముగాని, కేశములుగాని తెచ్చి కాల్చి బూడిదచేసి, సాధకుడు ఆ బూడిదను తనచేతి వ్రేళ్ళతో ఎవరి పేరు జెప్పి అద్దుకొని పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించునో వారు సాధకునకు నిత్యం దేహముగా వశీభూతులై ఆజన్మాంతము సాధకుడు చెప్పిన పనులన్నియూ జేయుచుందురు.

### ఇరువదియొకటవ విద్య

మూలమంత్రము : "ఓం నమ నమ నామిణే నమామిణే ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును ఏడువందల ఏభై ఆరుసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత ఇరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన పండ్లుగాని, పుష్పములుగాని ఎవరికి యిచ్చినను వారు సాధకునకు నిశ్చయముగా వశ్యమయ్యెదరు.

### ఇరువది రెండవ విద్య

మూలమంత్రము : "ఓం రోహే రోహావర్తే ఆవర్తే వర్తే బరిత్ర, నేమ ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యూ నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రము చేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన గుఱ్ఱమును, గి, ఒంటెను గాని పై కీల్ మొదలైన ఏ వాహనములనుగాని, ఎవరు ఎక్కినను వారు సాధకునకు వశ్యులయ్యెదరు. రెండు అంగుళముల పొడవుగల జాజికపుల్లను పై మంత్రముచే ఇరవై ఒక్కసార్లు అభిమంత్రించి ఆ జాజికపుల్లను పడమటిదిక్కున స్థాపించి ఆ పుల్లకు ఎదురుగా కూర్చుని ప్రతినిత్యమూ పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించుచున్న యెడల వాహనప్రాప్తి, ధన, ధాన్య లాభము సంతానప్రాప్తి, సర్వజన వశ్యకర్షణము మొదలైన శుభఫలములు సాధకునకు నిస్సందేహముగా లభించు చుండును.

### ఇరువది మూడవ విద్య

మూలమంత్రము : "ఓం ఉగ్గే మహా ఉగ్గే ఉగ్గవ సే పాసే పాసే మహాసే పాపమాలినే ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యూ నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత గుగ్గిలమునుగాని సాంబ్రాణిని గాని నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి పొగ వేసిన యెడల గ్రామమునందలి ఇంటి యందలి మశూచి, కలరా మొదలైన అంటు వ్యాధులు హరించును. పై మంత్రముచేత మంత్రించబడిన పండ్లనుగాని పుష్పములను గాని ఎవరికిచ్చిన వారు సాధకునకు వశ్యులయ్యెదరు.

### ఇరువది నాల్గవ విద్య

మూలమంత్రము : "ఓం నమోభగవతే ఆదిపాతే పద్మ మహాస్వామిన ఆసుర తెలుకూ పూర్ణ అప్ప వేగే వేగే మహా వేగే విష్ణుంతే నిరాలంబి సిసి సిసి ఫుహ ఫుహ ఉదయరంతే ఏకి సాసి, అంతరహా ధరాయి మాయి పతితంతు పాపహా ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును వెయ్యూ నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత ప్రతినిత్యమూ నూట ఎనిమిదిసార్లు జపించుచుండవలెను. దొంగలు క్రూరమృగముల వలన బాధ కలిగినప్పుడు, సాధకుడు తన పిడికిలి బిగించి పై మంత్రము చేత ఆ పిడికిలిని యిరవై ఒక్కసారి అభిమంత్రించిన యెడల సాధకుడు చోర క్రూరాదులకు కనబడకుండా అదృశ్యుడై పోవును. సాధకుడు ఏమి కోరినను వర్తమానసిద్ధిని ప్రభావము వలన ఆ వస్తువులన్నియూ సాధకునకు లభించుచుండును.

## శ్రీ కర్ణపిశాచాది మంత్ర తంత్రములు

మూలమంత్రము : "ఓం క్రీంగ పిశాచిని చాముండే స్వాహా"

విధానము : పై మంత్రమును సాధకుడు రావి చెట్టు క్రింద కూర్చుండి రోజుకు పదివేలసార్లు చొప్పున ఒక లక్ష జపము పూర్తి యగువరకు జపించినయెడల సిద్ధించును. ఈ మంత్రసిద్ధి పొందిన వారికి కర్ణపిశాచిని ప్రత్యక్షమై భూత భవిష్యద్వర్తమానములను చెవిలో చెప్పుచుండును.

మరొక విధము : పై మంత్రమును రాత్రిపూట సాధకుడు దిగంబరుడుగా వుండి, పక్కమీద కూర్చుని పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత నూట ఎనిమిది సార్లు అభిమంత్రించబడిన నూనెను పాదములకు, ముఖమునకు రాసుకొని నిద్రించిన యెడల రాత్రి స్వప్నములో సాధకుడు అడిగిన ప్రశ్నలకు కర్ణపిశాచిని సమాధానములు చెప్పుచుండును.

**వశీకరణ తంత్రము :** తెంగల్పకొష్టు, చితియందలి బూడిద ఈ రెండు వస్తువులను సమ భాగములుగా కలిపి పై మంత్రము చేత యిరవై ఒక్కసారి అభిమంత్రించి ఎవరి నెత్తిమీద చల్లినను వారు సాధకునకు వశ్యులయ్యెదరు.

## ధ్రువవశీకరణ మంత్రము

మూలమంత్రము : "ఓం నమో భగవతే ఉడ్డీ శ్వరాయా స్రుమికాయ స్వాహా"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత మంచి గంధము, గ్రంధి తగరము తెంగల్ప కొష్టు, ప్రియంగువు, నాగకేసరములు, నల్ల ఉమ్మెత్త చెట్టుయొక్క కాయ, పువ్వు, ఆకులు, వేరు, చెట్టుపై బెరడు ఈ వస్తువులన్నీ సమముగా కలిపి మెత్తగా చూర్ణించి పై మంత్రము చేత యిరవై ఒక్కసారి అభిమంత్రించి పావు తులము చూర్ణమును తాంబూలము నందుగాని, మిఠాయి మొదలగు తినుబండారములయందుగాని పెట్టి తినిపించిన యెడల వారు స్త్రీగాని, పురుషులుగాని సాధకునకు నిస్సందేహముగా ఆజన్మాంతము వశ్యులై యుండెదరు.

## మహావశీకరణ మంత్రము

మూలమంత్రము : "ఓం హ్రీం ఓం హూం స్వాహా"

విధానము : పై మంత్రమును యిరవై ఒక్కవేలసార్లు జపించిన యెడల సిద్ధించును. పై మంత్రము చేత మారేడు సమిధలను నేతిలో ముంచి పదివేలసార్లు హోమము చేసిన యెడల గ్రామములో నున్న జనులందరు సాధకునకు కింకరులయ్యెదరు. పై మంత్రము చేత మర్రి సమిధలను నేతిలో ముంచి వెయ్యిసార్లు హోమము చేసిన యెడల సాధకుడు కోరుకొన్న స్త్రీ వశ్యమగును.

[illegible], తెంగల్పకొష్టు, కప్పు, సౌవీరాంజనము (సుర్మా రాయి) రొయ్యపీత, మయూరశిఖమూలిక ఈ వస్తువులను సమభాగములుగా తీసుకొని తేనెతో నూరి పై మంత్రముచేత యిరవై ఒక్కసారి అభిమంత్రించి పై ఔషధమును స్త్రీ తన యోనికి లేపనము చేసుకొని భర్తతో సంభోగము చేసిన యెడల ఆ స్త్రీకి తన భర్త వశ్యుడై అన్య స్త్రీలను కోరకుండా వుండును. నువ్వులనూనెలో మాలతీ పువ్వుల చూర్ణమును చేసి కాచి వడియ గట్టి ఆ తైలమును పై మంత్రముచేత యిరవై ఒక్కసారి అభిమంత్రించి స్త్రీ తన యోనికి లేపనము చేసుకొని భర్తతో సంభోగించిన యెడల ఆ స్త్రీకి తన భర్త దాసుడై యుండును.

## కవీశ్వర మంత్రము

మూలమంత్రము : "ఓం హ్రాం వం హ్రాం హ్రాం వద వద వాగీశ్వరి నమః"

విధానము : పై మంత్రమును లక్షసార్లు జపించిన యెడల సిద్ధించును. పై మంత్రమును సిద్ధింపచేసుకొన్న సాధకుడు కవి శ్రేష్ఠుడగును. నిస్సందేహము.

## త్రి శక్తి మంత్రము

మూలమంత్రము : ఓం ఓం ఓం హ్రాం హ్రాం హ్రాం వం వం వం నమః

విధానము : పై మంత్రమును, పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. సాధకుని నోటినుండి కవిత్వము ప్రవాహమువలె వచ్చును. ఇందుకు సంశయము లేదు.

## భగవతీ మంత్రము

మూలమంత్రము : "ఓం నమో భగవతి, కిలికిలి విదాదా భంజని ముఖస్తంభిని ఠః ఠః స్వాహా"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత గ్రంధితగరము, రొయ్యపీత, గోరోజనము, తెంగల్పకొష్టు, పావురముల మలము ఈ వస్తువులను సమభాగములుగా కలిపి నూరి పై మంత్రముచే పదకొండుసార్లు అభిమంత్రించి స్త్రీ తన యోనికి లేపనము గావించుకొని భర్తతో సంభోగించిన యెడల ఆ స్త్రీకి భర్తవశ్యుడై సుఖముగా కాపురము చేయుచుండును.

## సంకెళ్ళు తెగిపోవు తంత్రము

నెమలి, పావురము, కాకి, కౌజుపిట్ట, ఈ పక్షులయొక్క మలమును సమభాగములుగా గ్రహించి నీళ్ళతో నూరి పై మంత్రము చేత పదకొండుసార్లు అభిమంత్రించి యినుప గొలుసులకు యినుపకడ్డీలకు పై రాలకు పూసిన యెడల ఆ యినుప వస్తువులు ముక్కలు ముక్కలుగా విరిగిపోవును. హస్తా నక్షత్రములో కూడి వచ్చిన ఆదివారమునాడు ఉత్తర దిక్కుగా పారిన వారి చెట్టుయొక్క వేరును తీసుకవచ్చి పై మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి ఆ వేరుచేత సంకెళ్ళను రాసిన యెడల ముక్కలు ముక్కలుగా పూడి పడిపోవును.

## వశీకరణ ద్రావిడ మంత్రము

మూలమంత్రము : "ఓం నమో నాగానాయ చక్రధారిణి పిశా ద్రావిడి స్వాహా"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రములో పువ్వులనుగాని, పండును గాని, ఒక వెయ్యిసార్లు అభిమంత్రించి ఎవరికి యిచ్చినా వారు సాధకునకు నిశ్చయముగా వశ్యులయ్యెదరు.

## అరుణ మంత్రము నేత్రరోగహరం

మూల మంత్రము : "ఓం అరుణం హంఫట్ స్వాహా"

విధానము : పై మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత ఏడుసార్లు అభిమంత్రిత బడిన మంచినీళ్ళతో కళ్ళను కడిగిన యెడల అతి దారుణమైన నేత్రబాధలు కూడా హరించి కండ్లు ఆరోగ్యవంతముగా నుండును.

## చించిణీ తంత్రము

మూల మంత్రము : "ఓం చించిణీ పిశాచీ స్వాహా"

విధానము : పై మంత్రమును రోజుకు వెయ్యి నూట ఎనిమిది సార్లు చొప్పున యిరవై ఒక్క రోజులు జపించవలెను.

...ముఖము ధరించి, నిధియున్న స్థలమునందు అర్ధరాత్రి సమయమున కూర్చుండి కాళికా దేవికి, ధూప, దీప, నైవేద్యములు యిచ్చి పూజించి పై మంత్రమును పదకొండు వందల ఎనిమిది సార్లు జపించి కాళికాదేవికి ఎనిమిది పుష్పాంజలులను సమర్పించవలెను. ఇట్లు వారము రోజులు ప్రతి రోజూ మంత్రము జపించిన యెడల ఆఖరు రోజున కాళికాదేవి ప్రత్యక్షమై సాధకునకు నిధికి తీసి యిచ్చును.

## నిధి దర్శనాంజన సిద్ధి

**మూలమంత్రము :** "ఓం హ్రీం యక్షిణీ భామినీ రతిప్రియే స్వాహా"

**విధానము :** సాధకుడు మూడు రోజులు ఉపవాసముండి చంద్ర గ్రహణమునాడు పై మంత్రమును పట్టునుండి విడుపు వరకు జపించవలయును. ఇట్లు చేసిన యెడల యక్షిణీ ప్రత్యక్షమై నిధులను చూపించే అంజనమును యిచ్చును. సాధకుడు ఆ యంజనమును ఉపయోగించి నిధులను తెలుసుకొని తీసుకొన వచ్చును. సాధకునికి యక్షిణీ సర్వత్ర రక్షగా వుండి కోర్కెలు నెరవేర్చుచుండును.

## నిధి దర్శన మంత్రము

**మూలమంత్రము :** "ఓం గం గణపతయే నమః ఓం చాముండాయైనమః ఓం భూతం దర్శయ దర్శయ స్వాహా"

**విధానము :** సాధకుడు పై మంత్రమును రోజుకు వెయ్యి ఎనిమిదిసార్లు చొప్పున యిరవై ఒక్క రోజులు జపించిన సిద్ధించును. తరువాత పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన దేవదారి సంగ్రహమును సాధకుడు తన కండ్లకు కాటుక పెట్టుకున్న యెడల భూమియందలి నిధులు కనిపించును. తరువాత ఆ నిధులను పై మంత్రముచే వెయ్యి ఎనిమిదిసార్లు అభిమంత్రించి త్రవ్వి తీసుకొన వచ్చును.

## నిధి దర్శన మంత్రము

**మూలమంత్రము :** "ఓం నమో విష్ణువినాశాయ నిధి దర్శనం కురు కురు స్వాహా"

**విధానము :** పై మంత్రమును వెయ్యి ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత తిరిసెన చెట్టు యొక్క పంచాంగములు అనగా శాఖలు, వేళ్ళు, ఆకులు, పువ్వులు, గింజలు, గన్నేరు చెట్టు యొక్క పంచాంగములు, ఉమ్మెత్త గింజలు, నాభి, తెల్ల గురిగింజలు, గుడ్లగూబమాంసము, గంధకము, మణిశిల ఈ వస్తువులన్నియూ కలిపి నూరి ఆవనూనెతో కలిపి, మందాగ్నిపై పక్వం చేయవలయును. ఇట్లు సిద్ధము చేసిన తైలమును, నిధియున్నదని అనుమానముగానున్న స్థలమునందు నిప్పులపై పోసి ఆ స్థలమునందు పొగపెట్టవలయును. మరియూ పై మంత్రము ను పదివేలసార్లు జపించవలయును. ఇట్లు చేసిన యెడల ఆ నిధిని కాపలా కాయుచున్న రాక్షస, భూత, భేతాళ, దేవతా దైత్యాదాది భూతములు పారిపోవును. అప్పుడు సాధకుడు నిధి ద్రవ్యమును సురక్షితముగా త్రవ్వి తీసుకొని సుఖంగా యింటికి రావచ్చును. ఈ యోగములు మంత్ర మహార్ణవ మను గ్రంథములోనిది.

## ధనధాన్యములు అక్షయముగా నుండి వృద్ధి చెందుటకు తంత్రములు

1. పుబ్బా నక్షత్రమునాడు దానిమ్మ చెట్టుమీద నుండు బదనికను తీసుకొని వచ్చి ధూప, దీప నైవేద్యము లిచ్చి పూజించి నమస్కరించి తన ఇంటి సింహద్వారమునకు గాని వ్యాపారస్థలములో ద్వారమునకు గాని కట్టిన యెడల ధన వృద్ధి కలుగును. ధనము అక్షయముగా నుండును.

2. హస్త నక్షత్రమునాడు వావిలి చెట్టుమీద నుండు బదనికను తీసుకొని వచ్చి ధాన్యపు కొట్టునందుగాని లేదా ధాన్యము వ్యాపారము కొట్టుయందు గాని ధూప, దీప నైవేద్యము లిచ్చి పూజించి వుంచుకొనిన యెడల అచ్చటు ధాన్యము అక్షయముగా నుండును.

3. భరణీ నక్షత్రమునందు దర్భగడ్డి వేళ్లనుతెచ్చి ఒక గుడ్డలోకట్టి ధూప దీప నైవేద్యము లిచ్చి పూజించి తన ఇంటి సింహద్వారమునకు కట్టినయెడల ఆ ఇంటియందు ధన ధాన్యములు అక్షయముగా నుండును.

4. రోహిణీ నక్షత్రము నాడు మేడిచెట్టుమీద నుండు బదనికను తెచ్చి ధూప, దీప, నైవేద్యములిచ్చి పూజించి (ఓం నమో ధన దాయస్వాహా) అను మంత్రముచే పదకొండు సార్లు మంత్రించి తన గృహములో సింహ ద్వారమునకు గాని వ్యాపార స్థలములో గాని వుంచుకొనిన యెడల ధన ధాన్యములు వృద్ధి చెందును.

## చేతబడులు పోగొట్టే మంత్రము

**మూలమంత్రము :** "ఓం నమో ఆదేశ్ గురుకా ఓమ్ ఐందర్ కేవ్ వికట్ భేష్ వ్యంఘూహిత వజ్రధరాత్రై! పాతాళ్ రాత్రై! సాంప్‌దేవి అంఘూ రాత్రై! కాళిక మస్తకరాత్రై! మహాదేవితో కోయా యహ్ పిండ్ ప్రాణోం చేతేతో దేహ్ కోహో భూత ప్రేత డాకిని శాకినీ గండమాలా తిజారీ ఏక్ పహియాహింపు కోపతెరే కీలియత రాయకో హాక్ పేడ్ ఇక్క నృసింహా కరేంగే! సర్వహంతా ఫురో మంత్ర ఈశ్వరో వాచా"

**విధానము :** పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచే ఏడుసార్లు అభిమంత్రించబడిన మంచినీళ్ళను చేతబడితో బాధపడుచున్న వారికి యిచ్చి త్రాగించుచున్న యెడలసకలమైన చేతబడులున్నూ పటాపంచలగును.

## సర్వప్రయోగ సిద్ధిద యంత్రము

| 17 | 26 | 2 | 7 |
|---|---|---|---|
| 6 | 3 | 23 | 11 |
| 25 | 18 | 8 | 1 |
| 4 | 5 | 19 | 20 |

ఈ యంత్రమును కుంకుమ పువ్వు గోరోజనము కలిపి నూరిన పచ్చటి ద్రవమును ఒక పల్చని రాగి రేకుకు పట్టించి యంత్రమువ్రాసి, ధూప, దీప, నైవేద్యములు ఇచ్చి పూజించి ఈ యంత్రమును ఒక బంగారు లేక వెండి లేక రాగి తాయెత్తు నందుంచి కంఠమునందు ధరించిన యెడల ఈ యంత్రము ను ధరించిన వారికి దృష్టిదోషము తగలదు. ఇతరుల వలన చేయబడిన లేక చేయించబడిన మంత్ర యంత్ర తంత్ర ప్రయోగములు, చేతబడులు, ఇతరవారిక కృత్యములు బాధించజాలవు.

## దయ్యములను వదిలించే ధూపము

నల్ల ఆవాలు, పాముకుబుసము, ఇంగువ, వేప ఆకులు వస ఉత్తరేణి ఆకులు, గుగ్గిలము ఈ వస్తువులన్నిటినీ, సమ భాగములుగా తీసుకొని చూర్ణమును నిప్పులపై పోసి పొగవేసిన యెడల దయ్యములు భూతములు వదలి పారిపోవును.

## రాక్షసనాశన మంత్రము

మూలమంత్రము : "ఓం శ్రీ రాం శీం శీం శుం శూం శేం శైం శోం శౌం శః శః అముకం హాం"

విధానము : పై మంత్రమును పదకొండువందల ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రములో అముకం అనుచోట పార్శ్వనామములను చేర్చి ఇరవై ఒక్కసారి అభిమంత్రించబడిన మంచినీటిని భూతములు పట్టిన వారిచేత, పిచ్చివారిచేత త్రాగించిన యెడల భూత, ప్రేత, రాక్షస, పిచ్చి మొదలుగా గలవన్నియు పలాయనంచేయును.

## దయ్యము వదలిపోయే యంత్రము

| ఈ | హ్రీం | 2 | 7 |
|---|---|---|---|
| 6 | 3 | క్రోం | క్లీం |
| స్వ | య | 8 | 1 |
| తం | దం | పం | జం |
| కం | జి | వ | త |
| 4 | 5 | ఒం | ఒం |

ఈ యంత్రమును గోరోజనము రసముచే దానిమ్మ పుల్ల కలముతో ఒక కాగితము పైన వ్రాసి ధూప, దీప నైవేద్యములు యిచ్చి పూజించి దయ్యము పట్టినవారి మెడలో ఈ యంత్రమును కట్టిన యెడల ఎటువంటి దయ్యమైనను మూడు రోజులలో పారిపోవును.

## భూత ప్రేత నాశక యంత్రము

| 97 | 78 | 1 | 27 |
|---|---|---|---|
| 2 | 46 | 62 | 16 |
| 54 | 5 | 86 | 91 |
| 8 | 89 | 65 | 58 |

ఈ యంత్రమును పెన్నేరు దుంప రసముచే దానిమ్మ పుల్ల కలముతో ఒక కాగితముపైన వ్రాసి లేదా రాగిరేకుపై వ్రాసి పెన్నేరు దుంపరసము పట్టించి ధూప, దీప, నైవేద్యములు యిచ్చి ఈ యంత్రమును ఇంటియందు గోడకు కొట్టిన యెడల ఆ ఇంటియందు ఏ విధమైన భయములు కలుగవు. మరియూ ఈ యంత్రమును శ్మశానము నందలి మట్టితో ఒక రేకుపై వ్రాసి దయ్యము పట్టిన వారి శిరస్సుపై ఆ రేకులు రెండు నిముషములు సేపుంచి తరువాత ఆ యంత్రపు రేకును తీసికెళ్ళి ఊరవెలుపల పారవేసిన యెడల దయ్యములు వదలిపోవును.

## భూతనాశన మంత్రములు

మొదటి మంత్రము : ఓం నమో కాళికాళి దహ దహ స్వాహా.

విధానము : పై మంత్రమును పదకొండు వందల ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముల చేత మూల ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన నీళ్ళను దయ్యములు పట్టినవారిపై చల్లిన యెడల భూత, ప్రేత, పిశాచ, యక్ష, రాక్షస, గాలి దయ్యములు వెంటనే విడిచిపోవును.

రెండవ మంత్రము : "ఓం నమో నారసింహాస్య వాక భస్మయోగినీ బంధ ఢాకినీ బంధ హౌరాసీ దోషబంధ అష్టోత్తర శతవ్యాధీ బంధ భేదీ భేదీ భేదీ మారే మారే సాళే సాళే జ్వలం జ్వలం ప్రజ్వల ప్రజ్వల నారసింహ వీర్ కీ శక్తి ఫురో"

విధానము : పై మంత్రమును మూల ఎనిమిదిసార్లు పఠించి దయ్యము పట్టిన వారిపై రెండుసార్లు పూదిన యెడల దయ్యము వదలి పోవును.

## శవమును బ్రతికించు తంత్రము

చెట్టునుండి కిందపడకుండా ఊడుగ గింజలను కోసి తీసుకువచ్చి నేలను పెట్టకుండా నీడను ఆరించి మహామృత్యుంజయ మంత్రముచే వెయ్యి ఎనిమిదిసార్లు అభిమంత్రించి ఆ గింజల నుండి నూనె తీయవలెను.

మహామృత్యుంజయ మంత్రము : "ఓం హౌం ఓం జూం సః భూర్భువః స్వః త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనమ్! ఉర్వారుక మివబంధనాన్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ భూర్భువః స్వరోం జూం సః హౌం ఓం" తరువాత పై విధముగా తీయబడిన ఊడుగ నూనెలో నుంచి ఒక చుక్కను తీసి పై మృత్యుంజయ మంత్రముచే మూడుసార్లు అభిమంత్రించి ఆ ఊడుగనూనె బొట్టును చచ్చిన శవము నోట్లో వేసిన ఒక జాము సేపటికి ఆ శవము బ్రతుకును (ఊడుగ గింజల నుండి నూనెను పాతాళ యంత్రము ద్వారా తీయవచ్చును)

## పంచదశీ వశీకరణాంజనము

బుధవారమునాడు ఒక తెల్లటి గుడ్డపైన పంచదశీ యంత్రమును నాగకేసరములు, గోరోజనము కలిపి నూరిన రసముచే దర్భపుల్ల కలముతో వ్రాసి, ఆ గుడ్డను వత్తివలె చుట్టి, ఆవనూనె యందు నైచి, దీపము వెలిగించి ఆ దీపపు పొగను శ్మశానమునందు దొరికే ఒక నరకపాలమునకు కాటుకపట్టి ఆ కాటుకను "ఓం హ్రీం శ్రీం క్లీం చాముండాదేవీ స్వాహా" అను మంత్రముచే మూల ఎనిమిది సార్లు అభిమంత్రించి సాధకుడు తన కండ్లకు అంజనము చేసుకొన్న యెడల స్త్రీ పురుషాది సర్వజనులు వశ్యులగుదురు.

## పంచదశీ యంత్ర విధానము

| 8 | 1 | 6 |
|---|---|---|
| 3 | 5 | 7 |
| 4 | 9 | 2 |

ఈ పంచదశీ యంత్రము మహా ప్రభావము కలది, కలియుగమునందు తక్కిన యంత్రములన్నియు కీలితములై యున్నవి. పంచదశీ యంత్రము కీలితము కాలేదు గనుక శీఘ్ర ఫలదాయకమైనది అని యీశ్వరుడు పార్వతితో చెప్పెను. ఈ యంత్రము దేవతలకు పంచదశీ యంత్రమును ప్రయోగించు విధానము శాస్త్ర పద్ధతి ననుసరించి విపులముగా ఈ క్రింద వ్రాయబడినది.

మొదటి మంత్రము : "ఓం హ్రీం శ్రీం క్లీం చాముండాదేవీ స్వాహా"

పై మంత్ర ప్రభావము వలన సర్వజన వశీకరణము కల్గును. కఠిన వ్యాధులు నయమగును. గర్భిణీ స్త్రీలు సుఖముగా ప్రసవింతురు. పోయిన వస్తువులు దొరుకును. దేశాంతరము పోయిన వారు తిరిగి ఇంటికి వచ్చెదరు. కారాగారాది బంధములు తొలగిపోవును. ఇష్ట కార్య ప్రాప్తి కొరకు ఈ యంత్రమును శుక్ల పక్షమునందు మంచి వారము నందు అనగా సోమ, బుధ, గురు, శుక్రవారముల యందు వ్రాయుట మొదలు పెట్టవలయును. శత్రునాశనము మొదలైన అశుభకార్యముల కొరకు కృష్ణపక్షమునందు మంగళ, శనివారముల యందు మొదలు పెట్టవలెను. ఈ యంత్రమును బ్రహ్మచర్య వ్రతమును పాటించుచూ వ్రాయుచుండవలెను. పెరుగు, పెసర పప్పు కలిపి వండిన అన్నము మాత్రము తినవలెను.

పంచదశీ యంత్ర లేఖన కల్పము : కుంకుమ పువ్వు మంచి గంధము, అగరు, పచ్చకర్పూరము, కస్తూరి ఈ వస్తువు లన్నిటిని కలిపి కొంచెము నీళ్ళుపోసి నూరి యంత్రం వ్రాయుటకు సిరాగా ఉపయోగించవలెను.

ఈ యంత్రమును వ్రాసే కలము : సర్వకార్యసిద్ధికి సన్న జాజికలము, ఆకర్షణ ప్రయోగములకు నేరేడు పుల్ల కలము, స్తంభన కర్మలకు మర్రిఊడ కలము, వశీకరణములకు దర్భపుల్ల కలము,

అతికార్యములు సాధనకొరకు బంగారు లేక వెండితో చేయబడిన కలమ్ను ఉపయోగించవలెను.

రెండవ మంత్రము : "ఓం హ్రీం శ్లీం సారస్వత్యవన నాగకుల పితామాయ స్వాహా"

పంచదశీయంత్ర, మంత్రసిద్ధి విధానము : ఒక అంగుళము పొడవు ఒక అంగుళము వెడల్పుగల తెల్లకాగితముపై న ఈపంచదశీ యంత్రమును పైన చెప్పబడిన పంచదశీ యంత్ర లేఖన కల్పముచే వన్నజాజి పుల్లకలముతో వ్రాసి ఈ పంచదశీయంత్రమునందు మధ్యగడిలోవున్న "5" అంకెను తదేకదృష్టితో చూచుచు పంచదశీ యంత్రమునకు మూలమంత్రము లై నట్టి పై నుదహరించబడిన మొదటి లేక రెండవ మంత్రమును నిశ్చలమైన మనస్సుతో ఒకసారి జపించి ఈ పంచదశీ యంత్రమును కొంచెము గోధుమ పిండితో కలిపి గోళీవలె జేసి నదియందుగాని, కాలవయందుగాని చేపలకు వేయవలెను. ఈ విధముగా ఒక లక్ష యిరవై అయిదు వేల యంత్రములను గోధుమపిండి గోళీలతో కలపి చేపలకు వేసినయెడల సమంత్ర పంచదశీ యంత్రసిద్ధి కలుగును. లక్ష సంఖ్యాకములయిన యంత్రము లన్నియూ ఒకనాడే వ్రాయనక్కర లేదు. రోజుకు నూట ఎనిమిదిగాని, వెయ్యిన్నూట ఎనిమిదిగాని, పదకొండు వేల నూట ఎనిమిదిగాని, ఒక నియమము ఏర్పరచుకొని చేయుచు ఆ నియమము తప్పకుండా లక్షా యిరవై అయిదువేల యంత్రములు పూర్తియగు వరకు కార్యదీక్ష కలిగి వుండవలెను.

సంపూర్ణ సిద్ధి పొందు వరకూ దీక్ష పూనలేనివారు తమ తమ మనోరథ సిద్ధుల కొరకు ఈ దిగువ నుదహరించబడిన ప్రకారము, సిద్ధి జేసికొనవచ్చును.

| | |
|---|---|
| ధన ప్రాప్తికి 2000 యంత్రములు | వ్రాయవలెను |
| వ్యాధి నివారణకు 6000 యంత్రములు | " |
| వశీకరణమునకు 3000 యంత్రములు | " |
| పరమేశ్వర ప్రసన్నమునకు 4000 యంత్రములు | " |
| దేవతా ప్రసన్నమునకు 5000 యంత్రములు | " |
| తిండి, బట్ట లోటు లేకుండుటకు 4000 యంత్రములు | " |
| ప్రవాసి ఇంటికి తిరిగి వచ్చుటకు 2000 యంత్రములు | " |
| సంధ్యా స్త్రీకి సంతాన ప్రాప్తి కొరకు 5000 యంత్రములు | " |
| మనోభీష్ట సిద్ధి కొరకు 15000 యంత్రములు | " |
| పొలము బాగా పండుటకు 2000 యంత్రములు | " |
| స్నేహితులు కలుసుకొనుటకు 2000 యంత్రములు | " |
| మంత్రసిద్ధి కొరకు 3000 యంత్రములు | " |
| దయ్యములను పరిశీలించుటకు 2000 యంత్రములు | " |
| పోయిన వస్తువు దొరుకుటకు 5000 యంత్రములు | " |
| శత్రువశీకరణమునకు 2000 యంత్రములు | " |
| కారాగార విమోచనమునకు 6000 యంత్రములు | " |
| విషము హరించుటకు 2500యంత్రములు | " |
| పరస్త్రీ ప్రసన్నమునకు 1000 యంత్రములు | " |
| శత్రుత్వమును పోగొట్టుటకు 2000 యంత్రములు | " |
| దొంగ సిద్ధి కొరకు 1000 యంత్రములు | " |
| తృతీయజ్వరహరానికి 6000 యంత్రములు | " |
| సుఖములు కలుగుటకు 2000 యంత్రములు | " |
| సభా సమ్మోహనమునకు 2000 యంత్రములు | " |
| అధికారి వశీకరణమునకు 4000 యంత్రములు | " |

శత్రునాశన విధి : పదిహేను జిల్లేడాకులు తెచ్చి, ఒక్కొక్క ఆకుపై న ఒక్కొక్క పంచదశీ యంత్రమును వ్రాసి, యంత్రము క్రింద శత్రువుయొక్క పేరును వ్రాసి, ఈ జిల్లేడాకులను నిప్పులలో వేయవలెను. ఇట్లు పదిహేను రోజుల చేసిన యెడల శత్రునాశనమగును. జిల్లేడాకులపై యినుప గంటముతో వ్రాయవలెను. సాధకుడు దక్షిణ ముఖముగా కూర్చుండి వ్రాయవలెను.

## పంచదశీ ఆకర్షణ విధి

గురువారమునాడు పంచదశీ యంత్రమును పసుపు, గోరోజనము, నెయ్యి కలిపిన కల్పముచే వేరెడు పుల్ల కలముతో ఒక కాగితముపై న వ్రాసి యంత్రము క్రింద సాధకుడు తాను ఆకర్షించ దలచిన వారియొక్క పేరును వ్రాసి ఈ మంత్రమునకు ధూప, దీప నై వేద్యములు యిచ్చి ఈ యంత్రమును సాధకుడు తాను కూర్చునే ఆసనము క్రింద పెట్టి వుంచిన ఎవరి పేరుతో యంత్రము వ్రాయబడినదో వారు ఆకర్షింపబడి సాధకుని దగ్గరకు వత్తురు.

స్త్రీ ఆకర్షణ విధి: శుక్రవారము నాడు ఈపంచదశీ యంత్రమును పచ్చకర్పూరము, పసు, వెంగల్వకోష్టు, తేనె కలిపి నూరిన కల్పముచే వేరెడు పుల్లకలముతో ఒక కాగితము పై న వ్రాసి ఈ యంత్రమునకు ధూప, దీప నై వేద్యములు యిచ్చి పూజించి ఈ యంత్రమును ఏ స్త్రీకి చూపించిన ఆ స్త్రీ ఆకర్షింపబడి ధన, ప్రాణములతో సహా సాధకుని ఆనుసరించి వచ్చును.

కృష్ణపక్ష చతుర్దశినాడు ఈ పంచదశీ యంత్రమును మర్రిపాల కలముతో వ్రాయుట మొదలు పెట్టిన సాధకునకు ధర్మార్థ కామమోక్షములు సిద్ధించును.

## తూకమును పెంచే మంత్రము

మూలమంత్రము : ఓం హ్రీం శ్రీం క్లీం ఐం లక్ష్మ్యై స్వాహా.

విధానము : సాధకుడు పై మంత్రమును ప్రతిరోజూ వెయ్యి ఎనిమిదిసార్లు చొప్పున 21 రోజులు జపించిన యెడల సిద్ధించును. తరువాత అమ్మకమునకు తెచ్చిన ఏ వస్తువునైనా పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు మంత్రించివుంచి అమ్మకము చేసిన యెడల బరువు అధికమై వెల హెచ్చు వచ్చును.

## తూకమును పెంచే మంత్రము

మూలమంత్రము : "ఓం శ్రీం హ్రీం క్లీం ఓం హ్రీం శ్రీం క్లీం ఓం లక్ష్మ్యై స్వాహా"

విధానము : ఈ మంత్రమును రోజుకు పదకొండువందల ఎనిమిదిసార్లు చొప్పున పదకొండు రోజులు జపించిన యెడల సిద్ధించును. తరువాత పై మంత్రముచేత ఒక నూలు త్రాడును పదకొండుసార్లు మంత్రించి వ్యాపారమునందు విక్ర యించే వస్తువులకు కట్టి ఒక రాత్రి నిలవయుంచి మరునాడు అమ్మిన యెడల బరువు అధికమై వ్యాపారమునందు అధిక లాభము వచ్చును.

## విక్రయవృద్ధిని కలిగించే యంత్రము

| | | | |
|---|---|---|---|
| 73 | 80 | 2 | 7 |
| 75 | 3 | 79 | 77 |
| 79 | 74 | 8 | 1 |
| 4 | 75 | 5 | 75 |

ఈ యంత్రమును శ్రీపంచమినాటి రాత్రి ఒక తెల్లని కాగితముపై వ్రాసి ధూప దీప నై వేద్యములు ఇచ్చి పూజించి వ్యాపారస్థలము యొక్క సింహ ద్వారమునకు కట్టిన యెడల ప్రతిరోజూ వ్యాపారము వృద్ధి కలిగి లాభము అధికముగా వచ్చుచుండును.

## 2వ యంత్రము

| 72 | 81 | 33 | 42 |
|---|---|---|---|
| 89 | 82 | 9 | 11 |
| 25 | 37 | 49 | 50 |
| 45 | 27 | 9 | 1 |

ఈ యంత్రమును గోరోజనము కుంకుమ పువ్వు కలిపి నూరిన రసమును ఒక పంచవన్నె రాగిరేకుపై వ్రాసి పట్టించి ఈ యంత్రమును గంటము తో గీసి దూప దీప నైవేద్యములు యిచ్చి పూజించి ఒక రాగి తాయీజునందు పెట్టి చంటి పిల్లల మెడలో కట్టి వుంచిన యెడల ఆ పిల్లలు ఆరోగ్యముగా నుండెదరు. దృష్టి దోషము తగలకుండా రక్షించును.

## బాల రోగముల నుండి రక్షించు యంత్రము

| 7 | 3 | 80 | 10 |
|---|---|---|---|
| 76 | 6 | 2 | 8 |
| 32 | 77 | 9 | 1 |
| 4 | 6 | 82 | 81 |

ఈ యంత్రమును ఒక పంచవన్నె రాగిరేకుపై వ్రాసి దానిపై గోరోజనము కుంకుమ పువ్వు పట్టించి దూప దీప నైవేద్యములు యిచ్చి పూజించి రాగి తాయీజు నందు పెట్టి పిల్లల మెడలో కట్టి వుంచిన యెడల చంటి పిల్లలకు వచ్చే రోగములు రాకుండా రక్షణగా వుండును. దృష్టిదోషములు తగలవు.

## 2వ యంత్రము

| 77 | 84 | 2 | 8 |
|---|---|---|---|
| 70 | 2 | 80 | 81 |
| 73 | 68 | 9 | 1 |
| 4 | 6 | 78 | 93 |

ఈ యంత్రమును మొక్కోణా కారముగా నున్న ఒక రాగి రేకుపై చెక్కించి దూప దీప నైవేద్యములు యిచ్చి పూజించి చంటి పిల్లల మెడలో కట్టి వుంచిన యెడల ఆ పిల్లలకు దృష్టి దోషములు తగులవు. బాలవ్యాధులు రావు. గ్రహబాధలు సంభవించవు. సర్వత్ర పిల్లలు ఆరోగ్యముగా నుండెదరు.

## బాలవ్యాధి నివారణకు యంత్రము

| 33 | 32 | 27 |
|---|---|---|
| 33 | 66 | 37 |
| 37 | 46 | 67 |

ఈ యంత్రమును గోరోజనము రసముచే దానిమ్మపుల్ల కలముతో ఒక దళసరి కాగితముపైన వ్రాసి ఈ యంత్రమునకు దూప దీప నైవేద్యములు యిచ్చి పూజించి ఆ కాగితమును ఒక రాగి తాయీజునందు పెట్టి బాల బాలికల మెడలో ధరింప చేసిన యెడల పిల్లలకు వచ్చు సమస్త వ్యాధులు నివారింప బడును. ఎల్లప్పుడూ ఆరోగ్యముగా పిల్లలు అభివృద్ధి చెందెదరు.

## సర్వరోగ నివారణ యంత్రము

| మ | పూ | వ | ర |
|---|---|---|---|
| 7 | 189 | 1002 | |
| | 4 | 82 | |
| 81 | 1002 | 117 | 5 |

ఈ యంత్రమును గోరోజనము కుంకుమ పువ్వు కలిపి నూరిన రసముతో ఒక కాగితం పైనగాని భూర్జపత్రము పైనగాని వ్రాసి గుగ్గిలము దూపము వేసి కొబ్బరి కాయకొట్టి ఈ యంత్రమును ఒక రాగి తాయీజునందు పెట్టి రోగియొక్క మెడలో కట్టి, తరువాత పిల్లలకు మిఠాయి పంచి పెట్టిన యెడల ఈ యంత్రమును ధరించిన వారి యొక్క సర్వవ్యాధులు హరించి పోవును.

## 2వ యంత్రము

| 82 | 89 | 8 | 7 |
|---|---|---|---|
| 63 | 3 | 56 | 55 |
| 58 | 63 | 8 | 1 |
| 4 | 5 | 84 | 87 |
| రోగిపేరు | | | |

ఈ యంత్రమును మహా నక్షత్రము రోజున పాత చెప్పు పైన వ్రాసి యంత్రము క్రింద రోగి యొక్క పేరు వ్రాసి రోగికి దిగదుడిచి భూమిలో పాతిపెట్టిన యెడల ఆ రోగి యొక్క రోగము తగ్గిపోయి ఆరోగ్యము కలుగును.

## 3వ రోగ నాశన యంత్రము

| రం | 79 | 5 | 2002 |
|---|---|---|---|
| వం | 1001 | 82 | 11 |
| పూం | 199 | 4 | 1003 |
| గం | 7 | 198 | 81 |

ఈ యంత్రమును పంచవన్నె రాగిరేకుపై వ్రాసి కస్తూరి కుంకుమపువ్వు గోరోజనం నూరి యంత్రమునకు పట్టించి దూప, దీప నైవేద్య ములు యిచ్చి రాగి తాయీజు నందు పెట్టి రోగికి కంఠము నందు కట్టిన యెడల రోగము ఎంత మొండిదైనను తగ్గి ఆరోగ్యం కలుగును.

## 4వ యంత్రము

ఈ యంత్రమును పంచవన్నె రాగి రేకుపై వ్రాసి కుంకుమ పువ్వు గోరోజనము కలిపి నూరిన కల్కమును పట్టించి, వంద్ర కర్ర కాల్చిన బొగ్గులు నిప్పు చేసి ఆ నిప్పుపై యంత్రమును వెచ్చచేసి రాగి తాయీజులో పెట్టి రోగి కంఠము నకు కట్టిన యెడల సర్వ రోగములు శాంతించి ఆరోగ్యము కలుగును.

| 78 | 20 | 95 | 7 |
|---|---|---|---|
| 12 | 92 | 6 | 90 |
| 87 | 13 | 96 | 4 |
| 23 | 75 | 3 | 99 |

## 5వ యంత్రము

| 14 | 31 | 2 | 8 |
|---|---|---|---|
| 20 | 3 | 15 | 14 |
| 1 | 15 | 16 | 19 |
| 44 | 6 | 9 | 19 |

ఈ యంత్రమును పంచవన్నె రాగి రేకుపై వ్రాసి కుంకుమ పువ్వు, పచ్చ కర్పూరము, గోరోజనము కలిపి నూరిన కల్కమును పట్టించి దూప దీప నైవేద్యములు యిచ్చి పూజించి రాగి తాయీజునందు పెట్టి రోగి కుడి చేతికి కట్టిన యెడల యెంతటి రోగమైనా శాంతించి ఆరోగ్యము కలుగును.

## 2వ యంత్రము–మనస్సులో కోర్కెలు నెరవేరుటకు

| 0 | 2 | 5 | 7 |
|---|---|---|---|
| 6 | 3 | 2 | 3 |
| 4 | 8 | 1 | 1 |
| 4 | 6 | 66 | 18 |

ఈ యంత్రమును రావిచెట్టు క్రింద కూర్చొని పుష్య నక్షత్రం భూమిపైన పదకొండువందల ఎనిమిది సార్లు చొప్పున పదకొండు రోజులు వ్రాసిన యెడల మనస్సులో కోర్కెలు సిద్ధించును.

## మనోవాంఛాసిద్ధి యంత్రము

| 8 | 15 | 2 | 8 |
|---|---|---|---|
| 7 | 2 | 12 | 11 |
| 14 | 9 | 0 | 1 |
| 4 | 6 | 10 | 13 |

ఈ యంత్రమును గరిక ముక్కచే భూమిపై ప్రతి రోజూ వెయ్యి ఎనిమిదిసార్లు చొప్పున నలభై రోజులు వ్రాసిన యెడల సాధకుని సర్వ కోర్కెలు జయప్రదముగా నెరవేరును.

## కార్యసిద్ధి యంత్రము

| ద్రాం | ద్రాం | ద్రాం | ద్రాం |
|---|---|---|---|
| ద్రాం | ద్రాం | ద్రాం | ద్రాం |
| సం | సం | సం | సం |
| అం | అం | అం | అం |

సాధకుడు స్నానము చేసి శుభ్రమైన వస్త్రములను ధరించి, ఈ యంత్రమును నలభై రోజులలోపల ఒక లక్ష యిరువది ఐదువేల సార్లు భూమిపై వ్రాయుట పూర్తి చేసిన యెడల సాధకుడు తలచిన కార్యములన్నియూ వెంటనే సిద్ధించును.

## పుత్రరక్షాకర యంత్రము

| 49 | 46 | 3 | 8 |
|---|---|---|---|
| 36 | 3 | 46 | 45 |
| 48 | 43 | 8 | 7 |
| 4 | 5 | 44 | 47 |

ఈ యంత్రమును శుక్ల పక్షములో ఆదివారమునాడు కుంకుమపువ్వు, కస్తూరి కలిపి నూరిన రసములో దానిమ్మ పుల్లకలముచే ఒక భూర్జపత్రం పై గాని కాగితముపై గాని వ్రాసి సిందూరము తులసీదళముచే పూజించి ఈ యంత్రమును ఒక తాయెత్తునందు పెట్టి ఒక గర్భిణీ స్త్రీ యొక్క నడుముకు కట్టిన యెడల దీర్ఘాయుర్దాయము గల పుత్రుడు జన్మించును. అయిదు శేర్ల గోధుమ పిండిని రొట్టెలు చేయించి పటిక బెల్లముతో సహా పిల్లలకు పంచి పెట్టవలయును. మృతవత్స దోషముకల స్త్రీలు ఈ యంత్రమును ధరించిన యెడల దోషము హరించి చిరంజీవులగు పుత్రులు కలిగెదరు.

## ఆశ్చర్య యంత్రము

| 88 | 95 | 2 | 8 |
|---|---|---|---|
| 7 | 3 | 92 | 91 |
| 94 | 89 | 9 | 1 |
| 4 | 6 | 90 | 91 |

ఈ యంత్రమును జిల్లేడాకు రసములో ఒక కాగితము పైగాని భూర్జపత్రముపైన గాని దానిమ్మ పుల్ల కలముచే వ్రాసి ఈ యంత్రమును మామిడి చెట్టుకు కట్టిన యెడల తలవని తలంపుగా ఏదో ఒక విశేష సంఘటన జరుగును.

## సంతాన సౌఖ్య యంత్రము

| అ | ఈ | ఈ | ఊ | ఊ | ఊ | అ |
|---|---|---|---|---|---|---|
| ఝ | ఞ | ట | ఠ | డ | ఢ | ణం |
| జ | మం | హాయ | ర | ల | ఐ | క |
| వ | ఠ | యహా | క్ష | వ | త | రం |
| వ | బ | స | ష | శ | ద | స |
| ఙ | ఫ | ప | న | ధ | ద | ణం |
| ఫం | గ | ఖ | క | ఆం | అ | అః |
| దేవదత్త | | | | | | |

ఈ యంత్రములో 'దేవదత్త' అనేచోట సంతానము కలుగవలసిన స్త్రీ యొక్క పేరును వ్రాసి ఈ యంత్రమును కుంకుమపువ్వు, గోరోజనము కలిపి నీళ్ళతో నూరిన పచ్చటి ద్రవములో దానిమ్మ పుల్ల కలములో ఒక కాగితముపై గాని, భూర్జపత్రంపై గాని వ్రాసి ధూపదీప నైవేద్యములు యిచ్చి పూజించి ఈ యంత్రమును ఒక బంగారు లేక వెండి లేక రాగి తాయెత్తు నందుంచి ఎవరి పేరుతో యంత్రము వ్రాయబడినదో వారు ఈ యంత్రమును తమనడుము నందు (కటి ప్రదేశమున) ధరించిన ఈ యంత్రమును ధరించిన వారికి సంతాన లాభము నిస్సంశయముగా కలుగును.

## కార్యజయకర యంత్రము

| 92 | 99 | 2 | 8 |
|---|---|---|---|
| 7 | 3 | 96 | 95 |
| 98 | 92 | 9 | 1 |
| 4 | 6 | 94 | 91 |

ఈ యంత్రమును ఆవాల చెట్టు సమూలరసములో దానిమ్మ పుల్లకలముచే ఒక కాగితముపై గాని భూర్జ పత్రము పై గాని వ్రాసి ధూప, దీప నైవేద్యములు పెట్టి పూజించి వనములో గాని ఉద్యానవనములోగాని పాతిపెట్టిన సర్వ కార్యములు జయప్రదముగా నెరవేరును.

## గర్భధారణ యంత్రము

| డోం | డోం | డోం | డోం |
|---|---|---|---|
| డోం | డోం | డోం | డోం |
| హ్రీం | హ్రీం | హ్రీం | హ్రీం |
| హ్రీం | హ్రీం | హ్రీం | హ్రీం |

ఈ యంత్రమును మూలా నక్షత్రములో కూడి వచ్చిన ఆదివారమునాడు చందనం, కర్పూరము, నాగకేసరములు, కురు వేరు, తుంగ ముస్తలు, దేవదారు, గోరోజనము, కుంకుమపువ్వు ఆవుపాలతో నూరిన అష్టగంధములో దానిమ్మపుల్ల కలముచే ఒక కాగితముపై గాని, భూర్జపత్రముపై గాని వ్రాసి గంధ పుష్పాక్షతాదులచే పూజించి ధూప, దీప నైవేద్యములు యిచ్చి ఈ యంత్రమును బంగారు, వెండి లేక రాగి తాయెత్తు నందుంచి స్త్రీ తనయొక్క ఎడమచేతికి కట్టుకొని భర్తతో సంభోగము చేయుచుండినయెడల ఆ స్త్రీ గర్భమును ధరించి సత్సంతానమును కనును.

### బాలలకు విద్యాభివృద్ధి కవిత్వప్రాప్తి తంత్రము

మూలమంత్రము : "ఓం మహేశ్వరాయనమః"

విధానము : ఈ మంత్రమును పదకొండు వందల ఎనిమిది సార్లు జపించిన ఎడల సిద్ధించును. తరువాత పన్నెండు గురిగింజలయెత్తు వసచూర్ణమును పాలతో నూరి అందు పంచదార కలిపి పై మంత్రముచే నూటఎనిమిదిసార్లు అభిమంత్రించి బాలకుని చే త్రాగించవలెను. ఇట్లు నలభై రోజులు యిచ్చిన యెడల ఆ బాలకుడు అఖిల విద్యా పారంగతుడై ఆశుకవీశ్వరుడగును.

### శ్రీ తులసీకవచ పారాయణ మహిమ

అత్యద్భుతముగా ఫలితములను యిచ్చే కవచములలో ఈ తులసీ కవచము ప్రశస్తమైయున్నది. ఈ కవచమును ప్రతి నిత్యము ప్రాతఃకాలమందు పారాయణ చేయువారలకు ఆరోగ్యము, ఆయుర్దాయము, అభివృద్ధి చెందును. అకాల మరణములు దరిచేరవు. సంతానవృద్ధి, పశువృద్ధి, ధనవృద్ధి, సర్వజనవశ్యము లభించును. యోగాభ్యాసపరులకు యోగ సిద్ధి, మోక్షాపేక్షగలవారికి మోక్షము లభించును. నిరుద్యోగులకు ఉద్యోగము, ఉద్యోగులకు ఉద్యోగాభివృద్ధి కలుగును. ఆపదల యందున్న వారికి సర్వోపద్రవములు శాంతించి సౌఖ్యము లభించును. స్త్రీలకు ఈ కవచపారాయణవల్ల సౌభాగ్యము వృద్ధి చెందును.

### తులసీ కవచ పారాయణ విధానము

తులసీ వనములోగాని, తులసిచెట్టు వద్దగాని సూర్యోదయ కాలమందు సూర్యునికి ఎదురుగా కూర్చొని తులసి చెట్టును పూజించి నమస్కరించి ఈ తులసీకవచమును ప్రతిరోజూ విడువకుండా జపించుచుండువారలకు దారిద్ర్యం నశించి, దైవభక్తివృద్ధి చెంది ఐశ్వర్యవంతులై సుఖించెదరు. సర్వోపద్రవములు తొలగిపోవును. అంత్యమందు విష్ణు సాన్నిధ్యము లభించును.

### సంతానము కలుగుటకు పారాయణ విధానము

సంతానము కలిగిపోవుచున్న స్త్రీలు ప్రాతఃకాలమందు తులసి చెట్టును పూజించి తూర్పు ముఖముగా కూర్చొని ఒక రాగి పాత్రలో నీళ్ళుపోసి ఆ పాత్రను ఒక పళ్ళెములో పెట్టి వుంచి ఆ పాత్రపైన తన కుడిచేతిని వుంచి సంతానాభిలాషియై ఈ తులసీ కవచమును పదకొండుసార్లు పఠించి ఆ పాత్రలోని జలమును కొంత తానుపుచ్చుకొని మిగిలిన జలమును తన మర్మస్థానము పైని జల్లుకొనవలెను. ఈవిధముగా నలభై రోజులు విడువకుండా చేసిన యెడల గర్భము నిలిచి చిరంజీవియైన పుత్రుని కనును.

### వంధ్యా స్త్రీలు సంతానముకొరకు చేయవలసిన పారాయణ విధానము

వంధ్యాస్త్రీలు అనగా సంతానమే కలుగని స్త్రీలు ప్రాతఃకాలమందు తులసిచెట్టును పూజించి ఒక రాగి పాత్రలో నీళ్ళు పోసుకొని, ఆ నీళ్ళలో కుశలను వుంచి అనగా దర్భగడ్డిపోచలను వేసి తన కుడిచేతిని ఆ నీళ్ళపై వుంచి సంతానాభిలాషిణియై పదకొండుసార్లు తులసీ కవచమును పారాయణచేసి ఆ జలము కొంత తాను పుచ్చుకొని మిగిలిన జలమును ఆ దర్భపోచలతో తన మర్మస్థానము పైన శరీరము పైన జల్లుకొనవలెను. ఈ విధముగా ఒక సంవత్సరము చేసిన యెడల ఎంతటి గొడ్రాలికైనా చిరంజీవి గుణవంతుడు రూప వంతుడు అయిన పుత్రుడు కలుగును.

### వశ్యమునకు తులసీ కవచ పారాయణ విధానము

ఈ తులసీ కవచమును ప్రతిరోజూ విడవకుండా ప్రాతః కాలమందు నలభై రోజులు రావిచెట్టుక్రింద కూర్చొని తనకు వశ్యం కావలసిన వారిని తలచుకొని రోజుకి పదకొండుసార్లు చొప్పున నలభై రోజులు పారాయణము చేసిన యెడల అధికారులు, రాజులు, తామకోరిన వారు తనకు వశ్యులై తన యిష్టానుసారము ప్రవర్తించెదరు.

### విద్యాభివృద్ధి గోరువారు పారాయణ చేయు విధానము

ఈ తులసీ కవచమును ప్రతిరోజూ విడువకుండా ప్రాతః కాలమందు మోదుగచెట్టు క్రింద కూర్చొని రోజుకి పదకొండు సార్లుకి తక్కువగాకుండా నలభై రోజులు విద్యాభివృద్ధిని తలంచుకొనుచు జపించిన విద్యాభివృద్ధి కలుగును. పరీక్షలలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులగు చుందురు.

### వివాహము కాని వారికి వివాహమగుటకు చేయవలసిన పారాయణ విధానము

వివాహము కానివారు చండీ, దుర్గా మొదలైన దేవతల ఆలయమందుగాని లేదా దుర్గాపార్వతి మొదలైన దేవతా పటముల ముందుగాని కూర్చుని ఆ పటమును పూజించి ప్రతిరోజూ ప్రాతః కాలమందు తనకు వివాహము కావలెనని తలంచుకొని రోజుకు పదకొండుసార్లు చొప్పున తులసీకవచమును నలభై రోజులు పారాయణ చేసిన యెడల ఏకారణము చేత వివాహము కాకపోయినను ఆ కారణము తొలగిపోయి వివాహము నిశ్చయముగా అగును.

### స్త్రీ వశ్యం కావలసినవారు పారాయణ చేయువిధానము

స్త్రీ వశ్యం కావలసినవారు, ఉద్యానవనములో గాని లేదా తులసిచెట్టు, పూలచెట్లు గల ప్రదేశమందుగాని లేదా ఫలవృక్షముల చెంతనుగాని పరిశుభ్రపరచుకొని ప్రాతఃకాల మందు ఈ తులసీ కవచమును రోజుకు పదకొండుసార్లు చొప్పున విడువకుండా నలభై రోజులు తనకు వశ్యంకావలసిన స్త్రీని తలంపులో వుంచుకొని జపించినయెడల ఆ స్త్రీ వశ్యమై యుండును.

### సర్వకార్య జయములకు శత్రువిజయములకు సర్వజనులచేత మోహింపబడుటకు పారాయణ చేయు విధానము

సర్వకార్యజయము, శత్రువిజయము కోరువారు విష్ణ్వాలయములోగాని లేదా విష్ణుదేవుని విగ్రహము లేదా పటము ముందుగాని ప్రాతఃకాలమందు కూర్చొని విష్ణుపూజ జరిపి ఈ కవచమును పదకొండుసార్లు జపించవలెను. ఈ విధముగా నలభై రోజులు జపించిన యెడల సర్వకార్యములు జయప్రదముగానెరవేరును. ఎంతటి శత్రువులైనా జయించగల శక్తి సామర్థ్యములు లభించును. సర్వజనులచేత కీర్తింపబడును. ధనవృద్ధి ఐశ్వర్యప్రాప్తి కలుగును.

### సౌందర్యము తేజస్సు కొరకు పారాయణ చేయు విధానము

సౌందర్యము తేజస్సు కావలసినవారు సూర్యునికి ఎదురుగా కూర్చుని తమముందు అగ్నిహోత్రమును వుంచుకొని లేదా లేకుండాగాని కూర్చొని ప్రతిరోజూ ప్రాతః కాలమందు రోజుకు పదకొండుసార్లు చొప్పున నలభై రోజులు ఈ కవచమును జపించిన యెడల సౌందర్యాభివృద్ధి తేజస్సు కలుగును.

సూచన : ఈ పారాయణ విధానములలో ప్రతిరోజూ పదకొండుసార్లు అని వ్రాయబడి యున్నది. గాని సాధకులు ప్రతి పారాయణలో మూడుపదకొండుసార్లుకి తక్కువ కాకుండా వారి శక్త్యనుసారము అధికముగా ఒక నియమ ప్రకారము చేయుచున్న యెడల శీఘ్రకాలములోనే వారికోర్కెలు నెరవేరును.

## జప మహిమ

శ్లో॥ యక్ష రక్షః పిశాచాశ్చ గ్రహాః సర్వేచ భీషణాః,
జాపినం నోపసర్పంతి భయభీతాః సమంతతః॥

తా. దశ దిక్కుల యందుండెడి భయంకరములైన గ్రహములు, భూతములు, ప్రేతములు, పిశాచములు, యక్షులు రాక్షసులు మొదలైన సర్వ దుష్ట భూతములున్నూ, భయ భీతములై ప్రతినిత్యమూ జపము చేయుచుండెడి వారిని సమీపించజాలవు.

శ్లో॥ జపేన పాపం శమయే దశేషం
యత్తత్కృతం జన్మపరం పరాసు,
జపేనభోగాన్ జయతేచ మృత్యుం
జపేనసిద్ధిం లభతేచముక్తిం॥

తా. అనేక జన్మల నుండి ఆర్జింపబడియున్న పాపము అన్నియూ భగవన్నామ జపము వలన నష్టమై పోవును. జప మహిమ వలన అనేకమైన భోగములతో సుఖించుచుండును. జపము వలన మరణమైకూడా లేకుండా పోవును. జపము వలన అణిమాద్యష్టమహా ద్యనేక సిద్ధులు లభించును. జపము వలననే నిత్యానంద దాయకమైన మోక్షము కూడా లభించును.

## జప సమయంలో గమనించవలసిన కొన్ని విశేషములు

శ్లో॥ కృష్ణాజినే జ్ఞానసిద్ధిర్మోక్ష శ్రీర్వ్యాఘ్రచర్మణి,
కుశాసనే మంత్రసిద్ధి ర్నాత్రకార్యా విచారణా॥

తా. కృష్ణాజినముపై కూర్చుండి మంత్రమును జపించిన యెడల జ్ఞానము లభించును. వ్యాఘ్ర చర్మముపై కూర్చుండి మంత్రమును జపించిన యెడల మోక్షము లభించును. దర్భాసనముపై కూర్చుండి మంత్రమును జపించుచుండిన యెడల మంత్రము నిస్సందేహముగా సిద్ధించును. ఇది శాస్త్ర నిర్ణయము.

శ్లో॥ తత్పూర్వాభిముఖం వశ్యం దక్షిణం చాభిచారికం
పశ్చిమం ధనదం విద్యాదుత్తరం శాంతికం భవేత్॥

తా. వశీకరణమును కోరువారు తూర్పు ముఖముగా కూర్చుండి మంత్రమును జపించవలయును. శత్రువులను శిక్షింపదలచినవారు దక్షిణముఖముగా కూర్చుండి జపము చేయవలయును. ధనమును కోరువారు పడమర ముఖముగా కూర్చుండి జపించవలెను. శాంతిని గోరెడివారు ఉత్తరాభి ముఖులై మంత్రమును జపించుచుండవలెను.

శ్లో॥ ప్రమాదాత్ పతితా హస్తె వృతమష్టోత్తరం జపేత్

తా. ప్రమాదవశాత్తు జపమాల చేతినుండి జారి క్రింద పడిన యెడల మూలమంత్రమును మాల ఎనిమిది సార్లు జపించవలెను.

## జప శబ్దము న కర్థము

శ్లో॥ జకారో జన్మవిచ్ఛేదః పకారః పాపనాశకః
తస్మాజ్జప ఇతిప్రోక్తో జన్మపాపవినాశకః॥

'జ' కారము జన్మ నాశనమును, అనగా మోక్షము, 'ప' కారము పాప నాశనమును సూచించును. పాపములను నశింప జేసి, జనన మరణములు లేకుండా, మోక్ష మొసంగు నట్టిది గనుకనే జపమని చెప్పబడుచున్నది.

## బ్రహ్మ ప్రాప్తికి సులభోపాయము

శ్లో॥ ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్॥

తా. భగవన్నామమైన ఓం కారమును ధనుస్సుగా భావించి ఆత్మయైన తనను బాణముగా జేసి, లక్ష్యరూపమైన బ్రహ్మము ను గురిచూచి, నిశ్చలమైన మనస్సుతో కొట్టిన యెడల ఆత్మ బ్రహ్మమునందు జేరి, తానే బ్రహ్మ స్వరూపుడగుచున్నాడు. అనగా దుస్సాధ్యములైన యజ్ఞ దాన తపస్సుల కంటె నామ జపమొనర్చి వ్యయ ప్రయాసలు లేకుండా జీవుడే పరమాత్మ యగుచున్నాడు.

## శ్రీరామకోటి యితర నామములు వ్రాయు భక్తులు గమనించదగిన విషయములు

1. పగటియందుగాని, రాత్రియందుగాని భగవన్నామము వ్రాయవచ్చును. ఎచ్చటనైనను కూర్చుండి వ్రాయుట సుఖకరముగా నుండును.

2. ఆటూయిటూ తిరుగుచూ భగవన్నామము వ్రాయుట ఉచితముకాదు. చాప, పీట, కుర్చీ మొదలైన వాటి యందు ఏదో ఒక ఆసనముపై కూర్చుండి వ్రాయుట మంచిది.

3. అంతకుముందు యితర విషయము లెవ్వియూ వ్రాయబడకుండా పున్న ఒకస్వచ్ఛమైన తెల్ల కాగితముపై భగవన్నామమును వ్రాయుచుండవలెను. కాగితము రెండవైపున ఏమియూ వ్రాయబడి గాని, అచ్చువేయబడిగాని వుండకూడదు. తాటియాకులపై నను భగవన్నామమును వ్రాయవచ్చును. కాగితము యొక్క రెండువైపుల భగవన్నామమును వ్రాయవచ్చును.

4. ఎర్ర సిరాతోనే భగవన్నామమును వ్రాయుచుండవలెను. భగవన్నామమును వ్రాసే కలమును, యితరములైన వ్రాతలకు ఉపయోగించక భద్రముగా నుంచుకొనవలెను.

5. ఎంత వరకు కాగితము పట్టునో, అంతవరకు సుందరమైన అక్షరములతో, స్పష్టముగా, భగవన్నామము వ్రాయవలెను. అంచులలో యిరికించి యిరికించి కనీ కనబడకుండా వ్రాయ కూడదు.

6. భగవన్నామము వ్రాయుచుండు సమయములో ఎచ్చటనైనా ఒకటి రెండు అక్షరములు పొరపాటు పడిన యెడల వాటిని సరిదిద్ద వద్దు కొట్టి వేయవద్దు అని ఎట్లు వ్రాయబడినవో అట్లే యుండనిచ్చి వాటి ప్రక్కనుంచి, యధాక్రమముగా భగవన్నామము వ్రాయుచు పోవలయును.

7. భగవంతుని యనేక నామములలో మీకు ఏ నామము యిష్టమో దానినే వ్రాయవచ్చును. సాధారణముగా భక్తులు "రామ" "సీతారామ" "శ్రీనివాస" "వెంకటేశాయ" "రాధాకృష్ణ" "నారాయణ" లేక "నమశ్శివాయ" అని వ్రాయుచుండెదరు.

8. అన్నిటికంటె ముఖ్యమైన విషయమేమనగా భగవన్నామము వ్రాయుచుండు సమయములో ఏ నామమును వ్రాయుచున్నారో ఆ నామమునే మానసికముగాగాని పైకి వినబడు నట్లుగా మెల్లగా గాని నోటితో ఉచ్ఛరించుచుండ వలెను.

9. భగవన్నామము వ్రాయుచుండే సమయములో, నామ జపము చేయుట తప్ప, యే యితర విషయములు మాట్లాడ కూడదు. మౌనముగా కూర్చుండి, భగవన్నామము వ్రాయు చుండవలెను.

## వ్రాయబడిన భగవన్నామములను ఏమి చేయవలెను?

పూర్వకాలమందు వ్రాయబడిన భగవన్నామములను ఒక్కొక్క పేరు చొప్పున విడివిడిగా కత్తిరించి ఒక్కొక్క ముక్కను గోధుమ పిండిలో పొదిగి, వుండలజేసి ఆ వుండలను చేపలకు వడవేయు చుండెడివారు. కాని యిట్లు చేయుట యుచితము గాదని తలచి, గుజరాతులోని సుప్రసిద్ధ యోగి శ్రీ పునీతజీ మహరాజ్‌గారు, భక్తులు వ్రాసి తెచ్చిన కోట్ల కొలది భగవన్నామములను శ్రీ నర్మదా నదియందు పడవేసి ప్రవహింపజేసిరి. వ్రాయబడిన భగవన్నామములను, పవిత్రములైన గంగా, గోదావర్యాది మహానదులలో, ఏదో ఒకదాని యందు విడిచి పెట్టుట ఉత్తమమైన మార్గము.

వ్రాయబడిన భగవన్నామములను స్వీకరించి, భద్రపర్చి ఆనామములకు పూజా, ప్రదక్షిణములు జరిపించుచుండెడి సంస్థలు కలవు. అట్టివాటిలో, కాశిలో నున్న "రామ-రమాపతి బ్యాంకు" ఒకటి. ఈ సంస్థ వారు ఆపదలో నున్న వారి కష్టములు తొలగుటకు లిఖిత నామ సంఖ్యలను అప్పు ఇచ్చెదరు. అప్పు తెచ్చుకొన్నవారు ప్రతి నిత్యమూ నియమ పూర్వకముగా భగవన్నామము వ్రాసి పూర్తి చేసి ఈ బ్యాంకు వారికి పంపించి ఋణము తీర్చుకొనవలెను. ఈ బ్యాంకు వారు పదమూడు లక్షల కంటె ఎక్కువ అప్పు యివ్వరు. వీరితో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపి అప్పు తెచ్చుకొన వచ్చును. ఇట్లే కాశిలో "ఓం నమః శివాయ బ్యాంకు" మూ "గాయత్రీ తపోభూమి" బ్యాంకుమూ కలవు.

కలకత్తాలో "అఖండ హరినామ సంకీర్తన భవనము" కలదు. ఇచ్చట కూడా వ్రాయబడిన భగవన్నామమును స్వీకరింతెదరు. మధ్యప్రదేశ్ రాష్ట్రములో "మానస-సంఘ్" బ్యాంక్ కలదు. దీని అడ్రసు : మానససంఘ్ రామవన్ సత్ నామధ్యప్రదేశ్, ఇచ్చట వ్రాయబడిన రామనామములను (రామకోటి) మాత్రమే స్వీకరింతెదరు. భారతదేశములో అనేకచోట్ల ఆంధ్రదేశమునందు రామకోటి వ్రాత ప్రతులను స్వీకరింతెదరు. భగవన్నామములను వ్రాయుచుండుట నిర్ణీత సంఖ్య పూర్తియయిన తరువాత ఆ నామములను పవిత్రమైన నదీ ప్రవాహములో విడిచిపెట్టుట ప్రవహింపజేయడమే ఉత్తమమైన మార్గము.

## శ్రీ విష్ణు పూజా ఫలము

శ్రీ విష్ణుమహిమలు అనంతములు, సహస్రవదనములుగల ఆదిశేషునకు కూడా లెక్కింప శక్యముగానట్టిది. విష్ణుమూర్తికి నమస్కరించి, నారాయణాష్టాక్షరీ మంత్రముచే పూజించిన యెడల సర్వరోగములు, సర్వపాపములు, సర్వ గ్రహదోషములు హరించిపోవును. 'ఓం నమో నారాయణాయ' అను అష్టాక్షరీ మంత్రమును ఎవరు జపించుచున్నారో, వారికి మహో విభ్రమ కారకములగు యితర మంత్రములతో పనియేమి? ఈ నారాయణాష్టాక్షరీ మంత్రమే సర్వకార్యములను సాధించును. వేదములు, యజ్ఞయాగాది క్రియలు సమస్తమూ నారాయణ పరములుగానే యున్నవి. పృథివ్యప్తేజో వాయురాకాశము అనెడి పంచభూతములున్నూ, నారాయణాత్మకములేయై యున్నవి. మనస్సూ, అహంకారము, బుద్ధి భూతభవిష్యద్వర్త మానములు, స్థూల, సూక్ష్మ, స్థావర, జంగమ సమన్వితమైన సకల బ్రహ్మాండము, నారాయణ పరమైయున్నది. శబ్దాది విషయములు, శ్రోత్రాదీంద్రియములు ప్రకృతి పురుషులు నారాయణాత్మకములైన వున్నవి. బ్రహ్మాది స్తంభపర్యంతము నారాయణుడే వ్యాపించి యున్నాడు. విష్ణువుకు ఉదకము స్నానము, కనుక స్నానము చేయునప్పుడు నారాయణుని స్మరించిన యెడల సర్వపాపములు హరించును.

## శివకేశవుల నామ మహిమ

శ్లో॥ హరిహరేతి నామ్నా లోకత్రయస్యచ
రక్షితాబహు మర్త్యా శివేన పరమాత్మనా

తా. హరే హరే! యని విష్ణు నామములుగాని, హర హర! యను శివ నామమునుగాని, నిరంతరము ఉచ్చరించుచుండుట వలన, అనేకమంది మానవులు పరమాత్ములైన శివకేశవులచే రక్షింపబడిరి.

తా. శివ యను రెండక్షరముల నామము ఎవరి జిహ్వాగ్రమందు ఎప్పుడూ వుంటున్నదో, వారే ధన్యులు, వారే మహాత్ములు, వారిజన్మము సార్థకము, ఎప్పటికైనా నాశనములేని "శివ" యను నామమును, ఎవరు ఉచ్చరించు చున్నారో మనుష్య రూపములో నున్ననూ, వారే రుద్రులు (శివ స్వరూపులు) అగుచున్నారు. ఇందుకు సందేహము లేదు.

## ఓం నమః శివాయ మంత్రము
### శివనామ మహిమ

శ్లో॥ కింతస్య బహుభిర్మంత్రైః కింతీర్థైః కింతపోధ్వరైః।
యస్య నమశ్శివాయేతి మంత్రో హృదయ గోచరః

తా. ఎవరి హృదయములో "ఓం నమఃశివాయ" అను మంత్రము సతతము కీర్తింపబడుచున్నదో, వారికి యితర మంత్రములతోను, తీర్థయాత్రలతోను, యజ్ఞయాగాదు లతోను పనియేమి?

ఓం నమః శివాయ మంత్రమే సకలార్థములను సాధించును.

శ్లో॥ తస్మాత్ సర్వప్రదో మంత్రః స్నాయ పంచాక్షరస్మృతః
స్త్రీభిః శూద్రైశ్చ సంకీర్ణైర్ధార్త ముక్తిశ్చ కాంక్షితంనాస్య దీక్షా నహోమశ్చ నసంస్కారో, నతర్పణం నకాలము నదేశశ్చ సదాశుచిరయం మనుః।

తా. ఓం నమఃశివాయ అను పంచాక్షరీ మంత్రమును స్త్రీలు, శూద్రులు, సంకర జాతీయులు ఎల్లరూ జపించవచ్చును. అందరికి మోక్షము లభించును. ఈ మంత్రమునకు దీక్షగాని, హోమాదులు గాని, ఉపదేశము, కాలనియమములు గాని లేవు. ఈ మంత్రమెప్పుడూ పవిత్రముగానే వుండును.

మహాపాపములు నశించిపోవుటకు 'శివ' యను రెండక్షరములే చాలును. 'నమః' అను పదమును జేర్చిన యెడల మోక్షమునిచ్చును. సద్గురువుచే ఉపదేశింపబడి పవిత్రమైన శివక్షేత్రమునందు జపింపబడిన యెడల "ఓం నమఃశివాయ" మంత్రము మహాశీఘ్రముగను సిద్ధింప జేయునదనుటలో ఆశ్చర్యమేమి!

## పంచాక్షరీ మంత్ర ప్రభావము

"ఓం నమశ్శివాయ" (షడక్షరి) లేదా "నమశ్శివాయ" (పంచాక్షరీ) మంత్రములలో ఏ ఒక్కటియైన దృఢతా పూర్వకముగ జపించెడి వ్యక్తి సమస్త శాస్త్రములను చదివిన వాడగుటేగాక, సమస్త సత్కార్యములను పూర్తిగా అనుష్ఠించిన వాడగుచున్నాడు. ఇట్టి వ్యక్తి యొక్క జీవితము సఫలమైనట్టిది. ఈ షడక్షరిగాని, పంచాక్షరిగాని జపించెడి వ్యక్తి, అతడు పండితుడేయగుగాక- అధముడేయగుగాక, హిరణ్యదర్శకుడే కాకపోయినా పాపపంజరము నుండి విముక్తుడు కాగలడు. ధర్మభ్రష్టమైన ఈ కలికాలములో ఈ పంచాక్షరీ జపము, అతడెంతటి పాతకుడైనప్పటికిని, సంసార సముద్రమునుండి, మహాపాపముల నుండి తరింపజేయగలదు.

తరింపచేయగలదు.

### శివనామ కీర్తన మహిమ

శ్లో॥ విశ్వేశ్వర విరూపాక్ష విశ్వరూప సదాశివ
శరణం భవ భూతేశ కరుణాకర శంకర॥
ఏతాని శివనామాని యః పఠేన్నిత్యమాదరాత్
నాస్తి మృత్యుభయం తస్య పాపరోగాదికం తథా॥

తా. ఈ పై రెండు శ్లోకములను ప్రతినిత్యమూ శివుని మనస్సులో ధ్యానించి శివుని పటము ఎదురుగా కూర్చుండి రోజున కొకసారియైన చదువుకొనుచుండెడివారికి పాపములు, వ్యాధులు, అపమృత్యువులు తొలగిపోవును. (పై శ్లోకార్థము విశ్వేశ్వర, విరూపాక్ష, విశ్వరూప, సదాశివ, భూతేశ, శంకర, కరుణాకర, మమ్ము రక్షింపుము)

### ఎన్నిసార్లు ఉపయోగించినను, పవిత్రముగావుండే వస్తువులు

బ్రాహ్మణులు, మంత్రములు, దర్భలు అగ్ని, తులసి ఈ వస్తువులు ఎన్నిసార్లు ఉపయోగింపబడు చున్ననూ, పవిత్రముగానే వుండును. (నిర్మాల్యత్వమును) పొందవు.

### అపారమైన సంసారములో సార భూతమైన వస్తువులు

విష్ణు భగవానుడు, ఏకాదశీ వ్రతము, గంగానది, తులసి, బ్రాహ్మణుడు, గోవులు ఈ ఆరున్నూ అపారమైన సంసారములో ముక్తినిచ్చేవి అయి వున్నవి.

### మోక్షము లభించుటకు శ్రేష్ఠమైన ఉపాయములు

అయోధ్య, మధుర, హరిద్వారము కాశీ, కాంచీపురం అవన్తికా (ఉజ్జయినీ), ద్వారకా యీ యేడు తీర్థక్షేత్రములు మోక్ష దాయకములు, ప్రాణములు పోవుచున్నప్పుడైనను "నేను సన్యసించితిని" అని ఎవరు చెప్పెదరో వారికి మోక్షం లభించును. కృష్ణ, కృష్ణ, కృష్ణ యని ఎల్లప్పుడూ ఎవరు స్మరించుచుండెదరో తామరపువ్వు నీళ్ళను ఛేదించుకొని ఎట్లు పైకివచ్చునో అట్లే వారిని తాను నరకము నుండి ఉద్ధరించెదనని శ్రీ కృష్ణ పరమాత్మ పలుమార్లు చెప్పియుండెను. సర్వ పాపహరమగు సాలగ్రామ శిలవుండే చోటా ద్వారకలో వుండే గోమతీ (చంద్రప్రతిమా) శిల వుండే చోట మోక్షము లభించును. తులసి చెట్లను నాటుట వలన పెంచుట వలన (ప్రమాదం కలగకుండా కాపాడుట) నీళ్ళు పోయుట వలన, మానవుల యొక్క, అనేక జన్మార్జితము అయిన పాపములను, తుడిచివెట్టి పోగొట్టును. మానవ శరీరములో, (మనస్సు) సత్యమనే జలములో నిండియుండి, రాగద్వేషములనే దోషములను పోగొట్టగలిగిన జ్ఞానమనే సరస్సులో ఎవరు స్నానము చేయుచుండెదరో వారికి పాపములు అంటవు. కర్రలో, రాళ్ళలో లేదు, మట్టి బొమ్మలోను లేదు, మహాభావమునందే దేవుడు కలడు. కనుక ధ్యానమును ఎల్లప్పుడూ వృద్ధి చేసుకొనుచుండవలెను. దేవతలు సత్పురుషులు ప్రతిదినమూ ప్రాతః కాలమందు పాపహరమగు నర్మదా నదిని దర్శనము చేసుకొనవచ్చునన్నారు. కాని వారు కైలాసమునకు పోలేరు. ఎందువల్లననగా వారి మనస్సులో పుణ్యచింతన లేదు. కనుక మహాభావమే ప్రధానమయినది. యెవరు బ్రాహ్మణుల కొరకు, గురువుల కొరకు, స్త్రీల కొరకు, దేశమును కాపాడుట కొరకు, దేవాలయములు ఆపదలు కలగకుండా రక్షించుట కొరకు ప్రాణములను త్యజించెదరో వారికి స్వర్గము లభించును. బుద్ధిమంతుడగు పురుషుడు జీవించుట, మరణించుట కూడ నేర్చుకొనవలెను. సేవధర్మములు చేయుచూ, సుఖభోగములను భవించుచూ, జీవించవలెను. యుద్ధస్థలమందు కాని పుణ్యక్షేత్రముల యందు కాని మరణించవలెను. హరిద్వారము, కురుక్షేత్రము భృగుక్షేత్రము, శ్రీశైలం, ప్రభాసము, అమరపర్వతము, త్రిపుష్కరము, భూతేశ్వరక్షేత్రములలో ప్రాణములు వదలిన వారు స్వర్గలోకమును కేగెదరు. పది నూతులతో సమానము ఒక దిగుడుబావి, పది దిగుడు బావులతో సమానము ఒక చెరువు, పది చెరువులతో సమానము ఒక నిర్జల ప్రదేశమందు కొలనులు త్రవ్వించేవారు, నిర్ధనుడైన బ్రాహ్మణునకు, దానమొసంగెడివారు, సకల ప్రాణుల దయతో చూచెడివారు, స్వర్గలోకాధిపత్యమును వహించెదరు. సదాచారవంతుడైన బీదవానికి దానముచేయుట, ఉపేక్షింపబడిన శివలింగమును పూజించుట, అనాధప్రేతకు సంస్కార మొనరించుట, కోటియజ్ఞములు చేసిన పుణ్యము నొసంగును.

### సర్వత్ర భగవంతుడు నిండియున్నాడు

సర్వ ప్రాణులయందు విష్ణువు నిండియున్నాడు. విష్ణుమంత్రోపాసకుడు సర్వ శ్రేష్ఠుడు. వృక్షములలో గింజ రూపముగా నున్నాడు. అన్ని భూతములలోను భగవంతుడు నివసించును. భగవంతుని యందే సమస్త జగత్తు యిమిడివున్నది. వృక్షానికి, ఫలము పండులో తిరిగి వృక్షానికి అంకుర రూపమయిన గింజయిమిడి వున్నట్లే సర్వమునకు కారణభూతమైనవాడు ఆ భగవంతుడే. ఈ భగవంతునికి కారణము వేరే యింకొకటి లేదు. అందరికి ఈశ్వరుడు (ప్రభువు) ఆతనికి వేరే యింకొక ప్రభువులేరు. కారణానికి కూడా కారణము భగవంతుడే బుద్ధిమంతులయిన పురుషులు, సమస్త జీవములకు భగవంతుడే మూలకారణమని చెప్పుచున్నారు.

భగవన్మాయచే మోహితులై ప్రాణులు, దేవుని తెలుసుకోలేకుండా వున్నారు. అన్ని జంతువులలోను ఆత్మ భగవంతుడే, కాని దుర్బుద్ధి వలన దౌర్భాగ్యమువలన, పాపగ్రస్తులయిన జీవులు, తమ ఆత్మల వలనైనా, భగవంతుని ఆదరించలేకుండా వున్నారు. ఏ శరీరములో భగవంతుడున్నాడో అక్కడ అన్నిశక్తులూ ఆతనిదివ్యకళా వుంటూ వున్నవి. కాని ఆ భగవంతుడు శరీరమునుండి లేచి పోవుటతోడనే, రాజు వెంట అనుచరుల వలె సర్వశక్తులు క్షీణించి పోవుచున్నవి.

### శ్రీ కృష్ణ పూజా సాధన క్రమము

ప్రాతః కాలమందు నిద్రలేచి, రాత్రి కట్టుకొన్న బట్టలు విడిచి వేరే వస్త్రములు ధరించి హృదయకమలమందు యిష్టదైవమును స్మరించి బ్రహ్మ రంధ్రమునందు గురువుతలచి కాలకృత్యములను తీర్చుకొని నిర్మల జలములో స్నానము చేయవలెను. కర్మ నివేదనము కోరే భక్తుడు ఏ సంకల్పము చెప్పనక్కరలేదు. స్నానము చేసి భగవంతుని స్మరించి సంధ్యావార్చి యింటికి వెళ్ళవలెను. యింటి సింహద్వారము వద్ద కాళ్ళు కడుగుకొని లోపల ప్రవేశించి ఉతికిన బట్ట (కట్టుబట్ట ఉత్తరీయము) కట్టుకొని మోక్షమునకు కారణభూతుడైన శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించి పూజించవలెను. సాల గ్రామములోను, మణిలోను, యంత్రములోను, ప్రతిమలోను, జలములోను బ్రాహ్మణునియందు గోవుయందు, లేక తన గురువు నందు శ్రీకృష్ణుడు వున్నట్లుగా తలంచి ఏదో ఒకచోట పూజించవచ్చును.

నీటిలో నిండిన కలశములోగాని అష్టదళ పద్మములోగాని, మంచిగంధపు చెక్కతో చేయబడిన పాత్రయందుగాని శ్రీ కృష్ణుని ఆ వాహనము చేసి పూజచేయవచ్చును. సాల గ్రామశిల యందు, జలమందు పూజచేసే యెడల ఆ వాహనము చేయనవసరంలేదు. మంత్రానురూపమయిన ధ్యానశ్లోకమును చదివి మూలమంత్రములో షోడశోపచార పూజగావించవలెను. ప్రతిమావరణలో కృష్ణునితోబాటు శ్రీదామ, సుదామ, వసుదామ, వీరభాను, శూరభాను, అను అయిదుగురు గోపకులను పూజించవలెను. తరువాత సునందనంద,

కుమార, సుదర్శనములను, లక్ష్మి, సరస్వతి, దుర్గా, రాధా, గంగా, పృథివీ అనే దేవతలను, గురు, తులసి, శివ కార్తికేయ, వినాయక, నవగ్రహములను తరువాత పదిమంది దిక్పాలకు లను, పది దిక్కుల యందు పూజించ వలెను. అందరికంటె ముందుగా విఘ్న నివారణకొరకు గణేశుని, సూర్య, అగ్ని, విష్ణు, శివ పార్వతులను పూజించవలెను. ఈ దేవతలు కర్మబంధములను త్రెంచి, మోక్షము పొసంగెడి వారై యున్నారు. విఘ్న నివారణ కొరకు గణేశుని, రోగ నివారణ కొరకు సూర్యుని అభీష్ట ప్రాప్తికి అంతః కరణ శుద్ధి కలుగుటకు అగ్నిదేవుని, మోక్షార్థము విష్ణుమూర్తిని, జ్ఞాన ప్రాప్తి కొరకు శివుని, బుద్ధి ముక్తి రెంటి కొరకు పార్వతిని పూజించవలెను. మూడు సార్లు పుష్పాంజలులు యిచ్చి, ఆయా దేవతల యొక్క స్తోత్రములు కవచములు పఠించవలెను, తరువాత గురువందనము, తదనంతరము దేవతలకు నమస్కారములు చేయవలెను. ఇట్లు పూజచేయుచుండిన యెడల ఆత్మ శుద్ధి కలుగును.

## శ్రీ కృష్ణ పంచదశాక్షర మహామంత్రము

మూలమంత్రము : "క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీ జనవల్లభాయ స్వాహా"

విధానము : ప్రతిదినము మొదలు శ్రీ గణపతి ధ్యానమును శ్రీ కృష్ణాష్టోత్తర శతనామ పూజను చేసి ఈ మంత్రమును అయిదు వందల ఎనిమిదిసార్లుగాని, నూట ఎనిమిదిసార్లుగాని జపించుచుండిన యెడల శ్రీ కృష్ణుని యనుగ్రహముచే సర్వ కార్యసిద్ధియును, శత్రు జయమును, కీర్తి, బలమును, తేజస్సును పాండవుల వలె తనకును ప్రాప్తించును.

## శ్రీ కృష్ణ అష్టాక్షర మహామంత్రము ప్రభావము

మూలమంత్రము : "శ్రీ కృష్ణః శరణం మమ"

(1) శ్రీ : సౌభాగ్యము నిచ్చును. ధనమును, లోక ప్రియత్వమును కలుగ చేయును. (2) కృ: పాపములను నశింపచేయును. (3) ష్ణ : ఆదిభౌతిక ఆదిదైవిక దుఃఖములను హరింప చేయును. (4) శ: జనన మరణ దుఃఖములు లేకుండా చేయును. (5) ర: భగవత్ జ్ఞానమును కలుగ చేయును. (6) ణః భగవంతుని యందు దృఢమైన భక్తిని కుదుర్చును. (7) మ: భగవత్ సేవను [illegible] ప్రీతిని కలిగించును. (8) మ : అనుదినము చేసే గురువు వందన [illegible]

సాయుజ్యము నిచ్చును. తిరిగి జన్మలేకుండా మోక్షమును ప్రసాదించును.

ఈ విధముగా పైన పేర్కొనబడిన ఎనిమిది బీజాక్షరములను వరుస క్రమముగా కూర్చి శ్రీకృష్ణః శరణం మమ అను మహామంత్రమును ప్రతినిత్యమూ ఉచ్చరించు చుండిన యెడల సమస్త కోరికలు సిద్ధించుచుండును. విఘ్నములు హరించును. వ్యాధులు గ్రహదోషములు పరిహరింపబడును. భగవద్భక్తి కలుగును.

కలియుగములో శ్రీకృష్ణ అష్టాక్షర మహామంత్రము చాలా గొప్పది. ఈ మంత్రమును ఉచ్చరించుచుండుట వలన జీవులు సత్యముగా ఉద్ధరింపబడెదరు. శరణుపొందిన వారిని భగవంతుడు తప్పక రక్షించును. భగవత్ ప్రాప్తిని కలుగ జేయుటకు శరణాగతియే ఉత్తమ మార్గమని వేదాది సకల శాస్త్రములున్నూ చెప్పుచున్నవి.

స్నానము చేసి శుచియై ఏకాగ్రమైన చిత్తముతో జపమాల చేతబట్టుకొని ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లుగాని యధాశక్తిగా గాని జపించవలెను. నిర్ణీత సంఖ్య జపము పూర్తి అయ్యే లోగా యితరులతో మాట్లాడుటగాని యితరపనులు గాని చేయకూడదు. మైలపడుదు వచ్చిన రోజులలో జపమాల చేతబట్టుకొని జపము చేయకూడదు. మనస్సులో జపించు కొనవచ్చును. స్త్రీలు కూడా బహిష్టు అయినప్పుడు ప్రసవించినప్పుడు జపమాల చేతబట్టుకొని మంత్రమును జపించకూడదు. మనస్సులో జపించుకొనవచ్చును. శ్రీకృష్ణః శరణం మమ అను మహామంత్రమును ప్రతి నిత్యము జపించు చుండుట వలన సర్వ మనోరథములు సిద్ధించును.

## శ్రీ కృష్ణ భగవానుని దర్శనము లభించుట కొరకు మంత్రము

1. మంత్రము : శ్లో॥ కచ్చి తులసి కళ్యాణి గోవింద చరణప్రియే సహాత్యాలికుల్లెర్విల దృష్ట సేతి ప్రియోమ్యతః

విధానము : మారేడు చెక్కతో ఒక చిన్న పీట చేయించి దానిపైన పై మంత్రమును తులసి కాష్ఠ గంధముతో తులసి పుల్ల కలముతో వ్రాసి, ప్రతి రోజూ షోడశోప చారములతో పూజించుచూ ప్రతి నిత్యమూ పై మంత్రమును బ్రహ్మ చర్యము నవలంబించి వెయ్యి నూట ఎనిమిది సార్లు చొప్పున జపించుచుండిన యెడల ముప్పయి రెండువేల జపము పూర్తియగునప్పటికి శ్రీకృష్ణ భగవానుని దర్శనము లభించును.

2. మంత్రము : శ్లో॥ ప్రణ మహోక సాం వృత్తలక్ష్మీ వృజినహాన్త్రం విశ్వమంగళమ్ ల్వజమూ కృష్ణలక్ష్మీ హొళ్ళనాల వ్రజన హృద్యజామ్ యన్ని మానసమ్

విధానము : ప్రతి నిత్యమూ ఈ మంత్రమును నూట ఎనిమిది సార్లు జపించి ఓం గోపీ జనవల్లభాయనమః అను మంత్రమును పదకొండు వందల ఎనభై ఎనిమిదిసార్లు జపించ వలయును. బ్రహ్మ చర్యములో నుండవలెను. ఇట్లు ప్రతి నిత్యమూ జపము చేయుచుండిన యెడల ముప్పయి రెండు వేల జపము పూర్తి యగునప్పటికి శ్రీకృష్ణుని దర్శనము లభించును.

3. మంత్రము : శ్లో॥ తా హి మా విరహాద్భారిః న్యయమాత ముఖాంబుజః పీతాంబరధరః స్రగ్వీసాక్షాన్మన్మథ మన్మథః

విధానము : ప్రతి నిత్యమూ పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించి "ఓం క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీ జన వల్లభాయ స్వాహా" అను మంత్రమును పదకొండు వందల ఎనభై ఎనిమిదిసార్లు జపించవలయును. బ్రహ్మ చర్యములో నుండవలెను. ఇట్లు ప్రతినిత్యమూ జపము చేయుచుండిన యెడల ముప్పయి రెండువేల జపము పూర్తియగు నప్పటికి శ్రీకృష్ణ దర్శనము లభించును.

## శ్రీ కృష్ణ భగవానునికి పూలలో యిష్టమైన పువ్వులు

కలువపువ్వు, ఎర్రగన్నేరుపువ్వు, కనుగుపువ్వు, సంపెంగ పువ్వు, మల్లెపువ్వు, మోదుగ ఆకులు, గరికె, గురుగింజల పువ్వులు. తులసి దళములు యివి శ్రీకృష్ణునకు చాలా ప్రియమైనవి. అన్ని పూవులలోను నల్ల కలువపువ్వు వెయ్యి రెట్లు ఎక్కువ యిష్టమైనది. ఎర్రతామర కంటె తెల్ల తామరపువ్వు యింకా వెయ్యిరెట్లు ఎక్కువ యిష్టమయినది.

తెల్ల తామర పువ్వు కంటె కూడా తులసి యింకా వెయ్యి రెట్లు ఎక్కువ యిష్టమైనది. తులసి పుష్పము కంటె [illegible] పుష్పము కంటె సార్వ పుష్పము మిక్కిలి ప్రీతి కరమైనవి. ఏ పూలు దొరకని యెడల తులసిదళములతోను, అవికూడా దొరకని యెడల తులసి కొమ్మల ముక్కలతోను, శ్రీకృష్ణుని పూజించ వలెను. తులసి వేరు కూడా దొరకని యెడల తులసి చెట్టు వుండే చోటులోని మట్టి తీసుకువచ్చి దానితో శ్రీకృష్ణుని పూజ భక్తి పూర్వకముగా చేయవచ్చును.

జపం చేయుచుండిన యెడల శ్రీకృష్ణుని దయవలన అన్ని [illegible]

సార్లు నేతితో హోమమును చేసిన యెడల సిద్ధించును. ఆపదలు [illegible]

## శ్రీకృష్ణ భగవానునికి ఇష్టములేని (పూజించకూడని) పుష్పములు

కావేరు పువ్వు, అవిసె పువ్వు, ఉమ్మెత్త పువ్వు, కలిగొట్టు పువ్వు, తుమ్మిపువ్వు, పున్నాగ పువ్వు, గనుగపువ్వు, తాళపత్రి, పొంతెట్టు పువ్వు, పావిలపువ్వు, పొత్తిదుంప పువ్వు, మందార పువ్వు, మెట్టతామర పువ్వు, అశోక పువ్వు, బూరుగు పువ్వు, ఎర్రరేచ కాంచనపువ్వు, కమ్మోరాలు, కసింద పువ్వు, ఊడుగ పువ్వు, దింటెనపువ్వు, సింధులంగు పూలు, ఒంటికొమ్మపూలు. శ్రీకృష్ణుని పూజకు పనికిరావు. మరియూ జిల్లేడిపూలు, జిల్లేడు ఆకుపైన పెట్టిన ఏ పూవు లైనను పనికిరావు వేసపూవులు పనికిరావు.

## శ్రీకృష్ణ భగవానుడు బాలరూపములో దర్శనము ఇచ్చుటకు మంత్రస్తోత్రము

శ్లో॥ యత్పాదపాంసు ర్బహు జన్మకృచ్ఛ్రతో ధృతాత్మభిర్యోగిభిర
వ్యాలభ్యః స ఏవయద్దృగ్విషయః స్వయంస్థితః కిం వర్ణ్య తే దిష్టమతో వ్రజౌకసామ్

విధానము: ఈ మంత్రమును ప్రతినిత్యము నూట ఎనిమిదిసార్లు జపించవలెను. శ్రీమద్భాగవతములో, దశమస్కంధములో, పూర్వార్ధములో ప్రతి దినము మూడు అధ్యాయములు చొప్పున పదహారు దినములలో పారాయణ పూర్తిచేయవలెను. అధ్యాయము పారాయణ మొదలు పెట్టేటప్పుడు పారాయణ చివర పై మంత్ర శ్లోకమును ఒక్కసారి చదువవలెను. ఇట్లు చేయుచుండిన యెడల శ్రీకృష్ణుడు బాలరూపములో దర్శనము ఇచ్చును.

## అన్ని కష్టములు తొలగించే శ్రీకృష్ణ మంత్రము

మూలమంత్రము: "శ్రీకృష్ణాయనమః"

విధానము: ఈ మంత్రమును ప్రతినిత్యమూ వెయ్యి ఎనిమిదిసార్లు జపించుచుండవలెను.

శ్లో॥ కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే
ప్రణత క్లేశనాశాయ గోవిందాయ నమోనమః

విధానము: ఈ శ్లోకమును ప్రతినిత్యమూ నూట ఎనిమిదిసార్లు పఠించుచుండవలెను. ఇట్లు ప్రతినిత్యమూ భక్తి విశ్వాసములతో జపం చేయుచుండిన యెడల శ్రీకృష్ణుని దయవలన అన్ని కష్టములు తొలగిపోవును.

## జ్వరము హరించుటకు శ్రీకృష్ణ మంత్రము

శ్లో॥ శ్రీకృష్ణః బలభద్రశ్చ ప్రద్యుమ్నాన్యానిరుద్ధకః /
ఉషా స్మరణ మాత్రేణ జ్వర వ్యాధి ర్విముచ్యతే /

విధానము: ఈ మంత్రమును ప్రతినిత్యమూ జ్వరముతో నున్నవారు ఉదయము లేచుటతోడనే నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచుండినయెడల రెండు మూడు రోజులలో ఎంతటి తీవ్రజ్వరమైనను హరించి పోవును.

## శ్రీకృష్ణుని దయకలుగుటకు కృష్ణదర్శనం లభించుటకు యంత్రము

| 8 మ | | | 5 ర |
|---|---|---|---|
| | 1 శ్రీ | 4 శ | |
| | 2 కృ | 3 ష్ణ | |
| 7 మ | | | 6 ణం |

విధానము: ఈ యంత్రమును పల్చటి రాగిరేకుపై చెక్కించి గంగా జలముతో గాని, యమునా నదీజలముతో గాని కడిగి సాంబ్రాణి పొగ వేసి పీటపై పెట్టి పంచోపచారము లతో పూజించి "శ్రీకృష్ణః శరణం మమ" అను మంత్రమును ప్రతినిత్యము అయిదు వందల యాభై సార్లు భక్తి విశ్వాసములతో జపించుచుండవలెను. ఇట్లు చేయుచుండిన యెడల శ్రీకృష్ణుని దయకలిగి సాధ్యమయినంత త్వరలో కృష్ణదర్శనము లభించును. భక్తునియొక్క సర్వమనోభీష్టములు నెరవేర్చుచుండును.

## సర్వాపదలు తొలగుటకు కృష్ణమంత్రము

మూలమంత్రము: "హే కృష్ణ! ద్వారకావాసిన్! క్వాసి యాదవ నందన ఆపద్భిః పరిభూతాం మాం త్రాయస్వాశు జనార్దన"

విధానము: ఈ మంత్రమును ప్రతి నిత్యమూ నూట ఎనిమిదిసార్లు స్వయముగా జపించవలెను. కొన్ని రోజులయ్యేటప్పటికి స్వప్నములో కృష్ణుడు కనబడి శుభాశుభములు చెప్పుచుండెను. ఈ మంత్రమును ఏభై రెండు వేలు జపించి ఏభై రెండు వందల సార్లు నేతితో హోమము చేసిన యెడల సిద్ధించును. ఆపదలు దరిచేరవు. ఎంతటి కష్టములైన శ్రీకృష్ణ పరమాత్మ అనుగ్రహము వలన సులువుగా విడిపోవును.

## ఘోరమైన సంకటములు తొలగిపోవుటకు కృష్ణ మంత్రములు

హే కృష్ణ ద్వారకావాసిన్ క్వాసి యాదవ నందన
ఆపద్భిః పరిభూతాం మాం త్రాయస్వాశు జనార్దన
హే కృష్ణ ద్వారకా వాసిన్ క్వాసి యాదవనందన /
కౌరవైః పరిభూతాం మాంకిం న్నజానాసి కేశవ /

విధానము: ఈ పై రెండు మంత్రములను ముప్పది రెండువేల సార్లు జపించినయెడల ఘోరములైన సంకటములైనను దూరముగా తొలగిపోవును. శాంతి సౌఖ్యములు లభించును.

## దుస్స్వప్న దోషశాంతికి, వివిధ సిద్ధులు లభించుటకు సాధన

స్నానము చేసి శుచిగా తూర్పు ముఖముగా కూర్చుండి అచ్యుత కేశవ విష్ణు హరి సత్య జనార్దన హంస నారాయణ అను ఎనిమిది శుభనామములను పదిసార్లు జపించినయెడల పాపము హరించి దుస్స్వప్నముకూడా శుభఫలమునే ఇచ్చును.

భక్తి పూర్వకముగా విష్ణుః నారాయణః కృష్ణః మాధవః, మధుసూదనః హరిః నరహరిః రామః గోవిందశ్చ వామనః అను పది శుభకర నామములను, నూరుసార్లు జపించిన యెడల వ్యాధులు హరించిపోవును. ఒక లక్షజపము చేసినయెడల కారాగార విమోచనము కలుగును. ఈ నామములనే పది లక్షలు జపించిన యెడల వంధ్యా స్త్రీకి పుత్రుడు జన్మించును. హవిష్యాన్న భోజనము చేయుచూ పై నామములను జపించితే దరిద్రుడు ధనవంతుడగును. ఈ పది నామములను ఒక కోటిసార్లు జపించిన యెడల జీవన్ముక్తుడగును.

స్నానము చేసి, ఓం శివాయ నమః ఓం దుర్గాయైనమః ఓం గణపతయే నమః ఓం కార్తికేయాయనమః ఓం దినేశ్వరాయ నమః ఓం ధరాయైనమః ఓం లక్ష్మ్యైనమః ఓం సరస్వత్యైనమః అను ఎనిమిది మంత్రములను జపించుచుండినయెడల సర్వమనోరథములు సిద్ధించును. దుస్స్వప్నములును శుభఫలము నిచ్చును.

## శ్రీ వేంకటేశ్వర మహా మంత్రము

మూలమంత్రము : "శ్రీ వేంకటేశాయనమః"

విధానము : ఈ వేంకటేశ్వర మహామంత్రము భక్తి ముక్తి రూపమైన ఫలము నిచ్చునది. కాబట్టి సర్వమంత్రముల లోను, సుప్రసిద్ధమయి రహస్యముగా నున్నది. ఈ మంత్రమును ప్రతి నిత్యమూ వెయ్యి నూట ఎనిమిదిసార్లుగాని యథాశక్తిగాని, జపించుచూ శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి ధూప దీప నైవేద్యాదులు సమర్పించుచుండిన యెడల భక్తునియొక్క సర్వమనోభీష్టములు నిస్సందేహముగా సిద్ధించు చుండును.

## కలిదోష నివారణ మహా మంత్రము

శ్లో॥ హరే రామ! హరే రామ! రామ రామ హరే హరే ! హరే కృష్ణ! హరే కృష్ణ ! కృష్ణ కృష్ణ హరే హరే ! కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే ప్రణత క్లేశనాశాయ గోవిందాయ నమో నమః॥ అచ్యుతం కేశవం రామ నారాయణం । కృష్ణ దామోదరం వాసుదేవ హరిమ్ శ్రీధరం మాధవం గోపికా వల్లభం । జానకీ నాయకం రామచంద్రం భజే । అను ఈ శ్లోకములను ఈ కలియుగమున నెవ్వరు ప్రతినిత్యమును పఠింతురో వారికి సమస్త పాపములు నశించునని శ్రీ భగవంతుడే భక్తుల కొరకు అనుగ్రహించి యున్నాడు.

## మహామంత్ర చింతామణి

మూలమంత్రము : గోపీ జనవల్లభ చరణాన్ శరణం ప్రపద్యే నమో గోపీజనవల్లభాభ్యామ్.

ఓం అస్య శ్రీ మంత్ర చింతామణి నామ యుగళ మంత్రస్య భగవాన్ శివ ఋషిః గాయత్రీచ్ఛందః వల్లకీ కాంతో దేవతా ప్రపీయస్య హార్దాస్యే వినియోగః.

విధానము : ఈ మహామంత్ర చింతామణి మంత్రములు భగవాన్ శివుడు నారద మహర్షికి ఉపదేశించెను. ఈ మంత్రమునకు పురశ్చరణ చేయవలసిన పనిలేదు. ఎందువలననగా యిది స్వతస్సిద్ధ మంత్రము. ఈ మంత్రమునకు న్యాసములు చేయనక్కరలేదు. ఈ మంత్రసిద్ధికి దేశకాలనియమములు పాటించవలసిన పనిలేదు. అరిమిత్రాది అర్ణములు చూచుకోనక్కరలేదు. బ్రాహ్మణుడు మొదలు చండాలుని వరకు సర్వమానవులు ఈ మంత్రమును జపించుటకు అధికారులే. స్త్రీలు శూద్రులు కూడా ఈ మంత్రమును జపించవచ్చును. మూగవారు, కుంటివారు, చెవిటివారు మొదలైన వారందరు కూడా ఈ మంత్రమును జపించుకోవచ్చును. హూణులు, కిరాతులు, పుళిందులు, పుల్కసులు, ఆభీరులు, యవనులు, ఖసులు మొదలైన భిన్న భిన్న జాతీయులు కూడ ఈ మంత్రమును జపించవచ్చును. దాంభికులు, అహంకారులు పాపాత్ములు మొదలైన వారు కూడా శ్రీకృష్ణుని యందు భక్తి కల్గియున్న యెడల ఈ మంత్రమును జపించుట కధికారులే. శ్రీకృష్ణుని యందు భక్తి లేని యెడల యజ్ఞములు చేసినవారు కాని, దానములు చేసినవారు కాని సర్వతంత్రములు చూచినవారు కాని, సత్యవాదులు కాని, వేదవేదాంగ విదులుకాని, తపోవ్రత పరాయణులు కాని బ్రహ్మనిష్ఠ చేసేవారు కాని ఈ మంత్రమును జపించకూడదు.

శ్రీకృష్ణునియందు భక్తి కలిగియుండిన యెడల ఎవరైననూ ఈ మంత్రమును జపించవచ్చును. అట్టి శ్రీకృష్ణ భక్తులకు ఈ మంత్రమును నుపదేశించవలెను. ఈమంత్రమును జపించువారు రాధాసహిత శ్రీకృష్ణుని పూజించవలెను. ఈ మంత్రం ఒకసారి పఠించినంత మాత్రముననే ఫలితము నిచ్చును. అయిననూ ప్రతినిత్యమూ నూట ఎనిమిదిసార్లు జపించు చుండిన యెడల విశేష ఫలదాయకమగును. ఈ మంత్ర పాఠకులకు శ్రీరాధాకృష్ణుల దయవలన అన్ని కష్టములు తొలగిపోయి, సకల భోగభాగ్యములు కలిగి అంత్యమున పరమపదము లభించునని శ్రీమహాదేవుడు నారద మహర్షికి ఉపదేశించెను.

## ఏ జన్మయందైననూ భక్తి కలుగుటకు భగవత్ ప్రార్థన

శ్లో॥ నాథ యోనిసహస్రేషు యేషు యేషు వ్రజామ్యహం ।
తేషు తేష్వచలా భక్తిరచ్యుతాస్తు సదా త్వయి ।
యా ప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ
త్వామనుస్మరతః సామే హృదయాన్మాపసర్పతు ।

తా. అనేక యోనులయందు ఎక్కడ నేను జన్మించి యున్ననూ, నీయందు స్థిరమైన భక్తిని నాకు ప్రసాదింపుము. అవివేకులయిన మనుజులు విషయసుఖములయందు ఎంత గాఢముగా ఆసక్తులై యుండెదరో, అట్లే నీయందు నాకుగల ప్రీతిని నా హృదయము నుండి తొలగిపోనివ్వకుము అని ప్రహ్లాదుడు భగవంతుని ప్రార్థించెను.

## విష్ణు షోడశ నామజపము

శ్లో॥ ఔషధే చింతయే ద్విష్ణుం భోజనే చ జనార్దనమ్ శయనే పద్మనాభంచ వివాహేచ ప్రజాపతిమ్ । యుద్ధే చక్రధరం దేవం ప్రవాసేచ త్రివిక్రమమ్ నారాయణం తను త్యాగే శ్రీధరం ప్రియ సంగమే దుస్స్వప్నేస్మర గోవిందం సంకటే మధుసూదనమ్ కాననే నారసింహంచ అగ్నౌహి జలశాయినమ్ జలమధ్యే వరాహంచ పర్వతే రఘు నందనమ్ షోడశైతాని నామాని ప్రాతరుత్థాయ యః పఠేత్ సర్వ పాపవినిర్ముక్తో విష్ణులోకే మహీయతే॥

ఔషధ సేవకాలమందు విష్ణునామమును, భోజనసమయ మందు జనార్దన నామమును, నిద్రించే సమయమందు పద్మనాభ నామమును, వివాహ కాలమందు ప్రజాపతి నామమును యుద్ధములో చక్రధర నామమును, ప్రయాణములో త్రివిక్రమ నామమును, మరణ సమయములో నారాయణ నామమును, ప్రియసంగమ సమయములో శ్రీధర నామమును దుస్స్వప్న దోష పరిహారము కొరకు గోవింద నామము, సంకటస్థితియందు మధుసూదన నామమును, అడవి యందు నృసింహ నామమును, అగ్ని ప్రమాదములయందు జలశాయి నామమును, నీటియందు వరాహ నామమును, పర్వతముపై సంచరించే కాలములో రఘునందన నామమును నడచి వెళ్ళునప్పుడు వామన నామమును స్మరించు చుండ వలెను. ప్రాతః కాలమందు లేచుటతోడనే ఈ విష్ణుషోడశ నామములను యెవరు చదువు చుందురో వారు విష్ణులోక మందు పూజింపబడుచుండెదరు.

## ఏ కోరిక సిద్ధించుటకైనా విష్ణు సహస్రనామ పారాయణం చేయు విధానం

మూలమంత్రము : రామో విరామో విరతో మార్గో నేయో నయో నయః రక్షాం కురు త్రిలోక దేవప్రియం మాం శరణాగతమ్

శ్రీ విష్ణుమూర్తి పటమును పంచోపచారములచే పూజించి, పైన పేర్కొనబడిన మంత్రమును, విష్ణు సహస్రనామ స్తోత్రములోని ప్రతి శ్లోకమునకు ముందు చివరా సంపుటీకరించి, విష్ణు సహస్రనామ స్తోత్రమును రోజుకు యిరవై ఒక్కసార్లు చొప్పున పారాయణ చేయుచుండిన యెడల ఏ కోరిక అయినప్పటికీ శీఘ్రముగా నెరవేరును.

## ఏ కష్టమైనా తొలగిపోవుటకు మంత్రము

**మూలమంత్రము :** "ఓం రాం రాం రాం రాం రాం రాం రాం రాం క్లీం స్వాహా."

**విధానము :** ఈ మంత్రమును ప్రతినిత్యమూ నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచుండిన యెడల ఏ కష్టమైనను అతి తొందరలో తొలగిపోవును. ఈ మంత్రము అనేకమందికి పరీక్షితముచేసి యున్నది. శ్రద్ధా, భక్తి విశ్వాసములతో జపించుటయే మంత్రము సిద్ధించుటకు ముఖ్యకారణమై యున్నది.

## రోగ నివారక మంత్రము

**మూలమంత్రము :** దైహిక దైవిక భౌతిక తాప రామరాజనప కారహారాభ్యాహా అల్ప మృత్యు నివారకవని ఉపగా సకలసుందర సఖ దిరుజ శరీరా ఓం క్లీం తేజసే రాం తారక బ్రహ్మ స్వాహా చౌహాయితో సహా ఈ మంత్రమును ప్రతి నిత్యమూ నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచూ; రామ దేవునికి యథాశక్తిగా నైవేద్యము పెట్టుచుండిన యెడల సకల వ్యాధులు. కొంత రోజులలోనే నిస్సంశయముగా తొలగిపోయి ఆరోగ్యము లభించును.

## శ్రీ సౌభాగ్యరామ మంత్రము

**మూలమంత్రము :** పునిమన బచనకరము రఘునాయక. వరన కమల అంతెనెసలాయక రాజీవనయన ధరేరమసాయకభగవ్ లివవిభజన సుఖదాయక. ఓం నమోభగవతే సర్వేశ్వరాయ శ్రియః పతయేనమః. ఈ మంత్రమును ప్రతినిత్యమూ నూట ఎనిమిదిసార్లు జపించుచుండవలెను. దీని ఫలిత ఆదరలు తొలగి సుఖములు గలుగును. ఈ మంత్రమును స్త్రీలు జపించు చుండిన యెడల సౌభాగ్యము స్థిరముగా నిలచియుండును. సంపదలు వృద్ధి చెందును.

## ఇరవై రకముల సిద్ధులు, సిద్ధ మంత్రము

అణిమా, లఘిమా, ప్రాప్తి, ప్రకామ్యము, మహిమా, ఈశిత్వమూ, వశిత్వము, కామవసాయితే, దూరశ్రవణము, పరకాయ ప్రవేశము, మనోయాయిత్వము, సర్వజ్ఞత్వము, అగ్నిస్తంభన, జలస్తంభన, చిరంజీవిత్వము, ఆకలి, దప్పిక, నిద్రాస్తంభన, వాక్సిద్ధి, మరణించిన వారిని తిరిగియదేచ్ఛగ రప్పించుట, సృష్టిచేయుట, ప్రాణములను ఆకర్షించుట. ఇవి యిరవై రకముల సిద్ధులు. సిద్ధమంత్రము : "ఓం సర్వేశ్వరాయ సర్వ విఘ్న వినాశనే మధుసూదనాయస్వాహా" ఈ మహామంత్రము అతి రహస్యమయినది. సర్వజనులకు సకలాభీష్టములు ఒసంగునట్టి కల్పవృక్షమువంటిది. ఈ మంత్ర జపమువల్లనే యోగులు, మునీశ్వరులు, దేవతలు అనేక సిద్ధులను పొందిరి. సత్పురుషులు ఈ మంత్రమును ఒక కోటిసార్లు జపించిన యెడల నిశ్చయముగా సిద్ధించును. నారాయణ క్షేత్రములో వుండి హరివిశ్వప్నమును తినుచూ ఈ మంత్రమును జపించుచుండిన యెడల బహుశీఘ్రముగా సిద్ధించును. కాశిలో మణికర్ణికా క్షేత్రములో (తీర్థము) వుండి జపముచేసినా సిద్ధించును. గంగాజల ప్రవాహమునకు నాల్గుమూరల దూరములో వుండే భూమి "నారాయణ క్షేత్రం" అని చెప్పబడును. ఈ ప్రదేశములో కూర్చుని జపము చేస్తే మంత్రము శీఘ్రముగా సిద్ధించును.

## ఆపత్తులు తొలగుటకు రామ మంత్రము

**మూలమంత్రము :** రాజీవనయన ధరేరమసాయక. భగత లివవిభజన సుఖదాయక. రామాయ రామభద్రాయ రామ చంద్రాయ వేధసే, రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

**విధానము :** ప్రతి దినమూ, తెల్లవారుగట్ల లేచి స్నానము చేసి, ఏడు మాలలు (అనగా నూట ఎనిమిది పూసలుగల జపమాలతో ఏడుసార్లు జపించవలయును) ఒక మాల జపము పూర్తికాగానే గుగ్గిలము అగ్నిలో వేసి హోమము చేయవలెను.

ఇట్లు ఏడుమాలల జపములకు ఏడుసార్లు గుగ్గిలముతో హోమం చేయవలయును. హోమభస్మమును భద్రపర్చి కొని, ఏదైనా పనిమీద వెళ్ళేటప్పుడు నుదుట బొట్టు పెట్టుకొనుచుండ వలయును. ఈ మంత్రమును ఈ విధముగా ప్రతినిత్యమూ జపించుచు, హోమభస్మము నుదుట ధరించు చుండిన యెడల విపత్తులు తొలగి సర్వకార్యములు నిరాటంకముగా సిద్ధించు చుండును. కోర్కెలు నెరవేరును. రాముని అనుగ్రహముతో వృద్ధి చెందును.

## సకలాపదలను తొలగించి సౌభాగ్యమును కలిగించు హనుమన్మంత్రము

**మూలమంత్రము :** ఓం ఐం హ్రీం శ్రీం నమో భగవతే హనుమతే మమ కార్యేషు జ్వల జ్వల ప్రజ్వల అసాధ్యం సాధయ సాధయ మాం రక్ష రక్ష సర్వ దుష్టేభ్యో హుం ఫట్ స్వాహా.

**విధానము :** ఈ మంత్ర జపమును మంగళవారమునాడు ప్రారంభించి, ప్రతిరోజూ నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించు చుండవలెను. ఇట్లు ఏడు మంగళవారములు గడిచే వరకు జపము చేయవలెను. ఈ విధముగా జపము చేయుచుండిన యెడల ఇంట్లో అంతఃకలహములు హరించిపోవును. దుష్టశక్తుల బాధలు కలుగకుండా వుండును. ఎటువంటి కష్టమైన కార్యమైనను సులభముగా నెరవేరుచుండును.

## అన్నిటికంటె గొప్ప ఆశ్చర్యము

యక్షుడు ధర్మరాజును యిట్లు ప్రశ్నించెను.
ఆశ్చర్యకరమైన విషయమేది?
దానికి ధర్మరాజు ఇట్లు సమాధానమిచ్చెను -

శ్లో॥ అహన్యహని భూతాని గచ్ఛంతీహ యమాలయమ్,
శేషాః స్థిరత్వ మిచ్ఛంతి కిమాశ్చర్యమతః పరమ్.

ప్రతిరోజూ ప్రాణులు యమలోకమునకు వెళ్ళుచున్నారు. (లోకులెల్లరు యిరుగువారు చనిపోవుటను చూచుచున్నారు. అయినప్పటికిన్నీ బ్రతికియున్నవారు తాము శాశ్వతముగా (మరణము లేకుండా) వుండవలెనని కోరుచున్నారు. ఇంతకు మించిన ఆశ్చర్యము మరేది గలదు. (మహాభారతం)

## అభీష్టములు తొలగి సర్వార్థములు సిద్ధించుటకు వాసుదేవ మంత్రము

**మూలమంత్రము :** ఓం రాం శ్రీం ఐం నమోభగవతే వాసుదేవాయ మమాభీష్టం నాశయ నాశయమాం సర్వ సుఖ భాజనం సంపాదయ సంపాదయ హుం హుం శ్రీం ఐం ఫట్ స్వాహా.

**విధానము :** ఈ మంత్రమును ప్రతినిత్యమూ నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచుండిన యెడల సర్వావిఘ్నములు తొలగిపోయి సర్వకార్యములు సిద్ధించును. సర్వులు అనుకూలముగా నుండెదరు.

## సర్వమనోరథములు సిద్ధించుటకు రాధా రమణ మంత్రము

**మూలమంత్రము :** ఓం ఐం హ్రీం శ్రీం నమోభగవతే రాధా ప్రియాయ రాధా రమణాయ గోపీ జనవల్లభాయ మమా భీష్టం పూరయ పూరయ హుం ఫట్ స్వాహా.

విధానము : కడిమి చెట్టు చెక్కతో చిన్న పీట చేయించి ఆ పీట పైన ఈ మంత్రమును పద్మాకారంగా కుంకుమ పువ్వు రెండూ సమభాగములుగా కర్పూరము కలిపిన కల్కముతో, దానిమ్మ పుల్ల కలముచే వ్రాసి ఆ మంత్రమును షోడశోపచారములతో పూజించి పైన పేర్కొనబడిన రాధా రమణ మంత్రమును రోజుకు పదివేల పర్యాయములు చొప్పున జపించుచుండవలెను. మొత్తము ఒక లక్ష యిరవై అయిదువేల జపము పూర్తి చేసి జపదశాంశము చేతితో హోమం చేయవలయును. ఈ ప్రకారము చేయుచుండినయెడల సాధకునియొక్క సర్వమనోరథములు నిస్సంశయముగా సిద్ధించును.

## వ్యాధి నివారణ కొరకు నారాయణ మంత్రము

మూలమంత్రము : అచ్యుతానంత గోవింద నామోచ్చారణ భేషజాత్ నశ్యంతి సకలారోగాః సత్యం సత్యం వదామ్యహం॥

విధానము : శ్రీమన్నారాయణుని చిత్రపటము ఎదురుగా కూర్చొని, ధూప దీప నైవేద్యములు యిచ్చి శ్రీమన్నారాయణుని పూజించి పై మంత్రము చేత నూట ఎనిమిది పర్యాయములు అభిమంత్రింపబడిన నీటిని వ్యాధిగ్రస్తుల చేత త్రాగించవలయును. ఇట్లు ప్రతినిత్యము చేయుచుండిన యెడల సకల వ్యాధులు సత్వరముగా హరించిపోవును. ఆరోగ్యము శాంతి లభించును. ఈ మహామంత్రము వ్యాధుల పాలిటి నారాయణాస్త్రము.

## శ్రీ కృష్ణ ద్వాదశాక్షర మంత్ర ప్రభావము

మూలమంత్రము : "ఓం నమో భగవతే వాసుదేవాయ॥

విధానము : ఈ మూల మంత్రమును పఠించుటలో విశేష విధులు లేవు. జాతి, మత, కుల, భేదములు లేకుండా స్త్రీ లైనను, పురుషులైనను ఈ మంత్రమును జపించవచ్చును. కలశ స్థాపన, హోమములు మొదలైన పూజా విధానములు అవసరములేవు. "యః సప్తరాత్రం ప్రవదన్ పుమాన్ పశ్యతి ఖేచరాన్" అని శ్రీ మద్భాగవతములో చెప్పబడియున్నది. అనగా ఈ మంత్రమును పగలు, రాత్రి విడవకుండా ఏడురోజులు జపించినయెడల ఆకాశంలో అదృశ్యముగా తిరుగుచుండే సిద్ధులు, మునులు, గంధర్వులు, యక్షులు, కిన్నరులు మొదలైనవారు సాధకుని కంటికి కనబడెదరు. వారితో మాట్లాడవచ్చును. ప్రవదన్ అని చెప్పబడియున్నది. కనుక యీ మంత్రమును బిగ్గరగా ఉచ్చరించుచుండవలెను. ఏ స్థితిలో నున్నా స్థలములో నున్నా ఈ మంత్రమును జపించవచ్చును.

## భగవాన్ విష్ణుమూర్తి దయ గలుగుటకు విష్ణు దర్శనము లభించుటకు యంత్రము




విధానము : ఈ మంత్రమును మంచిగంధపు చెక్కతో చేయబడిన చిన్న పీటపైన మంచి గంధముచే, తులసి పుల్ల కలముతో వ్రాసిగాని, లేక వెండి రేకుపైన యీ యంత్రమును చెక్కించిగాని, ప్రతినిత్యము పూజించుచుండవలెను. మరియూ ప్రతి నిత్యమూ "ఓం నమో నారాయణాయ" అను మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించుచుండవలెను. అంతేగాక విష్ణు సహస్ర నామ స్తోత్రములోని ప్రతి శ్లోకమునకు మొదట చివర, ఓం నమో నారాయణాయ అను మంత్రమును సంపుటి చేసి, ప్రతి నిత్యమూ విష్ణు సహస్రనామ స్తోత్రమును ఒకసారి పారాయణ చేయుచుండవలెను. ఇట్లు ప్రతినిత్యమూ చేయుచుండిన యెడల విష్ణుమూర్తికి దయగలిగి సాధ్యమైనంత త్వరలో భక్తునకు ప్రత్యక్షమై సకల మనోభీష్టములను నెరవేర్చుచుండును.

## భగవన్నామ మహిమ

ఏ కార్యము సిద్ధించుటకు ఏ యే భగవన్నామములను భక్తి శ్రద్ధలతో జపించవలయును?

★ కామ – కామప్రద – కాంత – కామపాల – హరి – ఆనంద – మాధవ : అను భగవన్నామములను జపించుచుండిన యెడల మనోభీష్టములు సిద్ధించును.

★ రామ – పరశురామ – నృసింహ – విష్ణు – విక్రమ : అను భగవన్నామములను జపించుచుండిన ఎడల శత్రువుపై జయము కలుగును.

★ పురుషోత్తమ : అను భగవన్నామమును ప్రతిరోజూ జపించుచున్న యెడల సకల విద్యలయందు అభివృద్ధి కలుగును.

★ దామోదర : అను భగవన్నామమును ప్రతిరోజూ జపించుచున్న యెడల బంధ విముక్తుడగును.

★ కేశవ – పుండరీ కాక్ష : అను భగవన్నామములను ప్రతి నిత్యము జపించుచున్న యెడల అన్నిరకములైన నేత్ర వ్యాధులు హరించి పోవును.

★ హృషీ కేశ : అను భగవన్నామమును భయము కలిగిన సమయములో జపించుచున్న యెడల భయము తొలగిపోయి ధైర్యము ఉత్సాహము కలుగును.

★ అచ్యుత – అమృత : అనెడు భగవన్నామములను జపించి ఔషధములను పుచ్చుకున్న యెడల ఔషధము మిక్కిలి శక్తి వంతముగా పనిచేసి శీఘ్రముగా రోగనివారణ చేసి ఆరోగ్యము కలిగించును.

★ అపరాజిత : అను భగవన్నామమును జపించుచూ యుద్ధ రంగమునకు పోవుచున్న యెడల జయము కలుగును.

★ చక్రి : అను భగవన్నామమును జపించుచూ తూర్పు దిక్కుగా ప్రయాణము చేసిన యెడల జయము కలుగును.

★ గదీ : అను భగవన్నామమును జపించుచూ దక్షిణ దిక్కుగా ప్రయాణము చేసిన యెడల జయము కలుగును.

★ శార్ఙ్గి : అను భగవన్నామమును జపించుచూ పడమటి దిక్కుగా ప్రయాణము చేసిన యెడల జయము కలుగును.

★ ఖడ్గీ : అను భగవన్నామమును జపించుచుచూ ఉత్తర దిక్కుగా ప్రయాణము చేసిన యెడల జయము కలుగును. అనగా ఆయా దిక్కులకు ప్రయాణము చేయునప్పుడు ఆయా భగవన్నామములను పఠించుకొనుచు వెళ్ళుచుండిన యెడల సర్వత్రా జయము కలుగును.

★ అజిత – అధిప – సర్వ – సర్వేశ్వర : అను భగవన్నామములను జపించుకొనుచూ ఏ వ్యవహారములందు ప్రవేశించినను జయము కలుగును.

★ నారాయణ : అను భగవన్నామము జపించుచుండిన యెడల సర్వోపద్రవములు గ్రహ, నక్షత్ర, పీడలు అపశకున దోషములు, దుస్వప్నాల వలన కలుగు దోషములున్నా హరించి పోవును.

★ **నారసింహా :** అను భగవన్నామమును జపించు చుండిన యెడల దొంగలు శత్రువులు మొదలయిన వారివల్ల కలిగే ప్రమాదములు తొలగిపోవును.

★ **జలశాయి :** అను భగవన్నామమును జపించు చుండిన యెడల అగ్ని ప్రమాదములు దరి చేరవు. శీఘ్రముగా శాంతించును.

★ **గరుడధ్వజ :** అను భగవన్నామమును జపించు చుండిన యెడల సర్పము కరచిన వారికి విషము దిగిపోవును. సర్ప భయములుండవు.

★ **వాసుదేవ :** అను భగవన్నామమును స్నానము, దేవపూజలు, ప్రదక్షిణ నమస్కారములు, హోమాదులు చేయుచున్నప్పుడు జపించు చుండిన యెడల సర్వత్ర మంగళప్రదముగాను జయప్రదము గాను వుండును.

★ **అనంతా, అచ్యుతా :** అను భగవన్నామములను జపించుచూ ధన ధాన్యములు నిలవలు పోసుకున్న యెడల అక్షయముగా వృద్ధి చెందు చుండును.

★ **నారాయణా, శార్ఙ్గధరా, శ్రీధర, పురుషోత్తమ, వామన, కల్కీ :** అను భగవన్నామములను జపించిన యెడల దుస్స్వప్న దోషములు హరించి పోవును.

★ **పర్యంకశాయీ :** అను భగవన్నామమును జపించు నీటి ప్రయాణము చేయుచున్న యెడల ప్రమాదములకు లోను గాకుండా సురక్షితులుగా నుండెదరు.

★ **బలభద్ర :** అను భగవన్నామమును, జపించుచూ ఏ కార్యమును ప్రారంభించినను జయప్రదముగా నెరవేరును. వాద వివాదములలోను, యుద్ధములోను జయము కలుగును.

★ **జగత్పతి :** అను భగవన్నామమును ప్రతినిత్యమూ జపించుచున్న యెడల సంతానములేని వారికి సంతానము కలుగును. సంతానము గల వారి సంతతి అభివృద్ధి చెందు చుండును.

★ **శ్రీశ :** అను భగవన్నామమును జపించుచున్న యెడల సర్వ కార్యములు జయప్రదముగా నెరవేరుచుండును.

★ **విశోకా :** అను భగవన్నామమును ప్రతినిత్యమూ జపించు చుండిన యెడల సర్వారిష్టములు తొలగిపోవును.

★ **వాసుదేవా :** అను భగవన్నామమును జపించుచున్న యెడల తుపానులవల్లను, అగ్ని ప్రమాదములవలన, జల ప్రమాదమువలన ఎట్టి భయము వుండదు. అనగా ఆయా సమయములలో ఈ భగవన్నామమును జపించుచున్న యెడల ఆపదలలో చిక్కుకొనరు.

★ **గోవిందా :** అను భగవన్నామమును ప్రతినిత్యమూ జపించుచున్న యెడల ఈ కలియుగములో మనోవాక్కాయ కర్మములచే చేయబడే సమస్త పాపములు నశించిపోవును. గోవింద నామస్మరణే కలియుగములో మానవులను పాపముల నుండి రక్షించును.

★ **శ్రీహరి :** అను భగవన్నామమును జపించుచున్న యెడల నిప్పును నీరు ఆర్పునట్లుగా చీకటిని సూర్యకాంతి పోగొట్టునట్లుగా ఈ కలియుగములో మానవుల పాపములను భస్మీపటలము చేయును.

★ **మాధవ :** అను భగవన్నామమును జపించుచుండిన యెడల సమస్త పాపములు నశించిపోవును.

★ **హరి :** భగవన్నామమును జపించు చుండిన యెడల సమస్త పాపములు నశింప చేయును. కృతార్థులయ్యెదరు. ఈ కలియుగములో గోవిందా, శ్రీహరీ, మాధవా, వాసుదేవా, అను నామములను భక్తి ప్రపత్తులతో జపించుకొని, కృతార్థులయ్యెదరు. ఇవియే కలియుగములో మానవులను రక్షించుటకు మహా మంత్రములు.

★ **కూర్మ, వరహా, లేక మత్స్య :** అను భగవన్నామములను, నదులు సముద్రము, ఏరులు మొదలైనవి దాటుచున్నప్పుడు జపించుచున్న యెడల ఎట్టి ప్రమాదములు కలుగక సురక్షితులయ్యెదరు.

★ **భ్రాజిష్ణు :** అను భగవన్నామమును విడవకుండా జపించుచున్న యెడల కాలిపోవుచున్న యిండ్లు మొదలయిన వాటి అగ్ని జ్వాలలు శాంతించి అగ్ని చల్లారి పోవును.

★ **గరుడధ్వజ :** అను భగవన్నామమును జపించుచున్న యెడల జ్వరము, తలనొప్పి, ఆపదలు నశించిపోవును.

★ **రామ :** అను భగవన్నామమును జపించుచున్న వారలకు ఈ కలియుగములో సర్వత్రజయము, యశస్సు, కీర్తి కలుగును. అంత్యమున భగవత్ సన్నిధానము లభించును.

★ **ఉత్తారణ :** అను భగవన్నామమును గాని, హలాయుధ అను భగవన్నామమునుగాని జపించుచు వ్యవసాయము చేయుట, తోటలువేయుట ప్రారంభించిన యెడల పంటలు సమృద్ధిగ పండి లాభము కలుగును.

★ **శ్రీ విష్ణు :** అను భగవన్నామమును ఏ గృహములో విడువకుండ జపించుచుండెదరో ఆ గృహస్థులకు సర్వతో మంగళప్రదముగా జయప్రదముగా నుండును. నిద్ర నుండి లేచినప్పుడు విష్ణు అను భగవన్నామమును నిద్రించబోయే ముందు మాధవా అను భగవన్నామమును భోజన కాలమందు గోవిందా అను భగవన్నామమును సర్వకాల సర్వావస్థలయందు మధు సూదన అను భగవన్నామమును జపించు చుండిన మానవులు ఈ కలియుగములో జన్మజన్మాంతరముల నుండి వెంటాడుచున్న సమస్త పాపములను నశింప చేసుకొని ఈ లోకమున సమస్త సౌఖ్యములు సమృద్ధిగా అనుభవించి తదుపరి మోక్షమును పొందెదరు.

## రామనామ ప్రభావము

ఒకప్పుడు పార్వతీదేవి శివుని సన్నిధి నుండి "ఓ స్వామీ నామ జపములలో ఏ నామజపము వలన మహత్తరమైన ఫలితము కలుగునని ప్రశ్నించగా శివుడు ఓ పార్వతీ అన్ని నామముల యందు రామ నామమే మిక్కిలి శక్తి గలది, నేను సదా శ్రీ రామ నామమే జపించు చుండెదను. ఒక రామనామము సహస్ర విష్ణు నామములతో తుల్యమైనది. అని చెప్పి ఈ దిగువను వ్రాసిన మంత్రమును చెప్పెను.

శ్లో॥ శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥

ఈ మహామంత్రమును నిరంతరము పఠించుచుండువారలు సమస్త సౌఖ్యములు అనుభవించి మోక్షమును పొందెదరు.

## పరమశివుడు ఏ స్థితిలో వున్నది తెలుసుకుని పూజించే విధానము

ఏరోజు శివపూజ చేయుదురో, ఆరోజు తిథిని రెండు చేత హెచ్చించగా వచ్చిన మొత్తమును మరల అయిదుచే హెచ్చించవలెను. ఈ విధముగా హెచ్చించిన మొత్తమును ఏడుతో భాగించగా ఒకటి శేషము వచ్చినచో, శివుడు కైలాసము నందున్నట్లుగాను, రెండు శేషము వచ్చినచో పార్వతీ దేవి వద్ద వున్నట్లును, మూడు శేషము వచ్చినచో వృషభవాహనముపై వున్నట్లును నాలుగు శేషము వచ్చినచో సభామధ్యమున వున్నట్లును, అయిదు శేషము వచ్చినచో భోజనాలయమున వున్నట్లును 6 శేషము వచ్చినచో క్రీడా భవనము నందున్నట్లును సున్నా శేషము వచ్చినచో స్మశానమునందున్నట్లును తెలుసుకొనవచ్చును.

(1) కైలాసమునందు శివుడున్నప్పుడు చేసిన శివపూజ శివాభిషేకముల వలన సర్వసౌఖ్యములు లభించును.

(2) పార్వతీదేవి వద్ద శివుడున్నప్పుడు చేసి శివపూజ శివాభిషేకముల వల్ల సమస్త సుఖములు కలుగును.

(3) వృషభ వాహనమైై శివుడున్నప్పుడు చేసిన శివపూజ శివాభిషేకమువల్ల ఐశ్వర్యవృద్ధి కలుగును.

(4) సభా మధ్యములో శివుడున్నప్పుడు చేసిన శివపూజ శివాభిషేకవల్ల పుత్రపౌత్రాభివృద్ధి, కీర్తి కలుగును.

(5) భోజనాలయమున శివుడున్నప్పుడు చేసిన శివపూజ శివాభిషేకమువల్ల షడ్రసోపేతమయిన భోజనప్రాప్తి కలుగును.

(6) క్రీడాభవనమునందు శివుడున్నప్పుడు చేసిన శివపూజ శివాభిషేకమువల్ల సంతానము ఆరోగ్యము కలుగును.

స్మశానమునందు శివుడున్నప్పుడు చేసిన శివపూజ శివాభిషేకమువల్ల మృత్యువు సంభవించును గాన శివపూజ శివాభిషేకములను చేసిన వారు ఈ వివరములను గమనించి 6, 0 శేషములలో శివుడున్నప్పుడు శివపూజను చేయకుండా శుభస్థానములయిన 1,2,3,4,5 స్థానములలో శివుడున్నప్పుడే శివపూజ శివాభిషేకములు చేయించిన శివాభిషేకము మేము చేయించియున్నాము. అందువలన తమకు ఏమి విశేషము కనిపించలేదని చెప్పుట కలదు. గాన, ఈ వివరములను గమనించి శివుడు శుభస్థానములలో వున్నప్పుడు శివాభిషేకములను చేయించి యెడల ఆ పరమశివుని కృపవలన తప్పక శుభఫలితములను పొందగలరు.

## పుణ్య కథలు

### రామునికంటే రామనామమే గొప్పది

మూలమంత్రము : "ఓం శ్రీరామ, జయరామ, జయ జయ రామ !"



శ్రీరామనామ మహామంత్రము యొక్క ప్రభావమును బుజువు పరుస్తున్నట్టి ఒక పుణ్యగాథ.

శ్రీరామచంద్రుడు లంకను జయించి తిరిగి అయోధ్యా పట్టణమునకు వచ్చిన పిమ్మట ఒకానొకనాడు విశ్వామిత్ర, నారద, వశిష్ఠాది మహాఋషులతో సభ దీర్చియుండెను. ఆ సభలో అనేక ధార్మిక విషయములపై చర్చ జరుపుచుండగా నారదుడు, "భగవంతుడు, భగవన్నామము - యీ రెండింటి యందు ఏది గొప్పది?" అని ప్రశ్నింపగా సభికులెవ్వరును ఎటూ చెప్పలేక పోయిరి. అంతట "భగవంతునికంటె భగవన్నామమే శ్రేష్ఠమైనది" దానినిప్పుడు నేను నిరూపించెదనని నారదుడు చెప్పగా సభ్యులందరూ ఆశ్చర్యపడిరి.

నారదుడు తన ప్రక్కనున్న హనుమంతుని పిలిచి, సభలోని ఒక విశ్వామిత్రునికి తప్ప తక్కిన మహాఋషులు అందరికీ నమస్కరింపుమని చెప్పెను. హనుమంతుడందులు కంగీకరించి, ప్రణామ సమయము వచ్చినప్పుడు, తక్కిన ఋషులకందరికీ సాష్టాంగ దండప్రణామము లాచరించి, విశ్వామిత్రుని వదలివేసెను.

తరువాత నారదుడు విశ్వామిత్రుని ప్రక్కన చేరి 'యీ హనుమంతుని పొగరు చూడుము. నిండు సభలో నిమ్మవమానించెనని చెవిలో చెప్పి రెచ్చగొట్టెను. వెంటనే విశ్వామిత్రుడు ఉగ్రుడై శ్రీరాముని దగ్గరకుపోయి శ్రీరామా! హనుమంతుడు నన్ను ఈ నిండు సభలో అవమానించినాడు. కనుక రేపు సూర్యుడు అస్తమించు లోగా యీ హనుమంతుని నీ చేతులలోనే వధియింపవలెను అని శ్రీరాముని కాజ్ఞాపించెను. శ్రీరాముని మనస్సు తల్లడిల్లిపోయెను. అయినను గురువాజ్ఞను మీరజాలక హనుమంతుని వధియింపుటకే శ్రీరాముడు నిశ్చయించుకొనెను.

ఈ వార్త అయోధ్యానగరమంతయు ప్రాకి జనులందరిని సంభ్రమాశ్చర్యములలో ముంచివేసెను. హనుమంతుడు భయభ్రాంతుడై రక్షణోపాయముపదేశింపుమని నారదుని ప్రార్థించెను. అంతట నారదుడు చిరునవ్వుతో హనుమంతుని వెన్నుతట్టి 'నాయనా! భయపడకుము. నేను చెప్పినట్లు చేయుము. తెల్లవారగట్ల నాలుగు గంటలకు నిద్రలేచి, సరయూ నదికి పోయి స్నానముచేసి నదిగట్టుపైన కూర్చుండి, చేతులు జోడించి 'ఓం శ్రీరామ జయ రామ జయజయరామ' అను మహామంత్రమును విడువకుండా, జపించు చుండుము. నీకెట్టి హానియు కలుగజాలదని నేనభయ మిచ్చుచున్నాను' అని హనుమంతునకు నారదుడు శ్రీరామ మహా మంత్రము నుపదేశము చేసెను.

నారదోపదేశానుసారము, హనుమంతుడు సరయూ నది గట్టుపై చేతులు జోడించి కూర్చొని శ్రీరామ మహామంత్రమును మిక్కిలి వైరాగ్యముతో భక్తిశ్రద్ధలతో అకుంఠిత దీక్షతో జపించుచుండెను. ఈ విచిత్రమును వీక్షించుటకు, అయోధ్యానగర వాసులంతా గుంపులు, గుంపులుగా చేరి యుండిరి. విశ్వామిత్ర నారదాదిమహర్షులు చూచుచుండగా శ్రీరాముడు హనుమంతునిపై బాణవర్షము కురిపించుచుండెను. లంకా యుద్ధములో ఘోర రాక్షసులను సంహరించిన అనేక దివ్యాస్త్రములను ప్రయోగించినప్పటికీ, ఒక్క బాణమైనను హనుమంతుని గ్రుచ్చుకొనలేకపోయెను. సూర్యుడు అస్తమించబోవుచుండెను. చివరకు శ్రీరాముడు బ్రహ్మాస్త్రమును

తీసెను. జనులందరు 'హనుమాన్‌కి జై, హనుమాన్‌కి జై' అని కేకలు వేయసాగిరి. అందరికి ఆశ్చర్యకరముగా నుండెను.

ఇట్టి సమయములో నారదుడు, విశ్వామిత్రుని వెంబడించి 'ముని సత్తమా! తమ క్రోధము నుపసంహరింపుడు, రాముని ప్రయాసయే గాని! ఒక్క బాణమైనను హనుమంతుని హింసింపలేదు. చూచితిరికదా! ఈ కష్టము నుండి తను శిష్యుడైన రాముని తప్పింపుడు. రామదర్శనముకంటే, రామ నామ జప మహిమను మీరు ప్రత్యక్షముగా జూచితిరి కదా!' అనెను. వెంటనే విశ్వామిత్రుడు శాంతచిత్తుడై, బ్రహ్మాస్త్రముచే హనుమంతుని సంహరింపకుమని శ్రీరాముని కాజ్ఞాపించెను. తరువాత హనుమంతుడు జపమును చాలించి, శ్రీరామునకు, విశ్వామిత్రునకు సాష్టాంగ దండప్రణామము లాచరించెను. విశ్వామిత్రుడు రామదర్శనము కంటె రామనామమే గొప్పదని చెప్పి హనుమంతుని భక్తికి మెచ్చి ఆశీర్వాదము లొసంగెను.

ఆపదలనుండి రక్షించుటలో 'ఓం శ్రీరామ జయరామ జయ జయ రామ' అను మహామంత్రము మిక్కిలి శక్తివంతమైనది. మహా మంత్రమునకర్థము : శ్రీరామయనగా ఓ రామా అని పిలచుట, జయరామ యనగా రాముని స్తోత్రము చేయుచున్నాను. నీవే నాకు శరణము అని మనస్సులో భావించుచుండవలెను.

ఈ ప్రకారముగా యీ శ్రీరామ మహామంత్రమును అకుంఠిత శ్రద్ధతో మిక్కిలి వైరాగ్యముతో పట్టుదలతో అహర్నిశము, జపించుచుండిన యెడల శ్రీరామ చంద్రుడు బహుత్వరగా అనుగ్రహించి సాక్షాత్కరించును. ఈ శ్రీరామ మంత్రములో పదమూడక్షరములు కలవు. పదమూడు లక్షల జపము పూర్తిచేసిన యెడల మంత్రము సిద్ధించునని శాస్త్రవచనము. సమర్థ రామదాసస్వామి యీ మహా మంత్రమును పదమూడుకోట్లు జపించెను. శ్రీరాముడు ప్రత్యక్షమయ్యెను రామనామ మహిమ అమితమైనది. ఈ మంత్రమును జపించి అనేకమంది మహనీయులు భగవత్సాక్షాత్కారమును బొందిరి. రామ నామమహిమ వర్ణనాతీతమైనది.

## నారాయణ కవచ పారాయణ ఫలితములు

1963వ సంవత్సరములో భావసార్ అనేవారికి కాలిపిలమందలో భరించరాని పోటు పెట్టెను. ఎన్ని వైద్యములు చేయించినా తగ్గలేదు. నడచుట కష్టమైపోయెను. కొంతమంది డాక్టర్లు ఇది ఎముక క్షయయని, మరికొంతమంది యిది కేన్సరు వ్యాధియని చెప్పుచు, కాలు తీసివేస్తేగాని వ్యాధి బాధ తగ్గదని చెప్పిరి ఎన్నో వైద్యములు చేయించిరి ఆఖరకు కరెంటుట్రీటుమెంటుకూడా చేయించి నిరాశ చెందిరి. ఆ స్థితిలో ఒకరు వీరింటికి వచ్చి చూచిరి.

శ్రీ మద్భాగవతము షష్ఠస్కంధములోని నారాయణ కవచమును నిత్యము పారాయణ చేయుచున్న యెడల వ్యాధి నివారణ యగునని చెప్పిరి.

అది మొదలు వీరు ప్రతిరోజూ విడువకుండా భక్తి శ్రద్ధలతో శ్రీ నారాయణ కవచమును మిక్కిలి వైరాగ్యముతో పఠించుచుండగా క్రమముగా వ్యాధి పూర్తిగా తగ్గిపోయి, ఆరోగ్యము కలిగినది. వీరి వ్యాధిని ఎరిగిన డాక్టర్లందరు ఆశ్చర్యపడిరి. చూచితిరా! నారాయణ కవచమహిమ - ఈ కాలములో కేన్సరు ఎముక క్షయ మొదలుగా గలమొండి వ్యాధులు దీర్ఘవ్యాధులు ప్రబలముగా నున్నవి. అట్టి వారు నారాయణ కవచ పారాయణ చేసి ఆరోగ్యవంతు లయ్యెదరు గాక - ఆరోగ్యవంతులు కూడా యీ నారాయణ కవచమును పారాయణ చేయుచుండినచో దీర్ఘాయుర్దాయము - ఐశ్వర్యము లభించును. కోర్కెలు నెరవేరును. ఎంతటి మొండి వ్యాధులైనా హరించిపోవును.

## నారాయణ మంత్ర మహిమ

మూలమంత్రము : 'ఓం నమో నారాయణాయ'

విధానము : అను యీ అష్టాక్షరీ మంత్రమును భక్తి శ్రద్ధలతో జపించుచుండువారు పరీక్షలలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యెదరు. తెలివితేటలు అభివృద్ధి చెందును. చురుకుతనము కలుగును. సత్యకోరికలు నెరవేరును. ఉద్యోగము లేనివారికి ఉద్యోగము దొరకును. అధికారుల ఆదరణ లభించును.

శ్రీ త్రిపాఠి అనేవారు చిన్నతనము నుండి మందబుద్ధితో పరీక్షలలో తప్పిపోవుచుండగా వీరికి ఒక మహానుభావుడు ఈ నారాయణ మంత్రమును ఉపదేశించెను. ఈ నారాయణ మంత్రమును భక్తిశ్రద్ధలతో జపించుచుండగా, క్రమక్రమముగా వీరు మహామేధావులై. అన్ని పరీక్షలలోను ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై పెద్ద పదవులలో నుండిరి.

## శ్రీ విష్ణు సహస్రనామములలోని మంత్రమహిమ

మూలమంత్రం : అమృతాంశూద్భవో భానుః శశబిందుః సురేశ్వరః
ఔషధం జగతః సేతుః సత్యధర్మ పరాక్రమః

విధానము : ఈ మంత్రజపము రోజూ 108 సార్లు చేయుచుండుట వలన అనేకమందికి శారీరక మానసిక బాధలు హరించిపోయి ఆరోగ్యము శాంతి లభించినది. సుఖప్రసవములు జరిగినవి. భక్తుల పాలిటి కల్పవృక్షం శ్రీమన్నారాయణ మూర్తి.

1906 సంవత్సరములో ఒక చిన్న పల్లెటూరు స్కూలు మేష్టరుగా ఒక పంతులుగారు ఉద్యోగముచేయుచు ఆయన భార్యతో కలిసి నివసించుచుండగా ఒకనాటి అర్ధరాత్రి సమయములో ఆమెకు ఆకస్మికముగా ప్రసవవేదన కలిగెను. అది పల్లెటూరు అవ్వుటవలన అచ్చట సరియైన వైద్యసహాయం లేనందున ఆ ప్రాంతములో నున్న కొంచెముగా తెలిసిన మంత్రసానిని పిలుచుకవచ్చిరి. కాని ఆ మంత్రసానికి అనుభవము లేనందువలన సకాలప్రసవం కాకపోవుట చేతను ఆమె ప్రసవించలేక చాల బాధపడుచుండెను. ఆలస్యమైన ఎడల ప్రాణాపాయము తటస్థించునని అందరు భయపడుచుండిరి. ఆ స్థితిలో ఆమె భర్త పైన వ్రాసిన మంత్రమును భక్తి శ్రద్ధలతో జపించుచు భగవంతునియందు భారముంచి మిక్కిలి వైరాగ్యముతో నుండిరి. ఇట్లు కొంతసేపుగడచుట తోడనే ఆమె సుఖముగా పుత్రుని ప్రసవించినది చూచితిరా? పైన వ్రాసిన మంత్రమహిమ. ఈ మంత్రము ప్రసవించలేక బాధపడు స్త్రీ పెద్ద భక్తితో 108 సార్లు జపించిన యెడల సుఖప్రసవము కలుగును.

## భగవన్నామమహిమ

శ్లో॥ అచ్యుతానంద గోవింద నామోచ్చారణ భేషజాత్
నశ్యంతి సకలారోగాః సత్యం సత్యం వదామ్యహమ్

అను మంత్రము మహిమను -

శ్లో॥ ఔషధం జాహ్నవీతోయం వైద్యోనారాయణో హరిః ॥

అను మంత్ర మహిమను తెలియచేయు యదార్థ చరిత్ర:

శ్రీకరమగు భగవన్నామమును భక్తి శ్రద్ధలతో నిత్యమూ స్మరించుచుండుటవలన ఆశ్చర్యకరముగా అనేక శుభఫలితములు కలుగుచుండును. శ్రీ గోకుల్ ప్రసాద్ త్రిపాఠి అనువారు 1914 సం॥ మే నెలలో ప్రయాగకు వెళ్ళియుండిరి. ఆ సమయములో వీరి రెండు సంవత్సరముల కుమారునికి జ్వరము వచ్చుచుండెను. వీరు ప్రయాగలో నాలుగు రోజులుండి తిరిగివచ్చునప్పుడు గంగా తీర్థమును తెచ్చుకొనిరి. వీరు ఇంటికి వచ్చునరికి వీరి కుమారునికి జ్వరము తీవ్రమై టైఫాయిడ్ జ్వరముగా మారి కామెర్లు వచ్చి పిల్లవాడు క్రుంగి కృశించిపోయి ప్రాణాపాయస్థితిలో నుండెను.

ఆ స్థితిలో వున్న పిల్లవానికి రక్షించుటకు డాక్టర్లకు సాధ్యముగాదని భగవంతుడొక్కడే శరణ్యమని ఆలోచించి వెంటనే పైని వ్రాసిన

శ్లో॥ అచ్యుతానంత గోవింద నామోచ్చారణ భేషజాత్
నశ్యంతి సకలారోగా సత్యం సత్యం వదామ్యహమ్॥

అను మంత్రమును పిల్లవాని వద్దనుండి భక్తి శ్రద్ధలతో జపించుచు

శ్లో॥ ఔషధం జాహ్నవీతోయం వైద్యోనారాయణో హరిః

అను మంత్రమును జపించి గంగాజలమును పిల్లవానికి త్రాగించుచు భగవంతునియందు నమ్మిక మిక్కిలి వైరాగ్యముతో నుండగా రెండు మూడురోజులలో క్రమముగా పిల్లవానికి ఆరోగ్యము చేకూరి అందరిని ఆశ్చర్యచకితులను చేసినది. చూచితిరా భగవన్నామ మహిమ. పైని వ్రాసిన మంత్రమును నిత్యము పఠించుచున్నచో వారికెలకు మొండి వ్యాధులు దీర్ఘవ్యాధులునయమై ఆరోగ్యము శాంతి లభించుటయే గాక సర్వసౌఖ్యములు లభించును. ఐశ్వర్యవృద్ధి కలుగును.

## కష్టములో ఇష్టదైవము కాపాడును

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

రామతారక్ అనేవారు తన భార్యాపిల్లలతో కలిసి తన బంధువుల వివాహమునకు ఒక పల్లెటూరు వచ్చుచు రైలుదిగి రెండు ఎడ్ల బండి కట్టించుకొనెను. ఆ బండివాడు రామతారక్ భార్యాపిల్లల మెడలోవున్న బంగారు నగలు చూచి ఎలాగయినా అపహరించాలన్న దురుద్ధితో కొంతదూరం బండి వెళ్ళిన తరువాత, మానవ సంచారము లేనిచోటులో బండిని ఆపి, ఈ ప్రక్కనే మా ఊరు వున్నది. మా కుర్రవానిని తీసుకొని ఇప్పుడే వస్తానని చెప్పి వెళ్లి యింకొక ఇద్దరు మనుష్యులను కత్తులతో తీసుకొని వచ్చి రామతారక్ భార్యాపిల్లలమీద పడి నగలు అపహరించి హత్య చేయుటకు పూనుకొన్నారు. అకస్మాత్తుగా జరిగిన ఆ సంఘటనకి రామతారక్ దిగ్భ్రాంతి చెంది, చేయునది లేక తన యిష్టదైవమునందు నమ్మిక నునిచి పైని వ్రాసిన శ్లోకమును పఠించుచు శ్రీకృష్ణ పరమాత్మను మనసారా ప్రార్థించుచు తిరుగుబాటు చేయకుండా ఊరకుండెను. అంతట ఆ బండికి కట్టియున్న రెండు ఎద్దులు పిచ్చెక్కినట్లు గంతులు వేయుచు కట్లు తెంపుకొని బండివానితో సహా వున్న ఇద్దరిపై నకూడా పడి పొడిచి కుమ్మివేయసాగినవి. ఆ బండివాడు మిగిలిన ఇద్దరు వానిని ఆపుచేయలేక పరుగులెత్తి పారిపోయిరి. మరికొంత సేపటికి కొందరు ప్రయాణీకులు వీరితో కలిసి జరిగినది విని దైవబలమునకు ఏది సాటిరాదని చెప్పుకొనుచు వీరిని వెంటబెట్టుకొని వెళ్ళి పోయిరి. చూచితిరా! దైవబల మహిమ.

## "హరిః శరణమ్" మంత్ర ప్రభావము

కలకత్తా పట్టణములో ఒకప్పుడు, శ్రీ రూడమల్ జీ గోయంకా యను సుప్రసిద్ధ పండితుడుండెను. ఆయనకు ఒక విశ్వాసపాత్రుడైన సేవకుడు తప్ప వేరెవ్వరును లేరు. ఆయనకు ఒకసారి భయంకరమైన ప్లీహవ్యాధి సంభవించెను. ఆ సమయములో కలకత్తాలో పేరుమోసిన కైలాస చంద్రబోస్ అను గొప్ప డాక్టరు వచ్చి, రూడమల్ జీని చూచి! వ్యాధి తీవ్రతనుబట్టి ఆ రాత్రికే మరణించునని చెప్పి వెళ్ళి పోయెను. కాని రూడమల్ జీ నిరుత్సాహపడక, తన సేవకుని చేత గంగాజలమును తెప్పించి, ఆ గంగాజలమును శరీరముపై చల్లుకొని, పరిశుభ్రమైన వస్త్రములను గట్టుకొని శ్రీకృష్ణుని యొక్క సుందరమైన పటమును తన యెదురుగుండా బల్లపై పెట్టుకొని సేవకునితో నీవు గదిలోనుంచి బయటకుపోయి, తలుపువేసి, బయట గొళ్ళెం పెట్టుము. ఈ రాత్రి నేను మరణించెదనని డాక్టరు చెప్పెను. దైవవశాత్తు నేను బ్రతికి యుండిన యెడల, నేను పిలిచినప్పుడు తలుపుతీయుము. లేని యెడల సూర్యోదయ మయిన తరువాత, మా బంధువులను పిలుచుకునివచ్చి దహన సంస్కారములు చేయించుము అని చెప్పి బయటకు పంపివేసెను.

ఆ రాత్రి తెల్లవారు గట్ల నాలుగు గంటలకు శ్రీరూడమల్ జీ పండితుడు తలుపుతీయుమని సేవకుని పిలిచెను. సేవకుడు తలుపు తీసి, గదిలోకి రాగానే తనకు బాగా ఆరోగ్యముగా నున్నదనియూ బ్రాహ్మణులకు భోజనములు పెట్టవలయుననియు. అందుకై గంగానదీ ఘాట్ దగ్గరవుండే బ్రాహ్మణులను, యితర బ్రాహ్మణ విద్వాంసులను నూరుమందిని భోజనమునకు పిలుచుకు రమ్ము అని వారికి భోజన ఏర్పాట్లు చేయుమని సేవకునినియోగించెను. మరల పన్నెండు గంటలయ్యే సరికి బ్రాహ్మణులువచ్చి తృప్తిగా భుజించి, దక్షిణలు కూడా తీసుకువెళ్ళిరి. డాక్టరు సర్. కైలాస చంద్రబోసు రూడమల్ జీ పండితుని బంధువుల యింటిలో ఒక రోగిని చూచుటకు ఆ సాయంకాలముపోయి రూడమల్ జీపండితుని దహన సంస్కారములు చక్కగా జరిగినా అని ప్రశ్నించెను. శ్రీరూడమల్ జీ పండితులు మరణించలేదని, ఆరోగ్యముగా వున్నాడని, బంధువులు చెప్పగానే, ఆశ్చర్యచకితుడయిన డాక్టరు రూడమల్ జీ యింటికి వచ్చి మీరు ఏ ఘన ఔషధము సేవించి యింత తొందరలో యిట్టి ఆశ్చర్యకరమయిన ఆరోగ్యము సంపాదించితిరి? అని ప్రశ్నించెను.

పండితుడు చెప్పదొడగెను. డాక్టరు గారూ! మీరు ఆశవదలుకొని వెళ్ళిపోయినప్పటి నుంచి, మరణించబోయే నేను భగవత్ స్మరణ చేసుకొంటూ మరణించుట మంచిదిగదాయని ఆలోచించితిని. అప్పుడు శ్రీమద్భాగవత మహాత్మ్యములో నారదుడు సనకసనందనాదులను నిరంతరము 'హరిఃశరణమ్' అను మంత్రమును జపించుచుండుటవలన, ముసలితనమువలన బాధింపకుండా, ఆయిదేళ్ళ పిల్లలవలె నిర్మలారోగ్యములో నున్నారుగదా అని పాడిన వాక్యములు గుర్తుకు వచ్చి నేను కూడా 'హరిశ్శరణమ్' మంత్రమునే మిక్కిలి భక్తితో గాఢ వైరాగ్యముతో జపించితిని. స్పృహ వున్నంతవరకు జపము చేయుచుంటిని. ఎంతవరకు స్పృహ వున్నదో నాకు తెలియదు తెల్లవారుగట్ల నాలుగు గంటలకు బాహ్యదృష్టి కలిగెను. శరీరము చల్లగానుండెను. గదిలో అటూ యిటూ పచార్లు చేసితిని ఏమీ బాధకలుగలేదు. ఇదంతా 'హరిశ్శరణమ్' మంత్ర ప్రభావమని తెలుసుకొంటిని. 'హరిఃశరణమ్' మంత్రము నాకు మందు. 'హరిఃశరణమ్' మంత్రమేనాకు డాక్టరు' అని శ్రీ రూడమల్ జీ గోయంకా పండితుడు చెప్పెను. మంత్రజపమును చేసుకొనుచుండెను. చూచితిరా భగవన్నామ మహిమ.

## గాయత్రీ మహామంత్ర జప మహిమ

గాయత్రీ మంత్రము : ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహిధియోయోనః ప్రచోదయాత్

శ్రీదండిస్వామి విరజానందుల వారికి బాల్యములో మశూచికము పోసుటవలన దృష్టిలోపించెను. వీరికి గాయత్రీ మంత్ర జపముచే విద్య లభించెను. వీరు తెలుసుకొని ఒక మహాత్ముని వలన గాయత్రీమంత్రమును ఉపదేశముబొంది హరిద్వారములో గంగానదిలో పీకలోతు గంటల కొలది వీరు గాయత్రీజపము చేయుచుండెడివారు. ఇట్లు కొంతకాలము గడచెను. ఒకనాడు వీరు గంగానదిలో నుంచి గాయత్రీజపము చేయుచుండగా నీపై దయకలిగినది. గాన యిక్కడ నుండి నీవు వెళ్ళుము. అను ఆకాశవాణి వినవచ్చెను. అప్పటినుంచి యీ విరజానందుల వారికి ఏ గ్రంథమునైనను ఒకసారి విన్నంత మాత్రముననే కంఠస్థముగా వచ్చుచుండెను.

వేలయింతే పరుండవలెయును. స్త్రీ బహిష్టు అయిన యెడల ఏడు రోజులు విడిగానుండి మరల వ్రతమును ప్రారంభింపవలయును. పురుషులు ప్రాతః సాయంకాలములందును పై మంత్రమును శక్తి కొలది జపించుచూ నలభై దినములు పూజింపవలయును. వ్రత సంపూర్తిలోగా సంభోగమును చేయకూడదు. స్త్రీ పురుషులు మూత్రము విసర్జించిన వెంటనే ఆ స్థానమును నీటితో పరిశుద్ధము చేయవలయును.

మహిమ : ఈ పంచముఖ ఆంజనేయ మహాయంత్రమును పూజించుటవలన గ్రహబాధలు, గర్భస్రావ దోషములు, సంతానము కలగనట్టి దోషములు, సంతానమే కలుగకుండు వారి సంతాన దోషములు, తీరరాని రోగములు, గృహారిష్టములు ఎల్లప్పుడుండు చింతలు, గ్రామాదులలో కలరా, ప్లేగు, స్ఫోటకము, జ్వరములు, ఇతర ప్రయోగములు మొదలైన వచ్చియూ పటాపంచలై పోవును, ఇందుకు సందియము లేదు ఇది పరమరహస్యము మహర్షి వాక్యము. రాగిరేకును బిళ్ళగా చేయించి ఒకవైపున ఈ పంచముఖ ఆంజనేయ మహామంత్రమును, మరొకవైపున పంచముఖ ఆంజనేయ ప్రతిమను చెక్కించి చిన్న బిడ్డలకు మెడయందు గట్టిన పక్షమున ఆ బిడ్డలకు బాలగ్రహ దోషములు సంధి దోషములు తగులవే తగలవు. మరియు ఆరోగ్యవంతులై తేజస్సు గలవారై బలము గలిగి దినదిన ప్రవర్ధమానులై యుందురు.

## శ్రీ శివస్తోత్రము

ఈ స్తోత్రమును చదువుకొనుచు శివాలయములో ప్రదక్షిణలు చేసినను లేదా శివలింగమునకు సమీపములో కూర్చొని ఈ స్తోత్రమును పఠించుచుండవలెను. దుష్టగ్రహ దోషములు ఏలినాటి శనిదోషములు తొలగిపోవును. సర్వకార్యములు జయప్రదముగా నెరవేరును. దారిద్ర్యము నశించి ధనవంతులు కీర్తివంతులు నయ్యెదరు.

నమస్తే నమస్తే మహాదేవ శంభో । నమస్తే నమస్తే ప్రపన్నైక బంధో నమస్తే నమస్తే దయాసార సింధో నమస్తే నమస్తే నమస్తే మహేశ.

నమస్తే నమస్తే జగజ్జన్మ హేతో నమస్తే నమస్తే వృషారూఢకేతో నమస్తే నమస్తే మహాపుణ్య హేతో నమస్తే నమస్తే నమస్తే మహేశ

నమస్తే నమస్తే మహామృత్యుహారిన్ । నమస్తే నమస్తే మహాదుఃఖహారిన్ । నమస్తే నమస్తే మహాపాపహారిన్ । నమస్తే నమస్తే నమస్తే మహేశ.

నమస్తే నమస్తే సదాచంద్రమౌళే నమస్తే నమస్తే సదాశూలపాణే । నమస్తే నమస్తే హ్యాసిల్లా విభోతే । నమస్తే నమస్తే మహాతాపహారిన్.

సర్వదా శర్వ సర్వేశ సర్వోత్తమ మహేశ్వర ।
శివనామామృతం దివ్యం జిహ్వాగ్రే మమతిష్ఠతు ।
దయాసముద్రాయ సతీశ్వరాయ ।
దినేశ మిత్రాయ సుధామయాయ ।
కామస్వరూపాయ మహేశ్వరాయ ।
శివాసమేతాయ నమశ్శివాయ ।
వేదాంత వేద్యాయ మహోదయాయ ।
కైలాసవాసాయ శివప్రదాయ
శివస్వరూపాయ సదాశివాయ
శివాసమేతాయ నమః శివాయ ।
మహేశ్వరాయ త్రిదశేశ్వరాయ
శ్రీ నీలకంఠాయ మహాంతకాయ
కుందేందు శంఖ స్ఫటికోపమాయ
శివాసమేతాయ నమః శివాయ
బ్రహ్మేంద్ర విష్ణ్వాది సురార్చితాయ
దేవాదిదేవాయ దిగంబరాయ
అనంత కళ్యాణ గుణార్ణవాయ
శివాసమేతాయ నమః శివాయ

## శ్రీ మహాలక్ష్మి స్తోత్రము

ఈ మహాలక్ష్మి స్తోత్రమును ప్రతిదినమును పఠించువారు ధనధాన్య సమన్వితులై, శత్రుజయమును కలిగి ఆయురారోగ్యములను శ్రీమహాలక్ష్మి ప్రసన్నత్వమును గలవారగుదురు.

నమస్తేస్తు మహామాయే శ్రీ పీఠే సురపూజితే
శంఖచక్రగదాహస్తే మహాలక్ష్మి నమోస్తుతే ।
నమస్తే గరుడారూఢే కోలాసురభయంకరి
సర్వపాపహరే దేవి మహాలక్ష్మి నమోస్తుతే ।
సర్వజ్ఞే సర్వవరదే సర్వదుష్ట భయంకరి !
సర్వదుఃఖహరేదేవి మహాలక్ష్మి నమోస్తుతే ।
సిద్ధిబుద్ధి ప్రదే దేవి భుక్తి ముక్తి ప్రదాయిని ।
మంత్రమూర్తే సదాదేవి మహాలక్ష్మి నమోస్తుతే ।
ఆద్యంతరహితేదేవి ఆదిశక్తే మహేశ్వరి ।
యోగజ్ఞే యోగసంభూతే మహాలక్ష్మి నమోస్తుతే ।
స్థూల సూక్ష్మే మహారౌద్రే మహాశక్తే మహోదరే ।
మహాపాప హరే దేవి మహాలక్ష్మి నమోస్తుతే ।
పద్మాసనస్థితేదేవి పరబ్రహ్మ స్వరూపిణి ।
పరమేశి! జగన్మాత మహాలక్ష్మి నమోస్తుతే ।
శ్వేతాంబరధరే దేవి నానాలంకార భూషితే.
జగత్ స్థితే! జగన్మాత మహాలక్ష్మి నమోస్తుతే ।
మహాలక్ష్మ్యష్టకం స్తోత్రం యః పఠేద్భక్తి మాన్నరః ।
సర్వసిద్ధి మవాప్నోతి రాజ్యం ప్రాప్నోతి సర్వదా ।
ఏకకాలే పఠేన్నిత్యం ధనధాన్యసమన్వితః ।
ద్వికాలం యః పఠేన్నిత్యం ఆయురారోగ్య సంభవమ్ ।
త్రికాలం యః పఠేన్నిత్యం మహాశత్రువినాశనం ।
మహాలక్ష్మి ర్భవేన్నిత్యం ప్రసన్నావరదాభవేత్ ।

## వివిధ శ్రీరామమంత్రములు

(1) "శ్రీరామః శరణం మమ"

భగవానుడగు శ్రీరాముడు తనను సమస్త బాధలనుండి (ప్రారబ్ధ బాధలు యనుమని భయములాటివాటి నుండి కూడా) రక్షించును. అనెడి పూర్తి విశ్వాసముతో యీ మంత్రమును తొమ్మిది లేదా ఇరవై ఒకటి లేదా నలభై రోజులలో ఎనిమిది లక్షల జపము పూర్తి చేయు సాధకుడు కేవలము 'సాంసారికమైన కోరికలను నెరవేర్చుకొనుటే గాదు' ఆధ్యాత్మిక ఔన్నత్యమును కూడా సాధించగలడు.

(2) "ఓం రామాయ హుంఫట్ స్వాహా"

ఎనిమిది లక్షలు జపము చేసినచో ఈ మంత్ర సిద్ధియగును ఈ మంత్రము సమస్త కోరికలను నెరవేర్చును.

(3) "ఓం త్రైలోక్య నాథాయనమః"

తొమ్మిది లక్షలు జపము చేసినచో ఈ మంత్రము సిద్ధి యగును. ఈ మంత్రమువాదకుని సమస్త ఆశయములను నెరవేర్చును.

(4) "ఓం హ్రీం శ్రీం శ్రీదాశరథయేనమః"

పదకొండు లక్షలు జపము చేసినచో ఈ మంత్రసిద్ధి యగును.

(5) "శ్రీరామ జయరామ జయజయరామ"

ఆంజనేయుడు ఈ మంత్రమును జపము చేయు చుండును. ఛత్రపతి శివాజీ మహారాజు గురువైన సమర్థ రామదాసు గోదావరీ తీరమున ఈ మంత్రమును పదమూడు లక్షలజపము చేసి మంత్ర సిద్ధి పొందెను. ఇది అలౌకికమైన మహామంత్రముగా గ్రంథములు వర్ణించియున్నవి. మంత్రముగా దీనిని జపించువారు బయటకు వినిపించకుండా గుప్తముగా చేయవలెను. సంకీర్తనగా దీనిని చేయువారు దొరికిన మారు ప్రోగుచేసుకుని బిగ్గరగా చేయవచ్చును

ఈ మంత్రమును అందరూ అన్ని సమయములందును జపించవచ్చును. దీనికి ఏ విధమైన దోషములు లేవు. పదమూడు లక్షలు జపము చేసినచో ఈ మంత్రము సిద్ధియగును. ఇది సమస్త సిద్ధులను యిచ్చును.

(6) "ఓం ఆద్య పురాణ పురుషోత్తమాయ బ్రహ్మణే నమః"

ఈ మంత్రమును పదిహేడు లక్షలు జపము చేసినచో మంత్రసిద్ధియగును.

(7) "ఓం దాశరథాయ విద్మహే । సీతావల్లభాయ ధీమహి । తన్నోరామః ప్రచోదయాత్"

ఇది శ్రీరామ గాయత్రీ మంత్రము. ఇది కోరిన ఫలితములన్నింటిని ప్రసాదించును.

(8) "ఓం నమో బ్రహ్మణ్య దేవాయ రామాయాకుంఠ తేజసే / ఉత్తమ శ్లోక ధుర్యాయ/ న్యస్త దండార్పితాంఘ్రయే"

ఈ మంత్రమును ముప్పై మూడు లక్షలు జపము చేసినచో సాధకుడు చేసిన సమస్త పాపములు నశించును. ఈ మంత్రమును ముప్పై మూడు లక్షలు జపము చేయుటవల్ల మంత్రసిద్ధి యగును. మంత్రసిద్ధి పొందిన సాధకుడు భోగ - మోక్షములు రెంటిని పొందును.

(9) "ఓం ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం"

ఈ మంత్రమువల్ల సమస్తమైన ఆపదలు నశించును. సమస్త సంపదలు లభించును. ఈ మంత్రమును జపము చేసినచో సంతానము లేనివారికి సంతానము కలుగును. భయభీతులందున్నవారికి భయములు తొలగిపోవును. రోగగ్రస్తులు రోగముల నుంచి విముక్తులగుదురు. ఈ మంత్రమును మూడు లక్షలు జపము చేసినచో మంత్రసిద్ధియగును. ఈ మంత్ర జపమువల్ల ధర్మ, అర్థ, కామమోక్షములనెడి చతుర్విధ పురుషార్థములు సిద్ధించును.

10. "ఓం రాం శ్రీం రామభద్ర మహేష్వాస రఘువీర నృపోత్తమ దశాస్యాంతక మాం రక్ష దేహి దాపయ/ మే శ్రియం"

ఈ మంత్రమును మూడు లక్షలు జపము చేసినచో మంత్ర సిద్ధియగును. ఇది కోరిన ఫలముల నిచ్చును.

(11) రాం, (12) రామ, (13) ఓం రామ ఓం, (14) హ్రీం రామ హ్రీం, (15) శ్రీం రామ శ్రీం, (16) క్లీం రామ క్లీం, (17) ఫట్ రామ ఫట్, (18) రాం రామ రాం (19) శ్రీం రాం శ్రీం స్వాహా, (20) శ్రీం రామ శ్రీం హుం ఫట్, (21) శ్రీం రామ శ్రీం నమః, (22) ఓం రామ, (23) హ్రీం రామ, (24) శ్రీరామ, (25) క్లీం రామ, (26) ఐం రామ, (27) రాం రామ, (28) రామాయ నమః, (29) క్లీం రామాయనమః, (30) హ్రీం రామాయనమః (31) ఐం రామాయనమః, (32) శ్రీం రామాయనమః (33) ఓం రామాయనమః.

విధానము: పైన వివరించిన వివిధ రామమంత్రము లన్నియూ సాధకునకు సమస్త శుభములను చేకూర్చును. సాధకుని కోరిక లన్నిటిని నెరవేర్చును. ధర్మ, అర్థ, కామమోక్షములనెడి చతుర్విధ పురుషార్థములను ఒసంగును. అజ్ఞానాంధకారమును తొలగించును. మహాపాతకములు, ఉపపాతకములన్నింటిని నశింపజేయును. వీటిలో ఏ మంత్రమునూ గొప్పది - తక్కువ అనే భావము లేకుండా తమకు ఇష్టము వచ్చిన శ్రీరామ మంత్రమును భక్తి - శ్రద్ధలతో జపించి పైన చెప్పిన సత్ఫలితములను అన్నింటినీ పొందవచ్చును.

## శ్రీ మారుతీ స్తోత్రము

ఓం నమో భగవతే విచిత్ర వీరహనుమతే ప్రళయ కాలానల ప్రజ్వలనాయ ప్రతాపవజ్రదేహాయ అంజనీగర్భ సంభూతాయ ప్రకట విక్రమ వీరదైత్య దానవ యక్షరక్షోగణగ్రహబంధనాయ భూతగ్రహబంధ నాయ శాకినీ ఢాకినీ గ్రహ బంధ నాయ కాకినీ కామినీ గ్రహబంధనాయ బ్రహ్మగ్రహ బంధనాయ బ్రహ్మరాక్షస గ్రహబంధనాయ చోరగ్రహబంధ నాయ మారీ గ్రహబంధనాయ ఏహి ఏహి ఆగచ్ఛ ఆ గచ్ఛ ఆవేశయ ఆవేశయ మమహృదయే ప్రవేశయ ప్రవేశయ స్ఫుర స్ఫుర ప్రస్ఫుర ప్రస్ఫుర సత్యం కథయ కథయ వ్యాఘ్రముఖ బంధనం సర్పముఖ బంధనం రాజముఖ బంధనం నారీముఖ బంధనం సభాముఖ బంధనం శత్రుముఖ బంధనం సర్వముఖ బంధనం లంకా ప్రాసాద బంధనం అముకంమే వశమానయ వశమానయ క్లీం క్లీం క్లీం హ్రీం శ్రీం శ్రీం రాజానం వశమానయ వశమానయ శ్రీం హ్రీం క్లీం స్త్రీణాం ఆకర్షయ ఆకర్షయ శత్రూన్మర్దయమర్దయ మారయ మారయ చూర్ణ చూర్ణయ ఖే ఖే శ్రీ రామచంద్రా జ్ఞయా మమకార్యసిద్ధిం కురు కురు ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఫట్ స్వాహా విచిత్రవీర హనుమన్ మమ సర్వశత్రూన్ వశమానయ స్వాహా ఇతి.

## అంజనమంత్రము

"ఓం నమో మేరు మహామేరు ఓం నమో గౌరి మహాగౌరి ఓం నమః కాళీ మహాకాళీ ఓం ఇంద్రే మహేంద్రే ఓం జయే మహాజయే ఓం నమః విజయే మహావిజయే ఓం నమః పద్మనుకి మహాపద్మ నమశే అంతర అంతరదేవి అవతర అవతర స్వాహా" అను యీ మంత్రమును, ఏడుమారులు జపముచేసి, తద్దశాంశహోమము, తర్పణ, మార్జన, బ్రాహ్మణ భోజనాదులొనర్చిన యెడల మంత్రము సిద్ధించును. తదనంతరము అద్దమునందుగాని బొటన వ్రేలు గోరు(అంగుష్ఠము) నందుగాని దీపపుకోనయందు కాని అంజనము చూడవచ్చును.

## బొటనవ్రేలియందు అంజనము చూచు విధానము

"ఓం క్రోం హ్రాం క్లీం క్షూం స్వాహా" అను మంత్రమును, వెయ్యి యెనిమిదిసార్లు జపించి కలశస్థానమునందు కన్యకలు కూర్చుండు స్థానమునందు పై మంత్ర న్యాసం. చేయవలయును. తరువాత ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః" అను మంత్రముతో కన్యకల యొక్క కుచస్థానముల యందు అభిమంత్రించి ఆ కన్యలకు చేతితో కలిపిన అన్నములు మొదలయిన పిండి వంటకము లను తినిపించవలయును. అక్కడంగుడే అలంకరించబడిన సాధకుని యొక్క బొటన వ్రేలి గోరునందు, సాధకుడు తన చేతులతో మర్దించిన తైలమును బూసి ఆ అంగుష్ఠమునందు ఆ కన్యలను చూడమని. చెప్పిన యెడల ప్రశ్నలకు సరియైన జవాబులు, రూపములు కనబడు చుండును.

## అంజనము మరియొక విధము

"ఓం పింగళ పింగళ పెల్లక్షి పల్లక్షి తరస్వాహా" అను మంత్రమును పన్నెండువేలసార్లు జపించి దశాంశము. తెల్లటి పువ్వులతో హోమము చేసిన యెడల యీ దర్పణ మంత్రము సిద్ధించును. తరువాత ఒక అద్దమును చేతియందలి భస్మముతో ఇరవై యొక్క సార్లు బాగుగాదుద్ది పై మంత్రముతో ఆ అద్దమును అభిమంత్రించి అక్షతలమీద స్థాపించబడిన నీటితో నిండియున్న ఒక క్రొత్త కలశము పైన పెట్టి బ్రహ్మ క్షత్రియ వైశ్య కులములలో ఏదో యొక కులములో పుట్టిన, యిద్దరు కన్యలను తీసుకువచ్చి, స్నానము చేయించి తెల్లటి బట్టలను ధరింపజేసి, గంధాక్షత, పుష్పములతో ఆ కలశము నారాధించి. ఆ కన్యలకు, చందన తాంబూలాది

## దత్తాత్రేయ మహాయంత్రము

ఈ దిగువ వ్రాసిన దత్తాత్రేయ మహాయంత్రమును రాగి రేకుమీద చెక్కించి, ఈ యంత్రముపైన దేవతా ప్రతిష్ఠచేసి ఆ దేవతను ఆరాధన చేసుకొను మనుష్యునకు భక్తి - జ్ఞాన - వైరాగ్యములు లభించును.

| 3 | 2 | 8 | 5 | 4 | 9 | 1 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|---|
| 5 | 4 | 9 | 1 | 6 | 7 | 3 | 2 | 8 |
| 1 | 6 | 7 | 3 | 2 | 8 | 5 | 4 | 9 |
| 8 | 3 | 2 | 9 | 5 | 4 | 7 | 1 | 6 |
| 9 | 5 | 4 | 7 | 1 | 6 | 8 | 3 | 2 |
| 7 | 1 | 6 | 8 | 3 | 2 | 9 | 5 | 4 |
| 2 | 8 | 3 | 4 | 9 | 5 | 6 | 7 | 1 |
| 4 | 9 | 5 | 6 | 7 | 1 | 2 | 8 | 3 |
| 6 | 7 | 1 | 2 | 8 | 3 | 4 | 9 | 5 |

## మంత్రాత్మకమైన మారుతి స్తోత్రము

మంత్రాత్మకమైన ఈ దిగువనుగల మారుతి స్తోత్రము చదువుచుండు వ్యక్తి అంతటను విజయమును పొందును. అతనికి ఏ విధమైన హానియూ సంభవించదు.

ఓం నమో వాయుపుత్రాయ భీమరూపాయ ధీమతే
నమస్తే రామదూతాయ కామరూపాయ శ్రీమతే । 1

మోహశోక వినాశాయ సీతాశోక వినాశినే ।
భగ్నాశోకవనాయాస్తు దగ్ధలంకాయ వాగ్మినే ॥ 2

గతి నిర్జిత వాతాయ లక్ష్మణ ప్రాణదాయచ ।
వనౌకసాంవరిష్ఠాయ వశీ వనవాసినే ॥ 3

తత్త్వజ్ఞాన సుధాసింధు నిమగ్నాయ మహీయసే ।
ఆంజనేయాయ శూరాయ సుగ్రీవ సచివాయతే ॥ 4

జన్మ మృత్యు భయఘ్నాయ సర్వక్లేశహరాయచ ।
నేదిష్ఠాయ ప్రేతభూత పిశాచ భయహారిణే ॥ 5

యాతనా నాశనాయాస్తు నమోమర్కటరూపిణే ।
యక్షరాక్షస శార్దూల సర్పవృశ్చిక భీహృతే ॥ 6

మహాబలాయ వీరాయ చిరంజీవిన ఉద్ధతే ।
హారిణే వజ్రదేహాయ చోల్లంఘిత మహాబ్ధయే ॥ 7

బలినామగ్రగణ్యాయ నమోనమః పాహిమారుతే ।
లాభదోసి త్వమేవాశు హనుమన్ రాక్షసాంతక । 8

యశో జయంచమే దేహి శత్రూన్ నాశయ నాశయ ॥
స్వాశ్రితానా మభయదం యఏవం స్తౌతిమారుతిమ్ ।
హానిఃకుతో భవేత్తస్య సర్వత్ర విజయీభవేత్ । 9

## వివిధ కార్యములు సిద్ధించుటకు, ఆపదలు తొలగి పోవుటకు హనుమన్మంత్రములు

సూచన : ఈ దిగువ మంత్రములను ప్రతి రోజూ 108 పర్యాయములు జపించుచున్నచో ఆయా ఫలితములు కలుగును. ఆమంత్రములను జపించుట ప్రారంభించుటకు ముందు ఒక పర్యాయము జపము పూర్తిఅయిన తరువాత ఒక పర్యాయము "రాం రామాయనమః" అనవలెను.

### కార్యసిద్ధికి

మంత్రము : "ఓం హనుమతే నమః"

### రక్షణ, కోరుకొనినది లభించుటకు మంత్రము

"అంజనాగర్భ సంభూత కపీంద్ర సచివోత్తమ ।
రామప్రియ నమస్తుభ్యం హనుమన్ రక్షసర్వదా ॥

### శత్రు నివారణ ఆత్మ సంరక్షణ, సంపదలు లభించుటకు మంత్రము

"మర్కటేశ మహోత్సాహ సర్వశోక వినాశన ।
శత్రూన్ సంహార మాంరక్ష శ్రియందాపయమే ప్రభో" ।

### దేశములో విప్లవము, మహామారి శత్రు ఆక్రమణ అనేక విధములగు సహించరాని ఆపదలు, దేశోపద్రవాదులు తొలగిపోవుటకు మంత్రము.

"జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః ।
రాజాజయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః ।
దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః
హనుమాన్ శత్రు సైన్యానాం నిహంతా మారుతాత్మజః ।

నరావణ సహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్ ।
శిలాభిస్తుప్రహరతః పాదపైశ్చ సహస్రశః ।
అర్దయిత్వాపురీంలంకామభివాద్య చ మైథిలీం
సమృద్ధార్థోగమిష్యామి మిషతాంసర్వరక్షసాం ।

### వివాహము అగుటకు భార్య లభించుటకు మంత్రము

"పతీవ నిత్యం పరిత్యజ్యమాన
స్త్వామేవ పితే త్వభిభాషమాణః ।
త్యక్త్వాపి రాజతో మహాత్మా
ధైర్య నేకాయకృత ప్రయత్నః ।

### అష్టసిద్ధులు నిచ్చెడి హనుమన్మంత్రము

"హం హనుమతే రుద్రాత్మకాయ హుం ఫట్"

### సమస్తమైన కోరికలు నెరవేరుటకు మంత్రము

"హం పవననందన స్వాహా"

### బంధవిముక్తికి మంత్రము

"ఓం నమో భగవతే ఆంజనేయాయ మమ శృంఖలాం త్రోటయత్రోటయ బంధ మోక్షం కురుకురు స్వాహా" ।

### భూతావేశమును పారద్రోలుటకు మంత్రము

మూలమంత్రము : "ఓం శ్రీం మహాంజనాయ పవనపుత్రాయ ఆవేశయ ఆవేశయ ఓం శ్రీ హనుమతే ఫట్"

విధానము : ఈ మంత్రము చదువుతూ భూతావేశముగల మనుష్యుని పైన నేతితో దిగదుడిచినచో, అతని భూతావేశము తొలగిపోవును.

### కామవికారము తొలగిపోయి, ఆత్మజ్ఞానము కలుగుటకు మంత్రము

మూలమంత్రము : "ఓం నమో హనుమతే మమ మదన క్షోభం సంహర సంహర ఆత్మతత్త్వం ప్రకాశయ ప్రకాశయ హుం ఫట్ స్వాహా"

విధానము : ప్రతిరోజూ ఈ మంత్రము 108 పర్యాయములు జపించుచున్నచో సాధకునకు కామవికారము తొలగి ఆత్మతత్త్వజ్ఞానము లభించును.

హనుమంతుడు కలలో కనిపించి సాధకుని కోర్కెను నెరవేర్చెడి ఒక మెలకువైన విధానము

ఈ అనుష్ఠానమును నలభై ఒక్క రోజులు చేయవలయును. సాధకుడు ఒక మంచిరోజు చూచుకొని ఈ విధానమును ప్రారంభించవలెను. ఈ అనుష్ఠానకాలములో బ్రహ్మచర్యమును పాటించవలెను. (అనగా స్త్రీ సంగమము చేయరాదు) క్షౌరము చేసికొనుట, గోళ్ళు కత్తిరించుకొనుట, మాంసాహారములు అనుష్ఠానము చేసెడి నలభై ఒక్క రోజులలోను చేయరాదు.

అనుష్ఠానము ప్రారంభించెడి రోజున ప్రాతఃకాలముననే లేచి కాలకృత్యములు నెరవేర్చుకొని, స్నానము చేసి శుభ్రమైన వస్త్రములు కట్టుకొని, ఒక గ్లాసునిండా నీళ్ళు తీసుకొని, ఆంజనేయస్వామి ఆలయమునకు వెళ్ళవలెను. ఆ గ్లాసులోని నీళ్ళతో ఆంజనేయ విగ్రహమును స్నానము చేయించవలెను. అటు తరువాత మొదటి రోజున ఆంజనేయస్వామి తలమీద ఒక మినపగింజ పెట్టి, ఆయన చుట్టూ పదకొండు ప్రదక్షిణలు చేయవలెను. అటు తరువాత ఆంజనేయ స్వామికి నమస్కరించి, మీ కోరికను మానసికముగా ఆంజనేయస్వామికి చెప్పుకొనవలెను. ఆ పిమ్మట ఆంజనేయ స్వామి తలమీద పెట్టిన మినపగింజను తీసుకొని యింటికి వచ్చి వేయవలెను. ఒక సీసాలోగాని డబ్బిలోగాని మీరు తీసుకువచ్చిన మినపగింజను భద్రముగా దాచియుంచవలెను.

రెండవరోజున రెండు, మూడవరోజున మూడు, నాల్గవరోజున నాల్గు ఈ రీతిన రోజునకు ఒక మినపగింజ చొప్పున పెంచుకుంటూ పోవలెను. ఈ రీతిగా నలభై ఒకటవ రోజున, నలభై ఒక్క మినప గింజలు ఆంజనేయస్వామి శిరస్సుపైన వుంచవలెను. అటు తరువాత నలభై రెండవరోజు 40, నలభై మూడవరోజున 39, నలభై నాల్గవరోజున 38, ఈ రీతిగా రోజుకు ఒక మినపగింజ చొప్పున తగ్గించుకుంటూ ఎనభై ఒకటవ రోజున ఒక్క మినపగింజ మాత్రమే ఆంజనేయుని శిరస్సుపైన ఉంచవలెను. తతిమ్మా కార్యక్రమం అంతా మొదటిరోజున చెప్పిన రీతిగానే చేయవలెను.

ఈ రీతిగా ఎనభై ఒక్క రోజులు – పై అనుష్ఠానము పూర్తి కాగానే – అదే రోజు రాత్రి శ్రీ ఆంజనేయస్వామి సాధకునకు కలలో కనిపించి, సాధకుని కోర్కెను నెరవేర్చును. ఈ ఎనభై ఒక్కరోజులలోను భద్రపరచియుంచిన మినపగింజలను అన్నింటిని ఎనభై ఒకటవరోజు చేసెడి అనుష్ఠానము పూర్తి అయిన పిమ్మట నదిలోగాని, కాలువలోగాని, యివి ఏవీ లేనిచోటున చెరువులోగాని, నూతిలోగాని విడిచిపెట్టవలయును.

## తులసీ రామాయణ (మానస) సిద్ధ మంత్రము

ఉత్తర భారతదేశములో తులసీ రామాయణ పారాయణ అతి ప్రసిద్ధిగలదై యున్నది. కష్టనివారణ, సుఖప్రాప్తి, వివిధ ఇహ-పర లాభములకుగాను తులసీ రామాయణము నందలి మంత్రజపము సుప్రసిద్ధమై యున్నది. ఎందరో వ్యక్తులు ఈ మంత్రజపమువల్ల సత్ఫలితములను పొంది సుఖించుచున్నారు.

ఈ మంత్ర జపమునకు స్త్రీ పురుషులందరూ అర్హులు. స్త్రీలు రజోదర్శన (బహిష్టు) సమయమున చేయరాదు. ఈ మంత్రములను ఉదయ సమయమునగాని, రాత్రి నిద్రపోవు సమయమునగాని జపించవచ్చును. ఇతర సమయములలో కూడ అవకాశము ననుసరించి మానసికముగా జపించుచుండవచ్చును.

మంచిరోజు చూచుకొని జపమును ప్రారంభించవలెను. తూర్పు దిశగాగాని, ఉత్తరదిశగా గాని ముఖము పెట్టుకొని కూర్చొనవలెను. సాధకుడు తన ఎదుట సీతారామ లక్ష్మణ హనుమంతులు వున్న పటమును పెట్టుకొని, అగరువత్తులు వెలిగించి తాను చేయుచున్న జపసాధనలో విజయమును అనుగ్రహించవలసినదిగా భక్తి పూర్వకముగా నమస్కరించవలెను.

మంత్రజపము ప్రారంభించుటకు ముందు మొట్టమొదటి రోజున ఈ దిగువనుగల రక్షారేఖా మంత్రమును 108 పర్యాయములు జపించి ఈ మంత్రమును చదువుచూ బొగ్గుతో గాని సుద్ద లేదా సిమెంటుముక్కతో గాని, సీటితోగాని జపముచేయుటకు కూర్చొనిన ప్రదేశమునకు నాల్గువైపులా రక్షారేఖను గీయవలెను. ఇటుల చేయుటవలన ఏ విధమగు విఘ్నములు రాకుండా జపసిద్ధియగును. జపము ప్రారంభించిన రెండవరోజు నుండి ఈ మంత్రము చదువుచూ జపముచేయుటకు కూర్చొనిన ప్రదేశమునకు చుట్టూ రక్షారేఖను (పైన చెప్పిన రీతిగా) గీయవలెను. రెండవరోజు నుండి 108 పర్యాయములు (రక్షారేఖ మంత్రమును) చదువనక్కరలేదు. చుట్టూ రక్షారేఖను గీయుచున్న సమయమున మాత్రమే ఈ రక్షారేఖా మంత్రమును చదువుచూ గీతను గీయవలెను.

### రక్షారేఖా మంత్రము

"మామభిరక్షయ రఘుకులనాయక !
ధృతవర చాప రుచిరకర సాయక !!

విధానము: ఈ జపము చేయుటకు జపసంఖ్యను లెక్కించుటకు తులసీ మాల శ్రేష్ఠమైనది. అవకాశములేని వారు తమ వీలుననుసరించి లెక్కించవచ్చును. లేదా కాలనియమము పెట్టుకొని ప్రతిరోజూ ఒక నియమిత కాలము వరకు జపము చేసినను చేయవచ్చును. ఇందువల్ల నష్టము లేదు.

అవకాశము వున్నవారు ప్రతిరోజూ జపము ప్రారంభించుటకు ముందు ఈ దిగువనుగల రెండు మంత్రములలో ఏదో ఒక మంత్రమును 108 పర్యాయములు జపించి అటు తరువాత తమకు అవసరమైన మంత్రమును జపము చేయుచున్న తాము ఏ కోరిక నెరవేరుటకై జపము చేయుచున్నారో, ఆ కోరిక త్వరలో నెరవేరుటకు సహాయపడును.

### 1వ మంత్రము

"జనకసుతా జగజ్జననీ జానకీ !
అతిశయప్రియ కరుణానిధాన్ కీ !
తాకే జుగ పదకమల మనావఉఁ !
జాసుకృపా నిర్మల మతి పావఉఁ !!"

### 2వ మంత్రము

"ఓం నమో భగవతే సర్వరక్షా హ్రీం ఓం
హూం రక్షరక్ష సర్వసౌభాగ్య భాజనం హూం కురుకురు స్వాహా"

విధానము: వివిధ లాభములు కలుగుటకుగాను ఉపయోగపడే మంత్రములను ఈ దిగువను వివరించుచున్నాము. ఎవరికి ఏ లాభము కలుగవలెనని యున్నచో ఆ లాభము కలిగే మంత్రమును ప్రతిరోజూ కనీసము 108 పర్యాయములైనను జపించవలెను. అవకాశము వున్నవారు ఏడు, లేదా పదకొండు మాలల వరకు కూడా (అనగా 756 లేదా 1188 పర్యాయములు ఒక్కొక్క మాలకు 108 పర్యాయములు జపము చేయవలయును) జపము చేయవచ్చును. కార్యసిద్ధి అగునంతవరకు మంత్రజపము చేయవలెను.

1. వ్యాపారములో విజయము పొందుటకు –
   రాజీవనయన ధరే ధనుసాయక !
   భగత విపతి భంజన సుఖదాయక !
   రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే !
   రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః !

### ధనలాభ మంత్రము

మూలమంత్రము : ఓం తారా త్రిపురాయై నమః బుద్ధిం వృద్ధిం కురు కురుస్వాహా.

విధానము : రాత్రిపూట పదిగంటలయిన తరువాత దీపారాధన చేసి, పై మంత్రమును పదకొండు వందల ఎనభై ఎనిమిది సార్లు జపించవలెను. జపానంతరము మూడు పావుశేర్లు మిఠాయి గాని, ఏదైనా తినుబండారముగాని నైవేద్యము బెట్టి, అందరికీ పంచి పెట్టవలయును. ఇట్లు ప్రతినిత్యము చేయుచుండిన ఎడల సర్వ సంపదలు నిశ్చయముగా అభివృద్ధి చెందు చుండును.

### సర్వవ్యాధి నివారణ పరబ్రహ్మ మంత్రము

మూలమంత్రము : ఓం వాం హ్రీం శ్రీం నమః సర్వాధారాయ భగవతే అస్య మమ '1' సర్వరోగం వినాశయ జ్వలజ్వల వినం దీర్ఘాయుష్యం కురు కురు స్వాహా. సర్వాధారాయ శాంతాయ నమస్తే పరబ్రహ్మణే. దీర్ఘాయుష్యం ప్రయచ్ఛాస్య సర్వాన్ రోగాన్ వినాశయ.

విధానము : ఈ మంత్రములో '1' అను అంకె వేసిన స్థలములో వ్యాధి గ్రస్తునియొక్క గోత్రనామములు చేర్చి, స్వంతముగా జపము చేయుటగాని, ఇతరులచే చేయించుటగాని, జరిపించవలెను. జపము చేయువారు బ్రహ్మచర్యముతో నుండవలెను. మొత్తము ఒక లక్ష యిరువది ఆయిదువేల జపములు పూర్తిజేసిన యెడల సర్వవ్యాధులు నిస్సందేహముగా హరించును. దీర్ఘాయుర్దాయము కలుగును. దారిద్ర్యము నశించిపోవును.

### వ్యాధినాశక రఘువీర మంత్రము

మూలమంత్రము : ఓం క్లీం రాం హుం ఫట్ — రామభద్ర మహేష్వాస రఘువీర నృపోత్తమ. రోగాన్నాశయ మేక్షిప్రం శ్రియం దాసస్యదేహి మే. ఓం క్లీం రాం హుం ఫట్.

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము పదకొండువందల సార్లు చొప్పున నలభై రెండు రోజుల వరకు తాను జపించు చుండుటగాని, ఇతరులచే తన కొరకు జపము చేయుచుండుట గాని జరిపించవలెను. ఆటుపిమ్మట తెల్లగరికె గడ్డి గుగ్గిలము నెయ్యి కలిపి, జపదశాంశము హోమము చేసి, పదుగురు బ్రాహ్మణుల కైనను భోజనము పెట్టించవలెను. జపము చేసినవారు బ్రహ్మచర్యముతో నుండవలెను. ఇట్లు చేయుచుండిన యెడల అతి ఘోరములైన దుష్టవ్యాధులు హరించి, శీఘ్రముగా ఆరోగ్యము లభించును.

### విద్యాప్రాప్తి కొరకు హయగ్రీవ మంత్రము

మూలమంత్రము : జ్ఞానానందమయం దేవం నిర్మలం స్ఫటికాకృతిమ్, ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవము పాస్మహే.

విధానము : హయగ్రీవ మూర్తి చిత్రపటము ఎదురు గుండా కూర్చుని ధూప దీప నైవేద్యములు యిచ్చి హయగ్రీవుని పూజించి పై మంత్రమును ప్రతినిత్యము నూట ఎనిమిదిసార్లు జపించుచుండిన యెడల అచిరకాలములోనే సర్వవిద్యాపారంగతుడగును.

### విఘ్నములు హరించుటకు గణపతి మంత్రము

మూలమంత్రము : ఓం గం గణపతయే నమః

విధానము : శ్రీ గణేశుని పూజించి నమస్కరించి, ప్రతిదినము భోజనము చేయుటకు పూర్వము ఈ మంత్రమును, ఇరువేల సార్లు జపించవలయును. ఇట్లు రెండువందల పదిరోజులు జపించవలయునని శాస్త్రజ్ఞులు చెప్పెదరు. కార్యసాఫల్యము కొరకు ప్రతిరోజూ 108 సార్లు చొప్పున యిరవై రోజులయినా జపించవలయును. ఈ మంత్రమును జపించు చుండిన యెడల సర్వవిఘ్నములు హరించి సర్వకార్యములు సులభముగా నెరవేరు చుండును. ఎంతటి కఠినమైన కార్యముకైన తప్పక నెరవేరును.

### సర్వాభీష్టసిద్ధి ప్రద మంత్రము

మూలమంత్రము : నమః సర్వవినాశాయ సర్వశక్తి యుతాయతే, మమాభీష్టం కురుష్వాశు శరణాగత వత్సల.

విధానము : ఈ మంత్రమును యిరవై ఒక్కవేలసార్లు స్వయంగా జపించిగాని, యితరులచేత తన కొరకు జపము చేయించిగాని యిరవై ఒక్క వందలసార్లు నేతితో హోమము చేసిన యెడల మనోభీష్టములు నెరవేరును. ధనవృద్ధి విద్యావ్యాపార వృద్ధులు కలుగును.

### సర్వకార్య సిద్ధి మంత్రము

మూలమంత్రము : ఓం కార్యత్యాలోహోవహాళ స్వలాను వృద్యానుమిల్యాం ధర్మ్య నమూర్యదచేరా, యద్యేంయమిస్యా న్యిళ్లిలం ప్రారంభత్యై శిష్య క్షేః హుం శాలి మాలంట్యాం ప్రపద్యమే.

విధానము : శ్రీకృష్ణునిగాని, విష్ణుమూర్తినిగాని పూజించుచూ ప్రతి దినమును ఈ మంత్రమును రోజుకు యిరవై ఒక్క వందల సార్లు చొప్పున పన్నెండురోజులు జపించిన యెడల అను కున్నపని అయ్యేది లేనిది స్వప్నములో తెలియును. ఈ విధముగా ఈ మంత్రమును విడువకుండా ప్రతినిత్యము జపించుచుండిన యెడల తలచిన కార్యములు క్రమముగా వెంట వెంటనే సిద్ధించు చుండును.

### సకల విద్యలు లభించుటకు మంత్రయోగము

మాఘ శుక్ల త్రయోదశినాడు సాయం సంధ్యా సమయ ములో సరస్వతీ ఆకు మూలికకు నిమంత్రణ చెప్పి వచ్చి, చతుర్దశినాడు ప్రాతః కాలమందు (తెల్లవారు గట్ల వాళ్ళ గంటలకు) నిద్రలేచి, ఎవరితోనూ మాట్లాడకుండా, సరస్వతీ ఆకును త్రెళ్ళతో సహా పీకి తీసుకురావలెను. తరువాత ఆ సరస్వతీ ఆకులు మూడు కొంచెము నీటితో కలిపి త్రాగవలెను ఇందుకు మంత్రములు ఈ దిగువ నుదహరించబడియున్నవి.

మూలమంత్రము : ఓం కుమార రంజన్యై నమః.

(ఈ మంత్రమును యిరవై ఒక్కసార్లు చదివి సరస్వతీ ఆకుపై దియ్యము చల్లవలెను).

మూలమంత్రము : ఓం వం బుద్ధి వర్ధిన్యై నమః.

ఈ మంత్రమును యిరవై ఒక్కసార్లు చదివి, సరస్వతీ ఆకును సమూలముగా పెకలించవలెను.

మూలమంత్రము : ఓం ఐం హ్రీం బ్రాహ్మ్యై నమః.

ఈ మంత్రమును యిరవై ఒక్కసార్లు చదువుచూ సరస్వతీ ఆకును కల్వములో వేసి, కొంచెము నీటితో నూరవలయును.

మూలమంత్రము : ఓం ఐం శ్రీం వాగ్వాదిని సరస్వతి మమ జిహ్వాగ్రే వదవద మాం సర్వవిద్యాం దేహి దేహి స్వాహా.

విధానము : ఏదైనా పరిశుభ్రమైన కూర్చుండి ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించవలెను. తరువాత కల్వములో నూరిన సరస్వతీ ఆకుపసరును గుడ్డలో వేసి పిండుకొని దొప్పలోని నీళ్ళలో వెలుబడి త్రాగవలెను. ఇట్లు చేసిన యెడల బుద్ధి అభివృద్ధి జెంది సకల విద్యలు పాండిత్యముగా బహు శీఘ్రముగా లభించును.

## విద్యాభివృద్ధికి హయగ్రీవ మంత్రము

మూలమంత్రము : ఓం ఐం హ్రీం హ్రాం హయగ్రీవాయనమః మే విద్యాం దేహి దేహి బుద్ధిం వర్ధయ వర్ధయ హం ఫట్ స్వాహా.

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును.

ఇందుకు ఔషధము : తిప్పతీగవేళ్ళు, ఉత్తరేణి వేళ్ళు, వాయువిడంగములు, తెల్లదింటెన వేళ్ళు సరస్వతీ ఆకు సమూలము, వస, కొండ పిల్లితేగలు, ఈ వస్తువులన్నీ సమ భాగములు కలిపి చూర్ణం కొట్టి వస్త్రఘాళిత మొనర్చి అందు తగు మాత్రము ఆవు నెయ్యి కలిపి తుల మెత్త వుండలు జేసి ప్రతినిత్యం ప్రాతఃకాలమందు ఒక్కొక్క ఉండను పై హయగ్రీవ మంత్రముతో యిరవై ఒక్కసార్లు అభిమంత్రించి తింటూ వుండిన యెడల నలభై దినములలో బుద్ధి అభివృద్ధి జెంది, సకల విద్యలు సులభముగా వచ్చుచుండును.

## దుఃఖహర మంత్రము

మూలమంత్రము : ఓం క్లీం శ్రీం యాదేవీ సర్వభూతేషు శాంతి రూపేణ సంస్థితా, నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః క్లీం శ్రీం ఓం.

విధానము : పదితులముల బరువు మూడంగుళముల వెడల్పు గల యినుపరేకు తెచ్చి దానిపైన ఒక త్రిశూలమును చెక్కించి పై మంత్రమును చదువుచూ ఈ యినుపరేకును నిప్పులలో ఎర్రగా కాల్చి కంచుపాత్రలోని నీళ్ళలో ముంచవలెను. ఇట్లు మూడుసార్లు కాల్చి ముంచి ఆ నీటిని బంధువియోగముచే దుఃఖించుచుండెడి వారికిచ్చి త్రాగించి కొంతనీటిని ముఖముపైన కొంతనీటిని హృదయముపైనా చల్లినయెడల ఎంతటి ప్రబలమైన విచారమైననూ హరించి పోవును.

రెండవ విధానము : దుఃఖములో నున్నవారు దర్భాసనము పై ఉత్తరాభిముఖముగా కూర్చుండి పై మంత్రమును ఉదయం పూట మూడువందల యిరవై నాల్గుసార్లు, సాయంత్రం మూడు వందల యిరవై నాల్గుసార్లు చొప్పున జపించుచుండిన యెడల సర్వదుఃఖములు క్రమముగా హరించి శాంతి కల్గును.

## సర్వవ్యాధులు హరించుటకు మంత్రము

మూలమంత్రము : మాంభయాత్ సర్వతో రక్ష శ్రియం వర్ధయ సర్వదా, శరీరారోగ్యంమే దేహి దేవదేవనమోస్తుతే.

విధానము : నీటితో నిండిన ఒక రాగిపాత్రను ఎడమచేతితో పెట్టుకొని కుడిచేతితో పైన మూసి ఈ మంత్రమును ఏడుసార్లు చదివి ఆ నీటిని త్రాగవలెను. ఇట్లు ప్రతినిత్యము ఉదయము, సాయంత్రమునందు చేయుచుండిన యెడల సర్వవ్యాధులు నిస్సందేహముగా బహుశీఘ్రముగా హరించి పోవును.

## సర్వకష్టములు తొలగుటకు కృష్ణ మంత్రము

మూలమంత్రము : ఓం నమో భగవతే తస్మై కృష్ణాయా కుంఠమేధసే సర్వవ్యాధి వినాశాయ ప్రభో మా మమృతం కృధి ।

విధానము : ప్రతినిత్యము ప్రాతఃకాలమందు నిద్ర లేచుట తోడనే ఎవరితోను మాట్లాడకుండా పై మంత్రమును మూడుసార్లు జపించుచుండినయెడల గొప్ప గొప్ప అరిష్టములు కూడా శాంతించి పోవును. పై మంత్రమును ఎనభై రెండు వేలసార్లు జపించి, ఎనభై రెండు వందలు మంత్రముతో నేతితో హోమము చేసిన యెడల గొప్పగొప్ప మహిమలు కలవారగుదురు. ఐశ్వర్యవృద్ధి, కీర్తివృద్ధి, సర్వకార్య జయము లభించును.

## జ్వరము హరించుటకు మంత్రము

1. మంత్రము : దంష్ట్రా కరాళ వదనే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని దిశోనజానే నలభేచశర్మ ప్రసీద దేవేశ జగన్నివాస

విధానము : భగవాన్ శ్రీకృష్ణునకు నమస్కరించి, పై మంత్రమును ఎనిమిదిసార్లు జపించిన యెడల జ్వరము హరించిపోవును.

2. మంత్రము : ఓం నమో భగవతే రుద్రాయ నమః క్రోధేశ్వరాయ నమో జ్యోతిః పతం గాయ నమోనమః సిద్ధిరుద్ర ఆజ్ఞాపయతి స్వాహా.

విధానము : చేతితో ఒక పిడికెడు ఆవాలు తీసుకొని, పై మంత్రముచే ఏడుసార్లు అభిమంత్రించి, ఆ ఆవాలను జ్వరము వచ్చిన వారి శరీరముపై చల్లినయెడల రోజు విడచి రోజు వచ్చే జ్వరము మూడురోజుల కొకసారి వచ్చే జ్వరము మొదలైనవి హరించి పోవును. ఇట్లు ఏడుసార్లు చేసిన యెడల సంపూర్ణమైన ఆరోగ్యము కలుగును.

## ఉద్యోగము దొరుకుటకు మంత్రము

మూలమంత్రము : లక్ష్మీ కాపులే ఆలే ఓ వస్తులే తేరికీ సబ్ ధ్యాన్ మహిమా మహాగణేశా కల్యాణ్ - ఓం హ్రీంక్లీం త్రిపురాముండీ కురుకురు (అముక) స్వామీ వశమానయ ఫట్ ఫట్ స్వాహా.

విధానము : పై మంత్రములో 'అముక' అనుచోట ఉద్యోగము యిచ్చే అధికారి పేరు జేర్చి ఈ మంత్రమును భక్తి శ్రద్ధలతో పదకొండు వందలసార్లు జపించినయెడల దేవతానుగ్రహము వలన ఉద్యోగము లభించును.

## వివాహము అగుటకు మంత్రము

మూలమంత్రము : ఓం మూలీ మూలీ మహామూలీ సర్వం సంక్షోభయ సంక్షోభయ ఉవ్విద్రవేద్యః స్వాహా.

విధానము : వివాహము కానివారు రాత్రి పదిగంటల తరువాత నెయ్యిపోసి వెలిగించిన దీపం ఎదురుగా కూర్చుండి పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించవలెను. ఈ ప్రకారముగా ఒక వెయ్యి రోజులు జపము చేసినయెడల మంచి అందమైన కన్యతో వివాహము జరుగును.

## కన్యలకు వరుడు లభించుటకు మంత్రము

మూలమంత్రము : హేగౌరీ! శంకరార్ధాంగి యథాత్వం శంకర ప్రియా! తథా మాంకురుకల్యాణి కాన్త కాన్తాం సుదుర్లభామ్

విధానము : శ్రీ పార్వతీదేవిని పూజించి భక్తి శ్రద్ధలతో ఈ మంత్రమును ప్రతినిత్యమూ అయిదు వందల నలభై సార్లు జపించుచుండిన యెడల కన్యలకు తగినవరుడు నిస్సందేహముగా లభించును.

## పశువుల రోగ నివారణ మంత్రము – మందు

మూలమంత్రము : ఓం సర్వ్రాత్ ఉతర్ వరసాంగ్ తహా బని సహేలా హాండేహాండ్, సహేలా హాండేకే సాంప్రుల్ జంగా కోరే ఉర్కా ముల్ కా ముసారినార్ భయ్ ఎజాయులో హాయా నహిరేహండే కైజో ఉపదేశ్ రహా లోహారంకీ పాప్ హోయ్.

విధానము : ఆదివారమునాడు సూర్యోదయము కాక ముందే కోసుకువచ్చిన రావి ఆకుపైన, నల్లసిరాతో, రెల్లు పుల్లకలముచే ఈ మంత్రము వ్రాసి గుగ్గిలము ధూపము వేసి, తెల్లటి బట్టలో పెట్టి మడ్చి, ఈ మంత్రమును ఆవు యొక్క, ఎద్దుయొక్క మెడకును, దూడకు కుడికొమ్ము వద్దను కట్టిన యెడల వాటియొక్క సర్వ వ్యాధులన్నూ నివారింపబడును. ఈ ప్రకారముగానే చేసిన యెడల

గేదెలు, దున్నలు, మేకలు, గొర్రెలు మొదలయిన పశువులయొక్క వ్యాధులు కూడా హరించి పోవును.

## ఆవులు, గేదెలు పాలివ్వకుండా తన్నుట, పరుగెత్తుట పొడుచుట హరించుటకు విద్యా

**విధానము :** పిల్లిమ్మొడు చెట్టు వేరు ఒక అంగుళము పొడుగుగంటి తీసుకువచ్చి వానికి గుగ్గిలము పొగవేసి ఆవు యొక్క, గేదెల యొక్క కొమ్ముకు కట్టిన యెడల కొంటెము చేసేటటోని ఆ జంతువులు పేచీ పెట్టకుండా పాలిత్తును. ఈ చెట్టు ఆకులు తమలపాకు ఆకారముగా వుండును. మామిడిచెట్టు ఇప్పచెట్టు మోస్తరుగా పెద్దదిగా వుండును. ఈ చెట్టు పెట్టకొంటెము తెల్లగా వుండును.

## సుఖప్రసవకర మంత్రము

**మూలమంత్రము :** హిమవంతీ మద్యోత్తరదిశి యదాహాయ: పుష్పతిలకో సమింగయతి నర్యతః, ఏవాతేగర్భ విజయునహాసైతు జరా యుణా ఇంద్రస్యాయం వ్రజజ్ఞుతః సాథకస్య పరిశయే, తమింద్రనిర్జహి గర్భేణా సావరాగం నమః

**విధానము :** ఈ మంత్రముచే నూట ఎనిమిదిసార్లు విభూతి మంత్రించి, అందుకొంత విభూతిని నీళ్లలో వేసి మిగిలిన విభూతిని పూసుకోనుటకు, విభూతిని కలిపిన నీళ్ళను త్రాగుటకును స్త్రీకి ఇచ్చిన యెడల సుఖముగా ప్రసవించును.

## స్త్రీ సౌభాగ్య రక్షామంత్రము

**మూలమంత్రము :** ఓం ఓం హ్రీం ఓం శ్రీం హ్రీం ఓం స్వాహా

**విధానము :** సూర్యోదయము కాకముందే లేచి స్నానము చేసి శుభ్రవస్త్రములు ధరించి, ఈ మంత్రమును శ్రద్ధా విశ్వాసములతో, స్త్రీ ప్రతినిత్యము పదివందల ఎనిమిదిసార్లు జపించు చుండిన యెడల ఆ స్త్రీకి సుఖసౌభాగ్యములు వృద్ధి చెందు చుండును. ప్రతి సంవత్సరము చైత్రమాసములో వచ్చు నవరాత్రులయందు ఆశ్వయుజమాసములో వచ్చు నవరాత్రుల యందు ఈ మంత్రముతో హోమముచేసి యథాశక్తిగా కన్యలకు వయస్సమయిన వారికి భోజనములు పెట్టుచుండవలెను.

**హోమ విధానము :** పై మంత్రము నుచ్చరించుచూ మర్రి సమిధలతో నవరాత్రి రోజులలో ప్రతినిత్యమూ నూట ఎనిమిదిసార్లు హోమము చేయుచుండవలయును. ఈ విధముగా చేసిన యెడల సౌభాగ్యము వృద్ధి చెందును.

## మహామాయా మంత్రము

**మూలమంత్రము :** ఓం హ్రీం శ్రీం క్లీం పూర్వ దుర్గతి నాశిన్యై మహామాయాయై స్వాహా.

**విధానము :** ఈ సప్తదశాక్షర మంత్రము మానవుల కోర్కెలు తీర్చుటకు కల్పవృక్షము వంటిది. కావున వుండి ఈ మంత్రమును పదిసార్లు జపించినయెడల దుస్స్వప్న దోషము హరించి శుభము కలుగును. ఈ మంత్రమును ప్రతిరోజు 108సార్లు జపించిన యెడల సకలమనోభీష్టములు సులభముగా వాటంతట అవే నెరవేరుచుండును.

## మృత్యుంజయ మంత్రము

**మూలమంత్రము :** ఓం నమో మృత్యుంజయాయ స్వాహా.

**విధానము :** ఈ మంత్రమును ఒక లక్షసార్లు జపించిన యెడల సిద్ధియగును. ఈ సిద్ధి పొందినవారు స్వప్నములో మరణమును చూచినను, మూడు సంవత్సరముల ఆయుర్దాయముకలవాడగును.

## అనుభవ మంత్రములు

**(1) మూలమంత్రము :** ఓం నమో గంగా ఉకారే గోరఖ్ వహా దారే మీసాల్ గోరఖ్ బేటాజాయ్ జయద్భుత పూత ఈశ్వర్ కీ మయా.

**విధానము :** ఈ మంత్రము వెయ్యి నూట ఎనిమిదిసార్లు జపించినయెడల సిద్ధించును. తరువాత కన్యచే వేయించబడిన దారమును తెచ్చి, పై మంత్రము నుచ్చరించుచూ ఇరవై ఒక్క ముడులు వేసి, ఆ దారమును గర్భిణీ స్త్రీ చేతికి కట్టిన యెడల రక్తము స్రవించుట, గర్భపాతము కలుగునేమోయను సందేహములు హరించి గర్భము నిలబడి పుష్టిగా పెరుగు చుండును. సుఖముగా ప్రసవించును.

**(2) మూలమంత్రము :** ఓం హర త్రిపురహర భవానీ బాలా రాజా ప్రజామోహినీ సర్వశత్రువిధ్వంసినీ మమచింతిత ఫలం దేహి దేహి భువనేశ్వరీ స్వాహా.

**విధానము :** ఈ మంత్రమును ప్రతినిత్యము ప్రాతఃకాలమందు నూట ఎనిమిదిసార్లు, సాయంకాలమందు నూట ఎనిమిదిసార్లు, జపించుచూ, శ్రీ భువనేశ్వరీ దేవిని, ధూపదీప నైవేద్యములతో పూజించుచుండిన యెడల సాధకుని మనోరథములన్నియూ సిద్ధించుచుండును.

**(3) మూలమంత్రము :** ఓం నమో భగవతే రుద్రాయ నమః కోటీశ్వరాయ నమోనమస్తే రూపా రుద్రాయ జ్వాలయతి స్వాహా.

**విధానము :** గ్రహదోషముచేత పనులు జరగకుండినా, ఉద్యోగము దొరకకపోయినా, ఈ మంత్రమును ప్రతినిత్యమూ స్నానము చేసిన పిమ్మట నూట ఎనిమిదిసార్లు తప్పక జపించు చుండిన యెడల కోరిన పనులన్నియూ జరుగు చుండును.

## ధనలాభ మంత్రము

**మూలమంత్రము :** ఓం నమో హ్రీం శ్రీం క్లీం క్లీం శ్రీం లక్ష్మీః మమగృహే ధనచింతాం దూరీ కరోతి స్వాహా

**విధానము :** ప్రాతఃకాలమందు ముఖము కడుక్కొని ఎవరితోను మాట్లాడకుండా పవిత్ర స్థానమందు కూర్చుని పై మంత్రమును నూట ఎనిమిది సార్లు జపించవలయును. ఇట్లు ప్రతినిత్యమూ జపించుచుండిన యెడల వ్యాపారము ద్వారా ధనలాభము కలుగు చుండును.

## పొంగు, మశూచికము హరించుటకు మంత్రము

**మూలమంత్రము :** ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఓం ఖడ్గాం దీగం జరాం వికటవదనాం లోయస్థితాంబజాయి స్వాహా స్వాంగ స్తాం ప్రచండ రూపాం నమామ్యాల్య విభూతయే.

**విధానము :** ఈ మంత్రమును పదకొండుసార్లు ఉచ్చరించుచూ మశూచికము, పొంగు, ఆటలమ్మ పోసిన వారికి వేపరెమ్మతో దిగదుడుపవలెను. మరియూ యీ మంత్రముచే పదకొండు సార్లు అభిమంత్రించబడిన నీటిని ముఖముపై చల్లవలయును. ఇట్లు ప్రతిదినమూ ఉదయం సాయంత్రములయందు రెండుసార్లు చేయుచుండిన ఆటలమ్మ, పొంగు మశూచికములు బహుశీఘ్రముగా నెమ్మదించి ఆరోగ్యముగా వుండును.

## విఘ్నములు తొలగు శాంతి మంత్రము

మూలమంత్రము : ఓం నమః శాంతే ప్రశాంతే ఓం హ్రీం హ్రీం సర్వక్రోధ ప్రశమని స్వాహా

విధానము : ప్రతిదిత్యము ప్రాతఃకాలమందు, పై మంత్రముచే యిరవై ఒక్కసార్లు అభిమంత్రింపబడిన, నీళ్ళతో ముఖము కడుగుకొనుచుండిన యెడల విఘ్నములు తొలగిపోయి, ఇంటి యందు శాంతియుతముగా నుండును. సాయంత్రం పూట రావిచెట్టు దగ్గరకువెళ్ళి ఆ చెట్టు మొదట్లో (వేళ్ళపైన) కొంచెము పంచదార పాకముపోసి, ఆ రావి చెట్టుకు, ధూపదీపములు పెట్టి వచ్చిన యెడల సమస్త శుభములు జరుగును.

## రోగులకు అపమృత్యుదోష శాంతి తంత్రము

విధానము : శనివారము సాయంకాలము సంధ్యాసమయములో కుమ్మరి వాని యింటికి వెళ్ళి, కుమ్మరి సారెపైన ఇరవై నాల్గు పచ్చి ప్రమిదలు తయారుచేయించి తెచ్చి ఆ ప్రమిదలలో నెయ్యి పోసి వత్తులు వేసి దీపములు వెలిగించి రోగిని ఉత్తరముఖముగా కూర్చుండబెట్టి రోగి ఎదురుగుండా ఈ దీపములు పెట్టి ఈ దీపములతో రోగిని దిగదుడిచి ఒక కంచములో ఒక మనిషికి సరిపోయే అన్నము, పాలు, పంచదారపాకు, రోగిచేతులతో కలిపించి ఆ అన్నమును రోగిచుట్టూ దిగదుడిచి ఆ అన్నమును ఇరవై నాల్గు దీపములను కూడా తీసుకువెళ్ళి రాత్రిపూట నాల్గు త్రోవలు కలిసే చోటులో వుంచి వచ్చిన యెడల ఆ క్షణమునుంచే రోగికి బాధలు తగ్గిపోయి అపమృత్యుదోషము తొలగి ఆరోగ్యము కలుగును. ఆయుర్దాయము వృద్ధియగును.

## అద్భుత వృక్ష తంత్రములు

### విష భయము నుండి రక్షణోపాయము

మూలమంత్రము : ఓం నమో భగవతే ఉడ్డామరేశ్వరాయ కంపితామృత మర్దిత జటాయ ఠః ఠః స్వాహా.

విధానము : ఈ మంత్రమును దీపావళినాడు రాత్రిగాని, గ్రహణ సమయములోగాని వెయ్యి నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత ఈ దిగువ చెప్ప బడిన తంత్రములనుపై మంత్రముచే నూట ఎనిమిది సార్లు అభిమంత్రించి ఉపయోగించుకొనవలెను.

(1) మేషరాశిలో సూర్యుడున్నప్పుడు ఒక వేపచిగురును రెండు వేపాకులతో కలిపి పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి తినిన యెడల అప్పటి నుంచి ఒక సంవత్సరము వరకు సర్పభయము వుండదు. తక్షకుడు కోపించినను యితనిని ఏమీ చేయలేడు. (2) తెల్ల విష్ణుక్రాంత చెట్టుయొక్క పండ్లు వేళ్ళు రెండూ కలిపి నీళ్ళలో నూరి పై మంత్రముచే నూట ఎనిమిది సార్లు అభిమంత్రించి త్రాగినయెడల సర్పవిషము హరించి పోవును. ఈ ఔషధమును ఓంకారము నుచ్చరించుచూ ఒక ఢంకా పైన గాని డోలుపైన గాని రాసి ఆ బాజాను మ్రోగించిన యెడల ఈ ధ్వని విన్న వెంటనే విషమూర్ఛితులైన మానవులు వెంటనే మేల్కొనెదరు. ఇది శివప్రోక్తము, ఇందుకు సందేహము లేదు. (3) ఒక శుభముహూర్తమున తెల్లగలిజేరు చెట్టు గింజలను తెచ్చి నీళ్ళతో నూరి పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి త్రాగిన యెడల సర్పము కరచుననే భయము వుండదు. ఒకవేళ సర్పము ప్రమాదవశాత్తు కరచిన యెడల ఆసర్పమే వెంటనే మృతిచెందును. (4) ఆషాఢశుక్ల పంచమినాడు దొరసెన చెట్టువేరు తెచ్చి పై మంత్రముచే నూట ఎనిమిది సార్లు అభిమంత్రించి నడుముకు కట్టుకొని బియ్యపు కడుగును త్రాగిన యెడల సర్పము కరచుననే భయము వుండదు. ప్రమాదవశాత్తు కరచిన యెడల ఆ సర్పమే నశించిపోవును.

## కష్టములు పోవుటకు సూర్య మంత్రము

మూలమంత్రము : ఓం ఖాం సః సూర్యాయ నమః.

విధానము : శుక్లపక్షమునందలి ఆదివారమునాడు (ఆ రోజు పుష్యమి నక్షత్రము కూడా వున్నచో యింకనూ శ్రేష్ఠము) ఒక మట్టి ప్రమిదలో నాలుగు వైపులను నాలుగు వత్తులు వేసి, నాలుగు దీపములను శుద్ధమైన ఆవు నేతితో వెలిగించవలెను. అటుల దీపారాధన చేసిన పిమ్మట కావలసిన కోరికను సంకల్పించుకొని ప్రాతఃకాలములో సూర్యోదయ మగుటతోడనే పసుపుకొమ్ముతో తయారు చేసిన మాలతో పై మూలమంత్రమును ఐదువేల మారులు జపించవలెను. ఈ రీతిగా ఐదు ఆదివారములుగాని, ఏడు ఆదివారములుగాని చేసినచో కోరిన కోరిక నెరవేరును.

## ఒక్కరోజులో కార్యసాధన మంత్రము

మూలమంత్రము : ఓం ఖాం సః సూర్యాయనమః

విధానము : మార్గశిరము లేదా పుష్యము లేదా మాఘ మాసమునందలి శుక్లపక్షమునందలి మొట్టమొదటి ఆదివారము నాడు సూర్యోదయమైన వెంటనే ఒక మట్టి ప్రమిదలో నాలుగువైపులను నాలుగు వొత్తులను వెలిగించి ఆ పాత్రను రెండు చేతులతోను పట్టుకొని సూర్యునికి ఎదురుగా నిలబడ వలెను. అటు తరువాత పై మూలమంత్రమును జపించుచుండ వలెను. ఈ విధముగా జపించుచూ సూర్యుడు ఏ దిక్కుకు తిరుగు చుండునో ఆ వైపునకే అనగా సూర్యునికి ఎదురుగా తిరుగుచూ జపము చేయుచుండవలెను. ఈ రీతిగా సూర్యాస్తమయము అగునంత వరకు జపించుచూ సూర్యాస్తమయము అయిన పిమ్మట దీపమునుదించి ఆసనముపై నుంచి సూర్యభగవానునకు నమస్కరించి ఫలహారము గైకొనవలెను. ఈ విధముగా చేసినచో ఎంతటి కష్టమైన పనియైనప్పటికిని ఒక్కరోజులోనే నెరవేరిపోవును.

## దుస్వప్న దోషనివారణ మంత్రము

మొదటి మంత్రము : ఓం అచ్యుతం కేశవం విష్ణుం హరిం సత్యం జనార్దనం, హం సం నారాయణం చైవ స్మరేన్నామాష్టకం శుభమ్, శుచిః పూర్వముఖః ప్రాజ్ఞో దశకృత్వస్త్రయోజపేత్, నిష్పాపః శిఖదేశోఽపి దుస్వప్నః శుభవాన్ భవేత్.

ఈ మంత్రమును తూర్పుముఖముగా కూర్చుండి పదిసార్లు జపించిన యెడల దుస్వప్న దోషము హరించి శుభము కలుగును. విష్ణుమూర్తికి దీపారాధన చేసి నైవేద్యము పెట్ట వలయును.

రెండవ మంత్రము : ఓం నమః శివం దుర్గాం గణపతిం కార్తికేయం దినేశ్వరమ్, ధర్మంగంగాంచతులసీం రాధాం లక్ష్మీ సరస్వతీమ్, నామాన్యేతాని భద్రాణి జపేత్సర్వాశ్చ యోజపేత్, వాంఛితంచ లభేత్ సోపి దుస్వప్నః శుభవాన్ భవేత్.

నీటిలో స్నానము చేసి పై మంత్రమును పదకొండుసార్లు జపించినయెడల దుస్వప్నములు కూడా శుభకరములై వాంఛిత ఫలము నొసంగును.

హనుమచ్ఛ్రీరామాయై నమోహృది (హృదయమును తాకవలెను) హం బీజాయ నమో నాభౌ (బొడ్డును స్పృశించవలెను) నమః శ్రయే నమః పాదయోః (పాదమును స్పృశించవలెను) అంజనేయాయ కీలకాయనమః సర్వాంగే (శిరస్సు నుంచి పాదము దాకా సర్వాంగములను స్పృశించవలెను).

కరన్యాసము : ఓం హ్రాం అంజనేయాయ అంగుష్ఠాభ్యాం నమః, ఓం హ్రీం మహాబలాయ తర్జనీభ్యాం నమః, ఓం హ్రూం శరణాగత రక్షకాయ మధ్య మాభ్యాంనమః, ఓం హ్రైం శ్రీరామ దూతాయ అనామికాభ్యాంనమః, ఓంహ్రౌం హరిమర్కటాయ కనిష్ఠి కాభ్యాంనమః, ఓం హ్రః సీతాశోక వినాశకాయ కరతలకర పృష్ఠాభ్యాంనమః (ఈ మంత్రముల నుచ్చరించుచు బొటన వ్రేళ్ళ నుంచి మొదలు పెట్టిన కరతల కరపృష్ఠముల వరకూ స్పృశించు చుండవలెను)

హృదయన్యాసము : ఓం హ్రాం అంజనేయాయహృదయాయనమః.ఓం హ్రీం మహాబలాయ శిరసే స్వాహా, ఓం హ్రూం శరణాగతరక్షకాయ శిఖాయైవషట్, ఓం హ్రైం శ్రీరామదూతాయ కవచాయహుం, ఓం హ్రౌం హరిమర్కటాయ నేత్రత్రయాయ వౌషట్, ఓం హ్రః సీతాశోక వినాశ కాయ అస్త్రాయ ఫట్, (పై మంత్రముల నుచ్చరించుచూ క్రమముగా హృదయము, శిరస్సు, శిఖ, బాహువులు, నేత్రములు, స్పృశించి ఆఖరు మంత్రము చదివి చప్పట్లు కొట్టవలెను)

న్యాసానంతరము ధ్యానము : ఓం ఉద్యద్బాల దివాకరద్యుతితనుం పీతాంబరాలంకృతం, దేవేంద్ర ప్రముఖ ప్రశస్తయశసం శ్రీరామదూత ప్రియమ్, సీతాశోక వినాశనం పటుతరం లక్ష్మీ సిద్ధిప్రదం, ధ్యాయే ధ్యానవపుంగవం హరివరం శ్రీ మారుతిం సిద్ధిదమ్, తదనంతరము మూల మంత్రములు జపించవలెను.

మూలమంత్రములు

(1) ఓం హాం హనుమతే అంజనే యాయ మహాబలాయనమః.

(2) ఓం అంజనేయాయ మహాబలాయ హుం ఫట్.

పై మంత్రములు రెండింటిని ప్రతి నిత్యమూ ఒక్కొక్క మంత్రము మూడువేల సారులు చొప్పున ఆరు వెలల వరకు జపించుచుండవలెను. ప్రతినిత్యమూ శ్రీహనుమాన్‌కు పంచ పూజలు చేసి నైవేద్యము సమర్పించుచుండవలెను. ఈవిధముగా ప్రతినిత్యము చేయుచుండెడివారికి ఐశ్వర్యసిద్ధి శత్రుజయము బ్రహ్మ రాక్షస భూత ప్రేత పిశాచాదులు వశీంచుట జరుగును. సర్వప్రతిబంధకములు తొలగిపోయి, సర్వకార్యములు సిద్ధించి హనుమాన్ పిలిచిన పలుకును, సర్వవ్యాధులు హరించి ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగు చుండును.

---

## భూతముల నివారణ తంత్రము

మూలమంత్రము : ఓం నమో కాలు బకాల్, శ్రీ మహా దేవులు ఉం ప్రకాల్ పగడోరు మార ఖయాల్ బి ఉమామ్ పేట ఉంతామ్ బామ్, పిర కాలూ. తోరే శక్తుపయమోరే వాక్ పదు.

విధానము : ఈ మంత్రము వెయ్యిసార్లు జపించిన సిద్ధియగును. తరువాత సాధకుడు ఈ మంత్రమును ఒక కాగితముపైన ఎర్ర చందనముతో వ్రాసి పిశాచగ్రస్తుని యొక్క కంఠము నందు ధరింపజేసిన యెడల ఎంత క్రూరములైన భూత, ప్రేత, పిశాచ, శాకినీ, ఢాకినీ గ్రహాదులైనను తక్షణం వదలి పోవును.

---

## పశువుల వ్యాధులు హరించుటకు మంత్రము

మూలమంత్రము : స్థానే హృషీ కేశ తవ ప్రకీర్త్యా, జగత్ప్రహృష్యత్యనురజ్యతేచ, రక్షాంసిభీతాని దిశో ద్రవంతి, సర్వే నమస్యంతిచ సిద్ధ సంఘాః.

విధానము : ఈ మంత్రమును 108 సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత అవసరము వచ్చినపుడు ఒక మట్టి పాత్రతో గాని, పరిశుభ్రమైన రాగిలేక కంచుపాత్రతో గాని కొంచెము మంచినీళ్ళు (లేక దొరికిన యెడల గంగాజలము) తీసుకొని పై మంత్రమును ఏడు సారులు . చదివి జపకుడు తన కుడిచేతి మొదటి వ్రేలును పాత్రలోని ఉదకములో నాలుగైదు సార్లు త్రిప్పి ఆమంత్రోదకమును భూత, ప్రేతములు సోకిన వారిచేత కొంచెము త్రాగించి మిగిలిన నీటిని వారిశిరస్సుపైనా శరీరముపైనా పడుకుండే ప్రక్కల పైనా చల్లిన యెడల భూత ప్రేత పిశాచాదులు వదలిపోవును. ఈ మంత్రముతో అభిమంత్రించబడిన నీటిని వెదురుగొట్టముతో పశువులకు పోసి పశువులచే త్రాగించినయెడల అన్ని రకములయిన పశువ్యాధులు హరించిపోవును.

## సర్వకార్య సిద్ధి మంత్రము

మూలమంత్రము : ఓం హ్రీం సకల కార్యసిద్ధికరాయ శ్రీసిద్ధమూర్తాయనమః

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము ఉదయము నూట ఎనిమిదిసార్లు, సాయంత్రం నూట ఎనిమిదిసార్లు జపించు చుండిన యెడల ధనము, కీర్తి, పుత్రలాభము కలుగును. విద్యార్థులు పరీక్షలలో కృతార్థులయ్యెదరు. ఈ మంత్రమును యిరవై ఒక్క రోజులలో ఒక లక్ష యిరవై అయిదువేల జపము పూర్తి చేసిన యెడల ఉద్యోగము మొదలయిన మనోభీష్టములు నెరవేరును.

---

## భూతబాధ నివారణ తంత్రములు

(1) ఆదివారమునాడు, నల్ల ఉమ్మెత్త చెట్టు వేరు తెచ్చి దండ చేతికి కట్టుకొన్న యెడల భూత ప్రేతముల బాధ హరించి పోవును. తిరిగి భూతములు ఎన్నటికీ దరిచేరవు. (2) నక్క వెల్లుల్లిపాయ రసమునందు యింగువను అరగదీసి, భూతము పట్టిన వారికి వాసన జూపించినా, లేక కొంచెము కంట్లో కలికము చేసినా భూతములు వదలి పోవును, తిరిగి ఎన్నటికీ దరిచేరవు. (3) ఆదివారమునాడు తులసిదళములు ఎనిమిది, మిరియాలు ఎనిమిది, సహదేవి చెట్టు వేరు ఒకటి తెచ్చి, ఈ మూడు కలిపి ఒక రాగి తాయెతులో పెట్టి గుగ్గిలం ధూపం వేసి, చేతికి కట్టిన యెడల భూత, ప్రేత, పిశాచ బాధలు దూరముగా తొలగిపోవును. (4) వేపాకులు, వస, యింగువ, పాము కుబుసము, ఆవాలు ఈ వస్తువులన్నీ కలిపి గుండగొట్టి పొగవేసిన యెడల అన్ని రకములయిన భూత ములు హరిపోవును. (5) భోదరసము కాయ, పెసుగువల్లేరు వేరు, ప్రత్తి చెట్టు వేరు, యీ వస్తువులన్నీ సమభాగములుగా కలిపి, గోమూత్రముతో నూరి, బ్రహ్మ రాక్షసి పట్టిన వారికి వాసన చూపిన యెడల దోషము తొలగిపోవును (6) ఆదివారము నాడు తెల్లదింటెన వేరు తీసుకువచ్చి నెయ్యితో అరగదీసి బ్రహ్మరాక్షసి పట్టినవారికి వాసన చూపిన యెడల వదలును.

# బదనిక తంత్రములు, నిధి నిక్షేపయోగాలు, బంగారు, వెండి, యోగాలు, వైద్య యోగములు

ఇంకను అనుభవసిద్ధమైన వివిధ యోగములు కలవు ఇవి చేసి నిదర్శనము చూచుకొనుడు

## దత్తాత్రేయ మంత్రము

ఈ దత్తాత్రేయ మంత్ర సిద్ధిపొంది యంత్రము ధరించిన వారికి అన్ని రకములైన తంత్రములు తప్పక సిద్ధించును.

**మూలమంత్రము :** ఓం పరబ్రహ్మ పరమాత్మ నే నమః ఉత్పత్తి స్థితి ప్రళయ కారిణే బ్రహ్మ హరి హరాయ త్రిగుణాత్మ నే సర్వ కౌతుకా నిదర్శయ దత్తాత్రేయ సమస్త తంత్రాణాం సిద్ధం కురుకురు స్వాహా.

**విధానము :** దీపావళినాటి రాత్రిగాని, గ్రహణ సమయములోగాని యీ మంత్రమును వెయ్యినూట ఎనిమిదిసార్లు ముందుగా జపించవలెను. తరువాత తంత్ర సాధన చేసిన యెడల సులభముగా సిద్ధించును.

ఈ మంత్రమును ఒక శుభదినమున తెల్ల కాగితముపై ఎర్ర చందనముతో వ్రాయవలెను. ఇట్లు వెయ్యిన్నూట ఎనిమిది యంత్రములు వ్రాసి ప్రతి యంత్రమును, గోధుమ పిండి ముద్దలో పెట్టి గోళీలవలె జాల్లో చేపలకు పడ వేయవలెను. ఇట్లు చేసిన యెడల మంత్రము సిద్ధియగును. తరువాత యీ మంత్రమును ఒక తెల్ల కాగితముపైన ఎర్ర చందనముతో వ్రాసి ధూప. దీప. నైవేద్యములు యిచ్చి పూజించి రాగి తాయిజులో మడచి పెట్టి కుడి చేతికి కట్టుకొనవలెను. దత్తాత్రేయ మంత్రమును సిద్ధి పొంది యీ యంత్రమును ధరించిన వారికి సర్వతంత్రములు అతి సులభముగా సిద్ధించును. ఏ తంత్రములు సిద్ధించని చాలా మంది విరక్తి చెందియున్నారు. కాని వారు పైన పేర్కొనబడిన దత్తాత్రేయ మంత్ర యంత్రములను సిద్ధింప చేసుకున్న వారికి సర్వతంత్రములు సిద్ధించును. ప్రాచీన గ్రంథముల నుండి ఈ రహస్యము బైటపెట్టబడి యున్నది. గాన ఏతంత్రముపైనను సాధించదలచిన వారు ముందుగా ఈ దత్తాత్రేయ మంత్రసిద్ధి చేసికొని యంత్రమును ధరించి తంత్రసాధనలు చేసికొనిన యెడల అన్ని రకములైన తంత్రములు అతి సులభముగా సిద్ధించును.

## లక్ష్మీ ప్రాప్తికి మామిడి బదనిక మంత్రము

ఆశ్వయుజ బహుళ చతుర్దశినాడు బదనికవున్న మామిడి చెట్టువద్దకు వెళ్ళి ఆ చెట్టుపైనున్న బదనికకు కుంకుమ అక్షతలతో నిమంత్రణము చెప్పి దీపావళినాడు సూర్యోదయమునకు పూర్వమే ఆ చెట్టుదగ్గరకు వెళ్ళి ఆ బదనికకు పాలు, పంచదార, పానకము బలియిచ్చి దేవదారు ధూపమువేసి పూజించవలెను. తరువాత ఆ చెట్టుకు నమస్కారముచేసి గోరి పెట్టుకొని సూర్యోదయమునకు పూర్వమే ఆ బదనికను తీసుకొనిరావలెయును. రాత్రి దీపావళి పూజచేసి ఏకాంతస్థలములో కూర్చుండి ఆ బదనికకు పంచోపచార పూజ గావించి మిగిలిన రాత్రి అంతా ఈ క్రింది మంత్రమును జపించు చుండవలెను.

**మూలమంత్రము :** ఓం వృక్షరాజ మహాశ్రీమన్ విష్ణుస్వరూ నూతన, ధనధాన్య సమృద్ధిం శ్రీం దేహిమే అచలాం ప్రభో.

మరునాడు ఉదయము స్నానముచేసి ఆ బదికకు ధూపము వేసి ఒక రాగి లేక బంగారు తాయిజులో పెట్టి ఆ తాయిజును కంఠము నందుగాని, కుడి చేతికిగాని కట్టుకొనిన యెడల లక్ష్మీ ప్రాప్తికలుగును. ధనము అక్షయముగా నుండును. లక్ష్మీమంత్ర సంపుటితో విష్ణుసహస్రనామ పారాయణ నూటఎనిమిదిసార్లు చేసి పదిరోజులు పోయిన తరువాత హోమము కూడా చేసినయెడల ఈ తంత్రముయొక్క బలము ఒక సంవత్సరము వరకు నిలచియుండును.

## జీవనోపాధి దొరుకుటకు రావి తంత్రము

సాధకుడు తనకు చంద్రబలము కలిగిన రోజున నవమి, లేక నవమి లేక చతుర్దశితో కూడి వచ్చిన శనివారము నాటికి ఒకరోజు ముందు అనగా శుక్రవారమునాడు బదనికతో వున్న రావిచెట్టు దగ్గరకువెళ్ళి కుంకుమాక్షతలతో నిమంత్రణము చెప్పివచ్చి శనివారం నాడు సూర్యోదయము నకు ముందే ఆచెట్టుకు కొంకాయ గొట్టి యథాశక్తిగా నైవేద్యము పెట్టి ఆ బదనికను మరల రక్షతిని వచ్చే వరకు అనగా నవమి నవమి లేక చతుర్దశితో కూడిన శనివారము వచ్చేవరకు ప్రతినిత్యము పంచోపచారములచే పూజించు చు అత్తి ఆదివారం ఈ క్రింది మంత్రమును మూడుసార్లు జపించవలెయును.

**మూలమంత్రము :** మూలే బ్రహ్మా విష్ణుః మధ్యే శాఖాగ్రే మహేశ్వరః, పత్రేపత్రే దేవానాం వృక్షరాజనమోస్తుతే వృక్షరాజ సముద్భవం మహాకాయ శిఖారిణీయ, సర్వరోగ వినాశాయ దేహి హాంహామ హామయమ్.

ఈ మంత్రముతో పైన పేర్కొనబడిన రావిబదనికను అభిమంత్రించి, గుగ్గిలము ధూపము వేసి రాగితాయిజులో పెట్టి కుడి చేతికి కట్టుకొనిన యెడల కష్టము లేకుండా జీవనోపాధి లభించును.

## ధాన్య వృద్ధికి మోదుగ బదనిక తంత్రము

హోళీ పండుగకు ఒకరోజు ముందు సంధ్యా సమయ మున మోదుగ చెట్టు దగ్గరకు వెళ్ళి కుంకుమాక్షతలతో నిమంత్రణము చెప్పి ఆ మరునాడు సూర్యోదయమునకు ముందుగానే ఆ చెట్టు పైన బదనికను పువ్వులు అక్షతలతో పూజించి దేవదారు ధూపము వేసి, లడ్డూలు బలియివ్వవలెను. తరువాత ఆ బదనికను తీసుకువచ్చి ఈ క్రింది మంత్రముచే 108 సార్లు అభిమంత్రించవలెను.

**మూలమంత్రము :** ఓం వృక్షరాజసమ్భూత స్వమంత్రేషులో కేమ వర్తసే, కురుష్వ ధాన్యవృద్ధిం త్వం క్షేత్రే కోషాఘవర్తినే.

ఈ మంత్రముచే అభిమంత్రించబడిన మోదుగ బదనికను అన్నము తినే చోట స్థాపించిన ఆ యింటిలో ధాన్యము సమృద్ధిగా నుండును.

## నిధులు కనబడుటకు మేడిబదనిక తంత్రము

గ్రహణము పట్టేరోజుకు ఒకరోజు ముందుగా మేడిచెట్టు అనగా అత్తిచెట్టుపై నుండే బదనికకు నిమంత్రణ చెప్పి వచ్చి గ్రహణము రోజున సూర్యోదయమునకు ముందుగానే ఆ బదనికకు పాలు, పంచదార, పానకము బలి యిచ్చి నమస్కరించి బదనికను పీకి తీసుకురావలెయును. తరువాత గ్రహణము మొదలయినప్పుడు ఆబదనికకు పంచోపచార పూజ గావించి లక్ష్మీ గాయత్రిని తామర గింజల మాలతో గ్రహణము విడుపు పర్యంతము జపించుచుండవలెను. ఈ మేడి బదనికను బంగారు తాయిజులో పెట్టి శిరస్సున ధరించిన ఎడల భూమిలో వుండే నిధులు కనబడి చేతికి లోనగును.

## ధనధాన్య వృద్ధికి చింత బదనిక తంత్రములు

మూలమంత్రము : ఓం నమో ధనదాయ స్వాహా.

విధానము : ఈ మంత్రమును పదివేలసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత యీ దిగువ పేర్కొనబడిన తంత్రములను ఉపయోగించుకొనవలెను. (1) చింత చెట్టుపై నుండే బదనికను శనివారమునాడు సాయంత్రము నిమంత్రణ చెప్పి అనగా ఆహ్వానము చెప్పి పుష్యమీనక్షత్రము ఆదివారము ప్రాతఃకాలమందు తీసుకొని రావలయును. ఆ బదనికకు పంచోపచార పూజగావించి, పై మంత్రముచే వేయిసార్లు అభిమంత్రించి ధాన్యపు కొట్లలోగాని, ధనపు పెట్టెలోగాని, పెట్టి వుంచినయెడల లక్ష్మీవృద్ధి కలుగును. (2) పైన పేర్కొనబడిన విధముగానే పుష్యమీనక్షత్రమునాడు తెచ్చిన దానిమ్మ బదనికనుగాని, బూరుగుబదనికనుగాని, ధనధాన్య స్థానముల యందు పెట్టివుంచిన యెడల ధన ధాన్యములు వృద్ధి జెందుచుండును. (3) పై విధముగానే హస్తా నక్షత్రమునాడు వావిలి బదనికను తీసుకువచ్చి ధాన్యపు కొట్టులో పెట్టి వుంచిన యెడల ధాన్యము వృద్ధి చెందుచుండును (4) పైన పేర్కొనబడిన విధముగానే భరణీ నక్షత్రమునాడు దర్భ చెట్టుపై వుండే బదనికను తీసుకొని వచ్చి యింట్లో పెట్టిన యెడల ధనధాన్యములు సంపూర్ణముగా వృద్ధి జెందును. 5) పైన పేర్కొనబడిన విధముగానే రోహిణీ నక్షత్రమునాడు మేడి బదనికను తీసుకువచ్చి యింట్లో స్థాపించిన యెడల ధనధాన్యములు నిస్సందేహముగా వృద్ధి జెందును.

## అదృశ్యకరణ బదనిక తంత్రములు

మూలమంత్రము : ఓం నమో భగవతే రుద్రాయ మృతార్కమధ్యే సంస్థితాయ మమ శరీర మమృతం కురు కురు స్వాహా.

విధానము : ఈ మంత్రము పదివేల సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత యీ దిగువ పేర్కొనబడిన తంత్రములను ఉపయోగించుకొనవలెను.

(1) అనూరాధా నక్షత్రమునాడు ముళ్ళమోదుగ చెట్టుపై నుండే బదనికను తీసుకువచ్చి పై మంత్రముచే వెయ్యి వేల ఎనిమిదిసార్లు అభిమంత్రించి బుగ్గన పెట్టుకున్న యెడల సాధకుడు నిస్సందేహముగా అదృశ్యమగును (2) మృగశిరా నక్షత్రమునాడు తులసి చెట్టుపై నుండే బదనికను తీసుకువచ్చి పైన పేర్కొనబడిన మంత్రముచే వెయ్యి నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి బుగ్గను పెట్టుకొన్న ఎడల మనుష్యుడు అదృశ్యుడగును (3) భరణీనక్షత్రమునాడు ప్రత్తి చెట్టుపై నుండే బదనికను తీసుకువచ్చి పైన పేర్కొనబడిన మంత్రముచే వెయ్యి నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి చేతికి కట్టుకొన్న యెడల సాధకుడు అదృశ్యుడగును. (4) స్వాతీ నక్షత్రమునాడు వేప బదనికను తీసుకు వచ్చి పైన పేర్కొనబడిన మంత్రముచే వెయ్యినూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, ఆ బదనికను చేతికి కట్టుకొన్న యెడల సాధకుడు అదృశ్యుడగు. (5) అశ్వనీ నక్షత్రమునాడు మారేడు బదనికను తీసుకవచ్చి పైన పేర్కొనబడిన మంత్రముచే వెయ్యి నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, చేతికి కట్టుకొన్న యెడల మనుష్యుడు అదృశ్యుడగును. (6) మృగశిరా నక్షత్రమునాడుగాని, ఉత్తరాషాఢా నక్షత్రమునాడుగాని అశోక బదనికను తీసుకవచ్చి, పైన పేర్కొనబడిన మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, ఆ బదనికను చేతికి కట్టుకొన్న యెడల సాధకుడు నిస్సందేహ ముగా అదృశ్య మగును.

## వివిధ బదనిక సిద్ధులు

మూలమంత్రము : ఓం అంతరిక్షాయ స్వాహా, ఓం అంతరిక్షాయ స్వాహా.

విధానము : ఈ మంత్రమును వెయ్యి నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత ఈ దిగువ చెప్పబడిన తంత్రములోని బదనికలను పై మంత్రము నుచ్చరించుచు తీసుకుని వచ్చి ఉపయోగించుకొనవలెను. (1) కృత్తికా నక్షత్రమునాడు బొంతజెముడు చెట్టుపై నుండే బదనికను పై మంత్రము నుచ్చరించుచూ తీసుకువచ్చి చేతికి కట్టుకొన్న యెడల వాక్సిద్ధి కలుగును. (2) స్వాతీ నక్షత్రమునాడు రేగి బదనికను పై మంత్రముచ్చరించుచు తీసుకొనివచ్చి చేతికి కట్టుకొనిన ఎవరిని ఏ వస్తువు అడిగినను యిచ్చి వేయును. (3) తులసి చెట్టుపై నుండు బదనిక, మామిడి బదనిక, పల్లేరు వేళ్ళు పై మంత్రము నుచ్చరించుచూ తెచ్చి యీ వస్తువులన్నీ సమభాగములు, వీట్లో నాల్గవవంతు ఉప్పు కలిపి పాలతో నూరి తిలకమును నుదుట తిలకముగా ధరించిన యెడల రహస్యముగా యున్న వస్తువులన్నీ కనబడును. గంధర్వులు, యక్షిణిలు, యక్షులు మొదలైనవారు కనబడెదరు. ఇందుకు సందేహము లేదు. (4) ఆశ్లేషా నక్షత్రములో కూడివచ్చిన ఆదివారము సాయంత్రము కుజుడు అష్టమములో వుండే లగ్నములో దానిమ్మ గింజల రసము, తామర వేరు, పిల్లితీగెల రసము, యీ వస్తువులన్నీ కలిపి నూరి, కండ్లకు అంజనము వేసుకొనిన యెడల రహస్యముగానున్న సర్వ వస్తువులు కనబడును. (5) రోహిణీ నక్షత్రమునాడు పై మంత్రము నుచ్చరించుచూ మర్రి బదనికను తీసుకువచ్చి చేతికి కట్టుకొనిన యెడల సర్వజనులు వశ్యమయ్యెదరని విశ్వామిత్రుడు చెప్పెను. (6) ఏదైనా ఒక శుభ దినమున, అర్ధరాత్రి సమయములో మర్రిచెట్టు దగ్గరకు దిగంబరుడుగా వెళ్ళి ఆ చెట్టుపై నుండు బదనికకు, ధూప, దీప, నైవేద్యములు యిచ్చి పూజించి తెచ్చి, ఆ బదనికను చేతికి కట్టుకొన్న యెడల సర్వజనులకు ప్రియుడుగా నుండును. ఆ బదనికను యింట్లో స్థాపించిన యెడల ధనధాన్య సమృద్ధి కలుగును. ఈ తంత్రములను సిద్ధించు దత్తాత్రేయ మంత్రమును, యంత్రమును ముందుగా సిద్ధిచేసుకొనవలెను.

ఈ తంత్రములేకాదు. ఏ తంత్రములైనా సాధించుటకు ముందుగా దత్తాత్రేయ మంత్రసిద్ధి పొంది యంత్రము ధరించి ఏ తంత్రములైనా సాధించుటకు ప్రయత్నించిన యెడల తప్పక సాధ్యపడును. ఇది అనుభవసిద్ధమైన రహస్యము.

## భూమిలో ద్రవ్యనిధులు నిక్షేపములు ఎక్కడ వుండునో తెలుసుకొను విధానములు

ఏ ప్రదేశమునందు భూమి తామర పుష్పం వాసన కలిగి యుండునో ఆ స్థలమునందు నిధియుండునని తెలియవలయును. డేగలు, కాకులు, కొంగలు మొదలయిన పక్షులు ఏ ప్రదేశము నందు ఎక్కువగా సంచరించుచుండునో ఆ భూమియందు నిధివుండునని తెలియవలయును. ఏ స్థానములో కాకులు సంతోషముతో మైథునము చేయు చుండునో ఆ స్థానమునందు నిధి వుండునని తెలియవలయును. సింహము ఎక్కడ నివసించు చుండునో అక్కడ నిధి వుండునని తెలియవలయును. అనేకములగు వృక్షము లున్న ప్రదేశములో పక్షులన్నియూ ఒక చెట్టుమీద నివసించుచుండునో ఆ చెట్టు క్రింది భూమిలో నిధి వుండునని తెలియవలయును. ప్రజల యొక్క వాడుకలో లేకుండా పాడై పోయిన జీర్ణోద్యాన వనములయందు, పాడై పోయిన గ్రామముల యందు భూత, ప్రేత పిశాచాదులు ఎక్కడ నివసించుచుండునో ఆ స్థానములయందు నిధులు వుండునని తెలియవలయును. ప్రతినిత్యమూ శకునములు చేయుచున్ననూ ఏ ప్రదేశము నందు గడ్డి తెల్లవారుసరికే గుబురుగా పెరిగియుండునో ఆ స్థానము

...ందు నిధి యుండునని తెలియవలయును. ఆకురాలు కాలమందు ఏ ప్రదేశమున చెట్లు పువ్వులతో ఆకులతో పచ్చగా కలకలలాడు చుండునో ఆ స్థానమున నిధివుండునని తెలియవలయును. కొబ్బరి చెట్టు, పోకచెట్టు, తాటి చెట్టు మొదలయిన ఒకే తల గల చెట్లకు ఎక్కడైతే రెండు తలలు వేసివుండునో ఆ ప్రదేశమునందు నిధియుండునని తెలియవలయును. ఏ ప్రదేశమున చెట్టు కాలము కాని కాలములో కాయలు కాయుచున్నదో లేక విపరీతాకారములు గల కాయలను కాయునో ఆ ప్రదేశమున నిధి వుండునని తెలియ వలయును. ఏ మర్రి చెట్టుకు ఏనుగ తొండముతో సమానమైన ఆకారముగల వూడలు వేయునో మరియూ ఆ ఊడలను విరచిన రక్తమువలె ద్రవము స్రవించునో ఆ ప్రదేశమున నిధి వుండునని తెలియవలయును. ఏ మర్రి చెట్టునకు చేపాకారముగాను, జెండా ఆకారముగాను వూడలు బయలుదేరునో, ఆ మర్రిచెట్టు క్రింద ఒక లక్ష బంగారు నాణెముల విలువగల ధనము వుండునని తెలియ వలయును. ఎక్కుటకు వీలుగానట్టి తాటిచెట్టు కొబ్బరి చెట్టు మొదలయిన వృక్షములకు పైకి ఎక్కుటకు వీలు కలుగజేయునట్టి వంపులు యేర్పడియున్న ఆ చెట్టు క్రింద నిధులు వుండునని తెలియవలయును. మండు వేసవి కాలము నందలి సూర్య కిరణములచే తపింపచేయబడియూ నీరు లేకపోయినను ఏ ప్రదేశమున పచ్చగడ్డి ఒత్తుగా పెరిగి పసపసలాడుచుండునో ఆ ప్రదేశమున నిధి వుండునని తెలియవలయును. భూమియందు యే ప్రదేశమున పాములు విశేషముగా నివసించుచుండునో ఆ స్థానమున నిధి వుండునని తెలియవలయును.

పై లక్షణములను గమనించి, నిధులుండు స్థానములను తెలిసికొని ఆస్థానమున నిధి వున్నదీ లేనిదీ నిశ్చయముగా తెలుసుకొనుటకు యీ క్రింద చెప్పబడు లేపనములచే ఆ భూమిని పరీక్షించ వలయును :

భూమిలో నిధి వుండేదీ లేనిదీ తెలుసుకొనుటకు మొదటి విధానము : ఒక క్రొత్త కుండనిండా గోమూత్రమును పోసి నిధి వుండునని అనుమానించిన స్థలమునందు ఆగోమూత్రముతో నిండిన కుండను పాతి పెట్టవలయును. ఏడు రాత్రులు గడచిన తరువాత ఆకుండ పాతిన స్థలమున జాగ్రత్తగా త్రవ్వి చూడగా ఆ కుండయందలి గోమూత్రమంతయు హరించిపోయి ఆ కుండ శిథిలమైవున్న యెడల ఆ స్థానమున నిధి వుండుట నిశ్చయమని తెలిసికొనవలయును.

భూమిలో నిధి వుండేదీ లేనిదీ తెలిసికొనుటకు రెండవ విధానము : నువ్వులు, కొర్రలు, ఆవాలు, జనపగింజలు, వీటిని ఆవుపాలతో నూరి కల్కము చేసి నిధి వుండునని అనుమానించిన స్థలమున, రాత్రి సమయములో యీ లేపనమును పూసి ఇంటికి రావలయును. ఉదయము నిద్రలేచిన తరువాత వెళ్ళిచూచిన యెడల ఆ ప్రదేశమున లేపనము హరించి పోయిన యెడల ఆ స్థలములో నిధి తప్పకుండా వుండును.

భూమిలో నిధి వుండేదీ లేనిదీ తెలుసుకొనుటకు మూడవ విధానము : మర్రి చెట్టు ఆకులు, కడిమి చెట్టు ఆకులు మర్రి ఆకులు, చండ్ర చెట్టు ఆకులు, మోదు గాకులు, వీట్లను గంజితో నూరి యీ కల్కమును, ఓం నమో భగవతే రుద్రాయ కల్కేన పాంజనం దర్శయ స్వాహా ఠః ఠః, అను మంత్రముతో అభిమంత్రించి నిధివుండునని శంకించిన స్థానమున ఆ కల్కమున రాత్రిపూసి ఉదయమునవే వెళ్ళి చూడగా ఆ స్థానమున పూసిన లేపనము హరించి పోయిన యెడల ఆ ప్రదేశములో నిధి నిశ్చయముగా వుండి తీరును.

భూమిలో నిధి వుండేదీ లేనిదీ తెలుసుకొనుటకు నాల్గవ విధానము : మర్రి చెట్టు ఆకును, గానుగచెట్టు ఆకులు కొబ్బరి చెట్టు ఆకులు యీ మూడింటిని బియ్యపు కుడితితో నూరి కల్కము గావించి పై యోగములో చెప్పిన లేపన మంత్రము తో అభిమంత్రించి, రాత్రి సమయములో నిధి వుండునని అనుమానించిన ప్రదేశమున యీ లేపనమును బూయ వలయును. ఉదయమునవే చూడగా ఆ లేపనము హరించిపోయిన యెడల ఆ స్థానములో తప్పకుండా నిధి వుండును.

భూమిలో నిధి వుండేదీ లేనిదీ తెలుసుటకు ఐదవ విధానము : అక్షతమైన మారేడు చెట్టుయొక్క ఆకులను తీసుకువచ్చి (అనగా అంతకుముందు ఒక ఆకు కూడా త్రుంపబడకుండా ఒక కొమ్మ కూడా కొట్టబడకుండా వున్న మారేడు చెట్టు) ఆ ఆకులను గంజితో నూరి నిధి యుండునని శంకింపబడిన స్థానమునందు సంధ్యా సమయములో ఆ లేపనమును పూయ వలయును. మరియూ, ఆప్రదేశమున పార్వతితో కూడియున్న కిరాత వేషధారి యగు శంకరుని పూజించి నెయ్యి, గుగ్గిలముతో ధూపమును సమర్పించవలయును. ఉదయమున వచ్చి చూడగా ఆ ప్రదేశమున పూసిన మారేడు ఆకుల లేపనము రంగుమారి విచ్ఛిన్నమైయున్నచో ఆ స్థానమున నిధియున్నదని నిశ్చయముగా తెలుసుకొనవలెను.

## నిధి దర్శన దీప ప్రక్రియ

విధానము : మణిశిల, గంధకము, తాళకము యీ మూడు వస్తువులను సమముగా చేర్చి చూర్ణించి తెల్లజిల్లేడు దూదితో కలిపి వత్తి వత్తినిగా చేసి పైన తామరతూడులోని నారతో చుట్టబెట్టి మాల్కంగినీ నూనెలో ఆ వత్తిని వేసి దీపము వెలిగించి భూమిలో ధనమున్నదని అనుమానముగల స్థలములో సాధకుడు ఆ దీపమును చేతితో పట్టుకొని తిరుగగా ఎక్కడ ఆ దీపము శిఖ క్రిందికి వంగునో అక్కడ భూమిలో ధనమున్నదని తెలుసుకొనవలెను.

## నిధి దర్శనాంజనము

మూలమంత్రము : ఓం నమో భగవతే రుద్రాయ ఉడ్డామరేశ్వ రాయ శిలిశిలి భూమిరే నాదదేతాటీ స్వాహా.

విధానము : ఈ మూలమంత్రమును పదివేలసార్లు జపించిన సిద్ధించును. సాధకుడు ముందుగా మంత్రసిద్ధిని చేసుకొని, ఆవిసెచెట్టు చెక్కతో పాదుకలను చేయించు కొనవలెను. తరువాత తామరపువ్వు కాడలను తెరుకు రసములో ఏడురోజులు భావన చేసి పిదప బాగా ఎండబెట్టి, ఆ తామరతూళ్ళ నారతో వత్తిని చేసి, పూడుగ నూనె యందు వేసి దీపము వెలిగించి ఆ దీపపు పొగను కాటుక పట్టి ఉంచుకొనవలెను. తరువాత సాధకుడు నూట ఎనిమిదిసార్లు మూలమంత్రమును జపించి పాదుకలను తొడుగుకొని కాటుకను పెట్టుకొని భూమిలో ధనమున్నదని అనుమానముగల చోట చూచిన యెడల భూమిలోగల నిధులు నిక్షేపములు కనిపించును.

## నిధి సర్ప దూరీకరణ లేపనము

విధానము : భూమియందలి నిధులను నిక్షేపములను త్రవ్వుచున్నప్పుడు భయంకర సర్పములు వచ్చుచున్న యెడల ఆ సర్పముల వలన బాధ లేకుండా ఆ సర్పములు తొలగిపోవుటకు సాధకుడు తన పాదములకు జిల్లేడు వేరు, గన్నేరు వేరు, వసచెట్టు వేరు కలిపి నూరిన కల్కమును రాసుకొనవలెను. ఇటుల చేసిన యెడల సర్పములు సాధకుని దరిచేరవు.

## నిధి దర్శన ధూపము

మూలమంత్రము : ఓం నమో విఘ్న వినాశాయ నిధి దర్శనం కురు కురు స్వాహా.

విధానము : ఈ మూల మంత్రమును పదకొండువందల సార్లు జపించిన సిద్ధించును. సాధకుడు ముందుగా మంత్రసిద్ధి చేసుకొని తరువాత దిరిసెన చెట్టుకాయ, పూవు, ఆకు, బెరడు, వేరు తెచ్చి ఆవనూనెలో వేసి, పక్వము చేసి, దానిలో గన్నేరు చెట్టుకాయ పూవు, ఆకు, బెరడు, వేరు, ఉమ్మెత్తగింజలు, తెల్ల గురువింద గింజలు, గుగ్గిలగూబమలము, గంధకము, మణిశిల కలిపి, మూల ఎనిమిదిసార్లు మూలమంత్రముతో అభిమంత్రించి, నిధులు నిక్షేపాలు వున్న తావున ధూపంవేసిన యెడల ఆ నిధి నిక్షేపములను కాచుకొనివున్న రాక్షసులు, భూతములు, భేతాళుడు, యక్ష రాక్షస వినాయకాది దేవ రాక్షస పన్నగులందరు తొలగిపోవుదురు. అప్పుడు సులభముగా ఆ నిధి నిక్షేపములను తీసుకొనవచ్చును.

## నిధి దర్శన తంత్రము

విధానము : ఒక నల్లని కాకిని పట్టుకొని పంజరములో పెట్టివుంచి, దానికి మూడు రోజుల వరకు ఆవు వెన్నను సేవింపచవలెను. ( ఈ మూడురోజులు ఎట్టి మేతా పెట్టకూడదు) వెన్న తినుచు, వేయుచున్న ఆ కాకి రెట్టలను తీసుకొని జాగ్రత్తగా దాచివుంచి, ఆ కాకిని వొదిలి పెట్టవలెను. ఆ రెట్టలలో నాల్గవ రోజున వత్తి కలిపి, వత్తి చేసి, ఒక మూకుడులో ఆవు నెయ్యి పోసి అందులో ఈ వత్తిని వేసి దీపం వెలిగించి ఆ పొగను కాటుక పట్టవలెను. కాటుక పట్టుచున్నప్పుడు ఓం నమో చిదా చిదాలా చక్రవతీన్ మేపిర్థం కురుకురు స్వాహా. ఈ కాటుకను కండ్లకు కాటుకగా పెట్టుకొని నిధులు వున్నవని అనుమానము కలిగిన ప్రదేశములో భూమిపై చూచిన యెడల ఎంత లోతున వున్న నిధులైనా అద్దములో తన నీడ కనిపించునటుల కనుపించును.

## నిధి దర్శనాంజనము

విధానము: అమావాస్యానంతరము మొట్టమొదటిసారి చంద్రుడు కనిపించే రోజు ఆదివారము అయివుండవలెను. అనగా శనివారం అమావాస్య అయితే ఆదివారము పాడ్యమి అయి చంద్రుడు కనిపించును. ఈ ఆదివారము రోజున మాల్కాంగిని గింజల నుండి తైలము తీసి ఆ తైలము ప్రమిదలో పోసి వత్తి వత్తి వేసి వెలిగించి, ఆ పొగను రాగిపళ్ళెముపై కాటుక పట్టవలెను. ఈ కాటుకను రాగి డబ్బీలో దాచివుంచుకొని భూమిలో నిధులు వున్నవని సందేహము గల చోట ఈ కాటుకను రాత్రిపూట కండ్లకు పెట్టుకొని చూచిన యెడల అద్దములో కనిపించినటుల ఎంత లోతునవున్న నిధులైనా కనిపించును.

## నిధులున్నట్లు తెలుసుకొనుటకు

విధానము : కాటుక పిట్టలు మైథునము చేయుచున్న తావుల యందు భూమిలో నిధులుండును. ఇందుకు సందేహము లేదు. కాటుక పిట్టలు రెట్టవేయు చోటునందు నేలలో మొగ్గలుండును. త్రవ్వి చూచుకొనిన యెడల నిదర్శనముగా కనిపించును.

## బంగారము వెండిచేసే వివిధ యోగములు

### స్వర్ణదాయిని జ్వాలాముఖీ మంత్రము

మూలమంత్రము : ఓం హ్రీం జ్వాలాముఖీ స్వాహా.

విధానము: ఈ మంత్ర జపమును గురువారము నాడు మొదలు పెట్టవలయును. ప్రతినిత్యము రాత్రి వంటికి కొబ్బరినూనె పూసుకొని, పై మంత్రమును వెయ్యిసార్లు జపించవలయును. యిటుల యిరవై మూడు గురువారములు జరుగు పర్యంతము ప్రతినిత్యమూ జపించుచుండిన యెడల జ్వాలా ముఖీదేవి ప్రత్యక్షమై సాధకునకు ప్రతినిత్యము ఆరు బంగారు మొహరీలను తెచ్చి యిచ్చుచుండును.

## స్వర్ణదాతాశాస్త్ర మంత్రము

### బంగారమును యిచ్చే మంత్రము

మూలమంత్రము : ఓం రైవ తే నమః

విధానము : ఓం అస్యశ్రీ శాస్త్ర పంచాక్షరీ మంత్రస్య రైవత ఋషిః, పంక్తిచ్ఛందః, శాస్త్రాదేవతా, మమ సువర్ణలాభార్థం జపే వినియోగః

అంగన్యాసః రై హృదయాయనమః వతిశిరసేస్వాహా, తే శిఖాయైవషట్, న కవచా యహుం, మః అస్త్రాయఫట్ ఏవ మేవ కరన్యాసః, పై మంత్రమును, ప్రతి నిత్యమూ పదకొండు వందల ఎనిమిదిసార్లు చొప్పున జపించుచూ శివావతారమైన శాస్త్రదేవతకు ప్రతినిత్యమూ ఉదకతర్పణము, పెరుగన్నము బలియిచ్చుచుండిన యెడల ఒక లక్షజపము పూర్తి అయేటప్పటికి మంత్రము సిద్ధించును. ఈ మంత్ర సిద్ధిని పొందిన సాధకునకు శాస్త్రదేవతా ప్రసాదము వలన ప్రతిదినమూ బంగారము లభించుచుండును. మరియూ సర్వవ్యాధిహరము సర్వోపద్రవ శాంతి కలుగుచుండును.

## బంగారము చేసే యోగము

విధానము : తాళకము ఒక తులము, హేమమాక్షికము ఒక తులము, ఇంగిలీకము ఒక తులము, మణిశిల ఒక తులము, పాదరసము అరతులము – యీ వస్తువుల నన్నింటిని కల్వములో వేసి పిచ్చి కుసుమ చెట్టు రసములో మూడు రోజులు మర్దించి, ఆ కల్కమును రాగిని సమభాగముగా కలిపి కరిగి వెండిచే తేయబడిన పల్చటి రేకులకు పట్టించి, ఆరేకులను ప్రమిదలో బెట్టి గట్టిగామూడు వీల మన్నులు యిచ్చి, మూడు గజపుటములు వేసిన యెడల బంగారముగును. (గజపుటమనగా గజం లోతు, గజం పొడుగు, గజం వెడల్పుగల గొయ్యి త్రవ్వి అందులో పిడకలు పేర్చి, మధ్యన ప్రమిదల సంపుటమును పెట్టి పుటము వేయుట) పొంగిశీతలమున తీసి చూచిన బంగారముగును.

## బంగారము చేసే యోగము

### (అనేక వ్యాధుల నివారణకు)

ఈ బంగారు యోగము శ్రీ జీవదత్తసూరీశ్వర యోగిచే ఉపదేశింపబడినది. ఒక క్రొత్తకుండ తీసుకు వచ్చి అందులో ఎనిమిదిశేర్ల కాల్చిన సున్నపురాళ్ళు వేసి, ఆ రాళ్ళమధ్య రెండు డబ్బుల ఎత్తు ప్రశస్తమయిన హరిదళము ముక్కలను గుడ్డలో మూటగట్టి పెట్టవలెను. ఆ సున్నపు రాళ్ళు మునుగు నటులుగా కుండలో నీళ్ళుపోసి, ఒకరాత్రి నిలవయుంచవలయును. మరునాడుదయము నీళ్ళు పారబోయవలయును. ప్రతిరోజూ యీ విధముగా నీళ్ళు పోయుచూ మరునాడు నీళ్ళు పారపోయు చుండవలయును. ఇట్లు రెండు నెలలు చేసిన యెడల హరిదళము శుద్ధియగును. ఈకుండను పవిత్రమైన స్థలమునందుంచవలయును. అశౌచపరులపై ఎవ్వరి నీడా పడకూడదు. ఔషధము తయారుచేయు వారియొక్క నీడకూడా కుండపై పడకూడదు. తరువాత హరిదళము ముక్కలను తీసి కల్వములో వేసి, కలబంద రసముచే మూడురోజులు మర్దించవలయును. తరువాత నల్లగుంట కలగర రసముచే మూడు రోజులు మర్దించవలయును.

## మధుహార రస బంధకము

### బంగారము చేసే యోగము

విధానము : శుద్ధి చేసిన గంధకము ఒక భాగము శుద్ధి చేసి పాదరసము ఒక భాగము యీ రెంటినీ కల్వములో వేసి పుల్ల తేనెతో మూడు రోజులు మర్దించి యాకల్కమును భద్రపరుచుకొని అందొక తులము కల్కమును ఒక తులము పల్చటి వెండిరేకులకు పట్టించి మూసకుళ్ళో పెట్టి చీలమన్నులు ఇచ్చి భూమిలో ఒక వెరొకాల పాతియుంచిన యెడల ఆ వెండిరేకులు బంగారమగును. మరియూ యీ కల్కమును శరీరముపై లేపనము చేయుచుండిన యెడల గజ్జి, చిడుము, కుష్టు మొదలైన సర్వచర్మ వ్యాధులు హరించిపోవును. ఈ కల్కము లేశెత్తు అల్లకన్యముతో రెండు పిన్నములు కల్పుకొని ప్రతినిత్యమూ తినుచూవుండిన ఆయుర్వృద్ధి కలుగును.

## సర్వసిద్ధి వరతారక బంధకము

### బంగారము చేసే యోగము

విధానము : శుద్ధిచేసిన పాదరసము మూడు తులములు తారకము మూడు తులములు ఈ రెంటిని కల్వములో వేసి ఉమ్మెత్త చెట్టు సమూల రసములో మూడు రోజులు మర్దించి చక్ర యంత్రములో బంధించి పుటము వేసినయెడల పాదరసము భస్మమగును. ఈ పాదరస భస్మము ఒక గింజయు ప్రమాణము పది తులముల తగరమును కరిగించి వేసిన యెడల వెండి యగును. ఈ భస్మమునే ఒక తులము రాగి కరిగించి అందు ఒక గురిగింజెత్తు వేసిన యెడల బంగారమగును. ఈ ప్రకారమే వెండిని కరిగించి పై భస్మమును వేసిన యెడల ఆ వెండి కూడా పదహారు వన్నెల బంగారమగును.

## రసఘుటికలు సిద్ధించుటకు మంత్రము

### బంగారము చేసే యోగము

మూలమంత్రము : ఓం హ్రీం శ్రీం క్లీం హా అమృతేశ్వర భైరవాయ హుం హా క్లీం శ్రీం హ్రీం ఐం హుం ఫట్ స్వాహా హా శ్రీం హ్రీం ఐం.

విధానము : శ్రీ సదాశివుని ధ్యానించి పైన చెప్పిన ఐదవ అమృతేశ్వర మంత్రమును ప్రతినిత్యమూ వెయ్యిసార్లు చొప్పున జపించుచూ యథాశక్తిగా భైరవునకు నైవేద్యము పెట్టు చుండవలెను. ఇట్లు నలభై దినములు చేసిన యెడల మంత్రము సిద్ధించును.

ఫలము : ఈ అమృతేశ్వర భైరవ మంత్రము సర్వ సిద్ధులను ప్రసాదించును. మరియూ యీ మంత్రము [illegible] సిద్ధి యగును. ఈ మంత్రముచేత వెయ్యిసార్లు ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన పాదరసము ఘుటికయగును. ఈ ఘుటికను నోటి యందు ధరించినయెడల పిల్ల ప్రాణము స్త్రీ లాభము. స్త్రీ వశ్యము కలుగ జేయును. మరియూ ఈ రస ఘుటికనే పుటము వేసి భస్మ మొనరించి రాగి కరిగించిన బంగారమున్నూ, తగరము కరిగించిన వెండియున్నూ తయారగుచుండును.

## రససిద్ధిప్రద శ్రీ భైరవ మంత్రము

### బంగారము చేసే యోగము

మూలమంత్రము : "ఐం హ్రీం శ్రీం క్లీం హాః శ్రీ భైరవః"

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము వెయ్యి సార్లు ఎనిమిదిసార్లుగాని, యథాశక్తిగాని జపించుచు ఒక లక్ష జపము పూర్తి చేసినయెడల సిద్ధించును. శ్రీ సదాశివుని ధ్యానించి యథాశక్తిగా నైవేద్యము పెట్టుచుండవలయును.

ఫలము : ఈ మంత్రముచే పదివేలసార్లు ఎనిమిదిసార్లు అభిమంత్రించబడిన పాదరసము లక్ష్మీ ఘుటిక యగును. ఘుటికను కంఠమునందు ధరించిన యెడల సర్వ వ్యాధులు హరించి ఆరోగ్యము కలుగును. యీ ఘుటిక శరీరముపై నున్నంతవరకు భూత, ప్రేత పిశాచాదులు దరిచేరకుండును. ఈఘుటికనే భస్మమొనరించి రాగి కరిగించి వేసినయెడల బంగారమగును. తగరమును కరిగించి వేసిన యెడల వెండిగాను మారుచుండును. ఇందుకు సందేహములేదు.

## వివిధ శ్రీ కృష్ణ మంత్రములు

దశావతారములలో అత్యద్భుతమైన లీలలతో కూడి యుండి అనుసరించే గాక ప్రపంచ ప్రజల కందరకు భారతీయ సనాతన ధర్మనిశ్చలతను సుబోధక మొనర్చుటకై అర్జునుని నిమిత్తముగా జేసుకొని శ్రీ మద్భగవద్గీతను మానవాళికి ప్రసాదించిన శ్రీ కృష్ణునిపేరును వినని వారుండరు. అది అత్యద్భుతమైన చిత్ర విచిత్రములతో కూడియున్న అవతారము. ఆయన జీవిత చర్యలు లక్షణము, లోకకళ్యాణము, పవిత్రనిలయము, పరిపూర్ణ మానవ సంతతమునై యున్నది. మానవ జీవితవిధానమునకు లోపాల మొనర్చు తలంపుతో అతడు మన్నించుటకు పూనుకొనని జీవిత రంగము ఏదీ వుండదు. వుండబోదు. అని నిర్ద్వంద్వముగా చెప్పవచ్చు అట్టి శ్రీకృష్ణభగవానుని ఆరాధించి జీవితమును సర్వతోముఖముగా వికాసవంత మొనర్చుకొనగల సౌభాగ్యము చేకూర్చగల వివిధ శ్రీకృష్ణమంత్రములను ఈ దిగువను వివరించుచు న్నాము. ఇవి అన్నియునూ మంత్రసిద్ధమైన మంత్రములుగనుక గాక పాఠకుల కోర్కెలను నెరవేర్చగల్గినవై యున్నవి. ఈ మంత్రములలో దేనిని 'కర్తరి - గౌప్యతి. అని తలంచరాదు. వీటిలో ఏ ఒక్క మంత్రమునైననూ తమ యిష్టానుసారము జపించవచ్చును. తమ యిష్టమువచ్చిన మంత్రమును ఒక లక్షజపము చేసినచో మంత్రసిద్ధియగును. ఇవ్వన్నిటికి మంత్రములకు అన్నింటికీ సంకల్పము, అంగన్యాసము కరన్యాసాదులు ఒకేరీతిగా చేసుకొనవలెను.

సంకల్పము : ఓం అస్యశ్రీ శ్రీకృష్ణమంత్రస్య । నారద ఋషిః । గాయత్రీ ఛందః । శ్రీ కృష్ణ దేవతా ః చతుర్విధ పురుషార్థ సిద్ధయే జపే వినియోగః ।

అంగన్యాసము : ఓం నారద ఋషయేనమః శిరసి । గాయత్రీ ఛందసే నమః ముఖే । ఓం శ్రీ కృష్ణ దేవతాయైనమః హృదయే ।

కరన్యాసము : ఓం క్లాం అంగుష్ఠాభ్యాం నమః । ఓం క్లీం తర్జనీభ్యాం స్వాహా ఓం క్లూం మధ్యమాభ్యాం వషట్ - ఓం క్లైం అనామికాభ్యాం హుం ఓం క్లౌం కనిష్ఠికాభ్యాం వౌషట్ ఓం క్లః కరతల కరపృష్ఠాభ్యాం ఫట్

హృదయాది న్యాసము : ఓం క్లాం హృదయాయనమః । ఓం క్లీం శిరసే స్వాహా । ఓం క్లూం శిఖాయైవషట్ । ఓం క్లైం కవచాయహుం ఓం క్లౌం నేత్రత్రయాయ వౌషట్ । ఓం క్లః అస్త్రాయ ఫట్ ।

మంత్రములు : 1) "ఓం కృః" 2) "ఓం కృష్ణ" 3) "ఓం క్లీం కృష్ణ" 4) "ఓం క్లీం కృష్ణాయ", 5) "ఓం కృష్ణాయనమః" 6) "ఓం క్లీం కృష్ణాయ క్లీం", 7) "ఓం గోపాలాయ స్వాహా", 8) "ఓం క్లీం కృష్ణాయ స్వాహా" 9) "ఓం క్లీం కృష్ణాయ నమః", 10) "ఓం కృష్ణాయ గోవిందాయ", 11) "ఓం శ్రీం హ్రీం క్లీం కృష్ణాయ" 12) "ఓం క్లీం కృష్ణాయ గోవిందాయ", 13) "ఓం దధి భక్షణాయ స్వాహా" 14) "ఓం సుప్రసన్నాత్మ నేనమః" 15) "ఓం క్లీం కృష్ణాయ గోవిందాయ క్లీం" 16) "ఓం క్లీం గ్లౌం శ్యామలాంగాయనమః" 17) "ఓం బాల వపుషే కృష్ణాయ స్వాహా", 18) "ఓం బాల వపుషే క్లీం కృష్ణాయ స్వాహా" 19) "ఓం గోకుల నాథాయనమః" 20) "ఓం గోపీ జనవల్లభాయ స్వాహా", 21) "హ్రీం శ్రీం క్లీం గోపీ జనవల్ల భాయ స్వాహా", 22) "శ్రీం హ్రీం క్లీం గోపీ జనవల్లభాయ స్వాహా", 23) "క్లీం హ్రీం శ్రీం గోపీ జనవల్ల భాయ స్వాహా" 24) "ఓం నమోభగవతే శ్రీ గోవిందాయ" 25) "ఓం శ్రీం హ్రీం క్లీం గోపీజన వల్లభాయ స్వాహా క్లీం హ్రీం శ్రీం", 26) "ఓం శ్రీం హ్రీం క్లీం కృష్ణాయ గోవిందాయ స్వాహా", 27) "ఓం శ్రీం హ్రీం క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా".

## అష్టాదశాక్షర మంత్రము

సంకల్పము : అస్య శ్రీ శ్రీకృష్ణ మంత్రస్య । నారద ఋషిః । గాయత్రీ ఛందః । శ్రీ కృష్ణ । దేవతా । క్లీం బీజం । స్వాహా శక్తిః । చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థే జపే వినియోగః

అంగన్యాసము : ఓం నారద ఋషయేనమః శిరసి । ఓం గాయత్రీ ఛందసే నమః ముఖే । శ్రీ కృష్ణదేవతాయై నమః హృది ఓం క్లీం ఓం బీజాయనమః గుహ్యే । ఓం స్వాహా శక్తయే నమః పాదయోః । వినియోగాయనమః సర్వాంగే ।

ఓం క్లీం అంగుష్ఠాభ్యాంనమః । ఓం కృష్ణాయ తర్జనీ భ్యాం నమః ఓం గోవిందాయ మధ్యమాభ్యాంనమః । ఓం గోపీజన అనామికాభ్యాంనమః । ఓం వల్లభాయ కనిష్ఠికా భ్యాంనమః । ఓం స్వాహా కరతల కరపృష్ఠాభ్యాంనమః ।

ఓం క్లీం హృదయాయనమః । ఓం కృష్ణాయ శిరసేస్వాహా ఓం గోవిందాయ శిఖాయైవషట్ । ఓం గోపీజన కవచాయ హుం ఓం వల్లభాయ నేత్రత్రయాయ వౌషట్ । ఓం స్వాహా అస్త్రాయఫట్ ।

మంత్రము : "ఓం క్లీం కృష్ణాయ గోవిందాయ । గోపీజనవల్లభాయ స్వాహా" ।

విధానము : ఈ మంత్రమును 1) విద్య లేదా జ్ఞాన ప్రాప్తికి గాను 11 లక్షలు, 2) విపత్తుల నుండి రక్షణ పొందుటకుగాను 1 లక్ష, 3) లభిపోయిన వని పూర్తిఅగుటకుగాను 1 లక్ష 4) సంగీత కళా నైపుణ్యము లభించుటకుగాను 1 లక్ష 5) విద్యుత్సమాజములో ఆదరము పొందుటకుగాను 1 లక్ష 6) జ్వరము అపస్మారకము మొదలుగాగల వ్యాధుల నివారణకుగాను 1 లక్ష, 7) శత్రువును ఓడించుట లేదా కోర్టు వ్యవహారములలో విజయము లభించుటకు గాను 1లక్ష 8) ధనసంపదలు లభించుటకుగాను 1 లక్ష 9) అవివాహిత కన్యకు తగిన వరునితో వివాహము జరుగుటకు గాను 2 లక్షలు 10) మేధా శక్తి, కవిత్వము చెప్పగల శక్తి లభించుటకు గాను 1లక్ష 50వేలు 11) ఆధ్యాత్మిక విద్య లేదా తత్వజ్ఞానము లభించుటకుగాను 11 లక్షలు 12) అఖండ ఐశ్వర్యము, యశస్సు, పదవి లభించుటకు గాను 10 లక్షలు 13) సంతానము కలుగుటకు గాను 2 లక్షలు 14) సంసార సాగరము నుంచి మోక్షం పొందుటకు 21 లక్షలు మంత్రజపము చేయవలసియున్నది. ఇలాంటి ఏదో ఒక కోరికతో ఈమంత్రజపము చేయువారు సంకల్పములో 1 చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థే – అని వున్న చోటున ఆ వాక్యమును తొలగించి తాము ఏ కోరికతో జపముచేయుచున్నారో ఆ కోరికను అవ్వట తెల్పవలసియున్నది.

నిష్కామ భావముతో ప్రత్యేక కోరికలు లేకుండా ఈ మంత్ర జపము చేయుచున్నచో అంతఃకరణ శుద్ధి లభించి భగవత్ప్రాప్తి కలుగును. భగవత్ప్రేమ లభించుటకై ఈ మంత్రజపమును సర్వకాల – సర్వావస్థలయందును మానసికముగ చేయుచుండవచ్చును. దీనికి పవిత్రత అపవిత్రత మొదలుగాగల దోషములు ఏవీలేవు. నడుచుచూ, తిరుగుచూ, కూర్చుని, పడుకొని ఏస్థితిలో వున్నప్పటికి మానసికముగా జపించవచ్చును.

## ద్వావింశత్యక్షర మంత్రము

సంకల్పము : అస్య శ్రీ శ్రీకృష్ణద్వావింశత్యక్షర మంత్రస్య । నారద ఋషిః । గాయత్రీ ఛందః । విద్యా దాతా గోపాలో దేవతా క్లీం బీజం । ఐం శక్తిః విద్యా ప్రాప్త్యర్థే జపే వినియోగః

అంగన్యాసము : ఓం నారద ఋషయేనమః శిరసి । ఐం గాయత్రీ ఛందసే నమః హృది । ఓం క్లీం బీజాయనమః గుహ్యే ఓం ఐం శక్తయే నమః పాదయోః వినియోగాయనమః సర్వాంగే ।

కరన్యాసము : ఓం ఐం క్లీం కృష్ణాయ అంగుష్ఠాభ్యాం నమః । ఓం హ్రీం గోవిందాయ తర్జనీభ్యాం స్వాహా । ఓం శ్రీం గోపీజన మధ్యమాభ్యాం వషట్ । ఓం వల్లభాయ అనామికాభ్యాం హుం ఓం స్వాహా కనిష్ఠి కాభ్యాం ఫట్ । ఓం సౌః కరతలకరపృష్ఠాభ్యాం నమః ।

హృదయాది న్యాసము : ఓం ఐం క్లీం కృష్ణాయ హృదయాయనమః ఓం హ్రీం గోవిందాయ శిరసే స్వాహా । ఓం శ్రీం గోపీజన శిఖాయై వషట్ । ఓం వల్లభాయ కవచాయ హుం । ఓం స్వాహా నేత్ర త్రయాయ వౌషట్ । ఓం సౌః అస్త్రాయ ఫట్ ।

మంత్రము : "ఓం ఐం క్లీం కృష్ణాయ హ్రీం గోవిందాయ శ్రీం గోపీజనవల్లభాయ స్వాహా సౌః

విధానము : ఈ మంత్రమును నాల్గులక్షలు జపము చేసినచో మంత్రసిద్ధియగును. ఈ మంత్రజపము చేయు వ్యక్తికి ఒక విలక్షణ మైన ప్రతిభ లభిస్తుంది. చూడకుండాను చదువకుండాను ఆ వ్యక్తి శాస్త్రములు కూడా అనర్గళముగ చెప్పగలడు.

## ద్వాదశాక్షర మహామంత్రము

సంకల్పము : ఓం అస్య శ్రీ శ్రీ కృష్ణ మంత్రస్య । ప్రజాపతి ఋషిః । గాయత్రీ ఛందః । వాసుదేవో దేవతా । చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థే । జపే వినియోగః ।

అంగన్యాసము : ఓం ప్రజాపతయే నమః శిరసి । ఓం గాయత్రీ ఛందసేనమః ముఖే ఓం వాసుదేవాయ దేవతాయైనమః హృది వినియోగాయనమః సర్వాంగే ।

కరన్యాసము : ఓం అంగుష్ఠాభ్యాంనమః ఓం నమః తర్జనీభ్యాంనమః ఓం భగవతే మధ్య మాభ్యాం వషట్ । ఓం వాసుదేవాయ అనామికాభ్యాంహుం । ఓం నమో భగవతే కనిష్ఠికాభ్యాం వౌషట్ వాసుదేవాయ కరతల కరపృష్ఠాభ్యాం ఫట్ ।

హృదయాది న్యాసము : ఓం హృదయాయనమః । ఓం నమః శిరసే స్వాహా । ఓం భగవతే శిఖాయైవషట్ । ఓం వాసుదేవాయ కవచాయ హుం । ఓం నమో భగవతే వాసుదేవాయ అస్త్రాయ ఫట్ నేత్ర త్రయాయ వౌషట్ ।

మంత్రము : "ఓం నమో భగవతే వాసుదేవాయ"

విధానము : ఈ మంత్రము కల్పవృక్షము లాంటిది. శ్రీకృష్ణ భక్తులు ప్రతిరోజు యీ మంత్రమును జపించుచుందురు. ఈ మంత్రము సమస్తమనోవాంఛలను నెరవేర్చును. పన్నెండు లక్షలు జపము చేసినచో ఈ మంత్రము సిద్ధియగును.

## తదితర సుప్రసిద్ధ శ్రీ కృష్ణ మంత్రములు

1. ఓం ఐం క్లీం హ్రీం శ్రీం గోపీ జనవల్లభాయ స్వాహా
   (నాలుగు లక్షలు జపము చేసినచో యీ మంత్రము సిద్ధియగును.
2. ఓం నమో భగవతే నంద పుత్రాయ
   ఆనంద వపుషే గోపీజనవల్లభాయ స్వాహా ।
   (ఒక లక్ష జపమువల్ల సమస్త వస్తువులు లభించును)
3. "ఓం దేవకీ సుత గోవింద వాసుదేవ జగత్పతే ।
   దేహి మే తనయం కృష్ణంత్వా మహంశరణం గతః"
   ఈమంత్రమును ఒక లక్ష జపముచేసినచో మంత్ర సిద్ధియగును. ఈ మంత్ర జపమువల్ల వంధ్య స్త్రీకికూడా పుత్రసంతతి కలుగును.
4. "ఓం కృష్ణ కృష్ణ మహాకృష్ణ సర్వజ్ఞత్వం ప్రసీదమే ।
   రమారమణ విద్యేశ విద్యామాశు ప్రయచ్ఛమే"
   ఈ మంత్రమును తులసిమాలతో ఒక లక్ష జపము చేసినచో మంత్రసిద్ధి యగును. ఎంతటి మూర్ఖుడు కూడా యీ మంత్ర జపమువల్లమహాపండితుడు, విద్వాంసుడు కాగలడు. ఈ మంత్రజప ప్రభావమువల్లనే కాళిదాసు లోకప్రసిద్ధిగల మహాకవి కాగలిగెను.
5. "ఓం శ్రీ కృష్ణాయ పరబ్రహ్మణేనమః"
   ఒక లక్ష జపము చేసినచో మంత్రసిద్ధి యగును. ఇది సమస్తమైన కోరికలను నెరవేర్చుటేగాక ముక్తిని వొసంగును.

జపించవచ్చును. జపము ప్రారంభించుటకు ముందు ప్రతిరోజూ ఈ దిగువను గల రాధాస్తుతి ఒకమారు చదివి, ఆటు తరువాత రాధా మంత్రమును రోజుకు 1008 పర్యాయములు గాని, 108 పర్యాయములు గాని జపము చేయుచుండవలెను.

"రాధారాసేశ్వరీ రమ్యా రమా చ పరమాత్మను
రాసోదయా కృష్ణ కాంతా కృష్ణ వక్షస్థలే స్థితా ।
కృష్ణ ప్రాణాధి దేవీ చ మహావిష్ణో ప్రసూరపి
సర్వాద్యా విష్ణుమాయా చ సత్యా నిత్యా సనాతనీ
బ్రహ్మస్వరూపా పరమా నిర్లిప్తా నిర్గుణాపరా
బృందా బృందావనే సా చ విరజా తటవాసినీ ।
గోలోక వాసినీ గోపీ గోపీశా గోపమాతృకా
సానందా పరమానందానందనందన కామినీ ।
వృషభానుసుతా శాంతా కాంతా పూర్ణతమా చ యా
కామ్యా కలావతీ కన్యాతీర్థపూతా సతీశుభా" ।

మంత్రములు : 1) "శ్రీ రాధాయై స్వాహా". 2) "హ్రీం శ్రీ రాధాయై స్వాహా", 3) ఓం హ్రీం శ్రీం రాధికాయైనమః", 4) "రాం ఐం ఐం యం స్వాహా", 5) "ఓం హ్రీం రాధికాయై విద్మహే గాంధర్విక్యాయై ధీమహి । తన్నో రాధా ప్రచోదయాత్ ।

## వివిధ సరస్వతీ మంత్రములు

జీవితము ప్రయోజనవంతముగా సాగుటయే గాక, జీవితావసరములలో విద్య ఒకటి. ఇతర సంపదలు తరిగి పోవచ్చును. ఇండ్లు ఎత్తుకొనిపోవచ్చును. ప్రభుత్వ విధానములవల్ల నశించవచ్చును. మరి యితర కారణములవల్ల బాధలను పొందవచ్చును. అట్టి ప్రమాదములు ఏవీ లేకుండా మానవునకు సర్వకాల సర్వావస్థల యందును సత్ఫలితములను ఇవ్వగలిగినది విద్య ఒక్కటియే విద్యకు అధిష్ఠాత్రి సరస్వతీదేవి సరస్వతీ ఉపాసనవల్ల బుద్ధి కుశలత లభిస్తుంది. చదివిన విషయము జ్ఞాపకముంటుంది. బుద్ధి సూక్ష్మత లభిస్తుంది. పరీక్షలలో విజయము పొందుటకు కావలసిన తెలివితేటలు, సమయోచిత బుద్ధి లభిస్తుంది. గొప్ప విద్యావంతులు కాదలచిన వారు ఈ దిగువ మంత్రము లలో ఏదో ఒక మంత్రమును నియమ పూర్వకముగ జపించుచున్నచో విద్యాభ్యాస సఫలతను పొందగలరు.

## వాగీశ్వరీ మంత్రము

సంకల్పము : అస్య శ్రీవాగీశ్వరీ మంత్రస్య । కణ్వఋషిః । విరాట్ ఛందః । వాగీశ్వరీ దేవతా । ఆత్మ సాధ సిద్ధ్యర్థే జపే వినియోగః ।

అంగన్యాసము : ఓం కణ్వఋషయేనమః శిరసి ఓం విరాట్ ఛందసే నమోముఖే ఓం వాగీశ్వరీ దేవతాయై నమో హృదయే ఓం వినియోగాయ నమః సర్వాంగే ।

కరన్యాసము : ఓం ఐం శ్రీం అంగుష్ఠాభ్యాం నమః । ఓం సౌః తర్జనీభ్యాం నమః । ఓం వద వద మధ్యమాభ్యాం నమః । ఓం వాగ్వాదిని అనామికాభ్యాం నమః ఓం స్వాహా కనిష్ఠికాభ్యాం నమః ఏవం హృదయాదిన్యాసః

మంత్రము : "ఐం శ్రీం సౌః వద వద వాగ్వాదిన్యై స్వాహా"

విధానము : ఈ మంత్రమును ఒక లక్ష యిరవై ఐదు వేలు జపము చేసినచో మంత్రసిద్ధి యగును.

ఇతర మంత్రములు :* "వద వద వాగ్వాదిని స్వాహా" * "ఓం హ్రీం ఐం హ్రీం ఓం సరస్వత్యై నమః" * "ఐం నమః భగవతి వద వద వాగ్దేవిస్వాహా" * "ఐం విం హస్పతే అమృత ప్లవః ప్లూః" * "ఐం రుం స్వాం" * "వద వద వాగ్వాదినీ నల్లా" * శ్రీం హ్రీం సరస్వత్యై నమః * "ఓం హ్రీం వేద మాతృభ్యః స్వాహా" * "ఓం ఐం నమః" * "ఓం ఐం ఓం" * "ఓం ఐం శ్రీం సౌః" * "ఓం ఐం హ్రాం ఐం హ్రీం వదవద స్వాహా"

విధానము : ఈ మంత్రములలో ఏ మంత్రమునైన ఒక లక్ష యిరవై ఐదు వేలు జపము చేసినచో మంత్రసిద్ధి యగును

### 1. ధనప్రాప్తికి మంత్రము

మూలమంత్రము : "ఓం శ్రీం శ్రియై స్వాహా"

విధానము : ఈ మంత్రమును ప్రతిరోజూ వెయ్యి ఎనిమిదిసార్లు సార్లు చొప్పున నలభై రోజులు జపించిన సిద్ధించును. అక్కడ నుండి ప్రతిరోజూ రోజుకి నూట ఎనిమిది సార్లు చొప్పున జపించుచుండిన ఐశ్వర్యవృద్ధి కలుగును. కుబేరుని యంతవాడగును.

### 2. ధనప్రాప్తికి మంత్రము

మూలమంత్రము : "ఓం శ్రీంక్లీం హ్రీం ఉత్తిష్ఠ శ్రీ కరిస్వాహా".

విధానము : ఈ మంత్రమును ప్రతిరోజూ వెయ్యి ఎనిమిదిసార్లు చొప్పున పదకొండు రోజులు జపించిన యెడల సిద్ధించును. తరువాత ప్రతిరోజూ నూట ఎనిమిదిసార్లు జపించుకొనుచు ఉన్న యెడల ధనవృద్ధి ఐశ్వర్యప్రాప్తి సర్వశుభములు కలుగును

### 3. ధనప్రాప్తికి మంత్రము

మూలమంత్రము : "ఓం నమోదాత్ర్యై స్వాహా".

విధానము : నేలమీద గంధముతో అలికి దానిమీద కూర్చొని అర్ధరాత్రివేళ పై మంత్రమును రోజుకు వెయ్యి ఎనిమిదిసార్లు చొప్పున నలభై రోజులు జపించిన యెడల సాధకునికి అధికమైన ధనలాభము కలిగి ధనవంతుడగును.

ఈ మంత్రమును విడిచి పెట్టకుండా రోజూ నూట ఎనిమిదిసార్లు జపించుచుండిన యెడల ఐశ్వర్యవంతులయ్యెదరు.

## దారిద్ర్య నాశన కుబేరమంత్రము

మూలమంత్రము : "శ్రీం ఓం హ్రీం శ్రీం క్లీం శ్రీం క్లీం విత్తేశ్వరాయ నమః".

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము పదివందల ఎనిమిదిసార్లు చొప్పున జపించుచూ, యిరవై ఐదువేల జపము పూర్తి చేసిన యెడల కుబేరుడు సంతోషించి కోరినంత ధనము నిచ్చును దారిద్ర్యము నిస్సందేహముగా తొలగిపోవును.

## హైమవతీశ్వరీ మంత్రము

మూలమంత్రము : "ఓం హ్రీం శ్రీం హైమవతీశ్వరీ హ్రీం స్వాహా"

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము యథాశక్తి జపించుచూ యిరవై ఐదువేల జపము పూర్తి చేసిన యెడల హైమవతీ దేవి ప్రసాదము వలన గొప్ప ధనవంతులయ్యెదరు.

## కుబేర మంత్రము

మూలమంత్రము : "ఓం యక్షాయ కుబేరాయ వైశ్రవణాయ ధనధాన్య సమృద్ధిందేహి దాత్రాయ స్వాహా".

విధానము : ఈ మంత్రము ప్రతిరోజూ శివాలయములో కూర్చుండి వెయ్యి నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచుండిన యెడల కుబేర ప్రసాదమువలన సాధకునకు నిత్యము ధనము లభించుచుండును. గొప్పధనవంతులుగా నుండెదరు.

## శ్రీ లక్ష్మీ నృసింహ మంత్రము

మూలమంత్రము : "ఓం శ్రీం హ్రీం జయలక్ష్మీ ప్రియాయ నిత్య ప్రముదిత లక్ష్మీ శ్రితార్ధ దేహాయ శ్రీం హ్రీం నమః".

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము, వెయ్యి నూట ఎనిమిది సార్లు జపించుకొనుచుండినయెడల సర్వ మనోభీష్టములు నెరవేరును. అధికముగా ధనలాభము కల్గుచుండును ధనవంతు లయ్యెదరు.

## వివిధములైన శ్రీరామ మహామంత్రములు వాని ఫలితములు

శ్రీరామ బీజం 'రాం' ఓంకారముతో ముఖ్యమైనది

### ఏకాక్షర శ్రీరామమహామంత్రము – 'రాం'

భూత భవిష్యత్ వర్తమానములలో వుండే సమస్త బ్రహ్మాండములకూడా 'ఓం కారమే పర బ్రహ్మాదులు కూడా ఓం కారమే ఓం కారమే పరమాత్మ యొక్క పేరు కనుక ఓం కారమే పర బ్రహ్మము ఈ ఓం కారజపము వలన జీవుడు పర బ్రహ్మముగ మారుట 'రాం' బీజము వలన జీవుడు ఆ మహిమ్నుడగును శ్రీరాముడే పరమేశ్వరుడు కనుక 'ఓం' కారజపము వలనయెట్టి ఫలితము కలుగునో అట్లే 'రాం' బీజజపమువలన కూడా మహాఫలములు కలుగును.

### ద్వ్యక్షర రామ మహామంత్రము – 'రామ'

**విధానము :** పై రెండు మంత్రములలోను ఏ ఒక్క మంత్రమునైనా ప్రతినిత్యమూ యథాశక్తిగా జపించుచూ పన్నెండు లక్షల జపము పూర్తి చేసిన యెడల సిద్ధించును.

**ఫలితము :** ఈ మంత్రజపము వలన సాధకుని యొక్క సర్వమనోభీష్టములు నిస్సంశయముగా నెరవేరును.

### త్ర్యక్షర రామ మహామంత్రములు

**మూలమంత్రములు :** (1) ఓం రామః (2) హ్రీం రామః (3) శ్రీం రామః (4) క్లీం రామః (5) ఐం రామః 6) రాం రామః.

**విధానము :** పై మంత్రములలో ఏ ఒక్క దానినైనను ప్రతినిత్యమూ యథాశక్తిగా జపించుచూ పన్నెండు లక్షల జపము పూర్తిచేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితములు :** ఈ రామత్ర్యక్షర మంత్ర సిద్ధి వలన ఆరోగ్యము, ధనము, విద్యలు లభించును. శత్రువులపై జయమునకెరిగి సాధకుడు సర్వదా సుఖములతో ఉండగలుగును.




### చతురక్షర రామ మహామంత్రములు

**మూలమంత్రములు :**

(1) "రామచంద్ర" (2) "రామభద్ర"

**విధానము :** పై రెండు మంత్రములలో ఏ ఒక్కదానినైనను ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచూ పన్నెండు లక్షల జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ చతురక్షర మంత్రసిద్ధి వలన సాధకుని సర్వమనోభీష్టములు నెరవేరి జీవితము స్థిరముగా నడచుచుండును.

### పంచాక్షర రామ మహామంత్రము

**మూలమంత్రము :** "రామాయ నమః"

**విధానము :** ఈ మంత్రమును ప్రతినిత్యమూ యథా శక్తిగా జపించుచూ ఐదులక్షల జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ రామ పంచాక్షరి మంత్రసిద్ధి వలన శత్రువులపై విజయము లభించును. మరియూ ఆరోగ్య భాగ్యములు చేకూరును.

### షడక్షర రామ మహామంత్రము

(1) రాం రామాయనమః
(2) క్లీం రామాయ నమః
(3) హ్రీం రామాయనమః
(4) ఐం రామాయ నమః
(5) శ్రీం రామాయనమః
(6) ఓం రామాయ నమః

**విధానము :** పై షడక్షర మంత్రములలో ఏ ఒక్క దానినైనను ప్రతినిత్యమూ యథాశక్తిగా జపించుచూ ఆరు లక్షలు జపము పూర్తి చేసిన

యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ రామషడక్షర మంత్ర సిద్ధి వలన ధర్మార్థ కామ మోక్షములనెడి చతుర్విధ పురుషార్థములును నిస్సందేహముగా కలుగుచుండును. మరియూ సాధకునకు మనశ్శాంతియు సర్వమనోభీష్ట సిద్ధియూ లభించుచుండును.

## సప్తాక్షర రామ మహామంత్రములు

**మూలమంత్రము :** *(1) రామ చంద్రాయ నమః (2) రామ భద్రాయ నమః*

**విధానము :** పై రెండు మంత్రములలోను, ఏ ఒక్క దానినైనను, ప్రతినిత్యము యధాశక్తిగా జపించుచూ, ఏడు లక్షల జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ రామ సప్తాక్షర మంత్రసిద్ధి వలన సాధకుల సర్వమనోభీష్టములు సంపూర్ణముగా సిద్ధించుచుండును.

## అష్టాక్షర రామ మహామంత్రము

**మూలమంత్రము :** "ఓం రామాయ హుం ఫట్ స్వాహా"

**విధానము :** పై మంత్రమును ప్రతి నిత్యమూ యధా శక్తిగా జపించుచూ, ఎనిమిది లక్షలు జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** పైన పేర్కొనబడిన రామాష్టాక్షర మంత్ర సిద్ధి వలన, సాధకునకు అణిమాది అష్టసిద్ధులున్నూ లభించు చుండును.

## శివోరామ మంత్రములు

**మూలమంత్రములు :** *(1) ఓం శ్రీం శ్రీం రామాయ నమః (2) ఓం హ్రీం నమో రామాయ హ్రీం (3) గ్లాం హ్రీం నమో రామాయ హ్రీం.*

**విధానము :** పైన పేర్కొనబడిన మూడు మంత్రములలోను ఏ ఒక్కదానినైనను, ప్రతినిత్యము యధాశక్తిగా జపించుచూ, ఎనిమిది లక్షలు జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** పైన పేర్కొనబడిన శివోరామ మంత్రసిద్ధి వలన, సాధకునకు, భూమిలోనున్న నిధులు స్వయముగానే వచ్చి చేరును. మరియు మహిమాన్వితములైన దేవతాసిద్ధులు కూడా లభించును.

## శరణాగతి రామ మహామంత్రము

**మూలమంత్రము :** "శ్రీరామః శరణం మమ"

**విధానము :** పై మంత్రమును ప్రతి నిత్యము యధాశక్తిగా జపించుచూ, ఎనిమిది లక్షల జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ మంత్రము అన్ని మంత్రములలోను అత్యుత్తమమైనది. బహుప్రయాసపడి సాధించిననూ, స్వల్ప ఫలములనే యిచ్చే యితర మంత్ర జపములతో బాధపడ నేల? ఈ మంత్ర సిద్ధి వలన సాధకుడు సకల దోషరహితుడై, దేవతా తుల్యుడై, తలచిన పనులన్నియూ నెరవేరుచూ, ఐహికాముష్మిక సుఖములు నందును.

## నవాక్షర రామ మహామంత్రములు

*(1) 'ఓం రామ భద్రాయ నమః ఓం'*

*(2) 'ఓం రామ చంద్రాయ నమః ఓం'*

**విధానము :** పై పేర్కొనబడిన రెండు మంత్రములలోను ఏ ఒక్క మంత్రమునైనను, ప్రతి నిత్యము యధాశక్తిగా జపించుచూ తొమ్మిది లక్షలు జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితములు :** ఈ రామనవాక్షర మంత్రసిద్ధి వలన సాధకునకు ధర్మార్థ కామ మోక్షములు క్రమముగా లభించును మరియు ఆరోగ్య భాగ్యములతో జీవితము క్షేమముగా నడచుచుండును.

## దశాక్షర రామ మహామంత్రములు

**మూలమంత్రములు :** *(1) 'జానకీ వల్లభాయ హుం స్వాహా'*

*(2) 'రామాయ ధనుష్పాణయే స్వాహా'*

**విధానము :** పైన పేర్కొనబడిన రెండు మంత్రముల లోను, ఏ ఒక్క దానినైనా; ప్రతినిత్యము యధాశక్తిగా జపించుచూ, పదిలక్షల జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** పై దశాక్షర మంత్రసిద్ధి వలన, సకల జనవశ్యము, శత్రునిగ్రహము, కుటుంబాభివృద్ధి కలుగుచుండును.

## ఏకాదశాక్షర రామ మహా మంత్రములు

**మూలమంత్రములు :** *(1) ఓం రామాయ ధనుష్పాణయే స్వాహా (2) హ్రీం రామాయ ధనుష్పాణయే స్వాహా (3) శ్రీం రామాయ ధనుష్పాణయే స్వాహా (4) క్లీం రామాయ ధనుష్పాణయే స్వాహా (5) ఐం రామాయ ధనుష్పాణయే స్వాహా (7) రాం రామాయ ధనుష్పాణయే స్వాహా.*

**విధానము :** పైన పేర్కొనబడిన ఆరు మంత్రములలోను ఏ ఒక్క మంత్రమునైననూ, ప్రతి నిత్యము యధాశక్తిగా జపించుచూ, పదకొండు లక్షల జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ మంత్రసిద్ధి వలన, సాధకుడు, రుద్రతుల్యుడై సకల శత్రువులను జయించి సదాసుఖములు అనుభవించుచుండును. మరియు సకల జనవశ్యకర్తగ కలిగి శాశ్వతమైన పేరు ప్రతిష్ఠలను పొందుచుండును.

## ద్వాదశాక్షర రామ మహామంత్రములు

**మూలమంత్రములు :** *(1) "ఓం హ్రీం భరతాగ్రజ రామ క్లీం స్వాహా" (2) ఓం నమో భగవతే రామ చంద్రాయ (3) ఓం నమో భగవతే రామ భద్రాయ.*

**విధానము :** పైన పేర్కొనబడిన మంత్రములలో ఏ ఒక్క మంత్రమునైనా ప్రతినిత్యము యధాశక్తిగా జపించుచూ పన్నెండు లక్షల జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ ద్వాదశాక్షర మంత్రసిద్ధి వలన సాధకునకు సర్వజన వశ్యకర్షణము, సకల భోగభాగ్య లాభములు కలుగుచుండును.

## త్రయోదశాక్షర శ్రీరామ మంత్రము

**మూలమంత్రము :** "శ్రీరామ జయ రామ జయ జయ రామ".

**విధానము :** ఈ మంత్రమును ప్రతినిత్యము యధాశక్తిగా జపించుచూ పదమూడు లక్షలు జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ మంత్రసిద్ధి వలన సాధకుని సర్వమనోభీష్టములు సంపూర్ణముగా నెరవేరుచుండును.

## చతుర్దశాక్షర శ్రీరామ మంత్రము

మూలమంత్రము : "ఓం శ్రీరామ జయరామ జయ జయ రామ".

విధానము : పై మంత్రమును ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచూ, పద్నాలుగు లక్షల జపము పూర్తిచేసిన యెడల మంత్రము సిద్ధించును.

ఫలితము : ఈ చతుర్దశాక్షర మంత్రసిద్ధి వలన ధర్మార్థ కామ మోక్షము కలుగును.

## పంచదశాక్షర శ్రీరామ మంత్రము

మూలమంత్రము : "ఓం శ్రీరామ జయరామ జయ జయ రామ ఓం".

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచూ పదిహేను లక్షల జపము పూర్తిచేసిన యెడల మంత్రము సిద్ధించును.

ఫలితము : ఈ మంత్ర సిద్ధి అమోఘమైనది. దీని మహిమ వర్ణనాతీతము. ఈ మంత్రము కల్పవృక్షమువలె సాధకునకు కోరిన కోర్కెలన్నియూ తీర్చుచుండును.

## షోడశాక్షర శ్రీరామ మంత్రము

మూలమంత్రము : "నమః సీతా పతయే రామాయ హన హన హుంఫట్".

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచూ పదహారు లక్షల జపము పూర్తిచేసిన యెడల మంత్రము సిద్ధించును.

ఫలితము : ఈ మంత్రసిద్ధి వలన సకల శత్రువులు హరించి పోయెదరు. సకల దౌర్భాగ్యములు తొలగిపోయి సౌభాగ్యాభివృద్ధి కలుగును. మరియు కుటుంబ సౌఖ్యము ఆయురారోగ్యములు కలుగుచుండును.

## సప్త దశాక్షర శ్రీరామ మంత్రము

మూలమంత్రము : "ఓం నమః సీతాపతయే రామాయ హన హన హుం ఫట్"

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచూ పదిహేడు లక్షల జపము పూర్తిచేసిన యెడల మంత్రము సిద్ధించును.

ఫలితములు : ఈ మంత్రసిద్ధి వలన ఐహికాముష్మిక సౌఖ్యము ఆధ్యాత్మిక జ్ఞానము, సుఖసంతోషములు లభించుచుండును.

## 18,19,20,21,22,23 అక్షరములు గల శ్రీరామ మహా మంత్రములు

**18 అక్షరముల శ్రీరామ మంత్రము**

"ఓం నమో భగవతే రామాయ మహాపురుషాయ నమః"

**19 అక్షరముల శ్రీరామ మంత్రము**

"క్లీం ఓం నమో భగవతే రామాయ మహాపురుషాయ నమః"

**20 అక్షరముల శ్రీరామ మంత్రము**

"ఓం నమో భగవతే రామాయ సర్వ సౌభాగ్యం దేహిమే స్వాహా"

**21 అక్షరముల శ్రీరామ మంత్రము**

"ఓం నమో భగవతే రామాయ సకలాపన్నివారణాయ స్వాహా"

**22 అక్షరముల శ్రీరామ మంత్రము**

"ఓం శ్రీరాం దాశరథాయ సీతావల్లభాయ సర్వాభీష్టదాయ నమః"

**23 అక్షరముల శ్రీరామ మంత్రము**

"ఓం నమో భగవతే వీర రామాయ సకల శత్రూన్ హన హన స్వాహా"

పైన పేర్కొనబడిన ఆరు మంత్రములలోను, ఏ ఒక్క మంత్రమును జపించుటకు ప్రారంభించినను, దానిని ప్రతి నిత్యము యథాశక్తిగా జపించుచూ ఆ మంత్రములో ఎన్ని అక్షరము లున్నవో, అన్ని లక్షలు జపము చేసిన యెడల ఆ మంత్రము సిద్ధించును.

ఫలితము : పైన పేర్కొనబడిన ఆరు మంత్రములలోను ఏ ఒక్క మంత్రమును సిద్ధి చేసుకున్ననూ సాధకునకు, మహామహిమలు కలుగును. సౌభాగ్యము వృద్ధిచెందును. సకల ఆపదలు తొలగిపోవును సర్వాభీష్టములు నెరవేరుచుండును.

## 24,25,26,27,28,29,30,31 అక్షరముల శ్రీరామ మహా మంత్రములు

**24 అక్షరముల శ్రీరామ మహా మంత్రము**

"ఓం నమో భగవతే శ్రీరామాయ తారక బ్రహ్మణే మాం తారయ నమః ఓం".

ఫలితము : ఈ మంత్రసిద్ధి వలన సకల కష్టములు తొలగిపోయి శ్రీరామ దర్శనము లభించును.

**25 అక్షరముల శ్రీరామ మహా మంత్రము**

"క్లీం ఓం నమో భగవతే రామచంద్రాయ సకల జనవశ్య కరాయ స్వాహా".

ఫలితము : ఈ మంత్ర సిద్ధి వలన సకల జనులు వశ్యులయ్యెదరు.

**26 అక్షరముల శ్రీరామ మహా మంత్రము**

"ఓం క్లీం ఓం నమో భగవతే రామచంద్రాయ సకల జన వశ్యకరాయ స్వాహా".

**27 అక్షరముల శ్రీరామ మహా మంత్రము**

"ఓం క్లీం ఓం నమో భగవతే రామచంద్రాయ సకల జన వశ్యకరాయ స్వాహా ఓం".

ఫలితము : పైన పేర్కొనబడిన నాలుగు మంత్రము లలోను, దేనిని సిద్ధి చేసికొనిననూ, స్త్రీ పురుషాది జన వశ్యము, అధికారవశ్యం అధికంగా కలుగుచుండును.

**28 అక్షరముల శ్రీరామ మంత్రము**

"ఓం నమో భగవతే రక్షోఘ్న విశదాయ సర్వవిఘ్నాన్ నివారయ నివారయ స్వాహా".

**29 అక్షరముల శ్రీరామ మంత్రము**

"ఓం నమో భగవతే రక్షోఘ్న విశదాయ సర్వ విఘ్నాన్ నివారయ నివారయ స్వాహా ఓం".

**30 అక్షరముల శ్రీరామ మంత్రము**

"రాం ఓం నమో భగవతే రక్షోఘ్న విశదాయ సర్వ విఘ్నాన్ నివారయ నివారయ స్వాహా ఓం".

**31 అక్షరముల శ్రీరామ మంత్రము**

"రాం ఓం నమో భగవతే రక్షోఘ్న విశదాయ సర్వ విఘ్నాన్ నివారయ నివారయ స్వాహా ఓం రాం"

**ఫలితము :** పైన పేర్కొనబడిన నాలుగు మంత్రము లలోను, ఏ ఒక్క మంత్రము సిద్ధి పొందినను, భూత, ప్రేత పిశాచ బాధలు తొలగిపోవును. ఆరోగ్య భాగ్యములు లభించును. సకల విఘ్నములు హరించి సర్వాభీష్టములు నెరవేరుచుండును. పైన పేర్కొనబడిన 24 అక్షరముల మంత్రము నుండి 31 అక్షరముల మంత్రము వరకూ ఏ మంత్రములో ఎన్ని అక్షరములు వున్నవో అన్ని లక్షలు జపము చేసిన యెడల సిద్ధించును.

### 32 అక్షరముల శ్రీరామ మంత్రము

**మూలమంత్రము :** "రామభద్ర మహేష్వాస రఘువీర నృపోత్తమ భో దశాస్యాంతకాస్మాకం రక్షాందేహి శ్రియంచతే".

**విధానము :** ఈ మంత్రమును ప్రతి నిత్యమూ యథాశక్తిగా జపించుచూ, పదిలక్షలు జపము పూర్తిచేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ మంత్ర జపము వలన సకల శత్రువులు సకల విఘ్నములు సర్వారిష్టములు తొలగిపోయి విశేషముగా ధనలాభము కలుగుచుండును.

## శత్రుభయహర శ్రీరామ మహామంత్రము

**మూలమంత్రము :** "హుం ఫట్ రాం ఓం రామ రామ మమ మంత్రేణ ఘోరం ద్రాక్ హనహనయో స్మాన్ ద్వేష్టి యంచ వయం ద్విష్మః".

**విధానము :** పై మంత్రములో "ఘోరం" అను చోట శత్రువు యొక్క పేరును చేర్చి ఈ మంత్రమును ప్రతి నిత్యం యథాశక్తిగా జపించుచుండిన యెడల శత్రువు నశించి పోవును. సాధకునకు శత్రువులవలన ఎట్టి భయము కలుగనేరదు. సుఖసంపదలు లభించు చుండును మరియూ పై మంత్రమును విడవకుండా ప్రతినిత్యమూ జపించుచుండిన యెడల అపమృత్యు దోషములు కూడా తొలగిపోవును. ఈ మంత్రమే 'కాలవజ్ర' మంత్రమని కూడా పిలువబడును.

## శ్రీరామ గాయత్రీ మహా మంత్ర మహిమలు

### శ్రీరామ గాయత్రీ మంత్రములు

**మూలమంత్రము :** "దాశరథాయ విద్మహే, సీతావల్లభాయ ధీమహి, తన్నో రామః ప్రచోదయాత్"

పై రామ గాయత్రీ మంత్రమునకు ముందు 'ఓం' కారమును చేర్చి, ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచుండిన యెడల పునర్జన్మ రాహిత్యము కలుగును.

ఈ శ్రీరామ గాయత్రీ మంత్రమునకే ముందు హ్రీం కారమును చేర్చి జపించుచుండిన యెడల సకల విద్యలు సాంగో పాంగముగా వచ్చును.

మరియూ శ్రీరామ గాయత్రీ మంత్రమునకు ముందు 'రాం' బీజమును చేర్చి, ప్రతినిత్యము యథాశక్తిగా జపించు చుండిన యెడల మిక్కుటముగా ధనలాభము కలుగును.

ముందుగా 'క్లీం' కారమును చేర్చబడిన శ్రీరామ గాయత్రీ మంత్రము ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచుండిన యెడల సర్వజన వశ్యాకర్షణము కలుగుచుండును.

## శ్రీరామ మాలా మంత్రము

**మూలమంత్రము :** "ఓం నమో భగవతే రఘునంద నాయ రక్షోఘ్న విశదాయ మధుర ప్రసన్న వదనాయామితతేజసే బలాయ రామాయ విష్ణవే నమః ఓం"

**విధానము :** ఈ మంత్రమును ప్రతినిత్యమూ యథాశక్తిగా జపించుచూ, ఒక లక్ష జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** పైన పేర్కొనబడిన శ్రీరామ మాలామంత్ర సిద్ధి వలన సాధకుడు సూర్యసమాన తేజస్సుగలవాడై సర్వజనవశ్యా కర్షణము కలవాడై సకల సుఖములు అనుభవించుచుండును. మరియూ భూత, ప్రేత, పిశాచాదులవలన బాధలు శత్రు కృత దుస్తంత్రములు పటాపంచలై పోయి ప్రతికార్యమునందును అఖండ విజయమును గాంచుచుండును.

## శ్రీరామ చంద్ర ప్రత్యక్ష దర్శన మహా మంత్ర స్తోత్రము

**మూలమంత్రము :** ఈ శ్రీరామ చంద్ర ప్రత్యక్ష దర్శన మహా మంత్ర స్తోత్రము గాయత్రీ మహామంత్ర సంపుటితో కూడియుండిన వలభై ఏడు మంత్రములు. మహాఋషి, భరద్వాజ మహాఋషికి ఉపదేశించెను. తరువాత బ్రహ్మదేవుడు ఈ స్తోత్రముతో శ్రీరామచంద్రుని స్తుతించి ప్రత్యక్షముగా శ్రీరాముని దర్శించెను గాన ఈ స్తోత్రమును ప్రతిరోజూ విడువకుండా పఠించుచుండిన వారికి శ్రీరామచంద్రుడు ప్రత్యక్షముగా దర్శనమిచ్చి మోక్షమును ప్రసాదించును.

1. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ ద్వైతపరమానందాత్మా యత్ పరబ్రహ్మ భూర్భువః స్వస్తస్మై వై నమో నమః.
2. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యశ్చాఖండైకరసాత్మా భూర్భువః స్వస్తస్మై నమోనమః.
3. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యశ్చ బ్రహ్మానందామృతం భూర్భువః స్వస్తస్మై వై నమో నమః.
4. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యత్ తారకం బ్రహ్మ భూర్భువః స్వస్తస్మై వై నమోనమః.
5. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్యో బ్రహ్మ విష్ణు రీశ్వరో యస్సర్వదేవాత్మా భూర్భువః స్వస్తస్మై వై నమోనమః.
6. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యే సర్వే వేదాః సాంగాః సశాఖాః పురాణాః భూర్భువః స్వస్తస్మై వై నమోనమః.
7. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యో జీవాత్మా భూర్భువః స్వస్తస్మై వై నమోనమః.
8. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యః సర్వ భూతాంతరాత్మా భూర్భువః స్వస్తస్మై వై నమోనమః.
9. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ దేవాసుర మనుష్యాది భావాః భూర్భువః స్వస్తస్మై వై నమోనమః.
10. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యే మత్స్య కూర్మాద్యవతారాః భూర్భువః స్వస్తస్మై నమోనమః.
11. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యశ్చ ప్రాణః భూర్భువః స్వస్తస్మై నమోనమః.
12. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యోఽంతః కరణ చతుష్టయాత్మా భూర్భువః స్వస్తస్మై వై నమోనమః.
13. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యశ్చ యమః భూర్భువః స్వస్తస్మై వై నమోనమః
14. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యశ్చాంతకః భూర్భువః స్వస్తస్మై వై నమోనమః
15. ఓం యో వై శ్రీరామచంద్రః స భగవాన్ యశ్చ మృత్యుః భూర్భువః స్వస్తస్మై వై నమోనమః

16. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యచ్చామృతం భూర్భువః సువస్తస్మై వై నమోనమః
17. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యాని పంచ మహాభూతాని భూర్భువః సువస్తస్మై వై నమో నమః
18. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యః అంగమార్గో భూర్భువః సువస్తస్మై వై నమో నమః
19. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యే చ పంచాగ్నయో భూర్భువః సువస్తస్మై వై నమో నమః
20. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యాః సప్త మహావ్యాహృతయః భూర్భువః సువస్తస్మై వై నమో నమః
21. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యా విద్యా భూర్భువః సువస్తస్మై వై నమో నమః
22. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యా సరస్వతీ భూర్భువః సువస్తస్మై వై నమో నమః
23. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యా లక్ష్మీః భూర్భువః సువస్తస్మై వై నమో నమః
24. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యా గౌరీ భూర్భువః సువస్తస్మై వై నమో నమః
25. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యా జానకీ భూర్భువః సువస్తస్మై వై నమో నమః
26. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యచ్చ త్రైలోక్యం భూర్భువః సువస్తస్మై వై నమో నమః
27. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యః సూర్యో భూర్భువః సువస్తస్మై వై నమో నమః
28. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యః సోమో భూర్భువః సువస్తస్మై వై నమో నమః
29. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యాని చ నక్షత్రాణి భూర్భువః సువస్తస్మై వై నమో నమః
30. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యే చ నవ గ్రహా భూర్భువః సువస్తస్మై వై నమో నమః
31. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యే చాష్టౌ లోకపాలా భూర్భువః సువస్తస్మై వై నమో నమః
32. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యే చాష్టౌ వసవో భూర్భువః సువస్తస్మై వై నమో నమః
33. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యే చైకాదశ రుద్రా భూర్భువః సువస్తస్మై వై నమో నమః
34. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యే చ ద్వాదశాదిత్యా భూర్భువః సువస్తస్మై వై నమో నమః
35. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యచ్చ భూతం భవ్యం భవిష్యత్ భూర్భువః సువస్తస్మై వై నమో నమః
36. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యచ్చ బ్రహ్మాండస్య బహిర్వ్యాప్నోతి విరాట్ భూర్భువః సువస్తస్మై వై నమో నమః
37. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యో హిరణ్యగర్భో భూర్భువః సువస్తస్మై వై నమో నమః
38. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యా ప్రకృతిః భూర్భువః సువస్తస్మై వై నమో నమః
39. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యః స్వాహంకారో భూర్భువః సువస్తస్మై వై నమో నమః
40. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యశ్చతస్రోఽర్ధమాత్రా భూర్భువః సువస్తస్మై వై నమో నమః
41. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యః పరమపురుషో భూర్భువః సువస్తస్మై వై నమో నమః
42. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యశ్చ మహేశ్వరో భూర్భువః సువస్తస్మై వై నమో నమః
43. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యశ్చ మహాదేవో భూర్భువః సువస్తస్మై వై నమో నమః
44. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యః ఓం నమో భగవతే వాసుదేవాయ యో మహావిష్ణుర్భూర్భువః సువస్తస్మై వై నమో నమః
45. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యః పరమాత్మా భూర్భువః సువస్తస్మై వై నమో నమః
46. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యో విజ్ఞానాత్మా భూర్భువః సువస్తస్మై వై నమో నమః
47. ఓం యోవై శ్రీరామచంద్రః స భగవాన్ యః సచ్చిదానందాద్వైతైకరసాత్మా భూర్భువః సువస్తస్మై వై నమో నమః.

ఇత్యేతాన్ బ్రహ్మవిత్ సప్తచత్వారింశన్మంత్రైః నిత్యం దేవం స్తువతే తతో దేవః ప్రీతో భవతి, యస్మాత్ య ఏతైర్మంత్రైర్నిత్యం దేవం స్తౌతి స దేవం పశ్యతి సోఽమృతత్వం చ గచ్ఛతి సోఽమృతత్వం చ గచ్ఛతి.

పైన పేర్కొనబడిన శ్రీరామ ప్రత్యక్షదర్శన మంత్రస్తోత్రమును ప్రతినిత్యము ఒక్కసారి, లేక యథాశక్తిగాని పారాయణచేయు చుండెడి వారికి అనగా చదువుకొనుచుండెడి వారికి శ్రీరామచంద్రుడు అచిరకాలములోనే దర్శనము యిచ్చును. వారు దేవతాతుల్యులై, జరామరణ రహితులయ్యెదరు. అని శ్రీరామోత్తర తాపనీయోపనిషత్తులో చెప్పబడియున్నది.

## శ్రీ సీతా మహామంత్రము

మూలమంత్రము : "శ్రీం సీతాయై స్వాహా"

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచూ, ఒక లక్ష జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

ఫలితము : ఈ సీతా మహామంత్రసిద్ధి వలన సాధకుడు మనస్సులో ఏమి తలచితే అవి అన్నియూ వెంటనే నెరవేరు చుండును.

## శ్రీ లక్ష్మణ మహా మంత్రము

మూలమంత్రము : "లం లక్ష్మణాయ నమః"

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచూ, ఒక లక్ష జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

ఫలితము : ఈ లక్ష్మణ మంత్రసిద్ధి వలన ధర్మార్థ కామ మోక్షములు క్రమముగా లభించును.

## శ్రీ భరత మహా మంత్రము

మూలమంత్రము : "భం భరతాయ నమః"

విధానము : ఈ మంత్రమును ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచూ, ఒక లక్ష జపము పూర్తి చేసిన యెడల మంత్రము సిద్ధించును.

ఫలితము : ఈ మంత్ర సిద్ధి వలన ఉద్యోగ ప్రాప్తి రాజ్యలాభము ధనలాభము కలుగుచుండును.

## ఉద్యోగ ప్రాప్తి మంత్రము

మూలమంత్రము : "ఓం హార త్రిపుర హార [illegible] రాజా ప్రజా మోహినీ సర్వశత్రు వినాశినీ మమమే [illegible] దేహి భువనేశ్వరీ స్వాహా".

విధానము : ఈ మంత్ర ప్రయోగము ఏ వే[illegible] వెళ్ళి పని చేయువాడు మొదలు పెట్టి శక్తిమేరకు యిరవై ఒక్కవేల జపము పూర్తి చేయవలెను. తరువాత ప్రతినిత్యము ఉదయమే పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచుండిన యెడల సాధకుని సర్వమనోభీష్టములు చాలంతటు అవే నెరవేరును. ఉద్యోగము లేనివారికి మంచి ఉద్యోగము దొరుకును.

## సర్వత్ర రక్షణ కలిగించే మంత్రము

మూలమంత్రము : "ఓం దుర్గే రక్షిణే స్వాహా"

విధానము : ఈ మంత్రమును రోజూ వెయ్యి ఎనిమిది సార్లు చొప్పున పదకొండు రోజులు జపించిన యెడల సిద్ధించును. తరువాత ఆపదలు వచ్చినప్పుడు నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల ఆపదలు కష్టాలు తొలగి పోవును. ప్రతిరోజూ నూట ఎనిమిదిసార్లు జపిస్తే సర్వ కార్యములు జయముగా నెరవేరును. సర్వభయాలు తొలగిపోవును. ప్రత్యేకముగా కార్యార్థమై వెళ్ళు వచ్చునప్పుడు నూట ఎనిమిదిసార్లు జపించి వెళ్ళిన ఆ కార్యము తప్పక నెరవేరును.

## చిన్న పిల్లలు ఏడ్చుమానే మంత్రము

మూలమంత్రము : "ఓం విద్యుద్వర వారాధ స్వ్రీం స్వ్రీం క్రాం క్రాం ప్రీం ఓం".

విధానము : ఈ మంత్రమును నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత సూర్యోదయము కాకముందే ఈ మంత్రము నుచ్చరించుచూ గరిక గడ్డితో పిల్లలకు పదకొండు సార్లు అభిమంత్రించిన యెడల గుక్కపెట్టి ఏడ్చే పిల్లలు ఏడుపుమాని సుఖంగా ఆరోగ్యముగా నుండెదరు.

## పిశాచ దోష నివారణ మంత్రము

మూలమంత్రము : "ఓం కలే బాలేలా ఈ భరీతలా ఈ జమాతే [illegible] హనుమంత్ ఆ ఈ, హాకేనపూతే [illegible] గురుగోరఖ్ వాచా".

విధానము : ఈ మంత్రమును నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత వేపమండతో పై మంత్రము నుచ్చరించుచూ పదకొండుసార్లు పిల్లలకు దిగ దుడిచిన యెడల పిశాచబాధలు హరించిపోవును.

## భూత నివారణ మంత్రము

మూలమంత్రము : "ఓం హ్రీం కీల కీల్ కుర్వీసీ కుజ మరీ అర సరీ హేంకార్ జకాల్ ఫట్"

విధానము : ఈ మంత్రమును వెయ్యి ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత భూత బాధ గల పిల్లలవద్ద కూర్చొని ఈ మంత్రము నుచ్చరించుచూ వేపమండతో యిరవై ఒక్కసార్లు దిగదుడిచిన యెడల భూత, ప్రేత, పిశాచ, శాకినీ, ఢాకినీ, బ్రహ్మరాక్షసాది గ్రహబాధలు నిశ్చయముగా హరించిపోవును.

## దొంగను పట్టుకొనే మంత్రము

మూలమంత్రము : "ఓం నారసింహ వీర్ లక్ పతే, ఓం నారసింహ వీర్ వాచక్ పతిపే [illegible] చోర్ కో పకడే ఆదేశ్ గురుకీ".

విధానము : ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. నాలుగు రూపాయలు తీసుకువచ్చి వాటిని పాలతో కడుగవలెను. సాంబ్రాణి పొగ వెయ్యవలెను. ఏడు తులముల అన్నపు బియ్యము తీసుకువచ్చి గోమూత్రముతో కడిగి ఎండబెట్టవలెను. శనివారము నాడు పొద్దున్న భూమిని ఆవు పేడతో అలికి ముగ్గు వేసిన తెల్లటి బట్ట పరచి దానిపై బియ్యము పోసి పక్కన రూపాయలు పెట్టి పై మంత్రముచే పదకొండు సార్లు అభిమంత్రించవలెను. దొంగ అని అనుమానమున్న వారందరినీ పిలిచి ఒక్కొక్కరికి ఒక రూపాయి యెత్తు బియ్యము యిచ్చి తినిపించవలెను. ఇట్లు చేసిన యెడల నిజముగా సొమ్ములు దొంగిలించిన వారినోటి మాట లేకుండా కట్టిపోవును. దొంగతనము చేసినట్లు ఒప్పుకొనిన యెడల నోట మాటలు వచ్చును. నోరుకట్టు విడిపోవును.

## దొంగల బాధ నివారణ తంత్రము

శ్లో. జలేరక్షతు వారాహః స్థలే రక్షతు వామనః,
అటవ్యాం నారసింహశ్చ సర్వతో పాతు కేశవః

శ్లో. జలేరక్షతు నందీశః స్థలేరక్షతు భైరవః,
అటవ్యాం వీరభద్రశ్చ సర్వతో పాతు శంకరః

శ్లో. అర్జునః ఫల్గుణో జిష్ణుః కిరీటి శ్వేతవాహనః,
బీభత్సుః విజయః కృష్ణః సవ్యసాచీ ధనంజయః,

శ్లో. త్రిపురాభార్యాః కపిలస్య వాహినీ మోహినీ సతీ,
తాసాంస్మరణమాత్రేణ చోరోగచ్ఛతి నిష్ఫలః

విధానము : సాధకుడు రాత్రి పడుకునే ముందు పై శ్లోకములను ఒకసారి చదివి వాహిని, మోహిని, సతి అని ఉచ్చరించి నిద్రించిన యెడల ఆ ఇంట్లో దొంగలు ఎంతమాత్రము ప్రవేశించరు.

## కోరిన కోర్కెలను నెరవేర్చుకొనుటకు మంత్రము

మూలమంత్రము : "ఓం శ్రీయే, శ్రీకరి, ధనకరి, ధాన్య కరి, పుష్టికరి, తుష్టికరి, అభీష్టకరి, సర్వకామదే స్వాహా"

విధానము : అశ్వత్థవృక్షమునకు గాని, మర్రిచెట్టునకు గాని, పూజచేసి ఆ చెట్టుక్రింద కూర్చుని పై మూల మంత్రమును రోజుకు రెండువేలసార్లు చొప్పున ఏభై రోజులు జపించిన యెడల సిద్ధించును. మంత్రాధిదేవత ప్రత్యక్షమై సాధకుని కోర్కెలు నెరవేర్చుచుండును. మంత్రసిద్ధి అయిన తరువాత మంత్రమును విడిచిపెట్టకుండా రోజూ వెయ్యిఎనిమిదిసార్లు జపించుచున్న యెడల సాధకునికి మంత్రాధిదేవత ప్రత్యక్షముగను కోరిన కోర్కెలు నెరవేర్చు చుండును.

## సర్వ సిద్ధులు యిచ్చే సూర్య మంత్రము

మూలమంత్రము : "ఓం ఖషోల్కాయ స్వాహా".

విధానము : ఈ మంత్రమును ప్రతిదినము సూర్యోదయ సమయమున సూర్యునికి ఎదురుగా కూర్చుని నూట ఎనిమిదిసార్లు జపించి ఎర్ర చందనము కర్పూరగంధము తీసి ఆ గంధమును నీటితో కలిపి ఆ నీటిని నూట ఎనిమిదిసార్లు దోసిళ్ళతో తీసి "ఓం పుణ్యగంధసూర్య ఆదిత్య" అను మంత్రమును చెప్పుచు అర్ఘ్యము విడిచి పెట్టవలెను. ఈ విధముగా ప్రతి రోజూ విడువకుండా మూలమంత్ర జపముచేసి అర్ఘ్యము ఇచ్చుచున్న యెడల ఎంతటి కష్టమైన కోర్కెలైనా సులభముగా నెరవేరును. ధనవృద్ధి, కుటుంబవృద్ధి కలుగును. నేత్రబాధ యుండదు. ఆరోగ్యము కలుగును. అపమృత్యు బాధలు దరిచేరవు. ఈ మంత్రజపము చేయుచున్న వారి సంతానము గొప్పవారయ్యెదరు.

## శత్రుఘ్న మహా మంత్రము

**మూలమంత్రము :** "శం శత్రుఘ్నాయ నమః"

**విధానము :** ఈ మంత్రమును ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచూ, ఒక లక్ష జపము పూర్తిచేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ మంత్రసిద్ధి వలన సకల శత్రువులు హరించిపోయి సకలకార్యములు జయప్రదముగా నెరవేరుచుండును.

## హనుమన్మహా మంత్రము

**మూలమంత్రము :** "హం హనూమతే నమః"

**విధానము :** ఈ మంత్రమును ప్రతినిత్యము యథాశక్తిగా జపించుచూ, ఒక లక్ష జపము పూర్తిచేసిన యెడల మంత్రము సిద్ధించును.

**ఫలితము :** ఈ మంత్రసిద్ధి వలన భూత భవిష్యత్ వర్తమాన జ్ఞానము కలుగును. భూత ప్రేత పిశాచాది బాధలు తొలగి పోవును. శత్రువులు హరించి పోయెదరు. ఆరోగ్య భాగ్యములు కలుగును. అవి యివి యనవేల సర్వసిద్ధులు లభించుట జరుగుచుండును.

## లక్ష్మీ మంత్రము

**మూలమంత్రము :** "ఓం హ్రీం శ్రీం లక్ష్మీ మహాలక్ష్మీ సర్వ కామ ప్రదేసర్వ సౌభాగ్యదాయిని అభిమతం ప్రయచ్ఛ సర్వగతే సురూపే సర్వ దుర్జయ విమోచని హ్రీం సః స్వాహా"

**విధానము :** ఈ మంత్రమును ప్రతి నిత్యమూ నూట ఎనిమిది సార్లు చొప్పున జపించుచుండిన యెడల అసాధ్య కార్యములు జయప్రదముగా నెరవేరుట సకల దుఃఖములు తొలగిపోవుట, మనోవాంఛిత కార్యములన్నీ సులువుగా సఫలమగుచుండు టయేగాక కావలసినంత ధనము లభించుచుండును.

## మనోభీష్ట సిద్ధికి మహా హనుమన్మంత్రము

**మూలమంత్రము :** "ఓం నమః హనుమంతాయ ఆవేశంతు ఆవేశయ స్వాహా".

**మహిమ :** ఈ మంత్రజపము చేసిన పిల్లలు లేనివారికి సంతానము కలుగును. పేదవారికి ధనలాభము కలుగును. ఉద్యోగం కొరకు ప్రయత్నించు చుండెడివారికి ఉద్యోగము దొరుకును. ఇవి యివి యన నేల సర్వ మనోభీష్టములు సిద్ధించుటకు కలియుగములో యిది ఒక గొప్ప మంత్రము ప్రతిరోజూ నూట ఎనిమిదిసార్లు జపిస్తూ వుండవలెను.

## శారదా మహా మంత్రము

**మూలమంత్రము :** "ఓం హ్రీం క్లీం సః నమో భగవత్యై శారదాయై హ్రీం స్వాహా".

**విధానము :** ఈ మంత్రమును విద్యార్థులు పరీక్షకు వెళ్ళే రోజులలో ప్రతిరోజూ నూట ఎనిమిదిసార్లు జపించుకొనుచు పరీక్షకు వెళ్ళి పేపర్లు వ్రాసిన యెడల ఫస్టు మార్కులు వచ్చును. ప్రతి నిత్యము ఈ మంత్రము జపిస్తూ వుంటే విద్య బాగా వస్తుంది. జ్ఞాపక శక్తి అభివృద్ధి అవుతుంది.

## విద్యాభివృద్ధి మంత్రము

**విధానము :** మాఘమాసములో పూర్వాషాఢా నక్షత్రము నాడు అర్ధరాత్రి సమయములో "ఓం హ్రీం" అను మంత్రమును, సరస్వతి ఆకు సరముతో తన నాలుకపై తన గురువుచేత వ్రాయించుకొని ఆ మంత్రము ప్రతినిత్యమూ వెయ్యి నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచుండిన యెడల విద్య అభివృద్ధి చెందును.

రోజూ నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచుండిన యెడల వాక్సుద్ధి, విద్యాప్రాప్తి కలుగును. మంచి మార్కులు వచ్చును. ఫస్టు మార్కులతో పాసయ్యెదరు.

## వివాహ కామేశ్వరీ మంత్రము

**మూలమంత్రము :** "ఓం హ్రీం శ్రీం హ్రాం హ్రీం క్లీం క్లూం ఐం ఐం మహాక్ష్యై కామేశ్వరీ బాణదేవతే స్వాహా".

**విధానము :** ఈ మంత్రమును ప్రతినిత్యము అర్ధరాత్రి సమయములో నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించు చుండిన యెడల తొందరలో వివాహము జరుగును. వివాహము కానివారికి తొందరగా వివాహము జరుగుటకు యిది గొప్ప మంత్రము సంసార సౌఖ్యము లభించును.

## సంతాన గౌరీ వ్రతము

**మూలమంత్రము :** "ఓం హ్రీం శ్రీం హ్రీం గ్లాం గం గౌరీ గీం స్వాహా".

**విధానము :** ఈ మంత్రమును ప్రతి నిత్యము మధ్యాహ్నము పన్నెండు గంటలకు నూట ఎనిమిది సార్లు చొప్పున జపించుచుండిన యెడల సంతానవృద్ధి స్త్రీ పుత్రాది సౌఖ్యము లభించును.

## అన్నపూర్ణ మంత్రము

**మూలమంత్రము :** "ఓం హ్రీం శ్రీం క్లీం నమో భగవతి మహేశ్వరీ అన్న పూర్ణే స్వాహా".

**విధానము :** ఈ మంత్రము ప్రతినిత్యము ఉదయము సాయంత్రముల యందు నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచుండిన ధన ధాన్యముల వృద్ధి అన్న సమృద్ధి కలుగుచుండును. మంత్ర జపము చేయుచున్న వారికి అన్న వస్త్రాలకు లోటు వుండదు.

## సర్వోపద్రవములు శాంతించుటకు మంత్రము

**మూలమంత్రము :** "ఓం హ్రీం స్ఫుర స్ఫుర ప్రస్ఫుర ప్రస్ఫుర ఘోర ఘోర తీర, తీర తనురూప, తనురూప చట చట ప్రచట ప్రచట కహ కహ వమవమ బంధ బంధ ఘాతయ ఘాతయ హుం ఫట్ స్వాహా".

**విధానము :** ఈ మంత్రమును నిత్యము నూట ఎనిమిది సార్లు చొప్పున జపించుచున్న యెడల సర్వోపద్రవములు నశించును.

## శత్రువులకు కనిపించకుండా వుండుటకు మంత్రము

**మూలమంత్రము :** "ఓం శ్మశాన వాసిని, ప్రేత మూర్తిని మాం మాం పశ్యంతు మమపశ్యా స్వాహా".

**విధానము :** శ్మశానములోని చితాభస్మమును తెచ్చి పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు మంత్రించి ఆ భస్మమును నొసటన మూడు రేఖలుగా ధరించినయెడల శత్రువులకు కనిపించకుండా వుండును. ఆ బూడిద రేఖలను చెరిపి వేసిన యెడల మామూలుగా కనిపించును. ఆ యోగము చేయుటకు ముందుగా మంత్రమును వెయ్యి ఎనిమిది సార్లు జపించి సిద్ధి చేసుకొనవలెను.

## జీవనోపాధి దొరుకుటకు మంత్రము

**మూలమంత్రము :** "ఓం ఐం హ్రీం శ్రీం క్లీం లక్ష్మీ కరికుంద స్వామినే నమః ఆరోగ్యం సర్వైశ్వర్యం కురు కురు స్వాహా"

**విధానము :** జీవనోపాధి దొరకనివారు అనగా ఏ పని లేని వారు నౌకరీ దొరకని వారు ప్రతిరోజూ ఉదయం నూట ఎనిమిది సార్లు ఈ మంత్రమును జపించుకొని ఉద్యోగం నిమిత్తంగాని లేదా ఏదైనా పనికొరకుగాని వ్యాపారం నిమిత్తంగాని ప్రయత్నిస్తే తప్పక ఆ పని నెరవేరుతుంది. జీవనోపాధి దొరుకుతుంది.

## పొలములు, తోటలు అధికముగా పండుటకు తంత్రము

ఆదివారము రోజున ఒక మట్టి మూకుడునందు పాలు, పెన్నేరు దుంపచూర్ణము, తమలపాకులు, తులసి, నెయ్యి, పాయసము నిండుగా పోసి, పైన గుడ్డ వాసిన గట్టిగ ఆ మూకుడును పొలము మధ్యగాని, పండ్లతోటల మధ్యగాని పాతి పెట్టినయెడల రోగాల వలనగాని, పురుగులు, మిడతలవలనగాని సస్యములకు హానికలుగకుండా అధికముగా పంటలు పండుచుండును.

## పంటలు అధికముగా పండుటకు మంత్రము

మూలమంత్రము : "ఉంబ్ ఠీ నరసింహావంబ్ ధీరాయ రక్షాకరది నరసింహారాయా".

విధానము : పై మంత్రమును నెయ్యూ నూట ఎనిమిది సార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత ఈ మంత్రమును ఒక కాగితముపైన వ్రాసి ధూప, దీప నైవేద్యములు యిచ్చి పూజించి ఆ కాగితమును పొలము మధ్య పాతి పెట్టిన యెడల పంటలు అధికముగా పండును.

## భూములు అధికముగా పండుటకు భూలాభము కలుగుటకు మంత్రము

మూలమంత్రము : "ఓం నమో భగవత్యై ధరత్యై ధరణీ ధరే స్వాహా".

విధానము : ఈ మంత్రమును ముందుగా రోజూ వెయ్యి సార్లు చొప్పున పదిరోజులు జపించిన సిద్ధించును. తరువాత రోజుకి నూట ఎనిమిది సార్లు చొప్పున జపించుచున్న యెడల తన భూములు అధికముగా పంటలు పండును. తనకు భూలాభము కలుగును.

## పశువులు పాలు ఎక్కువగా యిచ్చే మంత్రము

మూలమంత్రము : "ఓం ఐల్ హాల్ ఛాలాహామాఊపాల్ వ"

విధానము : ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత ఈ మంత్రముచే యిరవై ఒక్కసార్లు అభిమంత్రించిన గుగ్గిలమును పశువులకు పశువులశాలలో పొగ వేసిన యెడల అక్కడ వుండే పశువులన్నియూ ఎక్కువగా పాలు యిచ్చుచుండును.

## పశురోగ నివారణ మంత్రము

మూలమంత్రము : "ఓం నమో చేటీజానీ బాంధీ దహాలాయ్ రామ్‌సార్ సాచ్ కే పశు నాకోహా జాయే"

విధానము : పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత నాలుగు కొయ్య మేకులు తెచ్చి, ఒక్కొక్క మేకును పై మంత్రముచేత రెండేసి మార్లు అభిమంత్రించి ఆ నాలుగు మేకులను పశువులశాలకు నాలుగు వైపులా భూమిలో దిగగొట్టి మరియూ పై మంత్రము చేతనే యిరవై ఒక్కసార్లు అభిమంత్రించబడిన మంచినీళ్ళను, పశువులచేత త్రాగించిన యెడల పశువుల వ్యాధులన్నియూ హరించిపోవును.

## భార్యాభర్తల మధ్య విరోధము తొలగిపోవుటకు మంత్రము

మూలమంత్రము : "ఓం నమో మహాయక్షిణ్యై మమ పతిం (అముకం) మే వశ్యం కురుకురు స్వాహా"

విధానము : భార్యాభర్తల మధ్య విరోధాలు వచ్చి భార్య పుట్టింటికి వెళ్ళి వుండిపోయిన రోజులలో రాత్రిపూట ఆవునేతితో దీపము వెలిగించి ఆ దీపం వద్ద ఆ స్త్రీ కూర్చొని పైన వ్రాసిన మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించవలెను. ఈ విధముగా పదకొండు రాత్రులయందు మంత్రజపము చేస్తే ఆమె భర్త తనంతటానుగా వచ్చి తన భార్యను ప్రేమతో తీసుకొని వెళ్ళిపోవును. సుఖంగా కలతలు లేకుండా కాపురము చేయుదురు. ఈ రహస్యము భర్తకు తెలియనియ్య కూడదు.

## భర్తను ఏలుకొనని భార్యను రప్పించే మంత్రము

మూలమంత్రము : "ఓం నమో కటవికట ఘోర రూపిణి పత్నీం (అముకాం) మే వశమానయ స్వాహా".

విధానము : భర్తను భార్య ఏలుకొనక వదలి పెట్టి పుట్టింటికి వెళ్ళి వుండిపోయిన యెడల ఆ పురుషుడు తన భార్య ధరించిన చీర గాని, రవిక గాని తీసుకొని ఆదివారము రోజున తాను ఆ వస్త్రమును పరచుకొని దానిపై వ్రాసిన మంత్రములో (అముకం) అనుచోట తన భార్య పేరు చేర్చి మంత్రమును వెయ్యిసార్లు జపించవలెను. తరువాత పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు తెల్ల కాగితముపై వ్రాసి ఆ కాగితమును తాను భోజనము చేసే కంచము క్రింద పెట్టుకొని భోజనము చేయవలెను. రాత్రియందు తాను తిను భోజనము మంత్రముతో మూడుసార్లు మంత్రించి తినవలెను. ఈ విధముగా తొమ్మిది రోజులు చేస్తే ఎంత గడసరి భార్య అయినా లొంగి భర్త వద్దకు వచ్చి భర్తపై ప్రేమతో కాపురము చేయును. ఈ రహస్యము భార్యకు తెలియ నివ్వకూడదు.

## సంతానము కలుగుటకు తంత్రాలు

ఈ దిగువను వ్రాసిన మంత్రమును సంతానము కావలసిన స్త్రీ గురువారము నాడు సూర్యోదయాన్నే లేచి స్నానము చేసి పార్వతీ పరమేశ్వరుల పటము ముందర కూర్చొని ధూప, దీపములు పెట్టి కొబ్బరికాయ కొట్టి నైవేద్యము పెట్టి యీ దిగువను వ్రాసిన మంత్రాన్ని 1008 సార్లు జపించవలెను. తరువాతను ఈ దిగువను వ్రాసిన తంత్రాలలో ఏదో ఆమెకు వచ్చిన ఒక యంత్రమును యిందు చెప్పిన ప్రకారము చేసుకొనిన ఆమెకు తప్పక సంతానము కలుగును.

### మొదటి తంత్రము

సంతానము కావలసిన స్త్రీ బహిష్టు స్నానము చేసిన రోజునుండి వరుసగా వారము రోజులు రోజుకు ఒక లేత మోదుగ ఆకును, ఆవుపాలలో నూరి ముద్దచేసుకొని పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి తినుచూ భర్తతో కాపురము చేయుచుండవలెను. తేలికగా జీర్ణమగు పదార్థములు తినవలెను. ఈ విధముగా మూడు దఫాలు చేస్తే తప్పక సంతానము కలుగును. గర్భము నిలచిన తరువాత ఈ తంత్రము చేయకూడదు.

### రెండవ తంత్రము

సంతానము కావలసిన స్త్రీ బహిష్టు స్నానము చేసిన రోజు నుంచి వరుసగా వారం రోజులు వెంపలి చెట్టు యొక్క వేరును తీసుకొని వచ్చి మంచినీళ్ళతో నూరుకొని కుంకుడు కాయంత ముద్ద తీసుకొని దిగువ మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి తినుచూ భర్తతో కాపురము చేస్తూ తేలికగా జీర్ణమగు పదార్థములు తింటూ వుండవలెను. ఈ విధముగా రెండు మూడు దఫాలు చేస్తే తప్పక సంతానము కలుగును. గర్భము నిలచిన తరువాత ఈమంత్రము చేయకూడదు.

### మూడవ తంత్రము

పుష్యమీనక్షత్రముతో కూడిన ఆదివారము రోజున సహదేవి చెట్టును సమూలముగా తీసుకువచ్చి నీడను ఆరబెట్టి చూర్ణము చేసి వుంచుకొని సంతానము కావలసిన స్త్రీ బహిష్టు స్నానము

రోజు నుండి వరుసగా వారం రోజులు ఒక తులము మర్దనము ఒకే రంగు గల ఆవుయొక్క పాలు పావుసేరులో కలుపుకుని దిగువ మంత్రముతో నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి పుచ్చుకొనుచూ భర్తతో కలసి వుంటూ తేలికగా జీర్ణమగు ఆహారమును తింటూ వుంటే గర్భము ధరించి సంతానము కలుగును. గర్భము ధరించిన తర్వాత ఈ యోగమును చేయకూడదు.

### నాగ్దవ తంత్రము

పంజాలు నాగకేసరములు తెచ్చి మెత్తగా మర్దనము చేసి సీసాలో పోసి భద్రంగా వుంచుకొనవలెను. సంతానము కావలసిన స్త్రీ బహిష్టు స్నానము చేసిన రోజున అప్పుడే పిండిన పాపుకొను ఆవుపాలతో నాగకేసరముల మర్దనము ఒక తులము కలుపుకొని దిగువ మంత్రముతో నూటఎనిమిదిసార్లు అభిమంత్రించి పుచ్చుకొనవలెను. ఈ విధముగా పదిహేను రోజులు పుచ్చుకొనుచు భర్తతో కలసివుంటూ తేలికగా జీర్ణమగు ఆహారము తింటూ వుండవలెను. యీ విధముగా మూడు దఫాలు చేస్తే తప్పక సంతానము కల్గును.

---

### సంతానము కలిగించే కుంతీ మంత్రము

*"విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టారూపాణి పింశతు*
*ఆసించతు ప్రజాపతిర్ధాతా గర్భం దధాతు తే*
*గర్భం ధేహి సినీవాలీ గర్భం ధేహి సరస్వతీ గర్భంతే*
*అశ్వినౌ దేవీ ధత్తాం పుష్కరస్రజా"*

కుంతీ దేవి సంతానం కొరకు యీ మంత్రమును జపించి మహా బలపరాక్రమ వంతులయిన కుమారులను కనెనని చెప్పబడి యున్నది. కావున యీ మంత్రజపము చేయువారలకు పరాక్రమ వంతులయిన అదృష్టవంతులయిన సంతానము కలిగెదరు.

**విధానము :** సంతానము కావలసిన స్త్రీలు సాయంకాలము సూర్యాస్తమయమయిన తర్వాత శ్రీమహావిష్ణు పటము ముందు కూర్చుని ధూప, దీప నైవేద్యము లిచ్చి నమస్కరించి పై మంత్రమును నలభై సార్లు జపించవలెను. ఈ విధముగా విడువకుండా నలభై రోజులు మంత్రజపము చేస్తూ భార్యా భర్తలు అన్యోన్యముగా కలసివుంటూ తేలికగా జీర్ణమగు ఆహార పదార్థాలు తింటూ వుంటే తప్పక గర్భము ధరించి సంతానము కలుగును. గర్భం నిలిచిన తర్వాత కూడా యీ మంత్ర జపమును యథాశక్తిగా చేసుకుంటూ వుండవలెను.

### సర్వకార్యములందు జయము కలుగుటకు రక్షాబంధనము

ఈ రక్షాబంధనము వేద కాలము నుండి పరంపరా గతముగా వచ్చుచున్నది. ఇంద్రాది దేవతలు ఈ రక్షాబంధన మును ధరించి కార్యములయందు జయమును పొందెడివారు.

ఈ రక్షాబంధనమును ధరించిన యెడల అపమృత్యువులు తొలగిపోవునని భూత ప్రేత పిశాచ బాధలు తొలగిపోవునని దీర్ఘాయుర్దాయము కలుగునని వివాహాది శుభకార్యములు కోర్టు వ్యవహారములు మొదలగు సర్వకార్యములు జయప్రదముగా నెరవేరునని మహాఋషులచే చెప్పబడి వున్నది. ఈ రక్షాబంధనము పురుషులు, స్త్రీలు పిల్లలు అందరూ ధరించవచ్చును.

**మూలమంత్రము :** "యేన బద్ధో బలీ రాజా దానవేంద్రో మహాబలః / తేనత్వామభిబధ్నామి రక్షే మాచల మాచల"

**విధానము :** ఒక గురివింద ఎత్తు బంగారం, గరికగడ్డి, బార్లీ, బియ్యం, దర్భలు, ఆవాలు, మంచిగంధపు చెక్క, ముక్క, పసుపు కలిపిన అక్షతలు, పచ్చి ప్రేళ్ళ మామిడి ఆకు, పసుపు కొమ్ము, వేములకమ్మ, ఆవుపేడ, ఆవు పెరుగు యీ వస్తువులు ప్రతిదానిని కొంచెము కొంచెముగా తీసుకుని మొత్తము అన్నీ కలిపి పసుపు గుడ్డలో వేసి మూటకట్టి మీ ఇష్ట దైవముముందుంచి ధూప, దీపములు యిచ్చి కొబ్బరికాయ కొట్టి నైవేద్యము పెట్టించి మూలమంత్రముచే 108 సార్లు అభిమంత్రించి ఆ మూటను పురుషులయిన కుడి చేతి మణికట్టుకు లేదా దండకు కట్టుకొనవలెను. స్త్రీ అయిన ఎడమచేతి మణికట్టుకుగాని దండకుగాని కట్టుకొనవలెను.

---

### అపమృత్యువులు, దీర్ఘవ్యాధులు తొలగి పోవుటకు తంత్రము

ఎన్నిమందులు వాడినా నయముకాని మొండివ్యాధులు కలవారికి భూత, ప్రేత, పిశాచ బ్రహ్మ రాక్షసాది బాధలు పొందుచున్న వారికి యీ దిగువను వ్రాసిన విధముగా చేసిన యెడల అపమృత్యు భయములు గ్రహబాధలు తొలగిపోయి ఆరోగ్యము కలుగును.

**విధానము :** మట్టి కొత్తమూకుడు తెచ్చి దానిలో ఆముదము ఒక భాగము, నువ్వుల నూనె ఒక భాగము, నెయ్యి ఒక భాగము పోసి వుంచవలెను. తెలుపు, ఎరుపు నలుపు (మూడు కులాలదారము) దారములు మూడు కలిపి వత్తిగా చేసి మూకుడులో వేసి రోగిని తూర్పు ముఖముగా కూర్చోన బెట్టి ఈ నూనెగల మూకుడును రోగిచుట్టూ మూడు సార్లు దిగదుడిచి పెట్టవలెను. తరువాత నవధాన్యాలను పచ్చటి గుడ్డలోవేసి రోగిచుట్టూ మూడుసార్లు దిగదుడవవలెను. ఈ దిగదుడిచిన నవధాన్యములు నూనె మూకుడుని తిన్నగా తీసుకుని శివాలయానికి వెళ్ళి పచ్చగుడ్డలో వున్న నవధాన్యాలను క్రింద పెట్టి దానిపై నూనె మూకుడును పెట్టి దీపం వెలిగించవలెను.

పిదప రోగికి దిగదుడిచి శివాలయమునకు తీసుకుని వెళ్ళి దీపారాధన చేసిన వ్యక్తి తిన్నగా ఒక నూతి వద్దకుగాని చెరువు వద్దకుగాని వెళ్ళి తలపై నుండి తాను కట్టుకున్న బట్టలతో సహా స్నానము చేసి యింటికిరావలెను. ఈ విధముగా మూడు శని వారములు గాని, లేదా వరుసగా మూడురోజులుగాని చేస్తే ఎంతటి బాధలయినా తొలగిపోవును.

---

### వ్యాపారము అభివృద్ధి అధికలాభము కలుగుటకు యంత్రము

ఇది చేసి మంచి నిదర్శనము చూచుకొనుడు.

| 90 | 7 | 8 | 8 |
|---|---|---|---|
| 8 | 9 | 7 | 6 |
| 77 | 27 | 8 | 1 |
| 7 | 5 | 79 | 74 |

ఈ యంత్రాన్ని రెండు పలుచని రాగిరేకుల మీద దీపావళి నాటి రాత్రి యక్షకర్దమముతో వ్రాసి మీ యిష్ట దైవము ముందు వుంచి కొబ్బరి కాయ కొట్టి నమస్కరించి దుకాణముయొక్క గుమ్మముపైన చిన్న మేకులతో ఒక యంత్రాన్ని కొట్టవలెను. రెండవయంత్రాన్ని డబ్బుల పెట్టెలో పెట్టి వుంచుకొనిన యెడల వ్యాపారము వృద్ధి ధనలాభము కలుగును.

---

### సర్వజ్వరాలు తగ్గుటకు యంత్రము

ఇది చేసి చూచి నిదర్శనము చూచుకొనుడు.

| 93 | 33 | 15 | 45 |
|---|---|---|---|
| 45 | 4 | 4 | 52 |
| 44 | 28 | 87 | 9 |
| 54 | 5 | 39 | 93 |

ఈ యంత్రాన్ని తెల్లకాగితము మీద పసిబొగ్గుతో వ్రాసి మడత పెట్టి నీలరంగు గుడ్డలో మూటకట్టి జ్వరము తగిలిన వారికుడిచేతి దండకు కట్టి, కొబ్బరికాయ ఆరోజున రాత్రి దిగ దుడిచి నాలుగువీధులు కలిసినచోట కొట్టి పారవేస్తే జ్వరము తగ్గిపోవును.

### పాము ఇంట్లోకి చేరకుండుటకు యంత్రము

ఇది చేసి చూసి నిదర్శనము చూచుకొనుడు

| 9 | 4 | 9 | 51 |
|---|---|---|---|
| 14 | 4 | 4 | 52 |
| 3 | 28 | 87 | 91 |
| 7 | 5 | 39 | 45 |

ఈ యంత్రాన్ని అరటి ఆకుమీద వేలి గోరుతో వ్రాసి ఆ అరటి ఆకును రెండు చేతుల తోను పట్టి, ఆ దారిన్ని ఇంటి ఆవరణలో పెడితే ఇంట్లోకి పాము రాకుండా వుండును. మరియు ఇదే యంత్రాన్ని పలుచని రాగిరేకు మీద గంటంతో వ్రాసి ఇంటిలో పాతిపెడితే ఆ ఇంట్లోకి పాములు రావు.

### మనస్సులో గల కోర్కెలను నెరవేర్చే యంత్రము

ఇది చేసి చూసి నిదర్శనము చూచుకొనుడు.

| 8 | 15 | 2 | 7 |
|---|---|---|---|
| 6 | 8 | 12 | 11 |
| 14 | 9 | 8 | 1 |
| 4 | 5 | 10 | 3 |

ఈ యంత్రాన్ని ఆదివారము రోజు తెల్ల కాగితము మీద పసుపు కుంకుమ రసంతో దానిమ్మ పుల్ల ముంచి వ్రాయవలెను. యంత్రం క్రింద తనకు కావలసిన కోరిక వ్రాసి ఆ కాగితాన్ని చుట్టగా చుట్టి ప్రమిదల నూనెలో వేసి దీపము వెలిగించవలెను. దీపము ముందు తాను కూర్చొని "హ్రీం హం సః" అనే మంత్రాన్ని వెయ్యిసార్లు జపించవలెను. ఈ విధముగా మూడు ఆదివారాలు చేస్తే తన కోరిక నెరవేరును.

### విద్యాబుద్ధులు వృద్ధి అగుటకు యంత్రము

ఇది చేసి చూసి నిదర్శనము చూచుకొనుడు.

| 73 | 91 | 28 | 8 |
|---|---|---|---|
| 7 | 3 | 93 | 96 |
| 94 | 94 | 7 | 1 |
| 4 | 6 | 76 | 79 |

ఈ యంత్రాన్ని శుక్లపాడ్యమి రోజునుంచి పౌర్ణమివరకు ప్రతి రోజూ విడువకుండా తాను భోజనము చేసే కంచములో మంచి గంధముతో దానిమ్మ పుల్ల కలము ముంచి వ్రాసి దానిలో పాయసము పోసుకుని తింటూ వుంటే మంచి తెలివి తేటలు గలిగి బుద్ధి చురుకుగా వుండి విద్య అభివృద్ధి చెందును.

### ఆవులు గేదెలు ఎక్కువగా పాలిచ్చే యంత్రము

ఇది చేసి చూసి నిదర్శనము చూచుకొనుడు.

| 93 | 60 | 18 | 16 |
|---|---|---|---|
| 63 | 13 | 34 | 46 |
| 74 | 11 | 21 | 91 |
| 44 | 52 | 56 | 57 |

ఈ యంత్రాన్ని పలుచని రాగి రేకుమీద గంటముతో ఆదివారమునాడు వ్రాసి మీ యిష్ట దైవము ముందు వుంచి కొబ్బరి కాయ కొట్టి నైవేద్యము పెట్టి నమస్కరించి గుగ్గిలము పొగవేసి మూడు కులాల దారముతో చుట్టి గేదెకు గాని ఆవుకు గాని మెడలో కట్టిన ఎక్కువ పాలిచ్చును.

### అధికారులు వశ్యమగుటకు యంత్రము

ఇది చేసి చూసి నిదర్శనము చూచుకొనుడు.

| 36 | 58 | 1 | 3 |
|---|---|---|---|
| 1 | 9 | 62 | 61 |
| 87 | 45 | 1 | 8 |
| 8 | 6 | 83 | 82 |

ఈ యంత్రాన్ని పలుచని రాగి రేకు మీద గంటముతో వ్రాసి మీ యిష్టదైవము ముందు వుంచి కొబ్బరి కాయ కొట్టి నైవేద్యము పెట్టి యంత్రము తీసి మడిచి సిల్కు దారముతో చుట్టి దండకు కట్టుకొని అధికారుల వద్దకు వెడితే మీకు కావలసిన పనులు సులభముగా నెరవేరగలవు.

### తలచిన కార్యములు నెరవేరుటకు యంత్రము

ఇది చేసి చూసి నిదర్శనము చూచుకొనుడు.

| 6 | 44 | 9 | 51 |
|---|---|---|---|
| 4 | 4 | 2 | 52 |
| 87 | 28 | 87 | 91 |
| 9 | 5 | 39 | 65 |

ఈ యంత్రాన్ని పలుచటి రాగి రేకుమీద యినుప గంటముతో వ్రాసి మీ యిష్టదైవము ముందు వుంచి కొబ్బరి కాయ కొట్టి నైవేద్యము పెట్టి రాగి రేకు తీసి దానిలో కుక్క గోరు పెట్టి మడిచి పట్టుదారముతో చుట్టి దండకు కట్టుకొనిన సర్వకార్యములు నెరవేరును.

### దృష్టి దోషము నివారణ యగుటకు యంత్రము

ఇది చేసి చూసి నిదర్శనము చూచుకొనుడు.

| 46 | 1 | 85 | 85 |
|---|---|---|---|
| 8 | 9 | 22 | 25 |
| 37 | 27 | 9 | 55 |
| 7 | 9 | 39 | 8 |

ఈ యంత్రమును మంగళ వారము నాడు రాగి రేకు మీద గంటముతో వ్రాసి మీ యిష్ట దైవము ముందు వుంచి కొబ్బరి కాయ కొట్టి నైవేద్యము పెట్టి గుగ్గిలం పొగవేసి పసుపు పెట్టి పట్టుదారముతో చుట్టి పిల్లల మెడలో కట్టిన యెడల దృష్టి దోషము నివారించును మరితగలదు.

### శత్రువును జయించుటకు యంత్రము

ఇది చేసి చూసి నిదర్శనము చూచుకొనుడు.

| 6 | 3 | 2 | 7 |
|---|---|---|---|
| 6 | 3 | 10 | 9 |
| 12 | 7 | 8 | 1 |
| 4 | 5 | 8 | 11 |

ఈ యంత్రాన్ని తెల్ల జిల్లేడు ఆకుమీద వ్రాసి యంత్రము క్రింద శత్రువు పేరు వ్రాసి మంగళవారం రోజున శ్మశానములో పాతిపెడితే ఎంతటి గొప్ప శత్రువయినా లొంగిపోతాడు.

### పసిబిడ్డలకు రక్షా యంత్రము

ఇది చేసి చూసి నిదర్శనము చూచుకొనుడు.

| 19 | 19 | 19 | 19 |
|---|---|---|---|
| 19 | 19 | 19 | 19 |
| 19 | 19 | 19 | 19 |
| 19 | 19 | 19 | 19 |

ఈ యంత్రాన్ని రాగిరేకు మీద గంటముతో వ్రాసి మీ యిష్ట దైవము ముందు వుంచి కొబ్బరికాయ కొట్టి నైవేద్యము పెట్టి నల్ల దారముతో ఈయంత్రాన్ని చుట్టి చిన్న పిల్లల మొలలో గాని మెడలో గాని కడితే చంటి పిల్లల బాల గ్రహ దోషాలు గాలి దోషాలు దృష్టి దోషాలు సమస్తము తొలగిపోయి సౌఖ్యముగా వుంటారు.

## మంత్ర, యంత్ర, తంత్రములు సిద్ధించుటకు ఆవశ్యకమైన ఉపాయములు

సాధకునకు మంత్రములు సిద్ధించుటకు సద్గురువు యందు భక్తి మంత్రములయందు శ్రద్ధ, సదాచారము, సాహసము ముఖ్యముగా కావలయును. సాధారణముగా ఒక మనిషి చేత పనిచేయించు కోవలెనని అతని మనస్సును ఎంతో సంతోషపెడితేనేగాని పని జరుగుటలేదు. అట్టి విషయములో దేవతలచేత పనులు చేయించు కోవలెనని ఆ దేవతలను భక్తిశ్రద్ధలుంచే ఎంత సంతోష పెట్టవలసి యున్నదో సులభముగా తెలియుచున్నది. మరియూ యిది కలియుగము గావున యితర యుగములయందు మంత్రములకు చెప్పిన జపసంఖ్యకు యీ కలియుగములో నాలుగురెట్లు ఎక్కువ జపము చేయవలెయును. మరియూ మంత్రము సిద్ధించే వరకూ బ్రహ్మచర్య వ్రతము పళ్లుపులు, ఒంటిపూట భోజనము, నేలపై పరుండుట మొదలైన సదాచారములు ముఖ్యముగా చేయవలెయును. అందుకు శాస్త్ర ప్రమాణము ఈ విధముగా కలదు.

శ్లో. జప్యార్ధ్వా వరాన్నైవసాత్ర ద్వా ప్రతి గ్రహాః ।
మహోద్యజ్ఞవర ప్రీతిః కరం సిద్ధిర్భవాపనే ।

తా॥ వరాన్న భోజనము వలన వాలుక పొటై పోవుచున్నది. దానములు పుచ్చుకొనుట వలన చేతులు వెడిపోవుచున్నవి. పర స్త్రీల వలన మనస్సు వెడిపోవు చున్నది. ఇట్లుండగా సాధకునకు మంత్రసిద్ధి ఎట్లు కలుగును.

అది యీ విధముగా పూర్వపు మహర్షులు చెప్పి నిర్ణయించి యున్నారు. కనుక సాధకులు సదాచారములో శ్రద్ధా భక్తి విశ్వాసములతో జపసంఖ్యకు నాల్గురెట్లు ఎక్కువగా మంత్ర జపములు జేసిన యెడల మంత్రసిద్ధిని బడయగలరు.

## సమస్తమూ కర్మఫలము వల్లనే కలుగును

శ్లో॥ సుఖం దుఃఖం భయం శోకమానందం కర్మణః ఫలం ।
సుకర్మణః సుఖం హర్ష మితరే పాపకర్మణః ।
(బ్రహ్మ వైవర్త పురాణం, గణపతి ఖండం)

తా॥ సుఖ దుఃఖములు, భయ శోకములు, ఆనందము ఇవి అన్నియూ (తాహాపర్యన) కర్మ ఫలములే, సుఖము ఆనందములు సత్కర్మ ఫలములు, తదితరమైన (దుఃఖము – భయము – శోకములు) దుష్కర్మ యొక్క ఫలములు.

## ద్వాత్రింశ దక్షరగణపతి మాలా మంత్రము

మూలమంత్రము : "ఓం శ్రీం హ్రీం క్లీం గణేశ్వరాయ బ్రహ్మ స్వరూపాయ గురవే సర్వసిద్ధి ప్రదాయ విఘ్నేశాయ నమోనమః"

విధానము : గణపతియొక్క ఈ మంత్రజపము సమస్త కోరికలను నెరవేర్చి, ధర్మార్థ కామ మోక్షములను యిచ్చునట్టి సమస్తమైన సిద్ధులను యిచ్చునట్టిది అయి యున్నది. దీనిని ఐదు లక్షలు జపము చేసినచో మంత్ర సిద్ధి యగును. భారతదేశములో మంత్ర సిద్ధిని పొందిన వ్యక్తి విఘ్నరహితుడగును. అట్టి సిద్ధి పొందిన వ్యక్తి యొక్క పేరును స్మరించినంత మాత్రముననే సమస్త విఘ్నములు పారిపోవును. అట్టివాడు నిశ్చయముగా మహాపండితుడు, మహాసిద్ధుడు, సమస్తసిద్ధులు లభించినవాడు. బ్రహ్మణైన కల్పంలో బ్రహ్మను, విద్యాంసుల గురువుకు గురువు జగత్తునకు సాక్షాత్తు సాక్షియూ కాగలడు.

## విఘ్నములు తొలగిపోయి కోరికలు నెరవేరుటకు

మూలమంత్రము : "ఓం గం గ్లౌం గణపతయే విఘ్నవినాశినే స్వాహా"

విధానము : గోలోక నివాసిని యగు రాధాదేవి గణేశుని యీ షోడశాక్షరీ మంత్రమును జపించి తత్ఫలితముగా తన ప్రాణనాథుడైన శ్రీకృష్ణుని పొందినది. ఒక లక్ష జపము చేసినచో మంత్ర సిద్ధియగును. చేసెడి ప్రయత్నములలో విఘ్నములు వచ్చు చుండెడివారు, ఈ మంత్ర, జపము చేసి, తమ ప్రయత్నము లలో ప్రారబ్ధవశమున గాని, మరియే యితర కారణముల వల్లగాని వచ్చెడి విఘ్నములను నివారణ చేసికొని, కోరిన కోరికలను నెరవేర్చుకొనగలరు.

## గణపతి షడక్షరీ మంత్రము

మూలమంత్రము : "వక్రతుండాయ హుం"

విధానము : బ్రహ్మదేవుడు తాను చేసెడి సృష్టి కార్యక్రమములో విఘ్నములు ఎన్నోమార్లు వచ్చుచుండుట వల్ల గణేశుని యీ మంత్రమును జపించి, గణపతి అనుగ్రహము పొంది, అటు పిమ్మట నిర్విఘ్నముగా తన సృష్టి కార్యక్రమమును నెరవేర్చెను. తామనుకొనెడి ప్రయత్నములు పూర్తి కాకుండా తరచు విఘ్నములు సంభవించు చుండెడివారు, గణేశుని యీ షడక్షరీ మంత్రమును భక్తి పూర్వకముగ జపించి, విఘ్నములు రాకుండా చేసికొని, గణపతి అనుగ్రహమువల్ల కార్యసాఫల్యత పొందవచ్చును. కార్తికేయ స్వామి ఈ మంత్రమును జపించి తత్ఫలితముగా తారకాసురుని వధించెను.

## గణపతి దశాక్షరీ మంత్రము

మూలమంత్రము : "గం క్షిప్ర ప్రసాదనాయ నమః"

విధానము : దుఃఖమువల్ల పీడింపబడుచు దిక్కులేని వారై అన్ని విధముల బాధలు పడుచూ జ్ఞానారియనెడి రాక్షసుని సంహరించెడి విధానము తెలియక బాధలు పడుచున్న దేవతలు విష్ణుమూర్తి ఉపదేశించిన ఈ మంత్రమును జపించిరి. తత్ఫలితముగా జ్ఞానారి యనెడి రాక్షసేశ్వరుని బాధలనుండి విముక్తి పొంది, తిరిగి తమ స్వర్గరాజ్యమును పొంది సుఖపడిరి. ఆపదలు, దుఃఖములు బాధలలో నుండి దిక్కులేని వారై తమ కష్టములు తొలగించుకొనుటకు ఏ మార్గమూ తెలియనివారు, లోకనివాసులను మానవులు ఈ మంత్ర జపము చేసి తమను ముట్టడించి యున్న ఆపదలు – కష్టములు – దుఃఖముల నుండి విముక్తిని పొంది గణేశుని అనుగ్రహము వల్ల సమస్త సుఖములు – సంపదలు పొందవచ్చును.

## వివిధ గణేశ గాయత్రీ మంత్రములు

1. "ఓం విఘ్నరాజాయ విద్మహే । హస్తి ముఖాయ ధీమహి । తన్నోదంతి ప్రచోదయాత్।
2. "ఓం తత్పురుషాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి । తన్నోదంతి ప్రచోదయాత్।
3. "ఓం ఏకదంతాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి । తన్నోదంతి ప్రచోదయాత్"
4. "ఓం లంబోదరాయ విద్మహే । మహోదరాయ ధీమహి । తన్నోదంతిః ప్రచోదయాత్"
5. "ఓం మహాకాయాయ విద్మహే । వక్రతుండాయ ధీమహి । తన్నోదంతిః ప్రచోదయాత్।

విధానము: వేదములు, ఉపనిషత్తులు, పురాణములలో చెప్పబడిన పై ఐదు విధములైన గణేశగాయత్రీ మంత్రము గణపతి భక్తులకు సమస్త శుభములను – లాభములను కలిగించునవై యున్నవి. కాన గణపతి గాయత్రీ మంత్రములు ఈ ఐదింటిలో తమకు యిష్టమైన ఏ గాయత్రీమంత్రజపమును జేసినప్పటికీ ఒకే విధమైన ఫలితములు లభించగలవు. వీటి జపమువల్ల విఘ్నములు తొలగిపోవుట, మనోవాంఛలు నెరవేరుట, ఆపదలు – కష్టములు – దుఃఖములు

తొలగిపోవుట, సమస్త సంపదలు లభించుట, వశీకరణశక్తి, మేధాశక్తి, కవిత్వము చెప్పగలుగుట - మొదలుగాగల ఫలితములు పొంద వచ్చును. ఇంతేగాక ధర్మ, అర్థ, కామ, మోక్షములనెడి చతుర్విధ పురుషార్థములు గణేశ గాయత్రీ మంత్రజపమువల్ల లభించును.

## వివిధ గణపతి మంత్రములు

### మహాగణపతి మంత్రములు

1. "ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వర వరద సర్వజనం మే వశమానయ స్వాహా"
2. "ఓం హ్రీం గం హ్రీం మహాగణపతయే స్వాహా"
3. "ఓం హ్రీం గం హ్రీం వశమానయ స్వాహా"

### హేరంబ గణపతి మంత్రములు

1. "ఓం గూం నమః"
2. "గం క్షిప్ర ప్రసాదనాయ నమః"

### హరిద్రా గణపతి మంత్రము

ఏకాక్షర మంత్రము - "గ్లౌం"

### ఉచ్ఛిష్ట గణపతి మంత్రము

"ఓం హస్తి పిశాచిని లిఖే స్వాహా"

**విధానము :** పైన వివరించిన వివిధ గణపతి మంత్రములలో ఎవరికి యిష్టమువచ్చిన మంత్రమును వారు జపించి మంత్రసిద్ధి పొందవచ్చును. ఉచ్ఛిష్ట గణపతి మంత్రమును మాత్రము అశుచిగా, ఎంగిలి నోటితో జేయవలయునని, ఫలములనో, ఉండ్రాళ్ళనో తినుచూ మానసికముగా జపించవలెను. తంత్ర శాస్త్రములలో చెప్పబడియున్నది మిగతా గణపతి మంత్రములన్నియూ స్నానముచేసి, శుచియై జపించవలెను. వీటిలో ఏ మంత్రమును జపించినప్పటికీ, ఎవరు ఏ కోరికతో జపించెదరో వారికి ఆయా ఫలితములు శీఘ్రముగా లభించగలవు.

### సమస్తమైన కష్టములు తొలగించే సులభమైన గణపతి మంత్ర జప విధానము

మూలమంత్రము : "ఓం గం గణపతయే నమః"

విధానము : ఉదయం స్నానముచేసి పరిశుద్ధులై, పవిత్ర ప్రదేశములో దర్భలతో చేసిన చాపమీదగాని, పీటమీదగాని, తూర్పు దిక్కుగానో ఉత్తర దిక్కుగానో ముఖము వుండునట్లుగ కూర్చొన వలెను గణపతి విగ్రహమును గానిచిత్రపటమును గాని ఎదుట పెట్టుకొనవలెను గంధము, పుష్పము, అక్షతలతో గణపతిని పూజించి ధూప, దీప నైవేద్యములను సమర్పించి, "నేలాగా పని నెరవేరుటకుగాను ప్రతిరోజూ నేను యీ మంత్రమును యింత సంఖ్యలో జపము చేయదలచితిని" అని మొదటిరోజున సంకల్పము చేయవలెను. అటు తరువాత ఏకాగ్రచిత్తులై పై గణపతి మంత్ర జపమును ప్రారంభించవలెను.

జపసమయములో జపము ప్రారంభించి నప్పటినుంచి పూర్తి అయ్యేటంత వరకు గణపతికి కుడివైపున నేతితో వెలిగించిన దీపముపుంచవలెను. దీపము క్రింద అక్షతలు పుష్పములు వుంచ వలెను. ప్రతిరోజూ 108 మాలలు జపము చేయుట శ్రేష్ఠము అనగా ఒక్కొక్క మాలకు 108 మంత్రజపము అగును. 108 మాలలు అనగా పదకొండువేల ఆరువందల అరవైనాల్గు పర్యాయ ములు పై మంత్రమును ప్రతి రోజూ జపము చేయుట ఉత్తమము. అలా చేసినచో త్వరగా ఫలితములు కనిపించును. ఆ మాదిరిగా వీలుకానివారు 55 మాలలు (అయిదు వేల తొమ్మిదందల నలభై) గాని, 31 మాలలు (మూడు వేల మూడువందల నలభై ఎనిమిది) గాని, 11 మాలలు (పదకొండు వందల ఎనభై ఎనిమిది పర్యాయములు) గాని మంత్రజపముచేయవచ్చును. తాను కోరు కొనిన పని నెరవేరు నంతవరకు యీ జపము చేయుచుండవలెను. స్వయముగా జపముచేయజాలని వారుబ్రాహ్మణునిచే ఈ జపము జేయించుకొనవచ్చును.

ఏ విధమైన ప్రత్యేక కోరికయూ లేనివారు ప్రతిరోజూ పై గణపతి మంత్రమును ఏదో ఒక నియమిత సంఖ్యలో అనగా 108 పర్యాయములు గాని ఒక వెయ్యి ఎనిమిది పర్యాయములు గాని, అంతకంటె ఎక్కువ పర్యాయములు గాని జపము జేయు చున్నచో, అట్టి వ్యక్తికి సమస్తమైన శుభఫలితములు కలుగును. అతడు అన్ని విధముల అభివృద్ధి పొందును.

పై మంత్ర జపమువల్ల భార్యా భర్తల మధ్యనుండే తగవులు, కుటుంబ కలహములు, ఫ్యాక్టరీలలో సమ్మెలు, వ్యాపార నష్టము, కోర్టు వ్యవహారములు, ప్రభుత్వ సంబంధమైన చిక్కులు, ఋణబాధలు, మొండి వ్యాధులచే బాధింపబడుట - మొదలుగాగల సమస్తమైన ప్రాపంచిక కష్టములు-బాధల నుండి విముక్తి పొంద వచ్చును. ఈ రీతిగా ఈ మంత్ర జపముచేసి గణపతి అనుగ్రహమువల్ల తమ కష్టములను సులభముగా నివారణ జేసికొనవచ్చును.

### ఉచ్ఛిష్ట గణపతి ఉపాసనా మంత్రములు

తంత్ర శాస్త్రగ్రంథములలో ఉచ్ఛిష్ట గణపతి మంత్రము 'మంత్రము లన్నింటి సారము' అని వర్ణింపబడి యున్నది. ఈ దేవతను ఆరాధించుటకు తిథి, వార నక్షత్రాది నియమములు ఏవియూ లేవు. ఉపవాసాది నియమములు కూడా లేవు. ఎవరు ఏ కోరికతో ఈ దేవుని ఆరాధించెదరో వారికి ఆ కోరిక నెరవేరును.

ఈ దేవుని ఆరాధించు విధానములు రకరకములుగా వున్నవి అయినప్పటికీ ఎక్కువ గ్రంథముల అభిప్రాయానుసారము యీ దేవుని ఆరాధించుటకు పూజాదులు చేయవలసిన పనిలేదు. కేవలము మానసికముగా ఈ మంత్రజపము చేసిన చాలును.

లడ్డూలు తింటూ జపము చేయవలెనని కొన్ని గ్రంథములు ఫలములను భక్షిస్తూ జపము చేయవలెనని కొన్ని గ్రంథములు చెప్పుచున్నవి. కాన ఎవరి వీలునుబట్టి వారు ఆ చెప్పిన విధముగా జేయవచ్చును. పదహారువేలు జపము జేసినచో మంత్రసిద్ధి యగును.

**సంకల్పము :** అస్య శ్రీ ఉచ్ఛిష్ట గణేశ మంత్రస్య - సుహోర ఋషిః - నిచృద్ గాయత్రీ ఛందః । ఉచ్ఛిష్ట గణపతిర్దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

**అంగన్యాసము :** ఓం సుహోర ఋషయే నమః శిరసి । ఓం నిచృద్ గాయత్రీ ఛందసే నమః ముఖే । ఓం ఉచ్ఛిష్ట గణపతయే నమః హృదయే । వినియోగాయ నమః సర్వాంగే ।

**కరన్యాసము :** ఓం అంగుష్ఠాభ్యాం నమః । ఓం తర్జనీభ్యాం స్వాహా ఓం మధ్యమాభ్యాం వషట్ । ఓం అనామికాభ్యాం హుం । ఓం కనిష్ఠి కాభ్యాం వౌషట్ । ఓం కరతలకర పృష్ఠాభ్యాంఫట్ ।

**హృదయన్యాసము :** ఓం హృదయాయనమః । ఓం శిరసేస్వాహా ఓం శిఖాయై వషట్ । ఓం కవచాయహుం । ఓం నేత్రత్రయాయ వౌషట్ । ఓం అస్త్రాయ ఫట్ ।

**ధ్యానము :**

రక్తమూర్తిం గణేశంచ సర్వాభరణ భూషితం ।
రక్త వస్త్రం త్రినేత్రంచ రక్తపద్మాసనే స్థితం ।
చతుర్భుజం మహాకాయం ద్విరదంతం సుస్మితాననం ।
ఇష్టం చ దక్షిణేహస్తే దంతం చ దధతం కరే ।

మంత్రము : "ఓం ప్రణో దేవి సరస్వతీ వాజేభిర్వాజినీవతీ । ధీనామ విత్ర్యవతు."

విధానము : ఈ మంత్రజపము సాధకునకు తన జీవితములో ఏ విషయమును గురించి అసంతృప్తి గలదో ఆ అసంతృప్తిని పోగొట్టి ఆ విషయములో అతనికి పూర్ణమైన సంతృప్తి కలుగునట్లు అనుగ్రహించును.

## రెండవ మంత్రము

సంకల్పము : అస్య శ్రీ ఆనోదివ్ మంత్రస్య అత్రిఋషిః త్రిష్టుప్ ఛందః సరస్వతీ దేవతా హ్రీం బీజం । హ్రీం శక్తిః హ్రీం కీలకం మమాభీష్ట కార్యసిద్ధ్యర్థే జపే వినియోగః

అంగన్యాసము : అత్రి ఋషయేనమః శిరసి । త్రిష్టుప్ ఛందసే నమోముఖే సరస్వతీ దేవతాయైనమో హృది హ్రీం బీజాయ నమోగుహ్యే హ్రీం శక్తయేనమః పాదయోః హ్రీం కీలకాయ నమోనాభౌ వినియోగాయనమః సర్వాంగే ।

కరన్యాసము : హ్రీం ఆనోదివ్ అంగుష్ఠాభ్యాంనమః బృహతః పర్వతాదా సరస్వతీ తర్జనీభ్యాం నమః యజతాగంతు యజ్ఞం మధ్య మాభ్యాం నమః హవందేవీజుజుషాణాఘృతాచీ అనామికాభ్యాంనమః । శగ్మాంనో కనిష్ఠి కాభ్యాంనమః । వాచము శరోశృణోతు కరతలకరపృష్ఠాభ్యాం నమః

ఏవం హృదయాదిన్యాసః

మంత్రము : "హ్రీం ఆనోదివో బృహతః పర్వతాదా సరస్వతీ యజతాగంతు యజ్ఞం । హవందేవీ జుజుషాణాఘృతాచీ శగ్మాన్నో వాచముశతీ శృణోతు"

విధానము : ఈ మంత్రము ఏకోరికతో చేసెదరో ఆ కోరిక మహాసరస్వతీ అనుగ్రహమువల్ల నెరవేరును.

## మూడవ మంత్రము

సంకల్పము : అస్య శ్రీ అంబితమే మంత్రస్య - కృత్సమద ఋషిః - అనుష్టుప్ ఛందః - సరస్వతీ దేవతా - ఐం బీజం - ఐం శక్తిః ఐం కీలకం - మమ అభీష్ట కార్యసిద్ధ్యర్థే జపే వినియోగః.

అంగన్యాసము : ఓం కృత్సమద ఋషయేనమః శిరసి - అనుష్టుప్ ఛందసే నమోముఖే - సరస్వతీ దేవతాయై నమో హృదయే - ఐం బీజాయ నమోగుహ్యే - ఐం శక్తయే నమః పాదయోః - ఐం కీలకాయ నమోనాభౌ - వినియోగాయ నమః సర్వాంగే ।

కరన్యాసము : ఐం అంబితమే అంగుష్ఠాభ్యాం నమః - నదీతమేదేవితమే తర్జనీభ్యాం నమః - సరస్వతీ మధ్య మాభ్యాం నమః అప్రశస్తా ఇవస్మసి అనామికాభ్యాంనమః । ప్రశస్తి మంబ కనిష్ఠికాభ్యాం నమః - నస్కృధి కరతల కరపృష్ఠాభ్యాం నమః । ఏవం హృదయాదిన్యాసః ।

మంత్రము : "ఐం అంబితమే నదీతమే దేవితమే సరస్వతీ అప్రశస్తా ఇవస్మసి ప్రశస్తిమంబ నస్కృధి"

విధానము : ఈ మంత్ర జపమువల్ల ధనాగమము, అప్రతిష్ఠలు తొలగిపోవుట, ప్రతిష్ఠ ధనసంపదలు, గొప్పదనములు లభించును.

## తారామంత్రములు

సంకల్పము : అస్య శ్రీ తారామంత్రస్య । అక్షోభ్య ఋషిః । బృహతీ ఛందః తారాదేవతా । హ్రీం బీజ త్రీం శక్తిః హూం కీలకం, మమ అభీష్ట సిద్ధయే జపే వినియోగః ।

మంత్రము : "హ్రీం త్రీం హూం"

విధానము : ఈ మంత్రమును పదిలక్షలు జపము చేసినచో మంత్రసిద్ధి యగును. ఈ మంత్రజపమువల్ల సాధకుడు గొప్ప పండితుడు, కవి కాగలడు. అంతేగాదు, యితరులు అతనిని జయింప జాలనంతటి శక్తివంతుడగును. అతని యింట సరస్వతి - లక్ష్మీ రెండూ నివసించుటేగాక, ప్రజలకు ఆనందము, రంజకత్వముల నివ్వగల వాడగును ప్రజలు అతని పట్ల గౌరవ - ఆదరణలు గలవారగుదురు.

## బ్రహ్మదేవుడు ఉపాసించిన తారా మంత్రము

"ఓం త్రీం హ్రీం హూం హ్రీం హూం ఫట్"

## విష్ణుదేవుడు ఉపాసించిన తారా మంత్రములు

1. "ఐం హ్రీం శ్రీం క్లీం సౌః హూం ఉగ్రతారే హూం ఫట్"
2. "ఓం హూం హ్రీం క్లీం సౌః హూం ఫట్"

## చతుర్ముఖుడు ఉపాసించిన తారామంత్రము

1. "ఐం హ్రీం శ్రీం క్లీం హూం సౌః హూం ఉగ్రతారే హూం ఫట్"
2. "ఓం హూం హ్రీం క్లీం హూం సౌః హూం ఫట్"

## ఏక జటా మంత్రము

1. "ఓం హ్రీం హూం హ్రీం హూం ఫట్"
2. "త్రీం హ్రీం హూం ఫట్"

## నారాయణీ మంత్రము

మంత్రము : "త్రీం హూం ఫట్ క్లీం ఐం"

విధానము : ఈ పై నగల తారామంత్రములలో ఎవరికి యిష్టము వచ్చిన తారామంత్రమును వారు జపించవచ్చును. సంకల్పము పలితములు ప్రథమమునందుగల తారామంత్రములో వలెనే అని గ్రహించవలెను.

## నీల సరస్వతీ మంత్రము

సంకల్పము : అస్యశ్రీ నీల సరస్వతీ మంత్రస్య । బ్రహ్మఋషిః । గాయత్రీ ఛందః । నీల సరస్వతీ దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము : "ఓం శ్రీం హ్రీం [illegible] హూం ఫట్ నీల సరస్వత్యై స్వాహా"

విధానము : ఈ నీల సరస్వతీ మంత్రమును ఎవరు ఏ కోరికతో జపము చేసెదరో వారికి ఆయా కోరికలు నెరవేరును.

## మధుమతీ మంత్రము

సంకల్పము : అస్యశ్రీ మధుమతీ మంత్రస్య మధుఋషిః । త్రిష్టుప్ ఛందః మధుమతీ దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము : "ఓం హ్రీం క్రోం క్లీం హంసఓం స్వాహా"

విధానము : ఈ మంత్ర జపమువల్ల కోరిన రీతిగ కవి - గౌరవాదులు గల భార్య లభించును. ఒక లక్ష జపము చేసినచో మంత్రసిద్ధి యగును. మధుమతీ దేవత అనుగ్రహమువల్ల కోరిన రీతిగ సుఖ - భోగములు లభించును. యాభై లక్షలు పై మంత్ర జపము చేసినచో విద్యలలో పారంగతుడగును.

## వివిధ భోగముల నిచ్చెడి ప్రమోదా మంత్రము

సంకల్పము : అస్య శ్రీ ప్రమోదా మంత్రస్య । శక్తి ఋషిః । గాయత్రీ ఛందః । ప్రమోదాదేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము : "హ్రీం ప్రమోదే స్వాహా"

విధానము : ఈ మంత్ర జపమువల్ల సాధకుడు నానా విధములైన భోగముల ననుభవించును.

## జంబీదేవి మంత్రము

సంకల్పము : అస్య శ్రీ జంబీ మంత్రస్య । భైరవ ఋషిః । త్రిష్టుప్ ఛందః । జంబీ దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే । జపే వినియోగః

మంత్రము : "ఓం హిలి హిలి జంబీ దైవ్యై నమః"

విధానము : ఈ మంత్ర జపమువల్ల మానవుడు తాను ఏ సంకల్పముతో ఈ జపము చేయునో ఆ సంకల్పము నెరవేరును ఒక లక్ష జపము చేసినచో మంత్రసిద్ధి యగును.

## చెరసాల నుండి విడిపించే జంబీ దేవి మంత్రము

సంకల్పము : అస్య శ్రీ జంబీ మంత్రస్య । భైరవఋషిః । త్రిష్టుప్ ఛందః । జంబీ దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే । జపే వినియోగః ।

మంత్రము : "ఐం హ్రీం శ్రీం జంబీ అముకం బంధమోక్షం కురుకురుస్వాహా"

విధానము : చెరసాలలో వున్న వ్యక్తిని విడిపించుటకై ఈ మంత్రమును జపము చేయవలెను. ఈ మంత్రములో అముకం అని వున్న చోటున చెరసాల నుండి విడిపించ వలసిన వ్యక్తి పేరును చేర్చి 'అముకం' అనే మాట తీసివేయవలెను. ఈ మంత్ర జపము రోజుకు ఒక వెయ్యి సంఖ్యన చేయు చుండవలెను. మంత్ర ప్రభావమువల్ల త్వరలోనే చెరసాల యందున్న వ్యక్తి విడుదలయగును.

## వటయక్షిణీ మంత్రము

సంకల్పము : అస్య శ్రీ వట యక్షిణీ మంత్రస్య । విశ్వామిత్రఋషిః । పంక్తి ఛందః । యక్షిణీ దేవతా మమ అభీష్ట సిద్ధ్యర్థే । జపే వినియోగః ।

మంత్రము : "శ్రీం శ్రీం యక్షిణీ హం హం హం స్వాహా"

విధానము : ఈ మంత్రము రోజుకు ఒక వెయ్యి సంఖ్యన జపముచేయుచున్నచో కొంత కాలమునకు వటయక్షిణీ అనుగ్రహించినదై సాధకునకు గల సమస్త కోరికలను నెరవేర్చును.

## వ్యాధి నివారణ చేసే విశాలాక్షి మంత్రము

మంత్రము : "ఓం ఐం విశాలే హ్రీం శ్రీం క్లీం స్వాహా"

విధానము : ఈ మంత్రమును ఒక లక్ష జపము చేసినచో అట్టి వ్యక్తి రోగనివారణ పొందుటేగాక దీర్ఘాయువు గలవాడగును.

## శత్రుభయము లేకుండాచేసే, శత్రునిరోధము చేసే వారాహి మంత్రము

అస్య శ్రీ శత్రునాశిను మంత్రస్య । కపిలఋషిః । అనుష్టుప్ ఛందః । వారాహివార్తాళీ దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః.

మంత్రము : "ఐం గ్లౌం ఠం ఠం ఠం హం స్వాహా"

విధానము : ఈ మంత్రమును ఒక లక్ష జపము చేసినచో వారాహి వార్తాళిదేవి అనుగ్రహమువల్ల అతనికి శత్రుభయము లేకుండా పోవుటేగాక, శత్రువు అతనికి కలిగించే ప్రమాదము శత్రువునకే ఎదురు తగులును.

## శత్రునాశన మొనర్చే ధూమావతీ మంత్రము

సంకల్పము : అస్య శ్రీ ధూమావతీ మంత్రస్య పిప్పలాదఋషిః నిచృచ్ఛందః । జ్యేష్ఠా దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః.

మంత్రము : "ధూం ధూం ధూమావతి స్వాహా"

విధానము : ఈ మంత్రమును ఒక లక్ష జపము చేయుట వల్ల సాధకునకు కీడును కలిగించుచున్న శత్రువులు నాశనమగుదురు. వారు అతనికి ఏవిధమగు కీడును చేయజాలక పోవుటేగాక, అట్టి వారు తాము చెడ్డపనుల వల్ల కలిగే దుష్ఫలితమును తామే అనుభవించుచుందురు.

## శీతలామంత్రము

సంకల్పము : అస్య శ్రీ శీతలా మంత్రస్య । ఉపమన్యు ఋషిః బృహతీ ఛందః । శీతలాదేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే । జపే వినియోగః

మంత్రము : "హ్రీం శ్రీం శీతలాయై నమః"

విధానము : ఈ మంత్రమును పదివేలు జపము చేసినచో మశూచి, స్ఫోటక వ్యాధులు నివారణయగును.

## స్వప్నేశ్వరీ మంత్రము

సంకల్పము : అస్య శ్రీ స్వప్నేశ్వరీ మంత్రస్య । పిప్పలాద ఋషిః । నిచృచ్ఛందః । స్వప్నేశ్వరీ దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము : "ఓం శ్రీం స్వప్నేశ్వరీ కార్యం మే వద స్వాహా".

విధానము : ఈ మంత్రమును ఒక లక్ష జపము చేసినచో మంత్ర సిద్ధి యగును. అటు తరువాత ఏదైనా ఒక విషయము తెలిసికొనదలచినప్పుడు రాత్రి సమయమున పదివేలు ఈ మంత్ర జపము చేసి, నేలపైన చాపవేసుకొని, దానిపైన ఆ రాత్రి నిద్రించవలెను. ఆ రోజున స్త్రీ సంగమము చేయకుండా బ్రహ్మచర్యము పాటించవలెను. ఈరీతిగా చేసినచో ఆ రోజు రాత్రి స్వప్నేశ్వరీదేవి కలలో కనిపించి, మీరు ఏవిషయమును తెలిసికొను తలంపుతో జపము చేసిరో దానిని గురించిన భవిష్యత్తును గురించి కలలో చెప్పును.

## ఉచ్ఛిష్ట చాండాలీ మంత్రము

సంకల్పము : అస్య శ్రీ ఉచ్ఛిష్ట చాండాలీ మంత్రస్య । మతంగ ఋషిః అనుష్టుప్ ఛందః । మాతంగీ దేవతా । అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము : "ఓం హ్రీం ఐం శ్రీ నమోభగవతీ ఉచ్ఛిష్ట చాండాలీ శ్రీ మాతంగేశ్వరీ సర్వజన వశంకరీ స్వాహా"

విధానము : ఈ మంత్రమును ఒక లక్ష జపము చేసినచో మంత్రసిద్ధి యగును. ఈ మంత్ర ప్రభావమువలన సాధకునకు జగద్వశీకరణశక్తి లభించును.

## బాణేశీ మంత్రము

సంకల్పము : అస్య శ్రీ బాణేశీ మంత్రస్య । మోహన ఋషిః । బాణేశీ దేవతా మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము : "ద్రాం ద్రీం క్లీం బ్లూం సః"

విధానము : ఈ మంత్రము ఒక లక్ష జపము చేసినచో మంత్రసిద్ధి యగును. ఇష్ట వ్యక్తికి ప్రతి జీవి వశీకరణమగును. వివాహము కాని కన్య ఈ మంత్ర జపము చేసినచో ఆమెకు భర్త లభించును.

## కామేశీ మంత్రము

సంకల్పము : అస్య శ్రీ కామేశీమంత్రస్య । సంమోహన ఋషిః । గాయత్రీ ఛందః । కామేశీదేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము : "హ్రీం క్లీం ఐం బ్లూం స్త్రీం"

విధానము : ఈ మంత్రమును ఒక లక్ష జపము చేసినచో మంత్రసిద్ధి యగును. అతడు మన్మథునివలె లోక రంజకుడు, స్త్రీ రంజకుడు అగును.

## బాలా మంత్రము

సంకల్పము : అస్య శ్రీ బాలామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । పంక్తి చ్ఛందః । బాలాదేవతా । క్లీం శక్తిః సౌః బీజం మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము : "ఐం క్లీం సౌః"

విధానము : ఈ మంత్రమును మూడు లక్షలు జపము చేసినచో మంత్ర సిద్ధియగును. ఈ మంత్రసిద్ధి వల్ల అపమృత్యు భయము తొలగిపోవును. దీర్ఘవ్యాధులు నివారణయగును. ఆత్మజ్ఞానము, కవిత్వము చెప్పగల సామర్థ్యములు లభించును.

## బాలాత్రిపురా గాయత్రీ మంత్రము

మంత్రము : క్లీం త్రిపురాదేవ్యై విద్మహే - కామేశ్వర్యై ధీమహి - తన్నః (క్లిన్నే) బాలా ప్రచోదయాత్

విధానము : ఈ మంత్ర జపము చేయు సాధకునకు సమస్త సిద్ధులు లభించును. అతడు ఏకోరికతో మంత్ర జపము చేయునో ఆ కోరిక నెరవేరును.

## రహస్యమైన వివిధ బాలా మంత్రములు

సంకల్పము : అస్య శ్రీ బాలా మంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః పంక్తి చ్ఛందః బాలాదేవతా । ఐం బీజం క్లీం శక్తిః సౌః కీలకం । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రములు : (1) "హ్రీం క్లీం హంసః" (2) "క్లీం హ్రీం క్లీం సౌః హ్రీం క్లీం ఓం" (3) "ఐం క్లీం సౌః బాలాత్రిపురే స్వాహా"

విధానము : ఈ పై మూడు మంత్రములలో ఎవరికి ఏ మంత్రము ఇష్టమో ఆ మంత్రజపము చేయవచ్చును. అతడు ఏ కోరికతో మంత్రజపము చేయునో ఆ కోరిక నెరవేరును.

## కవిత్వము చెప్పగల శక్తినిచ్చే బాలా మంత్రం

సంకల్పము : అస్యబాలా మంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః గాయత్రీ ఛందః । త్రిపురా బాలా దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము : "హ్రీం శ్రీం క్లీం త్రిపురా భారతి కవిత్వం దేహి"

విధానము : ఈ మంత్ర జపము చేయుటవల్ల సాధకునకు చక్కని కవిత్వము చెప్పగల సామర్థ్యము లభించి గొప్ప కవికాగలడు.

## ఆరోగ్యము ఐశ్వర్యములు ఇచ్చే బాలా మంత్రము

సంకల్పము : అస్య శ్రీ బాలా మంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః గాయత్రీ ఛందః । త్రిపురాబాలా దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము : "హ్రీం హ్రీం హ్రీం ప్రౌఢ త్రిపురే ఆరోగ్యమైశ్వర్యం దేహి స్వాహా"

విధానము : ఈ మంత్రమువల్ల సాధకుడు ఆరోగ్యవంతుడు, ఐశ్వర్య వంతుడూ అయి సమస్త సుఖములను అనుభవించ గలడు.

## సమస్త శుభములనిచ్చే బాలా మంత్రము

సంకల్పము : అస్య శ్రీ బాలా మంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః గాయత్రీ ఛందః । త్రిపురా బాలాదేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రం : "హ్రీం శ్రీం క్లీం త్రిపురేమనసే సర్వం శుభం సాధయ స్వాహా"

విధానము : ఈ మంత్ర జపము చేయుటవల్ల సాధకునకు అన్ని విధములైన శుభములు లభించి జీవితమును సుఖవంతముగను ఆనందవంతముగను చేసికొనగలడు.

## ఆధ్యాత్మిక జ్ఞానమును, ప్రాపంచిక విద్యలను లభింపజేసే బాలా మంత్రము

సంకల్పము : అస్య శ్రీ బాలా మంత్రస్య దక్షిణామూర్తి ఋషిః । గాయత్రీ ఛందః । త్రిపురా బాలా దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము : "హ్రీం శ్రీం క్లీం బాలా త్రిపురే మహాయక్షాం విద్యాం కురుకురు నమః స్వాహా"

విధానము : ఈ మంత్రజపము చేయు సాధకునకు ఆధ్యాత్మిక జ్ఞానము సమస్తమైన ప్రాపంచిక విద్యలు లభించును.

## సమస్తమైన కోరికలు నెరవేర్చెడి బాలా మంత్రము

సంకల్పము : అస్య శ్రీ బాలా మంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః గాయత్రీ ఛందః । త్రిపుర బాలాదేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము : "హ్రీం శ్రీం క్లీం పరాపరే త్రిపురే సర్వమీప్సితం సాధయ స్వాహా"

విధానము : ఈ మంత్రజపము చేయుటవల్ల సాధకునకు సమస్తమైన కోరికలు బాలాత్రిపురాదేవి అనుగ్రహమువల్ల నెరవేరి సమస్తమైన సుఖభోగములను అనుభవించును. ఈ దిగువ వ్రాసిన సంకల్పమును చదివి ఆ తరువాత జపమును ప్రారంభించవలెను.

సంకల్పము

అస్య బాలామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । గాయత్రి ఛందః త్రిపురాబాలా దేవతాయను అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రములు

"ఐం క్లీం శ్రీం శ్రీం హ్రీం త్రిపురా లలితే మదీప్సితాం యోషితం దేహి । వాంఛితం కురుకురు స్వాహా"

విధానము

ఈ మంత్రమును జపముచేయు సాధకునకు అతడు కోరు కొనిన భార్య లభించును. భార్యా భర్తలు అన్యోన్య ప్రేమ గలవారై ఆనందముగ నుందురు.

## జగద్వశీకరణమును లభింపచేసే బాలా మంత్రము

సంకల్పము

అస్య శ్రీ బాలామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః గాయత్రి ఛందః । త్రిపురా బాలాదేవతా । మమ అభీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము

"ఐం క్లీం క్లీం శ్రీం శ్రీం శ్రీం హ్రీం హ్రీం హ్రీం త్రిపురసుందరీ సర్వం జగన్మమ వశం కురు కురు మహ్యం బలం దేహి స్వాహా ।

విధానము

ఈ మంత్రము జపము చేయు సాధకునకు జగద్వశీకరణ శక్తి లభించును. తద్వారా అతనికి పలుకుబడి వృద్ధియగును. ప్రజాసేవలో జీవితము గడపదలచు కొనినవారు, సాంఘిక సేవలోను, రాజకీయములలోను పనిచేయువారు, పనిచేయ దలచెడి వారునగు వ్యక్తులు ఈ మంత్రజపము చేయుచున్నచో అభివృద్ధికి రాగలరు.

## లఘు శ్యామా మంత్రము

సంకల్పము

అస్య శ్రీ లఘుశ్యామా మంత్రస్య । మదనఋషిః । వృ వర్గా యత్రీ ఛందః । దేవీ లఘుశ్యామా దేవతా । ఐం బీజం । స్వాహా శక్తిః । మమ అఖిలాభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము

"ఐం నమః ఉచ్ఛిష్ట చాండాలీ మాతంగీ సర్వవశంకరి స్వాహా"

ఈ మంత్ర జపమువల్ల సాధకుడు సమస్తమైన సిద్ధులను పొందును.

## అన్నపూర్ణా మంత్రము

సంకల్పము

అస్య శ్రీ అన్నపూర్ణా మంత్రస్య । ద్రుహిణఋషిః । కృతి ఛందః । అన్నపూర్ణేశ్వరీ దేవతా । మమ అఖిలాభీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము

ఓం హ్రీం శ్రీం క్లీం నమః భగవతి మాహేశ్వరి అన్నపూర్ణే స్వాహా

విధానము

ఈ అన్నపూర్ణా మంత్ర జపమువల్ల సాధకుడు తన మనస్సులో గల కోరికలను అన్నింటిని నెరవేర్చుకొన గలుగును.

## వారాహ మాధవ మంత్రము

మంత్రము

"ఓం నమో భగవతే వరాహరూపాయ భూర్భువః స్వః పతయే భూపతిత్వం మే దేహి దాపయ స్వాహా"

విధానము

ఈ మంత్రజపమువల్ల సాధకుడు అమితమైన భూసంపదకు అధిపతి కాగలడు.

## శివ మంత్రము

మంత్రము

"ఓం హౌం నమశ్శివాయ"

విధానము

ఈ మంత్రజపమువల్ల సాధకుడు సమస్త పాపముల నుండి విముక్తుడై ఐశ్వర్యవంతుడగును.

## అన్నాధిపతి మంత్రము

మంత్రము

"గ్లౌం అన్నం మహ్యమన్నం మేదేహి । అన్నాధిపతయే । మమాన్నం ప్రదాపయస్వాహా గ్లౌం"

విధానము

ఈ మంత్రజపము చేయుటవల్ల సాధకుడు తన యింట అంతులేని ఆహారపదార్థములు గలవాడగుటయే గాక షడ్రుచి సహితమైన విందుభోజనములు చేయుగల అదృష్టవంతుడగును.

## వివిధ అన్నపూర్ణా మంత్రములు

సంకల్పము

అస్య శ్రీ అన్నపూర్ణా మంత్రస్య । ద్రుహిణఋషిః । కృతి ఛందః । అన్నపూర్ణేశ్వరీ దేవతా । మమ అఖిల అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రములు

1. "ఓం హ్రీం నమః భగవతి మాహేశ్వరి అన్నపూర్ణే స్వాహా"
2. "ఓం హ్రీం శ్రీం క్లీం నమః భగవతి మాహేశ్వరి మమ అభిమతం అన్నం దేహి అన్నపూర్ణే స్వాహా ।
3. "ఓం శ్రీం హ్రీం నమో భగవతి ప్రసన్న పారిజాతేశ్వరి అన్నపూర్ణే స్వాహా
4. "ఓం శ్రీం హ్రీం నమః భగవతి మాహేశ్వరి ప్రసన్న వరదే అన్నపూర్ణే స్వాహా"

విధానము

ఈ మంత్రములలో ఎవరికి ఏ మంత్రము యిష్టమగునో వారు ఆ మంత్రమును జపించవచ్చును. ఈ మంత్రజపమువల్ల సాధకుడు తన మనస్సులో గల కోరికలను నెరవేర్చుకొనవచ్చును.

## జ్యేష్ఠ లక్ష్మీ మంత్రము

సంకల్పము

అస్య శ్రీ జ్యేష్ఠ లక్ష్మీ మంత్రస్య । బ్రహ్మ ఋషిః ఉష్ణిక్ఛందః । జ్యేష్ఠ లక్ష్మీ ర్దేవతా । హ్రీం బీజం । శ్రీం శక్తిః । మమ అభీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః

మంత్రము

"ఐం హ్రీం శ్రీం జ్యేష్ఠ లక్ష్మీ స్వయంభువే హ్రీం జ్యేష్ఠాయై నమః"

విధానము

ఈ మంత్ర జపముచేయు సాధకునకు డబ్బు కొరతరాదు. జ్యేష్ఠాదేవి అనుగ్రహమువల్ల అతనికి ఎల్లప్పుడూ ధనవృద్ధి యగుచుండును.

## నీల జ్యేష్ఠా గాయత్రీ మంత్రము

"ఓం రక్త జ్యేష్ఠా చ విద్మహే । నీలజ్యేష్ఠాయై ధీమహి । తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥"

### విధానము

ఈ మంత్ర జపము చేయు సాధకునకు ధనలోపము ఎన్నటికీరాదు నానాటికి అతనికి ధనవృద్ధియగు చుండును.

## అన్నద మంత్రము

అస్య శ్రీ జ్యేష్ఠా లక్ష్మీ మంత్రస్య । బ్రహ్మఋషిః । వృతద్గాయత్రీ ఛందః । వసుధాత్రీ దేవతా । గ్లాం బీజం హ్రీం శక్తిః । మమ అభీష్ట ప్రాప్త్యర్థే జపే వినియోగః ।

### మంత్రము

"ఓం గ్లాం శ్రీం అన్నం మహ్యన్నం మేదేహి । అన్నాధిపతయే మమ అన్నం ప్రదాపయ స్వాహా శ్రీం క్లీం గ్లాం శ్రీం

### విధానము

ఈ మంత్ర జపమువల్ల సాధకునకు భూసంపద ఐశ్వర్యము కోరిన భార్యయూ లభించును.

## స్వప్నవారాహీ జన వశంకర మంత్రము

అస్య శ్రీ స్వప్న వారాహీ మంత్రస్య । ఈశ్వరఋషిః । జగతీ ఛందః । స్వప్న వారాహీదేవతా । ఓం బీజం । హ్రీం శక్తిః । ఠః ఠః కీలకం । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

### మంత్రము

ఓం హ్రీం నమో వారాహి ఘోరే స్వప్నం ఠః ఠః స్వాహా ।

### విధానము

ఈ మంత్ర జపము వల్ల సాధకునకు జనవశీకరణ శక్తి లభించును శత్రువులు ఈ మంత్రజపము చేయువానికి ఏ విధమైన అపకారమును చేయజాలక అతని ప్రతిభకులొంగిపోయి. తమ అసమర్థతకు లోలోపల సిగ్గుపడెదరు.

## శత్రువులను దుష్టులను స్తంభింపచేసే వార్తాళీ మంత్రము

### సంకల్పము

అస్య శ్రీ వార్తాళీ మంత్రస్య । శివఋషిః । అతి జగతీ ఛందః । వార్తాళీ దేవతా । మమ అఖిలా భీష్ట ప్రాప్త్యర్థే జపే వినియోగః ।

### మంత్రము

"ఓం ఐం గ్లౌం ఐం నమో భగవతి వార్తాళి వారాహి । వారాహముఖి ఐం గ్లౌం ఐం అంధే అంధిని నమో రుంధే రుంధిని । నమోజంభే జంభిని । నమో మోహే మోహిని । నమః స్తంభే స్తంభిని । నమో ఐం గ్లౌం ఐం । సర్వదుష్ట ప్రదుష్టానాం । సర్వేషాం సర్వవాక్చిత్త చక్షుర్ముఖగతి జిహ్వా స్తంభనం కురు కురు । శీఘ్రం వశ్యం కురు కురు ఐం గ్లౌం ఐం ఠః ఠః హుం ఫట్ స్వాహా"

### విధానము

ఈ మంత్ర జపమువల్ల సాధకుడు సమస్త శత్రువులను దుష్టులను స్తంభింపచేయ గలుగును. వారుచేసెడి అన్ని విధములైన దుష్కార్యములు, దుష్ప్రయత్నములు నెరవేరక ఆగిపోవును.

## మాతంగేశ్వరీ మంత్రము

### మంత్రము

"ఐం క్లీం సౌః ఐం శ్రీ నమో భగవతి । మాతంగేశ్వరి మనోహరి । సర్వజన మనోహరి । సర్వరాజ వశంకరి సర్వముఖ రంజని సర్వస్త్రీ పురుష వశంకరి । సర్వ దుష్ట మృగ వశంకరి । సర్వలోక వశంకరి । హ్రీం శ్రీం క్లీం ఐం"

### విధానము

ఈ మంత్రజపమువల్ల సాధకుడు జనవశీకరణ శక్తి గలవాడగుటయేగాక, దుష్ట జంతువులను కూడ తన వశీకరణ శక్తికి లోబడి యుండునటుల చేసికొనగలుగును.

## మాతంగీ గాయత్రీ మంత్రము

### మంత్రము

"ఐం శుక ప్రియాయై విద్మహే । క్లీం కామేశ్వరీ ధీమహి । తన్నః శ్యామా ప్రచోదయాత్ ॥"

### విధానము

ఈ సుప్రసిద్ధమైన మాతంగీ. గాయత్రీ మంత్రమును జపము చేసిన సాధకుడు సమస్త సిద్ధులను పొందును. ప్రభువులైనను ప్రజ పుత్రులైనను - అతడు లోకములో కోలిల్లును.

## గోపాల మంత్రము

### సంకల్పము

అస్య శ్రీ గోపాల మంత్రస్య । నారద ఋషిః । విరాట్ ఛందః కృష్ణో దేవతా । క్లీం బీజం । స్వాహా శక్తిః మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

### మంత్రము

క్లీం కృష్ణాయ గోవిందాయ "గోపీ జనవల్లభాయ స్వాహా"

### విధానము

ఈ మంత్రము సమస్తమైన కోరికలను నెరవేర్చునట్టిది. ఈ మంత్రజపముచేయు సాధకుడు తన మనస్సులోగల కోరికలను నెరవేర్చు కొనగలుగును.

## దశావతార నృసింహ మంత్రము

### సంకల్పము

అస్య శ్రీ దశావతార మంత్రస్య । అత్రి ఋషిః । జగతీ ఛందః । నృకేసర్యవతారాన్ దేవతా । క్రౌం బీజం । ఓం శక్తిః । మమ అభీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః ।

### మంత్రము

"ఓం క్రౌం నమోభగవతే । నరసింహాయ । ఓం క్రౌం మత్స్య రూపాయ । ఓం క్రౌం కూర్మరూపాయ । ఓం క్రౌం వరాహరూపాయ । ఓం క్రౌం నృసిం హరూపాయ । ఓం క్రౌం వామనరూపాయ । ఓం క్రౌం పరశురామాయ । ఓం క్రౌం రామాయ । ఓం క్రౌం కృష్ణాయ । ఓం క్రౌం కల్కినేజయ జయ జయ సాల గ్రామ నివాసినే । దివ్యసింహాయ । స్వయం భువే పురుషాయ నమః । ఓం క్రౌం ॥

### విధానము

ఈ మంత్రజపము వల్ల సాధకుడు తన కోరికలన్నిటిని సులభముగ నెరవేర్చు కొనవచ్చును. ఏ వాంఛతో యీ మంత్రమును జపముచేయుదురో, ఆవాంఛ సులభముగా నెరవేరును అంతమున మోక్షమును కలుగజేయును.

## ఉదరరోగ నాశక మంత్రము

మంత్రము

"ఓం యో యో హనుమంత ఫల ఫలిత ధగ ధగిత ఆయురామపరుడాహా ఓం"

విధానము

ఈమంత్ర జపము చేయుటవల్ల హనుమంతుని కృపచే సమస్తమైన ఉదర వ్యాధులు నివారణయగును.

## గోవింద మంత్రము

సంకల్పము

అస్య శ్రీ గోవిందమంత్రస్య సమ్మోహనారద ఋషిః । గాయత్రీ ఛందః । త్రైలోక్య మోహనో దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము

"క్లీం హృషీకేశాయ నమః"

విధానము

ఈ మంత్ర జపమువల్ల సాధకుడు సర్వ సంపదలను, ఐశ్వర్యములను, సుఖభోగములను పొందును. ఈ జపము చేయువానికి పొందనలవికాని సంపద ఏదియూ వుండదు.

## గోపాల మంత్రము

సంకల్పము

అస్య శ్రీ ద్వాదశార్ణ గోపాల మంత్రస్య । బ్రహ్మఋషిః । గాయత్రీ ఛందః । కృష్ణోదేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము

"శ్రీం హ్రీం క్లీం కృష్ణాయ గోవిందాయ స్వాహా"

విధానము

ఈ మంత్ర జపమువల్ల సాధకుడు స్త్రీలకు ఎక్కువ ప్రీతి కరుడగును. అతడన్నచో స్త్రీలు తమకు తెలియకుండానే విచిత్రమైన విధముగా ఆకర్షింపబడెదరు.

## రుక్మిణీ వల్లభ మంత్రము

సంకల్పము

అస్య శ్రీ షోడశార్ణ గోపాల మంత్రస్య । నారదఋషిః । అనుష్టుప్ ఛందః । రుక్మిణీ వల్లభో హరిర్దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము

"ఓం నమో భగవతే రుక్మిణీ వల్లభాయ గోపీజనవల్లభాయ స్వాహా"

విధానము

ఈమంత్ర జపము వల్ల సాధకుడు లోకులనందరను సంమోహితు లనొనర్చి తనవైపుకు వారికి తెలియకుండానే వారినందరిని ఆకర్షించు కొనగలుగును.

## అష్టాక్షర కృష్ణ మంత్రము

సంకల్పము

అస్య శ్రీ అష్టాక్షర శ్రీ కృష్ణ మంత్రస్య । బ్రహ్మఋషిః । గాయత్రీ ఛందః । కృష్ణో దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము

"క్లీం గోవల్లభాయ స్వాహా"

విధానము

ఈ మంత్ర జపమువల్ల సాధకునకు స్త్రీ వశీకరణ శక్తి లభించును. స్త్రీ జనరంజకుడగును. స్త్రీలకు ప్రీతి పాత్రుడగును.

## గోపాల మంత్రము

సంకల్పము

అస్య శ్రీ కృష్ణ మంత్రస్య । నారద ఋషిః । గాయత్రీ ఛందః కృష్ణోదేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము

"క్లీం కృష్ణ క్లీం"

విధానము

ఈ మంత్ర జపమువల్ల సాధకుడు కల్పవృక్షమును ఆశ్రయించినవానికి ఏరీతిని ఏకొరతయూ లేకుండా సమస్తమూ లభించిన వాడగునో అదేరీతిగా సమస్తమును పొందగలుగును.

## సంతానము నిచ్చెడి కృష్ణ మంత్రము

సంకల్పము

అస్య శ్రీ గోపాల మంత్రస్య । నారద ఋషిః । అనుష్టుప్ ఛందః । సుత ప్రదః కృష్ణోదేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము

"దేవకీ సుత గోవింద వాసుదేవ జగత్పతే । దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణం గతః"

విధానము

ఈ మంత్రమును ఒక లక్ష జపము చేసినవారికి శ్రీకృష్ణ నుగ్రహమువల్ల పుత్ర సంతతి కలుగును.

## వ్యాధులను, దరిద్రమును పోగొట్టెడి రవి మంత్రం

సంకల్పము

అస్య శ్రీ సూర్య మంత్రస్య భృగు ఋషిః । గాయత్రీ ఛందః దివాకరో దేవతా । హ్రీం బీజం । శ్రీం శక్తిః మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము

"ఓం హ్రీం ఘృణిః సూర్య ఆదిత్యోం శ్రీం"

విధానము

ఈ మంత్ర జపము చేయుటవలన సాధకుడు సమస్త వ్యాధులు, పేదరికము నుంచి విముక్తి పొందినవాడై ఆరోగ్యవంతుడు ఐశ్వర్యవంతుడు అగును.

## పుత్ర సంతానమును, ధనమును యిచ్చెడి కుజమంత్రము

సంకల్పము

అస్య శ్రీ మంగళ మంత్రస్య । విరూప ఋషిః । గాయత్రీ ఛందః । ధరాత్మజో దేవతా । అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

మంత్రము

"ఓం హాం హం సం ఖం ఖః"

విధానము

ఈ మంత్ర జపముచేయువారికి పుత్రసంతతి ధన ధాన్యములు లభించును.

## అంగారక గాయత్రీ మంత్రము

### మంత్రము

"అంగారకాయ విద్మహే / శక్తి హస్తాయ ధీమహి / తన్నో భౌమః ప్రచోదయాత్"

### విధానము

ఈ అంగార గాయత్రీ మంత్రజపమువల్ల పుత్రసంతతి, ధనధాన్యములు లభించును.

## బృహస్పతి మంత్రము

### సంకల్పము

అస్య శ్రీ బృహస్పతి మంత్రస్య బ్రహ్మ ఋషిః అనుష్టుప్ ఛందః । సురాచార్యో దేవతా । బృం బీజం మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

### మంత్రము

"బృం బృహస్పతయే నమః"

### విధానము

ఈ మంత్రజపము వల్ల శత్రు రోగాది పీడలు, స్వజనములో వచ్చెడి కలహములు నివారణ యగును. బృహస్పతి గ్రహ దోషమువల్ల స్త్రీలకు వివాహము అగుటలో అయ్యెడి ఆలస్యము తొలగిపోవును. పుత్ర సంతతి కలుగును.

## శుక్ర మంత్రము

### సంకల్పము

అస్య శ్రీ శుక్ర మంత్రస్య । బ్రహ్మఋషిః । విరాట్ ఛందః । దైత్య పూజ్యో దేవతా । అం బీజం । స్వాహాశక్తిః మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

### మంత్రము

"ఓం వస్త్రం దేహి శుక్రాయ స్వాహా"

### విధానము

ఈ మంత్రజపమువల్ల సాధకుడు సుఖభోగములు గలవాడగును. శుక్ర గ్రహ దోషమువల్ల ఏర్పడెడి సమస్త దోషములు తొలగిపోవును.

## వేదవ్యాస మంత్రము

అస్య శ్రీ వ్యాస మంత్రస్య । బ్రహ్మ ఋషిః । అనుష్టుప్ ఛందః । సత్యవతీ సుతో దేవతా । వ్యాం బీజం । నమః శక్తిః మమ అభీష్ట సిద్ధ్యర్థే । జపే వినియోగః ।

1. "వ్యాం వేదవ్యాసాయ నమః"
2. "ఓం వ్రాం వః వ్యాం వేదవ్యాసాయ నమః వ్రాంఓం"

### విధానము

ఈ మంత్రజపమువల్ల మంత్రసిద్ధి అయిన తరువాత సాధకునకు జనరంజకముగ కవిత్వము చెప్పగల శక్తి వచ్చును. ఉపన్యాసము చెప్పగల శక్తి శాస్త్ర గ్రంథములకు వ్యాఖ్యానము చెప్పగల శక్తియూ లభింపగలదు. కీర్తి ప్రతిష్ఠలు, సంపదలు లభించు మృత్యుంజయ బీజాక్షరములతో కూడిన రెండు వేదవ్యాస మంత్రముల జపమువల్ల సాధకునకు వచ్చిన సమస్త ఉపద్రవములు తొలగిపోయి, కోరిన ఫలితములు లభించును.

## మహా మృత్యుంజయ మంత్రము

### సంకల్పము

అస్య శ్రీ మహామృత్యుంజయ మంత్రస్య । వామదేవక హోళ వసిష్ఠ ఋషయః । పంక్తి గాయత్ర్యనుష్టుభో ఛందాంసి సదా శివ మృత్యుంజయ రుద్రా దేవతాః । హ్రీం శక్తిః । శ్రీం బీజం మమ అభీష్టసిద్ధ్యర్థే । జపే వినియోగః ।

### మంత్రము

త్ర్యంబకం యజామహే / సుగంధిం పుష్టివర్ధనం / ఉర్వారుక మివబంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్

### విధానము

ఈ మంత్రజపము వల్ల సాధకుడు అపమృత్యు ప్రమాదము నుండి విముక్తుడగును. ఇష్టసిద్ధి లభించును. ప్రమాదములు గండములు ఆపదలనుంచి రక్షణ పొందును.

## రుద్రమంత్రము

### సంకల్పము

అస్య శ్రీ రుద్ర మంత్రస్య । బోధాయన ఋషిః । పంక్తిశ్ఛందః । రుద్రో దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

### మంత్రము

"ఓం నమో భగవతే రుద్రాయ"

### విధానము

జాతకరీత్యాగాని, గోచరరీత్యా గాని సంభవించిన వ్యాధులు అపమృత్యు దోషములు ఈ మంత్ర జపమువల్ల తొలగిపోవును. అంతేగాదు, శివానుగ్రహమువల్ల సాధకునకు సమస్త వాంఛితములు నెరవేరును దీర్ఘకాలముగా విడువకుండా బాధిస్తూ ఉన్న జ్వరము కూడా నివారణ అగును.

## కుబేర మంత్రము

### సంకల్పము

అస్య శ్రీ కుబేర మంత్రస్య । విశ్రవసఋషిః । బృహతీ ఛందః । శివమిత్రం ధనేశ్వరో దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

### మంత్రము

"యక్షాయ కుబేరాయ వైశ్రవణాయ ధనధాన్యాధి పతయే ధనధాన్య సమృద్ధిం మేదేహి దాపయ స్వాహా"

### విధానము

ఈ మంత్రజపమువల్ల సాధకుడు ధనధాన్య సమృద్ధి గలవాడై సమస్త సుఖభోగములను అనుభవించును.

## సమస్తములైన దారిద్ర్యములను పోగొట్టెడి కుబేర మంత్రము

### సంకల్పము

అస్య శ్రీ కుబేర మంత్రస్య । విశ్రవసఋషిః । బృహతీ ఛందః । శివమిత్రం ధనేశ్వరో దేవతా । మమ అభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః ।

### మంత్రము

ఓం శ్రీం ఓం హ్రీం శ్రీం హ్రీం క్లీం శ్రీం క్లీం విత్తేశ్వరాయనమః ॥

### విధానము

ఈ మంత్ర జపమువల్ల సాధకుడు సమస్తమైన దారిద్ర్యముల నుండి విముక్తి పొంది సిరిసంపదలు గలవాడగును.

## కాక వంధ్యాదోష నివారణ మంత్రము

ఒక పర్యాయము సంతానము కలిగి ఆ తరువాత గర్భధారణచేయకుండుటను కాకవంధ్యయందురు. ఇలాటి స్త్రీలు తిరిగి సంతానము పొందుటకై యీ దిగువ మంత్రమును రోజుకు 108 పర్యాయములు చొప్పున యిరవై ఒక్కరోజులు జపము చేసినచో, ఈ దోషము తొలగిపోయి తిరిగి గర్భమును ధరించి సంతానవతులయ్యెదరు.

### మంత్రము

ఓం నమః శక్తిరూపాయ మమ గృహే పుత్రం కురు కురు స్వాహా

### విధానము

ఈ మంత్ర జపముతోపాటు ఆదివారమునాడు పుష్యమీ నక్షత్రము వున్న సమయమున పెన్నేరుగడ్డను త్రవ్వి తీసుకొని రావలెను అటు తరువాత దానిని చూర్ణముగా చేసిరోజుకు ఒక తులము చూర్ణమును గేదెపాలలో కలిపి త్రాగుచుండవలెను. ఈరీతిగా చేసినచో సంతానమును కోరెడి స్త్రీ తప్పక గర్భవతి కాగలదు.

## ఉత్తమమైన భర్త లభించుటకు మంత్రములు

సకాలమునకు వివాహముకాని కన్యలు, పెళ్ళి కుమారుని వెదకుటలో విసుగెత్తిపోయిన తల్లిదండ్రులు యీ దిగువ మంత్రములను వివాహముకాని తమ కూతుళ్ళతో జపము చేయించినచో తప్పక ఉత్తమ వరుడు లభించును.

### మంత్రములు

1. "హేగౌరి శంకరార్ధాంగి ! యథాత్వంశంకర ప్రియా !
తథామాంకురు కల్యాణి ! కాంతా కాంతాం సుదుర్లభాం !
(పార్వతీదేవి పటముకు పూజచేసి ప్రతిరోజూ యీ మంత్రమును పదుమూలలు (అనగా పదివందల సార్లు) జపము చేయుచున్నచో త్వరగా ఉత్తమమైన వరుడు లభించగలడు.

2. "కాత్యాయనీ మహామాయే ! మహాయోగిన్యధీశ్వరి !
నందగోపసుతం దేవం పతింమే కురుతే నమః"
(పార్వతీదేవి పటమును పూజించి, ఆ పటము ఎదుట కూర్చొని ప్రతిరోజూ 108 పర్యాయములు ఈ మంత్రజపము చేయుచున్నచో త్వరలోనే ఉత్తమ వరుడు లభించగలడు.

3. "ఓం హ్రీం కుమారాయనమః స్వాహా"
(ఈ మంత్రమును ఒక లక్షాయిరవై ఐదువేలు జపము చేసినచో ఉత్తమమైన వరుడు లభించగలడు)

## వివిధ విపత్తులు సంకటముల నుంచి కాపాడే మంత్రములు భూత, ప్రేతముల బాధ తొలగి పోవుటకు మంత్రము

"ఉత్తర్ పిరాళీ కేదారునాథ్ నాథ్ కే రాజా !
హోరిక్ ఖబీర్ పుకార్ కే యే పూజా !
ఖబీర్ మక్కా మదీనాకేపీర్ !
కాహే ఆయేహిందుకే మందిర్ !
అప్నా నామ్ దఖోతో ఆముక్ కో ఛక్తిచోడ్"

### విధానము

ఈ మంత్రముతో మూడు పర్యాయములు శరీరముపై దిగదుడిచినచో భూత ప్రేతములవల్ల కలిగిన బాధలు నివారణయగును.

## అన్ని విధముల కష్టములు నివారణ యగుటకు మంత్రము

"ఓం రాం రాం రాం రాం రాం రాం రాం రాం రాం కష్టం స్వాహా"

### విధానము

ఈ మంత్రము ప్రతి రోజూ 108 పర్యాయములు జపించుచున్నచో, అన్ని విధములైన కష్టములు నివారణ యగును.

## దొంగల భయము లేకుండా వుండుటకు మంత్రము

"ఓం కరాళినీ స్వాహా ! ఓం కపాలినీ స్వాహా !
హ్రాం హ్రీం హ్రూం హ్రైం చోర్ బంధ ఠః ఠః ఠః"

### విధానము

ఈ మంత్రమును 108 పర్యాయములు జపము చేసినచో మంత్రసిద్ధియగు. అటుతరువాత ఈ మంత్రముతో ఏడు పర్యాయములు మట్టిని మంత్రించి యింటి గుమ్మమువద్ద మంత్రించిన మట్టిని గుంటలోపోసి పూడ్చివేసినచో ఆ యింట్లో దొంగలవల్ల ప్రమాదము వుండదు.

## ప్రవాస సమయములో సుఖముగా వుండుటకు మంత్రము

"గచ్ఛ గౌతమ శీఘ్రంత్వం గ్రామేషు నగరేషుచ !
ఆసనం వసనంచైవ తాంబూలం తత్ర కల్పయ"

### విధానము

ముందుగా ఈ మంత్రమును సూర్యగ్రహణ సమయమునందు గాని, చంద్రగ్రహణ సమయమునగాని, హోళీపండుగ లేదా దీపావళీరోజు రాత్రిగాని 108పర్యాయములు జపముచేసి మంత్ర సిద్ధిని పొందవలెను. అటు తరువాత అవసరము వచ్చిన రోజున ఈ మంత్రమును 108 పర్యాయములు జపము చేయు చుండ వలెను.

పొరుగూరు వెళ్ళునప్పుడు మూడు గడ్డి పరకలను చేతిలో పుచ్చుకొని, వాటిపై మంత్రముతో ఏడు పర్యాయములు అభి మంత్రించి, ఆ గడ్డిపరకలను తలయందు వుండే జుట్టులో దూర్చు కొనవలెను. ఇట్లు చేసినచో పరగ్రామమునకు వెళ్ళినప్పుడు ఆగ్రామములో అన్ని పరిస్థితులు సుఖవంతముగా వుండును.

## సమస్త ఆపదలు తొలగిపోవుటకు మంత్రము

"హేకృష్ణ ద్వారకావాసిన్ ! క్వాసియాదవ నందన !
ఆపద్భిః పరిభూతాంమాం ! త్రాయస్వాఖిలనాథ !"

ఈ మంత్రమును ప్రతిరోజూ 108 పర్యాయములు జపము చేయుచున్నచో సమస్త ఆపదలు తొలగిపోవును.

## ప్రమాదమైన ఆపదలనుండి రక్షణ పొందుటకు గణపతి మంత్రము

"ఓం గం గణపతయే నమః"

### విధానము

చాలా ప్రమాదకరమైన ఆపదలలో వున్నవారు యీ పై మంత్రమును పన్నెండు లక్షల యాభైవేలు జపముచేసినచో మంత్రసిద్ధి అయి దానిపూర్తి ఫలితములు కనిపించును. రోజుకు అయిదువేలు చొప్పున రెండువందల యాభైరోజులు జపము చేసినచో పై జపసంఖ్య పూర్తికాగలదు. అంత దీర్ఘకాలము పై రీతిగా జపము చేయుటకు అవకాశము లేనివారు, రోజుకు అయిదువేలు చొప్పున కనీసము యిరువైఐదు రోజుల వరకైనా జపము చేయవలెను. అట్లు చేసినచో మంత్రజప ప్రభావము అనుభవములో కనిపించుట ప్రారంభమగును. అటు తరువాత మెల్లమెల్లగా జపసంఖ్య పూర్తిచేసుకొనవచ్చును. జపముచేయు రోజులలో బ్రహ్మచర్యమును పాటించవలెను. జపముచేయు చోటున ఎదురుగా గణపతి పటము పెట్టుకొని, దానిని పూజించి

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత, చెరువులోని నాచు, మాలతీపువ్వులు తొడదరం పువ్వులు ఈ వస్తువులను సమభాగముగా తీసుకొని నూరి, పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, లింగముపై లేపనముచేసి, స్త్రీతో సంభోగించిన యెడల వీర్యము స్తంభించి స్త్రీకి సంతోషము కలిగి ద్రవించును.

2. 'ఓం నమో భగవతే వుడ్డామరేశ్వరాయ ద్రావయ స్త్రీణాం మదం నాశయే నాశయ స్వాహా ఠః ఠః ।'

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత వెలిగారము, తేనె, హారతికర్పూరము, పాదరసము ఈ వస్తువులను సమభాగములుగా తీసుకొని నూరి పైమంత్రముచే నూటెనిమిదిసార్లు అభిమంత్రించి, లింగముపై లేపనము చేసిన యెడల స్త్రీ సంభోగమునందు వీర్యము స్తంభించి, స్త్రీలకు ద్రావణమై స్త్రీ పురుషులిద్దరికి సంభోగ సౌఖ్యము లభించును.

3. 'ఓం నమో భగవతే వుడ్డామరేశ్వరాయ ద్రావయ స్త్రీణాం మదం నాశయే నాశయ స్వాహా ఠః ఠః ।'

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత, వేలములంకపండ్లు, వాకుడువేళ్ళు, పిప్పళ్ళు, మిరియములు, తేనె, గోరోజనము యీ వస్తువులను సమభాగములుగా కలిపి మర్దించి, పైమంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి లింగమునకు లేపనము గావించుకొని, స్త్రీతో కూడిన యెడల పురుషునకు వీర్య స్తంభనకలిగి స్త్రీని ద్రవింపజేయును. ఇది మహా ఉత్తమమైన యోగము స్త్రీలు, పురుషునకు ఆజన్మాంతము వశ్యులై యుండెదరు.

4. 'ఓం నమో భగవతే వుడ్డామరేశ్వరాయ ద్రావయ స్త్రీణాం మదం నాశయే నాశయ స్వాహా ఠః ఠః ।'

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత తెల్లజిల్లేడు వేరుగంధం, మంచి గంధం రెండు కల్పి నూరి పై మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, లింగమునకు లేపనము గావించుకొని, స్త్రీతో భోగించిన యెడల పురుషునికి వీర్య స్తంభనకలిగి, స్త్రీని రతి యందు ద్రవింపజేసి తృప్తి పరచును.

5. 'ఓం నమో భగవతే వుడ్డామరేశ్వరాయ, ద్రావయ స్త్రీణాం మదం నాశయే నాశయ స్వాహా ఠః ఠః ।'

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత, తేనె, గంధకము, మణిశిల ఈ వస్తువులను సమభాగముగా కల్పినూరి, మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి పురుషుడు తన లింగమునకు లేపనము గావించుకొని, స్త్రీతో భోగించిన యెడల వీర్యస్తంభన కలిగి రతియందు ద్రవింపజేయును.

6. 'ఓం నమో భగవతే వుడ్డామరేశ్వరాయ ద్రావయ స్త్రీణాం మదం నాశయే నాశయ స్వాహా ఠః ఠః ।'

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత పాదరసము వెలిగారము, మాల్కంగిణి పువ్వులు, పండిన దొండపండు, ఈ వస్తువులను సమభాగములుగా తీసుకొని మెత్తగా మర్దించి పై మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, లింగముపై లేపనము చేసికొని, పురుషుడు స్త్రీతో కూడిన యెడల వీర్యస్తంభన స్త్రీ ద్రావణ రతి సౌఖ్యము లభించును.

7. 'ఓం నమో భగవతే వుడ్డామరేశ్వరాయ ద్రావయ స్త్రీణాం మదం నాశయే నాశయ స్వాహా ఠః ఠః ।'

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత, మణిశిల, అన్నభేది, గ్రంధితగరము, తేనె ఈ వస్తువులను సమభాగముగా కూర్చి మర్దించి, పై మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, లింగమునకు లేపనము చేసుకొని స్త్రీతో భోగించిన యెడల చాలా సేపటివరకు సంభోగమునందు వీర్యస్ఖలనము లేక స్త్రీకి ద్రవించి ఆ పురుషుని ఎన్నటికీ వదలకుండా వుండును.

8. 'ఓం నమో భగవతే వుడ్డామరేశ్వరాయ ద్రావయ స్త్రీణాం మదం నాశయే నాశయ స్వాహా ఠః ఠః ।'

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును తరువాత పాదరసము, వెలిగారము, హారతి కర్పూరము, ఉమ్మెత్తగింజలు, అపీనకులు, నెయ్యి, యీ వస్తువుల సమ భాగముగా కలిపి నూరి పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, పురుషుడు తన లింగముపై లేపనముగావించుకొని, స్త్రీతో కూడిన యెడల అమిత లేపనము కలిగి, స్త్రీని ద్రవింపజేసి కామసుఖముల నోలలాడించును.

9. 'ఓం నమో భగవతే వుడ్డామరేశ్వరాయ ద్రావయ స్త్రీణాం మదం నాశయే నాశయ స్వాహా ఠః ఠః ।'

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత తేనెకొండచెట్టు వేరుముక్కలను, నిమ్మకాయ మధ్యనుంచి. ఒకరాత్రి ఉంచిపిదప గుడ్డలో సంభోగసమయములో ఆ నిమ్మకాయ స్త్రీకి వాసన చూపించిన యెడల స్త్రీ వెంటనే ద్రవించి సుఖపడును.

10. 'ఓం నమో భగవతే వుడ్డామరేశ్వరాయ ద్రావయ స్త్రీణాం మదం నాశయే నాశయ స్వాహా ఠః ఠః ।'

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత ఎర్రగన్నేరు పువ్వులు తీసుకువచ్చి, పువ్వులకట్టకు గ్రుచ్చి, పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, సంభోగ సమయములో యీ పువ్వులు స్త్రీకి చూపించిన యెడల స్త్రీకి ద్రావణమయి రతి తృప్తి నొందును.

11. 'ఓం నమో భగవతే వుడ్డామరేశ్వరాయ ద్రావయ స్త్రీణాం మదం నాశయే నాశయ స్వాహా ఠః ఠః ।'

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత మర్రిచెట్టు పువ్వులు, లవంగములు, హారతికర్పూరము, తేదుపుచ్చవేరు యీ వస్తువులను సమభాగములుగా కల్పి మర్దించి పై మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, లింగముపై లేపనముచేసికొని, స్త్రీతో భోగించిన యెడల స్త్రీ ద్రవించి యీ పురుషుని గాఢముగా ప్రేమించును.

## వీర్యవృద్ధికి తంత్రములు

ఆదివారమునాడు ఉత్తరేణివేరు తెచ్చి, దానిని నీడలో ఎండబెట్టి చూర్ణము చేసి, ఆ చూర్ణమును గేదెపాలతో పుచ్చుకొనిన వీర్యవృద్ధి అగును.

2. రావిచెక్కతో ఒక గిన్నెను తయారుచేసి ఆ గిన్నెలో రాత్రి సమయమున నీళ్ళు పోసియుంచి మరునాడు ఉదయము పరగడుపున త్రాగుచూ యున్నచో తెలివితేటలు గొప్ప వీర్య వృద్ధి కలుగును.

నెమయములందు) ఒక్కొక్క పర్యాయము చదివెడి వ్యక్తి చేసెడి సమస్త కార్యములు సిద్ధించును. ఎనిమిదిరోజులపాటు ఈ అష్టకమును రోజుకు ఒక పర్యాయము చదివెడివారు, మరియు చవితిరోజున ఈ అష్టకమును, ఎనిమిది పర్యాయములు చదివెడి వారు అష్టసిద్ధుల పొందును. ఒక నెలరోజులపాటు ప్రతిరోజూ రోజుకు పది పర్యాయములు చదివెడి వ్యక్తి చెరసాలలో బంధింప బడిన బంధనమునుండి రాజువలలో ఉరిశిక్ష విధింపబడిన వ్యక్తిని శిక్ష నుండి తప్పించగలడు. ఇందులో ఏ మాత్రము సందేహము లేదు. ఈ స్తోత్రమును ఇరువై ఒక్క పర్యాయములు చదివిన విద్యార్థి విద్యను కుమారులు కావలెననెడి వ్యక్తి కుమారుని, కోరికలుగల వ్యక్తి సమస్త కోరికలను నెరవేర్చుకొనగలడు. భక్తి భావములో ఈ స్తోత్రమును చదివెడి వాడు నా వరములకర్హుడగును. ఈ రీతిగా చెప్పినటుల ఈ స్తోత్రమును చదివి తమ కోరికలను నెర వేర్చుకొనవలెను.

## విఘ్నములు తొలగి పోవుటకు

శ్లో॥ పరంధామ పరంబ్రహ్మ పరేశం పరమేశ్వరం ।
విఘ్న విఘ్నకరం శాంతం పుష్టం కాంత మనంతకం ।
మహామునీంద్రైః సిద్ధేంద్రైస్సేవితం స్తౌమి పరాత్పరం ।
మహదాదృతవేశంచ గణేశం మంగళాయనం ।

### విధానము

శ్రీ రాధాదేవి చేసిన యీ గణపతిస్తోత్రము గొప్ప పుణ్యవంతము,విఘ్న - శోకములు తొలగించునట్టిదీ అయివున్నది దీనిని ప్రతిరోజూ ఉదయం నిద్రలేచిన వెంటనే చదువుచున్నచో, అట్టి వ్యక్తి సమస్తమైన విఘ్నములనుండి విముక్తుడు కాగలడు.

## సంకటములు తొలగి పోవుటకు

శ్లో॥ ప్రణమ్య శిరసాదేవం గౌరీ పుత్రం వినాయకం ।
భక్తావాసం స్మరేన్నిత్య మాయుః కామార్థ సిద్ధయే ।
ప్రథమం వక్రతుండంచ ఏకదంతం ద్వితీయకం ।
తృతీయం కృష్ణ పింగాక్షం గజవక్త్రం చతుర్థకం ।
లంబోదరం పంచమంచ షష్ఠం వికటమేవచ ।
సప్తమం విఘ్న రాజేంద్రం ధూమ్రవర్ణం తథాష్టమం ।
నవమం ఫాలచంద్రంచ దశమంతు వినాయకం ।
ఏకాదశం గణపతిం ద్వాదశంతు గజాననం ।

### విధానము

నారద పురాణములో చెప్పబడిన యీ "సంకష్టనాశన" గణేశ స్తోత్రమును - ఉదయము మధ్యాహ్నము, సాయంకాలము అందు ప్రతిరోజూ ఒక్కొక్క పర్యాయము చదువు చుండెడి వ్యక్తికి విఘ్న భయము వుండదు. అతనికి ఈ నామస్మరణ సమస్త సిద్ధులను లభింపచేయును. ఈనాడు జపమువల్ల విద్యార్థి విద్యను, ధనమును కోరువాడు ధనమును, బిడ్డలు కావలెననువారు బిడ్డలను మోక్షమును కోరువాడు మోక్షమును పొందును. ఈ గణపతి స్తోత్రమును ప్రతిరోజూ జపించు చుండవలెను. ఈ రీతిగా చేసెడివ్యక్తికి ఆరుమాసములలోపల కోరిన కోరిక నెరవేరును ఒక సంవత్సరము చేసెడి వ్యక్తి సిద్ధులను పొందును. ఇందులో సందేహము లేదు ఈ స్తోత్రమును కాగితము మీద వ్రాసి దానిని ఎనిమిది మంది బ్రాహ్మణులకు యిచ్చినవాడు, గణపతి అనుగ్రహము వలన సమస్త విద్యలు లభించిన వాడగును.

## వికారములు, వ్యాధులు నివారణ యగుటకు

శ్లో॥ పురాణ పురుషం దేవం నానా క్రీడాకరం ముదా ।
మాయావినందుర్విభావ్యం మయూరేశం నమామ్యహం
పరాత్పరం చిదానందం నిర్వికారం హృదిస్థితం ।
గుణాతీతం గుణమయం మయూరేశం నమామ్యహం ।
సృజంతం పాలయంతంచ సంహరంతం నిజేచ్ఛయా ।
సర్వ విఘ్న హరం దేవం మయూరేశం నమామ్యహం ।
నానాదైత్య నిహంతారం నానా రూపాణి బిభ్రతం
నానాయుధ ధరం భక్త్యామయూరేశం నమామ్యహం ।
ఇంద్రాది దేవతా బృందైరభిష్టుత మహర్నిశం ।
సదసద్ వ్యక్తమవ్యక్తం మయూరేశం నమామ్యహం ।
సర్వశక్తిమయం దేవం సర్వరూపధరం విభుం ।
సర్వవిద్యా ప్రవక్తారం మయూరేశం నమామ్యహం ।
పార్వతీ నందనం శంభోరానంద పరివర్ధనం ।
భక్తానందకరం నిత్యం మయూరేశం నమామ్యహం ।
మునిధ్యేయం మునినుతం మునికామ ప్రపూరకం ।
సమష్టి వ్యష్టిరూపం త్వాంమయూరేశం నమామ్యహం ।
సర్వాజ్ఞాన నిహంతారం సర్వజ్ఞానకరం శుచిం ।
సత్యజ్ఞాన మయం సత్యం మయూరేశం నమామ్యహం
అనేకకోటి బ్రహ్మాండనాయకం జగదీశ్వరం ।
అనంత విభవం విష్ణుంమయూరేశం నమామ్యహమ్ ।

### విధానము

బ్రహ్మదేవునిచే చెప్పబడిన యీ మయూరేశ స్తోత్రము సమస్త పాపములను నశింపజేసి బ్రహ్మ భావమును కలిగించు నట్టిదై యున్నది. మానవులకు సమస్తమైన మనోవాంఛిత వస్తువుల నిచ్చునట్టిది. సమస్తమైన ఉపద్రవములను శాంతింపు చేయునట్టి దయియున్నది. ఏడురోజులు దీనిని చదివినచో కారాగారమందున్న వ్యక్తి కూడ విడుదల చేయబడును. ఈ శుభస్తోత్రము శరీర సంబంధమైన వ్యాధులను మానసిక సంబంధమైన బాధలు - వ్యాకులతను నివారణచేసి భోగ - మోక్షముల నొసంగును.

## కుమారుడు కలుగుటకు

శ్లో॥ నమోస్తు గణనాథాయ సిద్ధి బుద్ధి యుతాయచ ।
సర్వప్రదాయ దేవాయ పుత్రవృద్ధి ప్రదాయచ ।
గురూదరాయ గురవే గోప్త్రే గుహ్య సితాయతే ।
గోప్యాయ గోపితా శేష భువనాయ చిదాత్మనే ।
విశ్వమూలాయ భవ్యాయ విశ్వసృష్టి కరాయతే
నమో నమస్తే సత్యాయ సత్య పూర్ణాయ శుండినే ।
ఏకదంతాయ శుద్ధాయ సుముఖాయ నమో నమః ।
ప్రపన్న జన పాలాయ ప్రణతార్తి వినాశినే ।
శరణం భవదేవేశ సంతతిం సుదృఢాం కురు ।
భవిష్యంతిచ యేపుత్రా మత్కులే గణనాయక ।
తే సర్వేతవ పూజార్థం విరతాః స్యుర్వరామతః ।
పుత్రప్రదమిదం స్తోత్రం సర్వసిద్ధి ప్రదాయకం ।

### విధానము

ఈ సంతాన గణపతి స్తోత్రమును భక్తితో ప్రతిరోజూ చదువువారికి. గణపతి కృపవలన పుత్ర సంతతి కలుగును. అంతేకాక సమస్త సిద్ధులు లభించును.

## ఐశ్వర్యము సంతానము కలుగుట

శ్లో॥ సరాగి లోకదుర్లభం విరాగిలోక పూజితం
సురాసురైర్నమస్కృతం జరాది మృత్యునాశనం ।

నగాగుణం శ్రియాహారం జయంతి యత్ప్రదార్పణ
నమామి తం గణాధిపం కృపానమః పయోనిధిం ॥ 1

శ్లో॥ గిరీంద్రజాముఖాంబుజ ప్రమోద దానభాస్కరం
కరీంద్ర వక్త్ర మానతాఘ సంఘవారణోద్యతం ।
సరీసృపేశ బద్ధకుక్షి మాశ్రయామి సంతతం
శరీర కాంతి నిర్జితాబ్జ బంధుబాల సంతతిం ॥ 2

శ్లో॥ శుకాది మౌని వందితం గకార వాచ్య మక్షరం
ప్రకామ మిష్టదాయినం సకామ నమ్ర పంక్తయే ।
చకాసనం చతుర్భుజైర్వి కాస పద్మపూజితం
ప్రకాశితాత్మ తత్త్వకం నమామ్యహం గణాధిపం ॥ 3

శ్లో॥ నరాధిపత్వ దాయకం స్వరాదిలోక దాయకం
జ్వరాది రోగవారకం నిరాకృతాసుర వ్రజం ।
కరాంబుజైర్ధరన్ వికారశూన్య మానసైర్సదా
సదా విభావితం ముదానమామి విఘ్నపం భజే ॥ 4

శ్లో॥ శ్రమా పనోదనక్షమం సమాహితాంతరాత్మనం
సమాధిభిస్సదార్చితం క్షమానిధిం గణాధిపం ।
రమాధవాది పూజితం యమాంతకాత్మ సంభవం
శమాదిషడ్గుణ ప్రదం నమామి తం విభూతయే ॥ 5

### విధానము

ఈ గణాధిప పంచక స్తోత్రము మానవులకు అభీష్ట వస్తువును ఇచ్చునట్టిదియై యున్నది. నమస్కారపూర్వకముగ ప్రసన్నతతో దీనిని చదివెడి వ్యక్తి దీర్ఘాయువును, అధికమైన సిరి - సంపదలను, అందమైన పుత్రుని పొందుదురు. ఇందులో సంశయము లేదు.

## లక్ష్మీ ప్రాప్తికి

శ్లో॥ ఓం నమో విఘ్న రాజాయ సర్వ సౌఖ్య ప్రదాయినే ।
దుష్టారిష్ట వినాశాయ పరాయ పరమాత్మనే ।
లంబోదరం మహావీర్యం నాగయజ్ఞోపవీతినం ।
అర్ధచంద్రధరం దేవం విఘ్న వ్యూహ వినాశనం ।
ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః హేరంబాయ నమో నమః
సర్వసిద్ధి ప్రదోసి త్వం సిద్ధి బుద్ధి ప్రదో భవ ।
చింతితార్థ ప్రదస్త్వంహి సతతం మోదక ప్రియః ।
సిందూరారుణ వస్త్రైశ్చ పూజితో వరదాయకః ।

### విధానము

ఈ గణపతి స్తోత్రమును భక్తిభావముతో చదివెడి వ్యక్తి యింట లక్ష్మీదేవి నివసించును. అతని దేహమును, యింటిని లక్ష్మీదేవి విడచిపెట్టదు.

## కుటుంబములో వారు ఒకరిపట్ల మరొకరు ప్రేమతో వుండుటకు

శ్లో॥ సువర్ణ వర్ణ సుందరం సితైక దంత బంధురం
గృహీత పాశకాంకుశం వరప్రదా భయప్రదం ।
చతుర్భుజం త్రిలోచనం భుజంగ మోపవీతినం
ప్రఫుల్ల వారి జాసనం భజామి సింధురాననమ్ ।

శ్లో॥ కిరీట హారకుండలం ప్రదీప్తబాహు భూషణం
ప్రచండరత్న కంకణం ప్రశోభితాంఘ్రి యష్టికం ।
ప్రభాత సూర్య సుందరాంబరద్వయ ప్రధారిణం
సరత్న హేమ నూపుర ప్రశోభితాంఘ్రి పంకజం ।

శ్లో॥ సువర్ణ దండమండిత ప్రచండ చారు చామరం
గృహ ప్రదేందు సుందరం యుగక్షణ ప్రమోదితం ।
కవీంద్ర చిత్తరంజకం మహావిపత్తి భంజకం
షడక్షర స్వరూపిణం భజే గజేంద్ర రూపిణమ్ ।

శ్లో॥ విరించి విష్ణువందితం విరూప లోచనం శుభం
గిరీశ దర్శనేచ్ఛయా సమర్పితం పరాంబయా ।
నిరంతరం సురాసురైః సపుత్ర వామలోచనైః
మహామఖేష్ట కర్మసు స్మృతం భజామి తుందిలమ్ ।

శ్లో॥ మదౌఘలుబ్ధ చంచలాలి మంజు గుంజితారవం
ప్రబుద్ధ చిత్తరంజకం ప్రమోదకర్ణ చాలకం ।
అనన్య భక్తిమానవం ప్రచండ ముక్తిదాయకం
నమామి నిత్య మాదరేణ వక్రతుండ నాయకమ్ ।

### విధానము

ఈ స్తోత్రము దారిద్ర్యమును శీఘ్రముగా పారద్రోలునట్టిదై యున్నది. అభీష్టవస్తువును ఇచ్చునట్టిది అయియున్నది. భక్తిభావముతో దీనిని ప్రతిరోజూ చదువు చుండెడి వ్యక్తికి గణేశ్వరుని కృపవల్ల పుత్రుని కలుగజేయునట్టిది అయియున్నది. భార్య కుటుంబమునందలి అందరూ ఒకరిపట్ల మరొకరు ప్రేమ కలిగి యుండునటుల చేయునట్టిది అయియున్నది.

## ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థములు లభించుటకు

శ్లో॥ విదేహరూపం భవబంధహారం
సదాస్వనిష్ఠం స్వసుఖ ప్రదం తం ।
అమేయ సాంఖ్యేన చ లక్ష్యమీశం
గజాననం భక్తియుతం భజామః 1

మునీంద్ర వంద్యం విధిబోధ హీనం
సుబుద్ధిదం బుద్ధిధరం ప్రశాంతం ।
వికారహీనం సకలాంగకం వై
గజాననం భక్తియుతం భజామః । 2

అమేయ రూపం హృది సంస్థితం తం
బ్రహ్మాహమేకం భ్రమనాశకారం ।
అనాది మధ్యాంత మపార రూపం
గజాననం భక్తియుతం భజామః । 3

జగత్ప్రమాణం జగదీశ మేవ
మగమ్య మాద్యం జగదాదిహీనం ।
అనాత్మనాం మోహప్రదం పురాణం
గజాననం భక్తి యుతం భజామః । 4

న పృథ్వీరూపం న జలం ప్రకాశం
న తేజ సంస్థం న సమీర సంస్థం
న ఖేగతం పంచవిభూతి హీనం
గజాననం భక్తియుతం భజామః । 5

న విశ్వగం తైజసం ప్రాజ్ఞం
సమష్టి వ్యష్టిస్థమనంతగం తం ।
గుణైర్విహీనం పరమార్థ భూతం
గజాననం భక్తియుతం భజామః । 6

గణేశగం నైవచ బిందు సంస్థం
నదేహినం బోధమయం నఢుండిం ।
సుయోగహీనం ప్రవదంతి తత్స్థం
గజాననం భక్తియుతం భజామః 7

అనాగతం గ్రైవగ తం గణేశం
కథం తదాకారమయం వదామః ।
తథాపి సర్వం ప్రతిదేహ సంస్థం
గజాననం భక్తియుతం భజామః । 8

సమ్యగ్వ్యాకరణం తం ని జమతీ
వాణావ్యజో లిప్తవాన్ ।
గీతాయా ఉపదేశ ఏవహికృతో
రాజ్ఞేవరేణ్యాయ వై
తుష్టాయా తవ ధూమ్రకేతు
రభవో విప్రః సధర్మార్థకః ।
అశ్వాంకో ద్విభుజో స్థితో
గణపతిర్ మ్లేచ్ఛాంతకః స్వర్ణదః ।
క్రీడా కాండ మిదం గణస్య
హరిణా ప్రోక్తం విధాత్రే పురా ।

### విధానము

ఈ అయిదు శ్లోకములను ప్రతిరోజూ భక్తిభావముతో చదువుచుండెడి వ్యక్తి సమస్తమైన ఉత్తమ సుఖభోగములను అనుభవించి, అంతమున మోక్షమును పొందును.

## సమస్త మైన బాధలను పోగొట్టి, అన్ని విధములైన సుఖములను ఇచ్చి వైకుంఠమును లభింపజేసెడి గణేశకవచము

శ్లో ॥ సంసార మోహనస్యాస్య
కవచస్య ప్రజాపతిః ।
ఋషిశ్ఛందశ్చ బృహతీ
దేవో లంబోదర స్స్వయం ॥
ధర్మార్థ కామ మోక్షేషు
వినియోగః । ప్రకీర్తితః ॥
సర్వేషాం కవచానాంచ
సారభూతమిద మునే ।
ఓం గం హుం శ్రీం గణేశాయ
స్వాహా మేపాతు మస్తకం ।
ద్వాత్రింశ ద్వక్షరో మంత్రో
లలాటంమే సదావతు ॥
ఓం హ్రీం క్లీం శ్రీం గమితివై
సతతం పాతులోచనం ।
తాలుకం పాతు విఘ్నేశః
సతతం ధరణీతలే ।
ఓం హ్రీం శ్రీం క్లీ మితి పదం కొం సతతం
పాతు నాసికాం ।
ఓం గ్లౌం గం శూర్పకర్ణాయ
స్వాహా పాత్వధరం మమ ॥
దంతాశ్చ తాలుకా జిహ్వాం
పాతు మేషోడశాక్షరః ।
ఓం లం శ్రీం లంబోదరాయేతి
స్వాహాగండం సదావతు ।
ఓం క్లీం హ్రీం విఘ్న నాశాయ
స్వాహా కర్ణం సదావతు ।
ఓం శ్రీం గంగజాననాయేతి
స్వాహాస్కంధం సదా తు ।
ఓం హ్రీం వినాయకాయేతి
స్వాహాపృష్ఠం సదావతు ।
ఓం క్లీం హ్రీమితి కంకాలం
పాతు వక్షస్థలంచ గం ।
కరౌ పదౌ సదాపాతు
సర్వాంగం విఘ్ననిఘ్న కృత్ ।
ప్రాచ్యాం లంబోదరః పాతు
ఆగ్నేయ్యాం విఘ్న నాయకః ।
దక్షిణేపాతు విఘ్నేశో
నైరుత్యాంతు గజాననః ॥
పశ్చిమే పార్వతీ పుత్రో
వాయవ్యాం శంకరాత్మజః ॥
కృష్ణస్యాంశశ్చోత్తరేపాతు
పరిపూర్ణతమశ్చమే ।
ఐశాన్యాం మేకదంతశ్చ
హేరంభః పాతు చోర్ధ్వతః ।
అధోగణాధిపః పాతు
సర్వపూజ్యశ్చ సర్వతః ॥
స్వప్నే జాగరణేచైవ
పాతుమాం యోగినాం గురుః ।
ఇతితేకథితంవత్స సర్వ
మంత్రౌఘ విగ్రహం ।
సంసార మోహనం నామ
కవచం పరమాద్భుతం ।
శ్రీకృష్ణేన పురాదత్తం
గోలోకే రాసమండలే ॥
బృందావనే వినీతాయ
మహ్యందినకరాత్మజః ।
మయాదత్తంచ తుభ్యంచ
యస్మైకస్మైన దాస్యసి ।
పరంవరం సర్వపూజ్యం
సర్వ సంకట తారణం ।
గురుమభ్యర్చ్య విధివత్
కవచం ధారయేత్తుయః ॥
కంఠేవా దక్షిణే బాహౌ
సోపి విష్ణుర్న సంశయః ।
అశ్వమేధ సహస్రాణి
వాజపేయ శతానిచ ।
గ్రహేంద్ర కవచస్యాస్య
కలాంనార్హంతిషోడశీం ।
ఇదం కవచమజ్ఞాత్వా యో
భజేచ్చం కరాత్మజం ।
శతలక్ష ప్రజప్తోపి న
మంత్రః సిద్ధిదాయకః ।

### విధానము

విఘ్నభగవానుడు చేసిన ఈ గణేశకవచమును పదిలక్షల జపము చేసినచో సిద్ధి లభించును కవచసిద్ధి బొందిన వ్యక్తి మృత్యువును జయించగల సమర్థుడగును ఈ సిద్ధకవచమును ధరించెడి వ్యక్తి వాగ్మి, చిరంజీవి, అంతటను విజయమును పొందువాడూ పూజనీయుడూ అగును ఈ కవచ ప్రభావము వల్ల మానవుడొనర్చిన సమస్త పాతకములు, ఉపపాతకములు నశించును. ఈ కవచమందలి శబ్దములను వినినంత మాత్రముననే భూత ప్రేత పిశాచ కుష్మాండ బ్రహ్మరాక్షస డాకినీ యోగినీ

యగును. దీనిని వెయ్యి పర్యాయములు చదివినవాడు, ఏ కోరికను కోరుకొనునో - దానిని పొందును.

ఈ మంత్రములో గణపతికి అభిషేకము చేసినవాడు వాగ్మి (గొప్పవక్త) యగును. చవితి రోజున ఉపవాసము వుండి దీనిని జపించెడివాడు ఆధ్యాత్మిక విద్యాప్రవీణుడగును బ్రహ్మాది అవిరాంల నెరిగినవాడు ఎన్నడూ భయపడడు కాదు. ఇది అథర్వ వాక్యము.

గణపతిని గరికతో పూజించువాడు కుబేరునితో సమానమైన వాడగును. పేలాలతో హోమము చేయువాడు యశోవంతుడు, మేధావంతుడు అగును ఒక వెయ్యి ఉండ్రాళ్ళతో గణపతిని పూజించువాడు మనోవాంఛిత ఫలమును పొందును. నేతితో తడిసిన సమిధలతో హోమము చేసినవాడు సమస్తమునూ పొందును. అన్నింటిని పొందును. ఎనిమిది మంది బ్రాహ్మణులకు ఈ అథర్వ శీర్షమును ఉపదేశించినవాడు. సూర్యునితో సమానమైన తేజస్విగల వాడగును సూర్యగ్రహణ సమయమున మహానదిలో గాని, గణపతి ప్రతిమవద్ద గాని ఈ ఉపనిషత్తును జపించిన సాధకుడు యీ మంత్రసిద్ధిని పొందినవాడగును. అంతేగాక అతడు సమస్త మహా విఘ్నముల నుండి విముక్తుడగును మహాపాతకముల నుండి విడుదల పొందును అతడు సర్వజ్ఞుడగును. అతడు సమస్తము నెరిగిన వాడగును.

మంగళవారము నాడు చవితి తిధి వచ్చినచో దానిని "అంగారక చతుర్థి యందురు. అదేరీతిగా ఆదివారమునాడు చవితి తిధి వచ్చినచో దానిని రవి చతుర్థి యందురు ఈ రోజులలో గణపతి పూజ, జపములు చేసినవారు ఎక్కువ ఫలితమును పొందెదరు.

## సిద్ధిప్రద సురభి మంత్రము – స్తోత్రము

### మూల మంత్రము

"ఓం స్త్రీం సురభ్యై నమః"

### ధ్యానము

శ్లో ॥ లక్ష్మీ వ్యరూపాం పరమాం రాధాసహచరీం పరాం ।
గవామధిష్ఠాతృదేవీం గవామాద్యాం గవాం ప్రసూమ్ ।
పవిత్ర రూపాం పూజ్యాంచ భక్తానాం సర్వకామదాం ।
యయాపూతం సర్వ విశ్వంతాం దేవీం సురభింభజే ।

### విధానము

పైన పేర్కొనబడిన సురభిమంత్ర జపము, దీపావళి అమావాస్య మరుసటి దినమున మొదలు పెట్టవలెను. ఈ మంత్రమును ప్రతి నిత్యము, స్నానముచేసి శుచియై వెయ్యి నూట ఎనిమిదిసార్లుగాని, యథాశక్తిగాని, పైన పేర్కొనబడిన ధ్యానమును పఠించిన పిమ్మట యథాశక్తిగా జపించుచూ ఒక లక్ష జపము పూర్తిచేసిన యెడల మంత్రము సిద్ధించును. ఈ సురభిమంత్రశక్తి, కల్పవృక్షమువలె, సాధకుని సర్వమనోభీష్టములను నిశ్చయముగా నెరవేర్చుచుండును.

### శ్రీ సురభిస్తోత్రము

శ్లో ॥ నమోదేవ్యై మహాదేవ్యై సురభ్యైచ నమోనమః ।
గవాంబీజ స్వరూపాయై నమస్తే జగదంబికే ।
నమో రాధాప్రియాయైచ పద్మాంశాయై నమోనమః ।
నమః కృష్ణ ప్రియాయైచ గవాంమాత్రే నమోనమః ।
కల్పవృక్షస్వరూపాయై పద్మాయై సర్వసంపదాం ।
శ్రీదాయై ధనదాయైచ బుద్ధిదాయై నమోనమః ।
శుభదాయై ప్రసన్నాయై గోప్రదాయై నమోనమః ।
యశోదాయై సౌఖ్యదాయై ధర్మజ్ఞాయై నమోనమః ।
ఇదం స్తోత్రం మహాపుణ్యం భక్తియుక్తశ్చ యః పఠేత్ ।
సగోమాన్ ధనవాంశ్చైవ కీర్తిమాన్ పుణ్యవాన్ భవేత్ ।
సుస్నాతః సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షితః ।
ఇహలోకే సుఖంభుక్త్వాయాత్యంతే కృష్ణ మందిరమ్ ।
సుచిరం నివసేత్తత్ర కురుతే కృష్ణసేవనం ।
నపునర్భవ భవంతస్య బ్రహ్మపుత్రభవే భవేత్ ।

### విధానము

పైన పేర్కొనబడిన సురభిస్తోత్రమును, స్నానముచేసి శుచియై, ప్రతి నిత్యము యథాశక్తిగా చదువుకొను చుండెడివారికి, మహాపుణ్యము కలుగును. గోవులు, ధనము అభివృద్ధి చెందును. కీర్తి ప్రతిష్ఠలు పెరుగును. సమస్త పుణ్యక్షేత్రముల యందు స్నానము చేసి వచ్చినంత పుణ్యము లభించును. ఈ లోకమునందు సమస్త సౌఖ్యములను అనుభవించి, అంత్య కాలములో కృష్ణుని సాన్నిధ్యమున చేరును. ఈ సురభిస్తోత్రమును ప్రతి నిత్యము భక్తి శ్రద్ధలతో పఠించుచుండెడివారికి పునర్జన్మము ఎన్నటికీ కలుగనేరదు.

## అన్ని దానములలోను జీవనదానము శ్రేష్ఠమైనది

ఒక జీవి యొక్క ప్రాణములను రక్షించుట, ఆహారానికి దాని ప్రాణములను దానము చేయుట, అన్ని దానములలోను గొప్పదైనది. అదియే అహింస అనబడును. అహింసా వ్రత మాచరించెడివారిని సర్వదేవతలూ, పవిత్రముగా చూచెదరు. అహింసను పాటించుచుండెడివారికి, సమస్త పురుషార్థములు చేకూరును. ప్రాణములకు జీవిత దానమే అన్నదానము కంటే గొప్పదని వాయుపురాణములో చెప్పబడియున్నది.

## స్వప్నములో నిజము తెలుసుకునే మంత్రము

"ఓం స్వప్నావలోకినీ సిద్ధిలోచనీ స్వప్నే కథయస్వాహా ।"

### విధానము

పైన పేర్కొనబడిన మంత్రమును ప్రతి నిత్యము యిరవై ఒక్కసార్లు చొప్పున జపించుచుండవలెను. బ్రహ్మ చర్య వ్రతములో నుండవలెను. రోజుకొక సారి భోజనము చేయు చుండవలెను. ఈ ప్రకారముగా ప్రతి నిత్యము చేయుచుండే సాధకునకు స్వప్నములో ఏ విషయమైననూ నిజమో అబద్ధమో తెలియుచుండును.

## విద్యావృద్ధి మంత్రము

"ఓం హ్రీం శ్రీం అహం వద వద వాగ్వాదినీ భగవతీ సరస్వతీ ఐం నమః సర్వ విద్యాం దేహిమమ హ్రీం సరస్వతీ స్వాహా ।"

### విధానము

గ్రహణము రోజున ఈ మంత్రమును 144 సార్లు జపించవలెను. తరువాత యిరవై ఒక్క రోజుల వరకు ప్రతిరోజూ మూడుపూటలా పూటకు నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించు చుండవలెను. ఆపైన, పై మంత్రమును రోజుకు నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించు చుండవలెను. పైన పేర్కొనబడిన విద్యావృద్ధి మంత్రమును యీ ప్రకారముగా జపించుచుండిన యెడల సకల విద్యాపారంగతుడగును ఉన్నత విద్యలు అభివృద్ధి చెందుచుండును.

## కనికట్టు మంత్రము

"ఓం నమో భగవతే వామన నాగరాజాయ గోపకుండలీ వరవానీ స్వాహా"

ఆదివారమునాడు ఉడుగుచెట్టుకర్ర తీసుకువచ్చి గంధముగా అలికినచోట ఆ కర్రను పెట్టి దీపధూప నైవేద్యములు యిచ్చి పూజించవలయును. తరువాత సాధకుడు దానిఎదురు గుండా కూర్చుని పై మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించవలెను. మంత్రము సిద్ధించును. అవసరము వచ్చి నప్పుడు గారడీ విద్యలు చేసేటప్పుడు, ఈ ఉడుగ కర్రను సభాసదులకు ప్రజల ఎదుట రెండు మూడు సార్లు త్రిప్పిన యెడల సాధకుడు చేసే తంతులు తమాషాలు అన్నియూ నిజమని ప్రేక్షకులు నమ్మెదరు.

## రెండవ కనికట్టు మంత్రము

"ఓం నమో బయుక్ చాముండే ఈ ఈ ఈ స్వాహా"

### విధానము

తామరతూడు ఒకటి తీసుకువచ్చి దానిపైన కన్యచేత పేనించబడిన దారమునుచుట్టి, ఆ తామరతూడును పైన పేర్కొనబడిన మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించ వలెను. తరువాత సాధకుడు ఈ తామరతూడును చేతిలో పెట్టుకొని తమాషాలు చేసే యెడల ఎదుటి వారికి కనికట్టు కలిగి సాధకుడు చెప్పేది చేసేది అంతా నిజమని నమ్ము చుండెదరు.

## కనికట్టు గోళీల మంత్రము

"ఓం నమో భగవతే వాసుకే నాగపుత్ర్యై"

### విధానము

బ్రహ్మకొమ్మ, కుందేలుచెట్టుల(కుందేటిమీసము) చేమంతి ఆకులు, తానికాయచెట్టు యొక్క వేరు, పాల్లతో ఈ అయిదు వస్తువులను సమభాగములుగా కలిపి గొర్రె పాలతో నూరి మాత్రలు చేయవలెను. ఈ మాత్రలకు గుగ్గిలము పొగ వేయ వలెను ఆమాత్రల ఎదుటదీపము పెట్టవలెను. పాలు పంచదార నైవేద్యము పెట్టవలెను ఆ మాత్రలపై పుష్పములువేసి పూజించవలెను మరియూ ఆ మాత్రలను పైన పేర్కొనబడిన మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించిన ఎడల మాత్రలు సిద్ధించును. ఆ మాత్రలను నీడలో ఆరబెట్టవలెను. ఈ మాత్రలు దిగువ పేర్కొనబడిన పనులకు ఉపయోగించు కొనవచ్చును.

1. పైన పేర్కొనబడిన మాత్రను నీళ్ళతో అరగదీసి సాధకుడు తన అరచేతిలో పూసుకొని "నేను కోరిన మనిషి వచ్చును గాక అన్న యెడల అరచేతిలో కోరుకొనిన మనిషి కనిపించును.
2. ఈ మాత్రలను కాకి ఈకపై పట్టించిన యెడల కాకి కనిపించును.
3. ఈ మాత్రను నిమ్మచెట్టు ఆకుపై పట్టించిన యెడల తేళ్ళు కనిపించును.
4. మాత్రను కోడి ఈకపై పట్టించి, ఆ ఈకను చేతో పట్టుకొన్న యెడల కోడి కనిపించును.
5. ఈ మాత్రను అన్నముపై పెట్టిన యెడల రత్నములు కనిపించును.
6. ఈ మాత్రను అరగదీసి గంధమును గింజలకు పట్టించి భూమిలో పాతిన యెడల శీఘ్రముగా మొలచి పూలు పండ్లు కాయును.
7. మాత్రను అరగదీసి చేతులకు ముక్కుకు పూసుకున్న యెడల అదృశ్యుడై జనులగుంపులో నుంచి తప్పించుకొని బయటపడవచ్చును.
8. మాత్రను అరగదీసి వళ్ళంతాపట్టించుకొన్న యెడల శరీరావయవములన్నీ ఊడిపోయినట్లు కనిపించును నీళ్ళతో ఎప్పుడు స్నానము చేసెదరో అప్పుడు శరీరము మునుపటి వలె మామూలుగా కన్పించును.

## చదువుకున్న విద్యలు మరచిపోకుండా వుండే మంత్రము

"ఓం నమో భగవతీ సరస్వతీ పరమేశ్వరి వాగ్వాదిని విద్యాందేహి భగవతీ హంసవాహన సమారూఢే బుద్ధిం దేహి దేహి ప్రజ్ఞాం దేహి దేహి విద్యాం దేహి దేహి పరమేశ్వరీ స్వాహా ॥"

### విధానము

ఆదివారమునాడు ప్రారంభించి రోజుకు నూట ఎనిమిదిసార్లు చొప్పున యిరవై ఒక్క రోజులవరకు మంత్రము జపించవలెను బ్రహ్మచర్య వ్రతమును పాటించుచుండవలెను రోజుకు ఒకసారి భోజనము చేయుచుండవలెను ఈ ప్రకారముగా చేయుచుండిన యెడల సాధకుడు చదువుకొన్న విద్యలు ఎన్నటికీ మరచి పోకుండా వుండును.

## తంత్ర సిద్ధికారక దత్త మంత్రము

"ఓం సర్వబ్రహ్మ పరమాత్మనే నమః జగదుత్పత్తిస్థితి ప్రళయకరాయ బ్రహ్మ హరి హరాయ త్రిగుణాత్మనే సర్వ కౌతుకాని దర్శయ దత్తాత్రేయాయనమః తంత్రాణాం సిద్ధిం కురుకురు స్వాహా ॥"

### విధానము

ఈ మంత్రమును ఒక మంచి శుభ ముహూర్తములో ప్రారంభించవలెను. నెయ్యితో దీపారాధన చెయ్యవలెను. ధూపమువేసి పుష్పములతో పూజించి దత్తాత్రేయ స్వామికి నైవేద్యము పెట్టి పైన పేర్కొనబడిన మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించవలెను. ఈ ప్రకారముగా యిరవై ఒక్క రోజులు జపించిన యెడల మంత్రము సిద్ధించును.

ఏ మంత్రమును చేయుటకైనను ముందుగా ఈ మంత్రమును యిరవై ఒక్క సార్లు జపించిన యెడల సాధకుడు చేసే ఏ మంత్రమైనను నిశ్చయముగా సిద్ధించును.

## ఇంద్రజాల విద్యాసిద్ధి మంత్రము

"ఓం నమో నారాయణాయ విశ్వంభరాయ ఇంద్రజాల కౌతుకానిదర్శయ సిద్ధిం కురుకురు స్వాహా"

### విధానము

శ్రీ మన్నారాయణమూర్తి పటము ఎదురుగా పెట్టుకొని నెయ్యితో దీపము వెలిగించి, సాంబ్రాణి ధూపము వేసి, పుష్పములతో పూజించి, నైవేద్యము పెట్టి పైన పేర్కొనబడిన మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించవలెను. ఇట్లు యిరవై ఒక్క రోజులు జపించిన యెడల మంత్రము సిద్ధించును. తరువాత సాధకుడు ఏ మంత్రమునైనా చేయుటకు ముందు ఈ మంత్రమును యిరవైఒక్కసార్లు జపించిన యెడల సాధకుడు చేసే తంత్రములన్నియూ సిద్ధించుచుండును.

## దేహరక్షణ మంత్రము

"ఓం పరమాత్మనే పరబ్రహ్మ మమ శరీరే పాహి పాహి కురుకురు స్వాహా ॥"

### విధానము

బ్రహ్మ పటమును ఎదురుగా పెట్టుకొని సాధకుడు నెయ్యితో దీపారాధన చేసి ధూపమువేసి పుష్పములతో పూజించి నైవేద్యము పెట్టి పైన పేర్కొనబడిన మంత్రమును రోజుకు నూట ఎనిమిదిసార్లు చొప్పున జపించుచుండవలెను. ఇట్లు

యుర్దై ఒక్కరోజు జపించుచుండిన యెడల మంత్రము సిద్ధించును ఏదైనా తాంత్రిక ప్రయోగములు, చేతకములు చేసే ముందు సాధకుడు ఈ మంత్రమును యుర్దై ఒక్కసార్లు జపించిన యెడల సాధకునకు ఎట్టి ప్రమాదములు కలుగకుండా శరీరము రక్షింపబడుచుండును.

### భూమిలోని నిధులు చూపే మంత్రము

"ఓం విదాలా వ్యకవర్తిన్ మమసిద్ధిం కురుకురు స్వాహా"

**విధానము**

అడవిలో ఎక్కడైనను శవము పడివుంటే రాత్రి సమయములో సాధకుడు అక్కడకు వెళ్ళి ఆశవము యొక్క ముఖమును ప్రక్కకు త్రిప్పి, ఆ శవము శిరస్సుపై దీపము పెట్టవలెను పైన పేర్కొనబడిన మంత్రమును ఒక లక్షసార్లు జపించవలెను మంత్రము సిద్ధించగానే శవము లేచి నిలబడి, భూమిలో నిధులు ఎక్కడవున్నవో అనియుల సంగతంతా వివరముగా చెప్పును.

### స్త్రీ వశీకరణ మంత్రము

"కాలా కలువా కాలీరాత్ మే మిలావో ఆతీ రాత్‌మే బులాయూనా అతు కులవేదిక్-వార్ తుమ్మెలో పీర్ బాలాన్గ్ కి అంగూలో కరదలావత్ బాగల్ ప్రేదేవగులు కాళీ విలాప తుకకోక్ బాగ్ విలాప్ అంకారీ బావన్ కా బారీ పద్మారీ సాదనీ పియారీకన్ చరాతో హంస్ వశీటమూల్గా మార్తె శెవేలోటే బారీకీళ్ బలై బలై హంరోదేశ్ కేవల్ కంబల్ బాన్ గుంకే - శత్రే మేరీ - భక్త వెతె మంత్ర ఈశ్వరోవాక్ !"

**విధానము**

పైన పేర్కొనబడిన మంత్రముచే ఆదివారమునాడు తమలపాకులను నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి ఆ తమలపాకులను ఏ స్త్రీ చేత తినిపించిన యెడల ఆ స్త్రీ సాధకునకు వశ్యమగును.

### అగ్నిస్తంభన మంత్రము

"ఓం నమో కోరా రూ జలపో భరియా పా గౌరా కేశర్ వస్ భరియా దోళే గౌరాన్హాయ్ జలతీ అగ్ని శీతల్ హోజాయే శక్తి పిండ్ కాంచాపురో మంత్ర ఈశ్వరోవాచా !"

**విధానము**

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత సాధకుడు ఒక పచ్చిమూకుడులో నీళ్లుపోసి పై మంత్రముచేత నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, నీళ్ళను ఎంతవరకు జల్లునో అంతవరకు అగ్ని స్తంభించి పోవును. అనగా ఆ ప్రదేశములో మండుతూ వుండే మంటలు ఆరిపోవును.

### ఖడ్గస్తంభన మంత్రము

"ఓం నమో దాస్ దాస్ అవర్ దాస్ దాంద హిమలార్ అవిహారంధా తీన్‌బార్ కట్టె రూమ్‌వ లీకేదర్ ఖాండ్‌కీబార్ కోలేగాయా యమీహనుమత్తవీర్ శక్తి పిండ్ కాచా పురో మంత్ర ఈశ్వరో వాచా"

**విధానము**

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత సాధకుడు మార్గమునందున్న దుమ్మును తీసుకొని దానిని పై మంత్రముచే నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, తనమీద ప్రయోగింపబడే ఖడ్గమునందైన (కత్తుల పైన) చల్లిన యెడల ఎట్టిప్రమాదము కలుగకుండావుండును.

### శతఘ్ని నివారణ మంత్రము

ఓం నమో ఆదేశ్ గురుకోజల్ బాంధూజల్ హాయీ బాంధూబాంధూ కాలీహాయీ పహాలోక్ ఆసేటబాంధూ చలతో హనుమన్ యతీకి దుహాయీ శక్తి పిండ్ కాచా పురో మంత్ర ఈశ్వరోవాచా"

**విధానము**

ఈ మంత్రమును నూట ఎనిమిదిసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత సాధకుడు ఒకేరంగుగల ఆవుపాలను తీసుకువచ్చి పై మంత్రముతో నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించి, తుపాకుల పైనగాని, ఫిరంగుల పైనగాని చల్లినయెడల అవి పేలకుండా వుండును. గుళ్ళు బైటికిరావు. ఎదుటివారికి అపకారము జరగకుండా వుండును.

### గర్భస్థిరీకరణ మంత్రము

"ఓం నమో ఆదేశ్ గురుకో ఓం నేతంబర్ పురుష్ హాయీకో రాతిఖ డిబ్బ్ నహోది హిందువర్ హామాన్ దర్బేకోహాయ పురాహీరేయ్ నాన్‌గారి హూహా గర్భకో దాంత్రీ హనుమానవీర్ గురోహా తేరాశ దమాన్ బీస్ పాంశ్ పురోమంత్ర ఆదేశ్ గురుకో"

**విధానము**

ఆదివారమునాడు కన్నెపిల్లచేత నూల్పును వడికించి సూర్యుని ఎదురుగుండా కూర్చొబెట్టి రెండున్నర మూరల కండెలు తీసుకువచ్చి ఆ దారముతో ఎడుపేటలు గల రెండు తాళ్ళు పేనించి ఒక్కొక్క దారమునకు మూడేసి ముళ్ళు వేయవలెను. సాధకుడు ఆముళ్ళు వేసేటప్పుడు ఒక్కొక్క ముడికి పై మంత్రముచేత యుర్దై ఒక్కసార్లు అభిమంత్రించవలెను. తరువాత ఆ తాళ్ళకు గుగ్గిలము పొగ వేయవలెను. అటుతరువాత ఒక త్రాడును గర్భిణీ స్త్రీ మెడలోను రెండవత్రాడును ఆ గర్భిణీ స్త్రీ యొక్క నడుమునకున్ను కట్టిన యెడల గర్భస్రావము జరగకుండా, గర్భము రక్షింపబడి, ఆ గర్భిణీ స్త్రీ ఆరోగ్యముగా పెరుగుచుండును.

### రాళ్ళు విసరివేసే మంత్రము

"ఓం హ్రీం శ్రీం క్లీం ఫట్ స్త్రీం స్వాహా"

**విధానము**

ఈ మంత్రమును పదివేలుసార్లు జపించిన యెడల సిద్ధించును. తరువాత సాధకుడు బట్టలుకుట్టె వాడింటికి తమలపాకులు అమ్ముకునే వాడింటికి చెప్పులు కుట్టుకునే వాడింటికి వెళ్ళి భిక్షముగనుగాని తీసుకొని రావలయును. అభిక్ష ఎంత దొరికితే అంత దానిలో కొంతెము పల్లెకెంకర కలిపి దాంట్లో గాడిద మూత్రముపోసి ఒక్కరోజు నిలువయుంచి ఆ భిక్షను ఈ దిగువ చెప్పబడిన మంత్రముతో నూట ఎనిమిదిసార్లు అభిమంత్రించవలెను.

**మంత్రము**

"ఓం కాలా కాలీ మహాకాళ్ళికే / దిన్ జాయ్ మహ్ ల్యావే వాకూ జడీ శిలాకూ వరవతే"

**విధానము**

పైన చెప్పబడిన విధముగా సిద్ధము చేయబడిన భిక్షాన్నమును ఏరాయిపైన పెట్టిన ఆరాయి సాధకుడు చెప్పిన చోటుకు ఎగిరివెళ్ళి పడును. భిక్షాన్నమును పెట్టిన తరువాత సాధకుడు ఆరాయిని తన చేతితో కూడా స్పృశించవలెను.

ఇట్లు చేసిన యెడల మార్గమందు పోయేటప్పుడు కురిసే వర్షము లేక అన్నము వండుకునే టప్పుడు కురిసే వర్షములు ఆగిపోవును. ప్రయాణముగాని వంటగాని సుఖముగా చేసుకొన వచ్చును.

### వేతాళుని తొలగించే మంత్రము

"ఓం నమో ఆదేశ్ గురుకో బజరీ బజ్ కివాడ్ బజ్రే సె బాంధో దశోంద్వార్ దశోంద్వార్ కో మారో హాతే ఉలట్ వేద్ హాహ కోతాల్ వహి హాకే గణపతికే ద్వారే హాకే హనుమన్త కిలికే హాకే భైరోంకే హారే హాకే రోష్ రోష్కే రక్ష కరేకో శ్రీ నృసింహదేవ్ ఆయా శబ్ద్ సాంచా పిండ్ కాచా పురోమంత్ర్ ఈశ్వరో వాచా సర్వ్ నాథ్ ఆదేశ్ గురుకా"

**విధానము**

ఈమంత్రజపమును శనివారమునాడు ప్రారంభించవలెను. రోజుకు యిరవై ఒక్కసార్లు మంత్రమును జపించవలెను. దీపారాధన చేసి పుష్పములు మిఠాయి దగ్గర పెట్టుకొని మంత్రము గుగ్గిలము పొగ వెయ్యవలెను. ఇట్లు యిరవై ఒక్కరోజులు చేసిన యెడల మంత్రము సిద్ధించును. తరువాత అష్టమినాడు నైవేద్యము పెట్టి మంచినీళ్ళను పై మంత్రముచేత ఏడుసార్లు అభిమంత్రించి రోగిచేత త్రాగించిన యెడల ఆ రోగిపైన వుండే వేతాళ దోషములు మంత్రతంత్ర ప్రయోగాది దోషములు తొలగిపోయి ఆరోగ్యము కలుగును.

### పీడా నివారణ మంత్రము

"అక్బాల్ వరూఖిన్ దర రోటి లగర్భ్ ఖర్"

**విధానము**

ఏ స్థానములో శరీరములో పీడవుండునో (నొప్పి, పోటు, బాధ మొదలైనవి) ఆ స్థానములో పైన పేర్కొనబడిన మంత్రమును చదువుచూ పచ్చముట్టితో మూడుసార్లు వ్రాయవలెను. తరువాత ఆ పచ్చముట్టితో మూడుసార్లు వ్రాయవలెను. తరువాత ఆ పచ్చముట్టితో సమానమైన ఎత్తు గల బెల్లమును తూచి ఆ బెల్లమును పిల్లలకు పంచిపెట్టిన యెడల శరీరములోని పీడలు తొలగిపోవును.

### దంత పీడా నివారణ మంత్రము

"హిరదంతా తుమ్ కోన్కుటంతా హమేయామె సజావారోహముహా కవత్ తుమ్హో బత్తీస్ హామత్ తుమత్ కాస్ రీతి మకమాయ్ తుమ్ ఖైరో బాహు మృత్యుకో వరియావంగ్ హీరాత"

**విధానము**

ప్రాతః కాలమందు పళ్ళు తోముకునే సమయములో చేతిలో పిళ్ళు తీసుకొని, పైన పేర్కొనబడిన మంత్రముచే ఏడుసార్లు అభిమంత్రించి నోట్లోవేసుకొని పుక్కిలించి ఉమ్మి వేసిన యెడల దంతముల బాధలు తొలగిపోవును. మరియు కదులుతూవుండే పళ్ళు గట్టిపడును.

### క్రిమిబాధా నివారణ మంత్రము

"హ్రీం మే సీసీ సీసీ మే మిరి మిరి మే కిడా కిడా మే పిడా మరే పిడాయన్ శబ్ద్ సాంచా పిండ్ కాంచా పురోమంత్ర్ ఈశ్వరో వాచా"

**విధానము**

రెండు యినుపమేకులు తీసుకువచ్చి పైమంత్రము చదువుచూ యిరవై ఒక్కసార్లు ఆ యినుప మేకులచేత పిప్పిపన్ను పై దిగదుడిచి అందులో ఒక మేకును నూతిలో పడవేయవలెను. రెండవమేకును వేపచెట్టుకు కట్టవలెను. ఇట్లు చేసిన యెడల పిప్పిపన్నులోని పురుగులు నశించి పోయి బాధతగ్గిపోవును.

### కంట్లో పువ్వు హరించే మంత్రము

"ఉత్తర్ కూల్ కాల్ మున్ రోగీ కీ బాత్ యుస్మే యూల్ రోగీ కీ దో బేటి ఏక్ పారేమాలావా ఏక్ కాటే ఫూలీ కాకాల్ ఫూలీ కాకాల్ ఫూ కాకాల్"

**విధానము**

పై మంత్రమును చదువుచూ రోగి ఎదురుగుండా కూర్చుని భూమిపై కత్తితో ఒక గీత గీయవలెను. ఇట్లు యిరవై ఒక్కసార్లు మంత్రమును చదువుచూ యిరవై ఒక్క గీతలు గీయవలెను. ఈ ప్రకారముగా ఏడురోజులు చేయుచుండిన యెడల కంట్లోని పువ్వులు హరించిపోవును.

### స్త్రీ వశీకరణ మంత్రము

"శ్రీ రామ్ నాగర్ వెలి అకస్ కలిర్ మునియే నారిలాల్ హమారీ ఏక్ హాస్‌రంగ్ మంగాయ్ ఏక్ హాస్ ఏక్ నేలాని ఏక్ హాస్ మూక్ బులాని హస్ కోహాడ బిర్ కో దేక్ తాకీ కరేజా మురహమ్మద్ బీర్ రక్ష్"

**విధానము**

పైన పేర్కొనబడిన మంత్రముచేత తమలపాకును యిరవై ఒక్కసార్లు అభిమంత్రించి ఏస్త్రీకి తినిపించిన యెడల ఆ స్త్రీ సాధకునకు వశ్యురాలగును.

### నేత్ర పీడా నివారణ మంత్రము

"ఓం నమో శ్రీ రామ్ కేవలి ఉత్ మన్ కాజల్ అంజ్ దర్ద్ కరేకో ఉల్ మన్ కవర్ కి ఆలీ మేరి భక్తి గురుశక్తి పురోమంత్ర్ ఈశ్వరో వాచా సత్యనామ్ ఆదేశ్ గురుకా"

**విధానము**

దీపావళినాడు రాత్రి ఈమంత్రమును మూటవలెనే నాల్గుసార్లు జపించిన యెడల సిద్ధించును. మంత్రము సిద్ధించిన తరువాత పైమంత్రమును ౧౦౮ సార్లు చదువుచూ యినుప గరిటతో కంటిపైనుంచి దిగదుడిచిన యెడల కంటిపోటు మంట వైగా బాధలు హరించిపోవును.

### కడుపునొప్పి నివారణకు మంత్రము

"ఓం నమో ఆదేశ్ గురుకో ప్యాస్ గురు పర్వత్ ప్యాస్ గురుపర్వత్ మే బట్ బట్ మేకూహా కూహా మేతీస్ నూహారాన్ కేస్ సూహా జహర్ సూఘా పీడాముఖా లాత్ బాఅవే జహర్ ఆఘాలాతీ హనుమన్త్ మార్ కరేగా భస్మన్ పురోమంత్ర్ ఈశ్వరోవాచా"

**విధానము**

ఈమంత్రముచేత మంచినీళ్ళను ఏడుసార్లు అభిమంత్రించి ఒకరోజులో ఒక్కసారి త్రాగవలెను. ఈ ప్రకారముగా ఏడురోజులు పైమంత్రముచేత అభిమంత్రించబడిన నీళ్ళను త్రాగుచుండిన యెడల కడుపునొప్పి నిశ్చయముగా హరించిపోవును.

### గడ్డలు పుండ్లను మాన్పే మంత్రము

"ఓం నమో ఆదేశ్ గురుకో బన్ మే బ్యాతః అంజని జిన్ జాయ హనుమన్త్ పూనీ పుంసీ గూమడీ తీనోం భస్మంత్"

ఓం వాగ్మినే నమః
ఓం వంద్యాయ నమః
ఓం వరదాయ నమః
ఓం భక్తాభీష్టఫల ప్రదాయ
ఓం మార్గశీర్షోద్భవష్టాయ
ఓం విపశ్చితే నమః నమః
ఓం విశ్వమిత్రాయ నమః
ఓం విష్ణు ప్రియాయ నమః
ఓం విరూపమాయ నమః
ఓం హరయే నమః
ఓం హింసాకరాయ నమః
ఓం శుచయే నమః
ఓం కామరూపాయ నమః
ఓం లీలాహాయ నమః
ఓం వేష్మగోదరఖండ వాయ నమః
ఓం గంగోద్భవాయ నమః
ఓం శివానందదాయినే నమః
ఓం సకలశాస్త్రవాయ నమః
ఓం షష్ఠ్యప్రమదదేవాను గామినే నమః
ఓం వల్లీ వారణాయ నమః
ఓం భోగినే నమః
ఓం భోగ ప్రదాయ నమః
ఓం భూభృతే నమః
ఓం భయాపహాయ నమః
ఓం భవ్యరూప ధరాయ నమః

ఓం బాల బ్రహ్మ చారిణే నమః
ఓం జరాదిహాయ నమః( నమః
ఓం నిత్యాన్నదాన నిరతాయ నమః
ఓం నిరవద్యాయ నమః
ఓం దయా నిధయే నమః
ఓం నిరంజనాయ నమః
ఓం జగదాధారాయ నమః
ఓం కాళియాయ
ఓం కులిశ స్థిరాయ నమః
ఓం సర్వస్పృహాయ నమః
ఓం సర్వరాజాయ నమః
ఓం కుండలినే నమః
ఓం భువనేశ్వరాయనమః
ఓం బ్రహ్మణ్యాయ నమః
ఓం బ్రహ్మ రూపాయ నమః
ఓం భవేశ్వరాయ నమః
ఓం మహాభూషాయాయై నమః
ఓం కాళిక్యై నమః
ఓం పరదేవతాయై నమః
ఓం చతుర్థ శాంతకోణ స్థాయై నమః
ఓం దశారద్వయవాసిన్యై నమః
ఓం భగవత్యై యమః
ఓం షోడశన్యాసాయై నమః
ఓం త్రిపుర భైరవ్యై నమః

## శ్రీ సుబ్రహ్మణ్య మహామంత్రము

ఈ మంత్ర ప్రారంభమునందు గణపతిని ధ్యానము చేయవలయును.

అస్య శ్రీసుబ్రహ్మణ్యేశ్వర మహామంత్రస్య । సదాశివ ఋషిః అనుష్టుప్ఛందః శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరో దేవతా । హ్రాం బీజం । హ్రీం శక్తిః హ్రూం కీలకం । శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర ప్రసాద సిద్ధ్యర్థే ఇష్ట కామ్యార్థ సిద్ధ్యర్థే సకల శ్రీ పురుషార్థ వశీ కరణార్థే జపే వినియోగః ।

### కరన్యాసము

హ్రాం అంగుష్ఠాభ్యాం నమః
హ్రీం తర్జనీభ్యాం నమః
హ్రూం మధ్యమాభ్యాం నమః
హ్రైం అనామికాభ్యాం నమః
హ్రౌం కనిష్ఠి కాభ్యాం నమః
హ్రః కరతల కరపృష్ఠాభ్యాం నమః

### అంగన్యాసము

హ్రాం హృదయాయ నమః
హ్రీం శిరసే స్వాహా
హ్రూం శిఖాయై వషట్
హ్రైం కవచాయహుం
హ్రౌం నేత్రత్రయాయ వౌషట్
హ్రః అస్త్రాయఫట్
ఇతిలోకత్రయేణ దిగ్బంధః

### ధ్యానము

గాంగేయం వహ్ని గర్భం శరవణజనితం జ్ఞానశక్తిం కుమారం। బ్రహ్మణ్యం స్కందదేవం గుహమమలగుణం రుద్రతేజ స్వరూపం। సేనాన్యం తారకఘ్నం గురుమచలమతిం కార్తికేయం గుణాఢ్యం। సుబ్రహ్మణ్యం మయూరధ్వజ రథ సహితం దేవదేవం నమామి

### పంచపూజ

శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః గంధం సమర్పయామి
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః పుష్పం సమర్పయామి
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః ధూప మాఘ్రాపయామి
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః దీపం దర్శయామి
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ నమః అమృతనై వేద్యంతాంబూలాద్య నంతకోటి నమస్కారాన్ సమర్పయామి.

### మూలమంత్రము

"ఓం హ్రీం సౌం శరవణభవ సౌం హ్రీం ఓం"

గాయత్రి - తత్పురుషాయ విద్మహే, మహాసేనాయ ధీమహి, తన్నష్షణ్ముఖః ప్రచోదయాత్।

ఈ మంత్రమును ప్రతిదినము ౧౦౦౮ గాని, ౧౦౮ గాని జపించవలయును. మరల కరన్యాస అంగన్యాసములును, దిగ్విమోకమును ధ్యానమును పంచపూజయును చేయవలయును. ఈ మంత్రమును జపించువారు ఆయురారోగ్య సంతాన సౌఖ్యములను ఐశ్వర్యమును సుబ్రహ్మణ్య దర్శనమును పొందుదురు.

### సుబ్రహ్మణ్యయంత్రము

| ఓం | సౌం | శ | ర |
|---|---|---|---|
| వ | ణ | భ | వ |
| శ | ర | వ | ణ |
| భ | వ | సౌం | ఓం |

(మూల మంత్రము)
"ఓం సౌంశరవణభవ"

ఈసుబ్రహ్మణ్యం మహా మంత్ర మును దీక్షతో రోజు ౧ కి ౩ వేలు చొప్పున ముప్పది రోజులు జపించి ముప్పదియొకటవ రోజున ౧౦ వేలు జపించగా లక్షజపము పూర్తియై మంత్రసిద్ధి యగును. (ఇందుకు నియమము ఈ యంత్రము జపమందున్నప్పుడు చాకలిమాట వినగూడదు.) ఇట్లు చేయుట వలన సుబ్రహ్మణ్యుడు ప్రత్యక్షముగా సాక్షాత్కరించును. సమస్త క్రూర గ్రహ బాధాది దోషములు తొలగి ఇష్టార్థ సిద్ధిని పొందుదురు.

### సముదాయ షణ్ముఖ సుబ్రహ్మణ్య యంత్రము

| శ | ర | వ | ణ | భ | వ |
|---|---|---|---|---|---|
| ర | వ | ణ | భ | వ | శ |
| వ | ణ | భ | వ | శ | ర |
| ణ | భ | వ | శ | ర | శ |
| భ | వ | శ | ర | వ | ణ |
| వ | శ | ర | వ | ణ | భ |

ఈ యంత్రమును బంగారు రేకునందైనను, వెండి రేకు నందైనను చెక్కించి పద్మాసనము వేసికొని తూర్పు ముఖముగా కూర్చుండి యంత్రమునకు షోడశోపచార పూజచేసి ఈ దిగువ

ప్రాయబడియున్న శ్రీ బాలసుబ్రహ్మణ్య మంత్రమును రుద్రాక్షమాలికతో ౧౦౦౦ జపించిన సమస్త కార్యములును నిర్విఘ్నముగా నెరవేరును.

### శ్రీ బాల సుబ్రహ్మణ్య మంత్రము

"ఓం వం స్కౌం సాం సౌం స్కౌం వం శరవణభవ శ్రీం హ్రీం నమశ్శివాయ"

యంత్రప్రమాణములు

ధ్యానమర్థ :- శ్లో॥ విశాంగుళస్య విస్తీరణ మంగుళద్వయ నిర్మితమ్ । ధ్యానమర్ధా ప్రయోగంచ సర్వరోగ నివారణమ్ ॥

స్వర్ణరక్ష :- శ్లో॥ అంగుళద్వయ విస్తీర్ణం చతురంగుళ నిర్మితమ్ః స్వర్ణరక్షా ప్రయోగంచ సర్వదేవవశీకరమ్ ॥

### కుమార స్వామి మహా మంత్రము

#### ధ్యానము

శ్లో॥ హిమాద్రి శ్వేతం ద్విభుజం భుజంగం, పరేతతంత్ర శివి విస్తరణమ్ । సరేంద్రకన్యా ప్రియపుత్ర మార్యం హృదిస్మరేఽభీష్టప్రదం కుమారం.

#### మూలమంత్రము

"ఓం హ్రాం కుమారాయ నమః స్వాహా"

ప్రతి దినమును ౧౦౦౮ వి గాని, ౫౦౮ గాని గాని, ౧౦౮ వి జపము చేయవలయును.

మరల ధ్యానమును చేసి నమస్కరించవలయును. ఈ మంత్రమును జపించిన యెడల శత్రుజయమును, తేజస్సును, బలమును, విద్యయును, ఆరోగ్యమును కలుగును.

### మృత్యుంజయ మహా మంత్రము

ఈ మంత్ర ప్రారంభమునందు గణపతిని ధ్యానము చేయవలయును.

అస్య శ్రీ మృత్యుంజయ మహామంత్రస్య । జమదగ్ని ఋషిః । అనుష్టుప్ఛందః । శ్రీ మృత్యుంజయో దేవతా । మృత్యుంజయాయ రుద్రాయ బీజం । నీలకంఠాయ శంభవే అమృతేశాయ శర్వాయ శక్తిః । మహాదేవాయ తే నమః కీలకం శ్రీ మృత్యుంజయ ప్రసాద సిద్ధ్యర్థే అపమృత్యుజయార్థే జపే వినియోగః ।

#### కరన్యాసము

మృత్యుంజయాయ రుద్రాయ అంగుష్ఠాభ్యాం నమః
నీలకంఠాయ తర్జనీభ్యాం నమః
శంభవే మధ్యమాభ్యాం నమః
అమృతేశాయ అనామి కాభ్యాం నమః
శర్వాయ కనిష్ఠి కాభ్యాం నమః
మహాదేవాయ తేనమః కరతల కరపృష్ఠాభ్యాం నమః

#### అంగన్యాసము

మృత్యుంజయాయ రుద్రాయ హృదయాయ నమః
నీలకంఠాయ శిరసేస్వాహా
శంభవే శిఖాయై వషట్
అమృతేశాయ కవచాయహుం
శర్వాయ నేత్రత్రయాయ వౌషట్
మహాదేవాయ తే నమః అస్త్రాయఫట్
మృత్యుంజయాయ రుద్రాయ, నీలకంఠాయ శంభవే
అమృతేశాయ శర్వాయ, మహాదేవాయ తేనమః
ఇతిదిగ్బంధః ।

#### ధ్యానము

చంద్రమండలపీఠస్థం చంద్రార్ధకృత శేఖరం ।
చంద్రవర్ణం జగద్ధ్యేయం మృత్యుంజయ ముపాస్మహే ।

#### మూలమంత్రము

మృత్యుంజయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే
అమృతేశాయ శర్వాయ మహాదేవాయ తే నమః

ఈ మూలమంత్రమును ప్రతిదినము ౧౦౮ సార్లు జపించవలయును. మరల కరన్యాస అంగన్యాసములును దిగ్బంధనము ధ్యానమును చేయవలయును.

#### మంత్ర మహిమ

శ్లో॥ ఏవం ధ్యాత్వా జపేన్నిత్య మష్టోత్తర శతంనరః
యో నరో భక్తిసంయుక్త స్సర్వరోగాన్ముచ్యతే ధ్రువం ।
దృష్ట్వాతు మాంత్రికం దూరాత్పలాయంతే గ్రహాదయః
జపేన చాస్య మంత్రస్య మృత్యుంజయతి నిశ్చితం ।

### మృత్యువును జయించు మంత్రము

శ్లో॥ మృత్యుంజయాయ రుద్రాయ, నీలకంఠాయ శంభవే అమృతేశాయ శర్వాయ, మహాదేవాయ తే నమః"

అను నీమహామంత్రమును ధ్యానించుచు కేవల కుంభక ప్రాణాయామమును స్థిరపరచుకొనిన యెడల మృత్యువును అవలీలగా జయించవచ్చును.

### సంతాన గోపాలకృష్ణ మంత్రము

ఈ మంత్ర ప్రారంభమునందు విష్వక్సేనుని ధ్యానము చేయవలయును.

అస్య శ్రీ సంతానగోపాలకృష్ణ మహామంత్రస్య । నారద ఋషిః । అనుష్టుప్ఛందః । శ్రీ సంతాన గోపాలకృష్ణో దేవతా క్లాంబీజం । క్లీంశక్తిః । క్లూం కీలకం । శ్రీ సంతాన గోపాల కృష్ణ ప్రీత్యర్థే సంతానార్థే జపే వినియోగః

#### కరన్యాసము

క్లాం దేవకీసుత అంగుష్ఠాభ్యాం నమః
క్లీం గోవింద తర్జనీభ్యాం నమః
క్లూం వాసుదేవ మధ్య మాభ్యాం నమః
క్లైం జగత్పతే అనామి కాభ్యాం నమః
క్లౌం దేహి మేతనయం కృష్ణ కనిష్ఠి కాభ్యాం నమః
క్లః త్వామహం శరణంగతః కరతల కరపృష్ఠాభ్యాం నమః

#### అంగన్యాసము

క్లాం దేవకీసుత హృదయాయ నమః
క్లీం గోవింద శిరసేస్వాహా
క్లూం వాసుదేవ శిఖాయై వషట్
క్లైం జగత్పతే కవచాయ హుం
క్లౌం దేహి మే తనయం కృష్ణ నేత్రత్రయాయ వౌషట్
క్లః త్వా మహం శరణం గతః అస్త్రా యఫట్
భూర్భువస్సువరోమితి దిగ్బంధః

#### ధ్యానము

శ్లో॥ వైకుంఠా దాగతం కృష్ణం రథస్థం కరుణా నిధిం
కిరీటిసారథిం పుత్ర మానయం తంజగత్పతిం
రథస్థం పుత్ర మాదాయ గురవేదైవి కాయచ



శ్రీ చక్రపూజ

### కరన్యాస అంగన్యాసములు

క ఏ ఈ ల హ్రీం సర్వశక్తి ధ్యనివే అంగుష్ఠాభ్యాం నమః
హసకహలహ్రీం నిత్యశక్తి ధ్యనివే తర్జనీభ్యాం నమః
సకలహ్రీం ఆనందబో ధశక్త్యైమధ్యమాభ్యాం నమః
క ఏ ఈలహ్రీం నిత్యశక్తి ధ్యనివే అనామి కాభ్యాం నమః
హసకహల హ్రీం అనంతబోధితాయై కనిష్ఠి కాభ్యాం నమః
సకల హ్రీం కరతల కరపృష్ఠాభ్యాం నమః
క ఏ ఈలహ్రీం సర్వశక్తి ధన్వినే హృదయాయ నమః
హసకహల హ్రీం నిత్యశక్తి ధన్వినే శిరసే స్వాహా
సకలహ్రీం ఆనందబోధశక్త్యై శిఖాయై వషట్
క ఏ ఈలహ్రీం నిత్యశక్తి ధ్యనివే కవచాయహుం
హసకలహ్రీం ఆనందబోధితాయై నేత్రత్రయాయ వౌషట్
సకలహ్రీం నిత్యశక్తిధామ్నే అస్త్రాయఫట్ ।

శ్లో॥ శ్రీ చక్రప్రియవాసినీం, భగవతీం శ్రీ రాజరాజేశ్వరీం
చక్రానామమయప్రదాం పరదేవీ మానందసందాయినీం ।
బ్రహ్మాద్యమరసన్నిషేవితాం మునిమునాం గంధర్వసంసేవితాం
ధ్యాయంతీం త్రిపురాం పరాత్పరమయాం శ్రీ
బ్రహ్మవిద్యాంతరతేమాయ్యమన్యవర్ణమితి చిత్యంతః

### ధ్యానము

శ్లో॥ సకుంకుమ విలేపనా మళిక చుంబిక స్తూరికాం
సమందహసి తేక్షణాం సశరచాపపాశాంకుశాం ।
అశేషజన మోహినీం అరుణమాల్య భూషాంబరాం
జపాకుసుమ భాసురాం జపవిధౌస్మరే దంబికామ్

### లమిత్యాదిపంచపూజ

లం పృథ్వీతత్వాత్మనే గంధం సమర్పయామి
హం ఆకాశతత్వాత్మనే పుష్పం సమర్పయామి
యం వాయుతత్వాత్మనే ధూపం మాఘ్రాపయామి
రం తేజస్తత్వాత్మనే దీపం దర్శయామి
వం అమృతతత్వాత్మనే నైవేద్యం నివేదయామి
సం సర్వతత్వాత్మనే సర్వోపచార పూజాం సమర్పయామి

### మూలమంత్రము

"క ఏ ఈ లహ్రీం, హసకహలహ్రీం, సకలహ్రీం"

ఈ మహామంత్రమును జపించునప్పుడు తనమనస్సును నిశ్చలముగా నుంచుకొని జపమాలను చేత ధరించి (౧౪౦౦౦౦) లక్షాయావృత్తి చేయుము (౪౦) నలుబది దినములకు పూర్తిచేయునది.

సర్వం శ్రీ త్రిపురసుందరీ దేవతార్పణ మస్తు.

మరల అంగన్యాస కరన్యాసములను, నమస్కార దండ ప్రణామములను చేయవలయును. ప్రతి దినము పూజలకు ధూప దీపములు, సుగంధ పుష్పములు, ఖండశర్కర లేక పండ్లు లేక కొబ్బరికాయనైనను నైవేద్య మిమ్మనది. వారపూజకు ధూప దీపములు, సుగంధ పుష్పములు, క్షీరాన్నము, మినపవడలు మొదలగునవి నివేదనమును చేయునది. ఈ చక్రమునందు బీజాక్షరములను లిఖించి యుండుటను, బీజాక్షరములు లేకయే ఉన్నట్లుగా భావించి గృహస్థులును పూజించవలయును.

### దీపదుర్గా కల్పం ప్రారంభము

శ్లో॥ దేవ దేవ మహాదేవ కరుణాకర శంకర
దీపదుర్గా విధానం చ అత్యాశ్చర్యకరం తథా ।
అస్తి చేత్కృపయా స్వామిన్ వద మే కరుణా కర.

తా॥ మిక్కిలి ఆశ్చర్యమును గలిగించు దీపదుర్గా విధానము ఉన్నదని చెప్పుచుంటిరి. కాన దీపదుర్గా విధానమును నాకు చెప్పుమని పార్వతి పరమేశ్వరుని అడిగెను.

### మూలమంత్రము

"ఓం వం జం గం గ్రహేశ్వరాయ శుక్రాయ నమః"

మరల ధ్యానముచేసి నమస్కరించవలెయును.

ఈ మంత్రమును ౨౦ వేలు జపము చేయవలెయును.

### శని గ్రహ మహామంత్రము

శ్లో॥ నీలాంజనాభం మిహిరేష్టపుత్రం గ్రహేశ్వరం పాశభుజంగ పాణిమ్ । సురాసురాణాం భయదం ద్విబాహుం, స్మరే శనిం మానసపంకజేఽహమ్ ।

### మూలమంత్రము

"ఓం హ్రీం శ్రీం గ్రహచక్రవర్తినే శనైశ్చరాయ క్లీం ఐం సః స్వాహా"

మరల ధ్యానము చేసి నమస్కరించవలెయును

ఈ మంత్రమును ౧౯ వేలు జపమును చేయవలెయును శని వారమున ప్రారంభించవలెయును

### రాహు గ్రహ మహామంత్రము

### ధ్యానము

శ్లో॥ శీతాంశుమిత్రాంతక మీడ్యరూపం ఘోరంచవైడూర్యనిభం ద్విబాహుమ్ । త్రైలోక్యరక్షాపరమిష్టదంతం, రాహుం గ్రహేంద్రం హృదయే-భజేఽహమ్ ।

### మూలమంత్రము

"ఓం క్రీం క్రీం హూం హూం టం టంకధారిణే రాహవే రం హ్రీం శ్రీం భైం స్వాహా"

మరల ధ్యానముచేసి నమస్కరించవలెయును.

ఈ మంత్రమును ౧౮ వేలు జపమును చేయవలెయును. గ్రహణమునందు ప్రారంభించవలెయును.

### కేతు గ్రహమంత్రము

### ధ్యానము

శ్లో॥ లాంగూలయుక్తం భయదం జనానాం, కృష్ణాంబు భృత్సన్నిభ మేకవీరమ్। కృష్ణాంబరం శక్తి త్రిశూలహస్తం. కేతుం భజే మానసపంకజేఽహమ్

"ఓం హ్రీం క్రూం క్రూరరూపిణే కేతవే ఐం సౌః స్వాహా"

మరల ధ్యానము చేసి నమస్కరించవలెయును.

ఈ మంత్రమును 7 వేల జపమును చేయవలెయును.

ఈ సూర్యాది నవగ్రహమంత్రములను ధ్యానపూర్వకముగా జపించిన యెడల ఆయా గ్రహదోషములు తొలగి ఆయురారోగ్యములును, బలమును, తేజస్సును వృద్ధిపొందును.

| | | | |
|---|---|---|---|
| [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | [illegible] | [illegible] |

౨౫ సంవత్సరముల శని యంత్రము

| | | | |
|---|---|---|---|
| [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | [illegible] | [illegible] |

౩౫ సంవత్సరముల శని యంత్రము

### శనిగ్రహ ధ్యానము

శ్లో॥ నీలాంజనాభం మిహిరేష్టపుత్రం
గ్రహేశ్వరం పాశభుజంగపాణిమ్ ।
సురాసురాణాంభయదం ద్విబాహుం ।
స్మరే శనిం మానసపంకజేఽహమ్ ।

### మూలమంత్రము

ఓం హ్రీం శ్రీం గ్రహచక్రవర్తినే శనైశ్చరాయ క్లీం ఐం సః స్వాహా"

మరల ధ్యానము చేసి నమస్కరించవలెయును.

శని గ్రహము చెడ్డస్థలములయందున్నప్పుడు ౨౫ సంవత్సర దోషమునకుగాని, లేక ౩౫ సంవత్సర దోషమునకు గాని ఆయా యంత్రములను రాగిరేకుమీద చెక్కించి దానికి ధ్యానసహిత ఉపచారముగా మూలమంత్రముతో ధూపదీపనైవేద్య తాంబూలాదికములను చేయుచు ౨౨ వేలు మూలమంత్ర జపము చేసిన యెడల శనిగ్రహముయొక్క పీడ తొలగి ఆయురారోగ్యైశ్వర్యాది సకల శుభఫలములు తప్పక కలుగును.

### మంత్రబీజ ప్రభావము

సమస్తశబ్దములకు మూలమయిన ఏబదియక్షరములు పఠించిన యెడల మంత్రము లన్నియు జపించినంత ఫలము కలుగునవియు ఇంక మంత్రముల నెందుకు జపింప వలయుననియు తలంపరాదు. ఎట్లనగా గంధకము, సురేకారము, బొగ్గు వీనిని ఆయా భాగ ప్రకారముగ చేర్చినచో తుపాకి మందుగను బాణాసంచు మందుగను, మతాబు మందుగను పరిణమించి వానికి కొకవిధమైన శక్తి గలిగి చిత్ర విచిత్రముగ ప్రకాశించుచున్నవి, ఆ వస్తువులు ప్రత్యేక ప్రత్యేకముగా నున్నను లేక వానిని చేర్చు పరిమాణభాగము తప్పినను చిత్రవిచిత్రములుగ ప్రకాశింపజాలవు. అట్లే ఏబది అక్షరములు వేదోక్తపద్ధతి బీజమేళనముచే మంత్రములై జపించువారికి ఇష్టార్థసిద్ధిని గలిగించును. గాని ఏబది యక్షరములను ఊరక పఠించుటచే ఏ మాత్రము ఫలమును గలుగ జాలదు.

### శ్రీ చూర్ణ ధారణ ధ్యానము

రెండు కన్నులను మూసుకొని రెండు చేతులను జోడించు కొని అంజలి హస్తుడై ధ్యానమును చేయవలెయును.

శ్లో॥ శంఖ చక్ర గదా పాణే ద్వారకా నిలయాచ్యుత ।
గోవింద పుండరీ కాక్ష రక్షమాం శరణాగతమ్ ।

అను ఈ మంత్రము నోటచెప్పక మనస్సులోనే ధ్యానించి "ఓం నమో భగవతే వాసుదేవాయ" అను మంత్రమును మున్మార్లు మనస్సున దలచి, వెనుక శరణాగతరక్షకా రక్షింపుము, రక్షింపుము. అని మనస్సునదలంచుచు, కేశవాది నామముల నుచ్చరించుచు శ్రీ చూర్ణము ధరించవలెయును. తర్వాత వేదోక్తవిధిగా సంధ్యావందన మాచరించవలెయును.

### స్త్రీలు కుంకుమమును ధరించునపుడు ధ్యానము

శ్లో॥ ఓం కారపంజరశుకీం ఉపనిషదుద్యాన కేళికలకంఠీమ్ ।
ఆగమవిపిన మయూరీం మార్యా మంతర్విభావయే గౌరీమ్

అను ఈ మంత్రమును చెప్పుచూ స్త్రీలు కుంకుమమును ధరించవలెయును.

| | |
|---|---|
| వీరరామాయ | మధ్యమాభ్యాం నమః |
| సకల శత్రూన్ | అనామికాభ్యాం నమః |
| హన హన | కనిష్ఠికాభ్యాం నమః |
| స్వాహా | కరతల కరపృష్ఠాభ్యాం నమః |
| ఓం నమో | హృదయాయ నమః |
| భగవతే | శిరసేస్వాహా |
| వీర రామాయ | శిఖాయై వషట్ |
| సకల శత్రూన్ | కవచాయహుం |
| హన హన | నేత్ర త్రయాయ వౌషట్ |
| స్వాహా | అస్త్రాయఫట్ |

భూర్భువస్సువరోమితి దిగ్బంధః । ఉత్తరే దిగ్విమోకః

ధ్యానము

శరంధనుషిసంధాయ తిష్ఠంతం రావణోన్ముఖం,
వజ్రపాణింరథారూఢం రామం ధ్యాత్వా జపేన్మనుం

మూల మంత్రం

ఓం నమో భగవతే వీరరామాయ సకల శత్రూన్ హనహన స్వాహా

## శ్రీ రామ షోడశాక్షరి

శ్లో। నమశ్చ సీతాపతయే రామాయేతి హనద్వయం
తతస్తు కవచాస్త్రం షోడశాక్షర ఈరితః
తస్యాగస్త్య ఋషిశ్ఛందో బృహతీ దేవతాననః
రాం బీజం శక్తి రస్త్రంచ కీలకం హుమితీరితం
ద్విపంచ త్రిచతుర్త్వ్యంగవస్వాక్షైర గంన్యసేత్ర్యః మాత్
అస్య శ్రీ షోడశాక్షరీ మహామంత్రస్య అగస్త్యఋషిః। బృహతీ
ఛందః। రామాయ దేవతా। రాం బీజం। ఫట్ శక్తిః। హుం కీలకం
సీతా పతయే రామాయ ప్రీత్యర్థం సర్వ శత్రుజ యార్థం జపే
వినియోగః।

| శిరాదిన్యాసః | కరహృదయాదిన్యాసః |
|---|---|
| నమః-బ్రహ్మ రంధ్రే | నమః-అంగుష్ఠాభ్యాం నమః |
| సీతాపతయే-భ్రూమధ్యే | సీతాపతయే-తర్జనీభ్యాం నమః |
| రామాయ-హృదయే | రామాయ-మధ్యమాభ్యాంనమః |
| హనహన - నాభౌ | హనహన అనామి కాభ్యాం నమః |
| హుం ఫట్ - ఊర్వోః | హుంఫట్ - కనిష్ఠి కాభ్యాం నమః |
| నమస్సీతాపతయేరామాయ | నమస్సీతాపతయేరామాయ |
| హనహన హుంఫట్ పాదయోః | హన హన హుంఫట్ కరతల కరపృష్ఠాభ్యాం నమః |

హృదయ న్యాసము

నమః హృదయాయ నమః, సీతాపతయే - శిరసేస్వాహా, రామాయ - శిఖాయై వషట్, హన హన - కవచాయహుం, హుం ఫట్ - నేత్ర త్రయాయవౌషట్। నమస్సీతాపతయే రామాయ హనహన హుంఫట్ అస్త్రాయఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః । ఉత్తరే దిగ్విమోకః

ధ్యానము లేదు

మూలమంత్రము

"నమస్సీతాపతయే రామాయ హన హన హుంఫట్" ।

## శ్రీ రామ అష్టాక్షరీ మహామంత్రము

అస్య శ్రీ రామ అష్టాక్షరీ మహామంత్రస్య । బ్రహ్మఋషిః గాయత్రీ ఛందః । రాఘవోదేవతా । శ్రీం బీజం । నమశ్శక్తిః । శ్రీరామ ప్రీత్యర్థే చతుర్వర్గ ఫల ప్రాప్త్యర్థే ఇష్ట కామ్యార్థ సిద్ధ్యర్థే జపేవినియోగః ।

| శిరోన్యాసః | కరన్యాసః |
|---|---|
| శ్రీరామః బ్రహ్మరంధ్రే | శ్రీరామఃఅంగుష్ఠాభ్యాం నమః |
| శరణం-భ్రూమధ్యే | శరణం తర్జనీభ్యాం నమః |
| మమ-హృదయాయై | మమ-మధ్యమాభ్యాం నమః |
| శ్రీరామ నాభౌ | శ్రీరామ అనామి కాభ్యాంనమః |
| శరణం -ఊర్వోః | శరణం కనిష్ఠికాభ్యాం నమః |
| మమ పాదయోః | మమ కరతల కరపృష్ఠాభ్యాం నమః |

అంగన్యాసము

శ్రీరామ-హృదయాయ నమః శరణం శిరసేస్వాహా, మమ-శిఖాయై వషట్, శ్రీరామ-కవచాయ హుం, శరణం - నేత్ర త్రయాయవౌషట్, మమ-అస్త్రాయ ఫట్ భూర్భువస్సువరోమితి దిగ్బంధః । ఉత్తరేదిగ్విమోకః ।

ధ్యానము

శ్లో। కేయూరాంగద కంకణై ర్మణి గణై ర్విద్యోతమానం సదా
రామం పూర్ణమచంద్రకోటి సదృశ ంఛత్రేణ వైరాజితం
హేమ స్తంభసహస్రషోడశయుత మధ్యే మహామంటపే
దేవేశం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్.
మూలమంత్రం :- "శ్రీరామ శ్శరణం మమ"
"సతతం జపం, ధ్యానం దిగ్బ.."



## శ్రీ రామ షడక్షరి మంత్రము

అస్య శ్రీరామ షడక్షరీ మహా మంత్రస్య। బ్రహ్మ ఋషిః। గాయత్రీఛందః। శ్రీరామో దేవతా। రాంబీజం। రీం శక్తిః। రూం కీలకం । శ్రీరామ ప్రసాదసిద్ధ్యర్థే చతుర్వర్గ ఫలప్రాప్త్యర్థే ఇష్టకామ్యార్థసిద్ధ్యర్థే జపే వినియోగః ।

| శిరాదిన్యాసః | కరన్యాసః |
|---|---|
| రాం - బ్రహ్మరంధ్రే | రాం - అంగుష్ఠాభ్యాం నమః |
| రా - భ్రూర్మధ్యే | రా - తర్జనీభ్యాం నమః |
| మా - హృదయే | మా - మధ్యమాభ్యాం నమః |
| య - నాభౌ | య - అనామికాభ్యాం నమః |
| న - ఊర్వోః | న - కనిష్ఠ కాభ్యాం నమః |
| మః - పాదయోః | మః - కరతల కరపృష్ఠాభ్యాం నమః |

హృదయాదిన్యాసః

రాం - హృదయాయనమః, రా - శిరసేస్వాహా , మా - శిఖాయై వషట్, య - కవచాయహుం, న - నేత్రత్రయాయ వౌషట్, మ - అస్త్రాయఫట్ ।

భూర్భువస్సువరోమితి దిగ్బంధః ।

ధ్యానము

శ్లో। కాలాంభోధర కాంతి కాంతమనిశం వీరాసనాధ్యాసితం
ముద్రాంజ్ఞాన మయాందధాన మపరాం హస్తాంబుజం జానుని
సీతాం పార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం ముకుటాంగ దాది వివిధాకల్పోజ్జ్వలాంగంభజే
షడక్షరీ మంత్రము :- "రాం రామాయనమః"

## శ్రీ రామ షడక్షరి మంత్ర అక్షర లక్షణము

శ్లో। రామరూపాయ రామాయనమో మాయామయాయచ
నమో వేదస్వరూపాయ ఓం కారాయ నమోనమః
రామాధారాయ రామాయ శ్రీరామా యాత్మమూర్తయే
జానకీదేహ భూషాయ రక్షోఘ్నాయ శిఖాంగినే
రామభద్ర మహేష్వాస రఘువీర నృపోత్తమ
భో । దశాస్యాంతక మాస్మాకం రక్షాం దేహి శ్రియంచతే

హ్రీం ఐంద్రం శివాయనమః । ప్రాసాదబంధ పంచాక్షరీ మంత్రం (ప్రతిష్ఠాపనం చ దర్శయేత్) ౧౯

ఐం హ్రీం క్రోం శిం శిం హ్రీం హ్రీం ప్రాసాద పంజర పంచాక్షరీ మంత్రం (మూలపీఠం చ దర్శయేత్) ౨౦

ప్రాసాదం ప్లుతి మూం మూం హ్రీం జీవ జీవ ప్రాసాద సారపంచాక్షరీ మంత్రం (సర్వతత్త్వం చ దర్శయేత్) ౨౧

వం శ్లీం క్రోం ఆం హ్రీం వం నమః । ప్రాసాదశిఖర పంచాక్షరీ మంత్రం (శివతత్త్వం దర్శయేత్) ౨౨

క ఏ ఈ ల శివాయనమః । ప్రాసాదసుందర పంచాక్షరీ మంత్రం (విద్యాతత్త్వం చ దర్శయేత్) ౨౩

హం హీం హ్రీం హ్రీం నమః । ప్రాసాదగోచర పంచాక్షరీ (ఆత్మతత్త్వం చ దర్శయేత్) ౨౪

ఇతి ఈశాన వక్త్ర మంత్రాః స్వమాహాత్మ్య సిద్ధిజపం ౪౦౦౦౦౦

## తత్పురుష వక్త్ర పంచవింశతి మంత్రాః

అస్య శ్రీ తత్పురుష వక్త్ర మహామంత్రస్య । హరఋషిః అనుష్టుప్ఛందః । భర్గోదేవతా । శ్రీ భర్గప్రీత్యర్థే సర్వకామ ఫలప్రాప్త్యర్థే జపే వినియోగః ।

### ధ్యానము

ఓం హాం అంగుష్ఠాభ్యాం నమః
ఓం హీం తర్జనీభ్యాం నమః
ఓం హూం మధ్యమాభ్యాం నమః
ఓం హైం అనామికాభ్యాం నమః
ఓం హౌం కనిష్ఠికాభ్యాం నమః
ఓం హః కరతల కరపృష్ఠాభ్యాం నమః
ఓం హాం హృదయాయ నమః
ఓం హీం శిరసేస్వాహా
ఓం హూం శిఖాయై వషట్
ఓం హైం కవచాయహుం
ఓం హౌం నేత్రత్రయాయ వౌషట్
ఓం హః అస్త్రాయఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

### ధ్యానము

తత్పరాకారం తటిద్రూపం తపస్యోత్కృష్టం తథా ।
తారాధీశ ధరం దేవం వందే తత్పురుషేశ్వరం

### మూలమంత్రాః ౧౫

ఓం శివాయనమః అఘోర పంచాక్షరీ (ఉత్పాటనాది సర్వేషు యోజయేత్ సర్వదాబుధిః) ౧

అం శివాయనమః । సౌమ్యపంచాక్షరీ (శాంతస్త్రం ప్రజపేన్మనుం) ౨

అం క్రోం శివాయనమః । ఆత్మపంచాక్షరీ (దీర్ఘాయుష్యం భవిష్యతి) ౩

హ్రీం హ్రీం శివాయనమః । ఆజ్ఞా పంచాక్షరీ (భూత ప్రేత నివారణ) ౪

శ్లీం నమశ్శివాయ । మారపంచాక్షరీ (రాజవశ్య కరం పరం) ౫

హ్రీం నమోనమశ్శివాయ మాయాపంచాక్షరీ (సర్వసంపత్ప్రదాయకం) ౬

నమో హ్రీం నమశ్శివాయ । (మాయా పంచాక్షరీ మంత్ర మననం) ౭

ఐం నమశ్శి వాయ వాణీ పంచాక్షరీ (సర్వవిద్యా ప్రదాయకం) ౮

క్షం నమశ్శివాయ అమృత పంచాక్షరీ (ఇహాపసిద్ధిర్భవిష్యతి) ౯

శ్రం నమశ్శివాయ । శుక్రపంచాక్షరీ (అష్టసిద్ధి ప్రదాయకం) ౧౦

హ్రీం నమశ్శివాయ । సిద్ధి పంచాక్షరీ (సర్వజ్వర నివారణం) ౧౧

గ్లాం నమశ్శివాయ చంద్రపంచాక్షరీ (కాలకూట విషం హరేత్) । ౧౨

పింనమశ్శివాయః । జగతీ పంచాక్షరీ (భూసిద్ధిం కురుతే సదా) ౧౩

తార్తీయం శివాయనమః । తార్తీయం పరం పంచాక్షరీ (వాక్యం సిద్ధి ర్భవత్యేవ శాపానుగ్రహ కారకం) ౧౪

క్ష్మౌం శివాయనమః । స్కందపంచాక్షరీ (మహారోగ నివారణం) ౧౫

ఓం రోం ఆహం శివాయనమః । మూలపంచాక్షరీ మోహం త్వపప్రశస్యతే । ౧౬

హం సత్రైం నమశ్శివాయనమః । మహాపంచాక్షరీ (రాజ్య సిద్ధిందదాతిహి) ౧౭

ఓం జూం నమశ్శివాయనమః । ఓం మృత్యుంజయ పంచాక్షరీ (కాలమృత్యు నివారణం) ౧౮

హం హం నమశ్శివాయ కైలాస పంచాక్షరీ (మహా సిద్ధించ విందతి) ౧౯

ఓం శ్రీం నమశ్శివాయనమః । శ్రీం ఓం లక్ష్మీ పంచాక్షరీ (ధాన్యసిద్ధించ విందతి) ౨౦

హ్రాం ఓం నమశ్శివాయ । క్షేత్రపంచాక్షరీ (సిద్ధిర్జ్యోతి జ్ఞ హితుకం) ౨౧

ఓం ఓం హ్రైం నమశ్శివాయనమః । ఆనంద పంచాక్షరీ (సర్వదుఃఖ నివారణం) ౨౨

శ్రీం నమశ్శివాయనమః । అనంత పంచాక్షరీ (వనితావశ మేవచ) ౨౩

బ్లాం ఓం నమశ్శివాయ । శాంభవ పంచాక్షరీ (సర్వ ప్రతికూల వినాశనం) ౨౪

ఓం హం సః నమశ్శివాయనమః । సర్వవిద్యాక్షర పంచాక్షరీ (పరకాయ ప్రవేశనం) ౨౫

ఇతి తత్పురుష వక్త్ర మంత్రాస్వమాహాత్మ్య
సిద్ధి జపం ౧౦౦౦౦౦౦

### ప్రాణ ప్రతిష్ఠ మంత్రము

ఓం ఆం హం సోహం "ప్రాణస్య శివం ప్రాణేస్వాహా"

ఈ మంత్రమును సర్వమంత్ర యంత్రములకును అక్షతలతోగాని, జలముతోగాని, పుష్పములతోగాని ౧౦౮ సార్లు జపించి ప్రోక్షించిన యెడల తాను అనుష్ఠించుదానికి ప్రాణకళలు కలుగును.

### జలప్రోక్షణ మంత్రము

"ఉత్తిష్ఠతో" విశ్వపతో ఒ వ్యాపించు ప్రపూర్ణాజ్ఞ సంజాయామివత్సాపహా" అని ఈ మంత్రముతో ప్రోక్షించిన అపరిశుద్ధత తొలగి పవిత్రత కలుగును.

## గణపత్యష్టకమ్

ఈ గణపతి అష్టకమును చదువువారు సమస్తవిఘ్నములు తొలగిపోయినవారై కార్యసిద్ధిని పొందుదురు. సమస్త పాపములు తొలగిపోయి అనంతరము రుద్ర లోకమున చేరదురు.

శ్లో । ఏకదంతం మహాకాయం తప్త కాంచన సన్నిభం
లంబోదరం విశాలాక్షం వందేహం గణనాయకం
మౌంజీకృష్ణ జినధరం నాగయజ్ఞో పవీతినం
బాలేందువిల సన్మౌళీం వందేఽహం గణనాయకం.
అంబికాహృదయానందం మాతృభిః పరిపాలితం
భక్తప్రియం మదోన్మత్తం వందే ఽ హం గణనాయకం.
చిత్రరత్న విచిత్రాంగం చిత్రమాలా విభూషితం
చిత్రరూపధరం దేవం వందే ఽ హం గణనాయకం
గజవక్త్రం సురశ్రేష్ఠం కర్ణచామరభూషితం
పాశాంకుశధరం దేవం వందే ఽ హం గణనాయకం
మూషికోత్తమ మారుహ్య దేవాసుర మహా ఽ హవే
యోద్ధుకామం మహావీర్యం వందేఽ హం గణ నాయకం
యక్ష కిన్నరగం ధర్వ సిద్ధవిద్యాధరైస్సదా
స్తూయమానం మహాత్మానం వందే ఽ గణనాయకం.
సర్వవిఘ్నహరం దేవం సర్వవిఘ్న వివర్జితం
సర్వసిద్ధి ప్రదాతారం వందే ఽ హం గణనాయకం

### మూల మంత్రము

రాయస్పోషస్య దదితా నిధిదో రత్న ధాతుమాన్ ।
రక్షోహణో వలగహనో వక్రతుండాయహుం (౨౦ అక్షరముల మంత్రము) లక్ష జపాత్సిద్ధిః ॥

మంత్రమహార్ణవే

శ్లో । బ్రహ్మ చర్యరతో మంత్రీ జపేద్రవిసహస్రకం ।
షణ్మాసమధ్యాద్దారిద్ర్యం నాశయత్యేవనిశ్చితం ।

తా । మంత్రసిద్ధ్యనంతరము బ్రహ్మ చర్య వ్రతమొనర్చుచు పండ్రెండువేలు జపముచేసిన యెడల నాలుమాసములలో దారిద్ర్యము నిశ్చయముగా నశించును.

శ్లో । చతుర్థ్యా మేవతుర్థ్యాంబ వేద్దశ సహస్రకం ।
ప్రత్యహంబ హుయాదష్టోత్తర శతమతంద్రితః ।
పూర్వోక్తం ఫలమాప్నోతి షణ్మాసాద్భక్తితత్పరః ।

తా । చవితి మొదలుకొని తిరుగు చవితి వరకు మంత్రము పది వేలు జపము చేయుచు, ప్రతిదినము 108 పర్యాయములు చొప్పున హోమము చేసిన యెడల ఆరు మాసములలో దారిద్ర్యము తప్పక నశించును.

శ్లో । ఆజ్యాక్తాన్నస్య హోమేన భ వేద్ధన సమృద్ధిమాన్ ।

తా । నెయ్యి, అన్నము కలిపి హోమముచేసిన యెడల ఐశ్వర్యవంతుడగును.

శ్లో । పృథుకై ర్నాళికేరై ర్వామరీ చైర్వాసహస్రకం ।
ప్రత్యహంజుహ్వతో హోమాత్ జాయతే ధనసంచయః ।

తా: అటుకులతో గాని, కొబ్బరి కాయలతోగాని, మిరియాలతో గాని ఒక వెయ్యిరోజులు ప్రతినిత్యము వెయ్యి చొప్పున హోమము చేసిన యెడల ధనము సంప్రాప్తించును.

శ్లో । జీరసింధుమరీచాక్తై ర్దశద్రవ్యైస్సహస్రకం
జుహుయాత్ప్రత్యహం పక్షాత్కుబేర ఇవార్థవాన్

తా : జీలకర్ర, సైంధవము, మిరియాలు, వీటితో అష్ట ద్రవ్యములను కలిపి ప్రతినిత్యము వెయ్యి పర్యాయములు చొప్పున ఒక పక్షము హోమము చేసిన యెడల కుబేరునితో సమానమైన ధనవంతుడగును. అనగా గొప్ప ఐశ్వర్యవంతుడగునని భావము.

మేరుతంత్రే

శ్లో । తిలైర్మధుఘృత సంయుక్తైర్హోమః శ్రీ వశ్యదాయకః ।

తా : నువ్వులు, నెయ్యి కలిపి హోమము చేసిన యెడల ఐశ్వర్యము వశీకరణ శక్తియు గలుగును.

స్వాదుత్రయ యుతై ర్లాజైర్హుతేత్సప్త దినావధి ।
కన్యార్థీ లభతే కన్యాం పుత్రార్థీ లభతే సుతం ।

తా : పేలాలను మధుత్రయముతో కలిపి ఏడు దినములు హోమముచేసిన యెడల పుత్రికాసంతతి కావలయునని కోరిన వారలకు పుత్రికా ప్రాప్తియు పుత్రసంతతి కావలయునని కోరువారలకు పుత్ర ప్రాప్తియు గలుగును.

శ్లో । దధిసంసిక్తలవణైర్హుత్వా యావ్చతుర్దినం ।
నీతివ్యాంచ వశ్యాపా భవేత్సశ్యతి తచ్చితం ।

తా : పెరుగు ఉప్పు కలిపి నాల్గు దినములు రాత్రియందు హోమము చేసిన యెడల కోరినదివశ్యమగును.

## శ్రీ బాలా త్రిపుర సుందరి



### శ్రీ బాలా త్రిపురసుందరి మహా మంత్రము

శ్లో । రక్తాంబరాం చంద్రకళావతంసాం
సముద్యదాదిత్య నిభాంత్రినేత్రాం ।
విద్యాక్షమాలాభయదామహస్తాం
ధ్యాయామిబాలామరుణాంబుజస్థామ్ ।

### మూలమంత్రము

ఐం క్లీం సౌః (మూడక్షరముల మంత్రము)

శ్రీ బాలాత్రిపురసుందరి పూజన యంత్రము

జ్ఞానార్ణవే

శ్లో । గంగాతరంగకల్లోల వాక్పటుత్వ ప్రదాయినీ ।
మహాసౌభాగ్య జననీ మహాసామ్రాజ్యదా ।
మహాసౌందర్యసుభగా మహామృత్యువినాశినీ ।
బ్రహ్మవిష్ణుమహేంద్రాది వందితా పాపహారిణీ ।
సర్వతీర్థమయీదేవీ సర్వలోకవశంకరీ ।
సర్వక్షేత్రమయీదేవీ సర్వకార్యార్థ సాధికా ।
మహామోక్ష ప్రదానిత్యం మహాముక్తి ప్రదాయినీ ।

తా॥ అల్పాహారమును భుజించినవాడై అర్ధరాత్రియందు విశ్రమించక మారేడుచెట్టుమీద కూర్చుండి పై మంత్రము మూడువేల పర్యాయములు జపము చేయవలయును. ఈ ప్రకారముగా మారేడు చెట్టుపై కూర్చుండి మధ్యలో విడవకుండా ఒక నెలరోజులు జపము చేయవలయును. జపానంతరము మద్యమును, మాంసమును బలిని ఇవ్వవలయును. అప్పుడనేక రూపములను ధరించిన బిల్వయక్షిణీదేవి ప్రసన్నమగును. ప్రసన్నమైన యక్షిణీదేవిని చూచి భయపడకుండా బలిగా ఇచ్చిన మద్యమాంసములను భుజించువరకు జపము చేయుచుండవలయును. యక్షిణీదేవి బలిని భుజించినపిమ్మట వరము కోరుమని ఆజ్ఞాపించి కోరుమనినతోడనే జపము చాలించి కోరికను కోరినచో ఆ వరమును తప్పక ఇచ్చును.

### వటయక్షిణీ సాధనము

శివార్చనచంద్రికాయాం ।

మంత్రము : ఓం హ్రీం నమశ్చంద్రద్రవే కర్ణాకర్ణ కారణే స్వాహా ।

శ్లో॥ వటవృక్షం సమారుహ్యాలక్షమేకం జపేన్మనుం ।
మంత్రితేనస్థలిర్మం త్రికాం జక్షేణాశయేన్మఖం ।
యామద్వయం జపేద్రాత్రౌపరం యత్ర యక్షిణీ ।
రసంరసాయనం దివ్యంస్తు ప్రకర్మాణ్య నేకధా ।
సిద్ధానిసర్వ కార్యాణి సావ్యదాశంకరోదితం ।

తా॥ ప్రతినిత్యము అర్ధరాత్రి మర్రిచెట్టుపై కూర్చుండి పై మంత్రమును లక్షపర్యాయములు జపము చేయవలయును. పిమ్మట ఏడుపర్యాయములు పులియబెట్టిన కడుగు నీళ్ళను పై మంత్రముతో ఏడుసార్లు అభిమంత్రించి ముఖము కడుగు కొనవలయును. ఆఖరురోజున అర్ధరాత్రి సమయమున చంద్ర ద్రావయక్షిణీ ప్రత్యక్షమై క్షుద్రకర్మలను, సర్వకార్యములను సిద్ధింపజేయు సామర్థ్యముగల దివ్య రసాయనమును ఇచ్చును ఆరసాయనముచే సర్వ కోరికలు నెరవేరును.

### చించం యక్షిణీ సాధన

దత్తాత్రేయ తంత్రే ।

మంత్రము : ఓం క్లీం ధనం కురుకురు స్వాహా ।

శ్లో॥ అశ్వత్థవృక్షమారూఢో జపేదేకాగ్రమానసః ।
ధనదాయక్షిణీం చైవ ధనం ప్రాప్నోతిమానవః ।

తా॥ ప్రతినిత్యము అర్ధరాత్రికాలమందు విడువకుండా ఒక మాసము రోజులు ప్రతినిత్యము పదివేలు చొప్పున రావి చెట్టుపై కూర్చుండి స్థిరచిత్తుడై పై మంత్రమును జపముచేయు నెడల ధనదాయమయక్షిణీదేవి ప్రత్యక్షమై కోరిన ధనమును ఇచ్చును, పాలు పెరుగునైవేద్యమును పెట్టవలయును.

### ఆమ్రయక్షిణీ సాధన

దత్తాత్రేయతంత్రే ।

ఓం హ్రాం హ్రీం హ్రూం పుత్రం కురుకురు స్వాహా ।

శ్లో॥ చూతవృక్షసమారూఢో జపేదేకాగ్రమానసః ।
అపుత్రో లభతేపుత్రం నాన్యథా శంకరోదితం ।

తా॥ సంతానము లేనివాడు మామిడిచెట్టు క్రింద కూర్చుని పై మంత్రమును స్థిరచిత్తుడై లక్ష పర్యాయములు జపముచేసిన యెడల ఆమ్రయక్షిణీ ప్రత్యక్షమై శాకఫలము నొసగును. ఆ ఫలమును భుజించినయెడల తప్పక పుత్రప్రాప్తి కలుగును.

### ధాత్రీ యక్షిణీ సాధన

దత్తాత్రేయ తంత్రే । ఓం ఐం క్లీం నమః

శ్లో॥ ధాత్రీమూల సమారూఢో జపేదేకా గ్రమాన సః
అతులక్షయ కారిణ్యా యక్షిణ్యా మంత్ర సత్తమం

తా॥ ఉసిరిక చెట్టు క్రింద కూర్చుండి ఏకాగ్రచిత్తుడై లక్ష పర్యాయములు పై మంత్రమును జపముచేసిన యెడల అతులక్షయ కారిణియైన ధాత్రీయక్షిణీదేవి ప్రత్యక్షమై వరము కోరుకొనుమని ఆజ్ఞాపించును అప్పుడా ధాత్రీయక్షిణీదేవితో "నాకు అశుభములు కలుగకుండ వుండునట్లు" వరమివ్వమని ప్రార్థించగా ఆయక్షిణీదేవి కోరినవరము నిచ్చును.

### ఉదుంబర యక్షిణీ సాధన

దత్తాత్రేయతంత్రే ।

మంత్రము : హ్రీం శ్రీం శారదా యై నమః

శ్లో॥ ఉదుంబర సమారూఢో జపేదేకాగ్రమానసః ।
లభేత్పుస్తక సంసిద్ధిం సర్వవిద్యాశ్చశాశ్వతీ ।

తా॥ అత్తిచెట్టు క్రింద కూర్చుని ఏకాగ్రమనస్కుడై అర్ధరాత్రి కాలమునందు విడువకుండా ప్రతినిత్యము పదువేల పర్యాయములు చొప్పున నలుబది దినములు జపముచేసిన యెడల ఔదుంబర యక్షిణీ ప్రత్యక్షమై సమస్తవిద్యలను వేదవేదాంగ న్యాయ మీమాంసా పురాణములనెడు చతుర్దశవిద్యలను ప్రసాదించును. పుస్తకసంసిద్ధి యగును. తేనె పాయసము నైవేద్యము చేయవలయును.

### నిర్గుండీ యక్షిణీ సాధన

దత్తాత్రేయ తంత్రే ।

మంత్రం : ఓం సరస్వత్యై నమః

శ్లో॥ నిర్గుండీమూల సమారూఢో జపేదేకా గ్రమానసః ।
విద్యాప్రాప్తిర్భవేన్నిత్యం నాన్యథా శంకరోదితం ।

తా॥ వావిలి చెట్టు క్రింద కూర్చుని స్థిరచిత్తుడై అర్ధరాత్రి కాలమందు రోజుకు పదివేలు చొప్పున నలుబది దినములు జపముచేసిన యెడల నిర్గుండీ యక్షిణీ ప్రత్యక్షమై సమస్త విద్యలను ప్రసాదించును. ఇందు సంశయములేదు.

### అర్క యక్షిణీ సాధన

దత్తాత్రేయతంత్రే ।

మంత్రం : ఓం ఐం మహాయక్షిణ్యై సర్వకార్యసాధనం కురుకురు స్వాహా ।

శ్లో॥ అర్కమూల సమారూఢో జపేదేకాగ్రమానసః ।
యక్షిణీవి జయానామ సర్వకార్యకరీ పరా ।

తా॥ జిల్లేడు చెట్టు మొదలుకూర్చుని ఏకాగ్రచిత్తుడై అర్ధరాత్రి కాలము నందు విడువకుండా ప్రతి నిత్యము రోజు ఒక్కింటికి పదువేల పర్యాయములు చొప్పున నలుబది దినములు జపముచేసిన యెడల యా యక్షిణీ ప్రత్యక్షమై వరము నొసగి సర్వకార్యసిద్ధిని, జయమును ప్రసాదించును.

### శ్వేత గుంజాయక్షిణీ సాధన

దత్తాత్రేయతంత్రే ।

మంత్రము : ఓం జుష్మ్రాంతేనమః

శ్లో॥ శ్వేతగుంజాసమారూఢో జపేదేకాగ్రమానసః ।
[illegible]

తా॥ శుచియై ఏకాంత ప్రదేశమున నిశీథ సమయమున స్థిరచిత్తుడై మూడులక్షలు జపమును, ముప్పదివేలు గుగ్గిలముతో హోమమును చేయవలయును. పిమ్మట ఎర్రతొగ్గిన తెల్ల చెక్కతో పీటను చేయించి దానిపైన పై మూలమంత్రమును లొద్దుగబంకతో వ్రాసి, అందు సర్వాంగములోచనను ధ్యానము చేసి షోడశోపచార పూజను చేయవలెను. ఈ ప్రకారముగా చేయు నెడల సర్వాంగ సులోచన యక్షిణీదేవి ప్రత్యక్షమై వరమును కోరు కొనుమని ఆజ్ఞాపించును. అప్పుడు సాధకుడు ప్రతిదినమును ధనమును ప్రసాదించవలయునని కోరగా దేవి సంతోషముతో ప్రతినిత్యము వెయ్యిదీనారము లిచ్చును సాధకుని సంతోషపరచును.

## భూత సులోచనా సాధన

మంత్రము : ఓం భూతే సులోచనే స్వాహా ॥

శ్లో॥ లక్షముత్పలకోత్థం సాధ్యామంత్రమముం జపేత్ ।
లక్షైకాదశ మానర్ష్య సాధ్యామవేశ్యనిగ్రహే ।
అథవామాలతీ పుష్పైర్హుతా భానుసహస్రకం ।
భానుభుక్తిభవేత్సాధ్యా వైసిద్ధ్యతేధ్రువం ।
సహస్రంతు జపేద్యంతే సహస్రాంతాకు భోజనం ।

తా॥ గృహమునందు ఏకాంత ప్రదేశమున కూర్చొని ఏకాగ్రమనస్కుడై పదిలక్షలు జపమును, తద్దశాంశమైన లక్ష సర్వాయములు కలువ పువ్వులతో హోమమును చేయవలయును పిమ్మట రాత్రి సమయమందు పదకొండులక్షల జపమును, తద్దశాంశము హోమమును చేయవలయును పిమ్మట పండ్రెండు వేలు జాజిపువ్వులతో హోమముచేసి పూర్ణాహుతి చేయవలయును. పూర్ణాహుతి చేసిన పిమ్మట రాత్రి సమయములో యధాప్రకారముగా చేయుచున్న యెడల దేవి సంతసించి సాధకునకు ప్రత్యక్షమై వెయ్యి మంది మనుష్యులకు సరిపడు పదార్థములను ధనమును సాధకునకు తెచ్చి యిచ్చుచుండును.

## హంసీ సాధన

మంత్రము : హంసీ హంసి హంసే హ్రీం స్వాహా ॥

శ్లో॥ ప్రవేశస్య స్థాపమ్లక్ష సంఖ్యాం జపేత్సుధీః ।
పద్మపత్రైః ఘృతేః పీతమంతే హోమందశాంశతః ।
ప్రయచ్ఛ హంసీత్యంజనంయే నవక్ష్యతి భూవిరం ।
కుర్తక్షే త్తంచ గృహ్ణాతి నవిష్క్రీ పరిశూయతే ।

తా॥ ఒకానొక రహస్య ప్రదేశమునందు సావధానచిత్తుడై స్థిరముగా కూర్చునితదేక దీక్షతో పర్యాయముగా ఒక లక్ష జపమును తద్దశాంశమైన పదివేల సార్లు తామర పువ్వులు, నెయ్యి, పేలాలతో హోమమును చేయవలయును. పిమ్మట మనస్సునందు దృఢముగా హంసీయక్షిణీదేవిని ప్రార్థించి మరల జపము చేయుచుండవలయును. ఈ ప్రకారముగా చేసిన యెడల హంసీ యక్షిణీదేవి ప్రత్యక్షమై సాధకుని కోరకు అంజనము నొసగును ఆ అంజనముచే భూమి యందుండు నిధి నిక్షేపములు సులభముగా గనపడును ఆ అంజనమును శుచి ప్రదేశమునందుంచవలయును లేనిచో ఆ అంజన ప్రభావముతో అగిపోవును.

## భిక్షిణీ యక్షిణీ సాధన

మంత్రము : ఓం ఐం మహానాదే భిక్షిణీ హ్రాం హ్రీం స్వాహా॥

వేరొక మంత్రము : ఓం హ్రీం మహానందే భిక్షిణీ హ్రీం హూం స్వాహా ॥

శ్లో॥ త్రి పథస్థో జపే న్మంత్రం లక్ష సంఖ్యం దినాంతతః
ఘృతాక్త గుగ్గులైర్హోమా ద్భిక్షిణీ సిద్ధితం సదా

తా॥ మూడు మార్గములు కలియుచోట స్థిరచిత్తుడై నిశీధి సమయమునందు ఒక లక్ష జపమును నెయ్యి, తేనె, పంచదారలను కలిపిన గుగ్గిలముతో పదివేలు హోమమును చేయవలయును పిమ్మట భిక్షిణీయక్షిణీ దేవిని పూజచేసి యధాప్రకారముగా జపము చేయుచుండవలయును. ఈప్రకారము చేసిన యెడల భిక్షిణీ యను యక్షిణీదేవి ప్రత్యక్షమై సాధకుడు కోరిన వరమును ప్రసాదించును

## విశాలసాధన

మంత్రము : ఓం ఐం విశాలే హ్రాం హ్రీం క్లీం స్వాహా

శ్లో॥ చించావృక్షతలేలక్షం మంత్రమావర్తయేత్సుధీః ।
శతపుష్పోత్థితైః పుష్పైః నమ్మతిక్షోమమాచరేత్ ।
విశాలా వతితస్తుష్టా దదాతివ్యం రసాయనం ।
ప్రసన్నాయచ్ఛతితతః సర్వసిద్ధిర్భవిష్యతి ।

తా॥ చింతచెట్టు మొదలును కూర్చొని శుచిర్భూతుడై పైమంత్రమును లక్షజపము, నేతిలో ముంచిన తామరపువ్వులతో హోమమును చేయవలయును. పిమ్మట "విశాల" యను యక్షిణీ దేవిని ధ్యానము చేసి మరలజపము చేయుచుండవలయును. ఈ ప్రకారముగా చేసినయెడల విశాలదేవి ప్రత్యక్షమై ఒక్క దివ్య రసాయనము నొసగును ఆ రసాయనముచే కాయసిద్ధి మున్నగు సర్వసిద్ధులు కలుగును.

## జనరంజనీ సాధన

మంత్రము : ఓం క్లీం జనరంజని స్వాహా ॥

శ్లో॥ కదంబా ఽ ధోజపేన్మంత్రం లక్షద్వయంచ సాధకః ।
ఘృతాక్తగుగ్గులైర్హోమం దేవీ సర్వార్థసిద్ధిదా ।

తా॥ నిర్జన ప్రదేశమందుగల పెద్ద కడిమి చెట్టు క్రిందకూర్చొని పై మంత్రమును రెండులక్షలు జపము చేయవలయును. పిమ్మట నెయ్యి, తేనె, పంచదారలను కలిపిన గుగ్గిలముతో ఇరువదివేలు హోమము చేయవలయును. తరువాత జనరంజనీ యక్షిణీదేవిని ధ్యానముచేసి పై మంత్రమును యధాప్రకారముగా జపము చేయుచుండవలయును. ఈప్రకారముగా చేసిన యెడల జనరంజనీ యక్షిణీదేవి ప్రత్యక్షమై సాధకుని కోరిక ప్రకారము వరమును ఇచ్చును అవరముచే సమస్త కోరికలు సిద్ధించు చుండును.

## మదనా సాధన

మంత్రము : ఓం మదనే, మదనవేశని మాయాలింగయ సంగం దేహి శ్రీః స్వాహా ॥

వేరొకమంత్రము : ఓం ఐం మదనే మదన విదావణే అనంగ సంగమం దేహి దేహి క్రీం క్రీం స్వాహా ॥

శ్లో॥ లక్షసంఖ్యం జపేన్మంత్రం రాజద్వారే శుచి స్మృతా ।
సక్షీరమాలతీ పుష్పైః కృతేహోమేదశాంశతః ।
మదనాయక్షిణీ సిద్ధాగుటీ కాంతం ప్రయచ్ఛతి ।
తయాముఖ స్థయాద్భోత్తు స్యాచ్చిరం సుఖితం నరః ।

తా॥ శుచిర్భూతుడై రాజద్వారమునందు కూర్చుని పై మంత్రములలో నేదైన మంత్రమును లక్షజపము చేయవలయును. పిమ్మట పాలలో జాజి పువ్వులను ముంచి పదివేలు హోమము చేయవలయును. తరువాత మదనాయను యక్షిణీ దేవిని ధ్యానముచేసి మరల యధా ప్రకారముగా జపము

చేయుచుండ వలయును. ఈ ప్రకారముగా చేసినయెడల "మదనా" యను యక్షిణీదేవి ప్రత్యక్షమై సాధకుని కొక సిద్ధగుటికను ప్రసాదించును. ఆ సిద్ధగుటికను "మదనా" యనుయక్షిణీదేవిని ప్రార్థించి పై మంత్రమును జపముచేయుచు నోటియందుబెట్టు కొనిన యెడల అదృశ్యుడగును. నోటిలోనుండిన గుటికను తీసిన యెడల యథాప్రకారముగా దృశ్యుడగును.

### ఘంటా సాధన

మంత్రము : ఓం ఐం పురం క్షోభయ క్షోభయ భగవతి గంభీర స్వర్ణేం స్వాహా ॥

శ్లో ॥ సఘంటాం వాదయన్మంత్రం జపేన్మంత్రాయుతద్వయం
తత్క్షోభయతే లోకాన్ దర్శనాదేవ సాధకః ॥

తా ॥ నిర్జన ప్రదేశమందు ఏకాంతముగా కూర్చుని విశ్రమములేకుండా నొక గంటను మ్రోగించుచు ఇరువదివేలు పై మంత్రమును జపముచేయవలయును. పిమ్మట అర్ధరాత్రి సమయమందు ఘంటాయనుదేవిని ధ్యానముచేసి యథాప్రకారముగా ఘంటను మ్రోగించుచు మరల జపము చేయుచుండవలయును అంతలో "ఘంటా" యను యక్షిణీదేవి ప్రసన్నమై సాధకునకు వరమును ప్రసాదించును. ఆవరముచే సాధకుడు లోకమును దర్శించిన యెడల లోకములను క్షోభింపచేయు సామర్థ్యము గలవాడగును.

### కాలకర్ణి సాధన

మంత్రము : ఓం హ్రీం క్లీం కాలకర్ణికే ఠః ఠః స్వాహా ॥

శ్లో ॥ లక్షసంఖ్యం జపేన్మంత్రం పలాశతరుతేం ధ్రువః ।
మధువాజ్యైః కృతేహోమే కాలకర్ణీ ప్రసీదతి ।
సతతంతాంస్మరేన్మంత్రీ వివిధైశ్వర్య కారిణీం ।

తా॥ రహస్య ప్రదేశమునందు సావధానచిత్తుడై కాంతముగా కూర్చుని పై మంత్రమును లక్షపర్యాయములు జపము చేయ వలయును. పిమ్మట మోదుగ సమిధలతోడను, తేనె, నేతులతోడను, పదివేలు హోమము చేయవలయును. తరువాత అర్ధరాత్రి సమయమునందు కాలకర్ణి యను యక్షిణీదేవిని ధ్యానముచేసి యథాప్రకారముగా జపముచేయు చుండవలయును. అప్పుడు కాలకర్ణి యక్షిణీదేవి ప్రత్యక్షమై వరమును ప్రసాదించును.

ఈ ప్రకారముగా సాధకుడు కాలకర్ణీయక్షిణీ దేవి వరమును పొందిన పిమ్మట ఎప్పుడు ఏ వస్తువు కోరిన ఆ వస్తువును, ఎంత ధనము కోరిన ఆ ధనమును తెచ్చియిచ్చు చుండును. ఐతే ఈ యక్షిణి సిద్ధియైన పిమ్మట ఏ రోజున కారోజే అప్పటి కప్పుడు కావలసిన కోరికలను కోరుచుండవలయును. కోరిన రూపాయలను వినియ చేయు నెడల దేవికి ఆగ్రహము గలిగి మరల ఇవ్వదు.

### మహేంద్రి సాధన

మంత్రము : ఐం క్లీం ఐం ద్రి మహేంద్రి కులుకులు చులు చులు హంసః స్వాహా ॥

శ్లో ॥ శుక్రవారాదయే లక్షం నిర్గుండీ తల మధ్యగః ।
జపేన్మంత్రంతత తస్తుష్టా దేవీ పాతాళ సిద్ధిదా

తా॥ ఏ కాంతప్రదేశమునందున్నవావిలిచెట్టు మొదటను ఇంద్రధనువు ఉదయించుకాలమునందు ప్రారంభించి, లక్షపర్యాయములు పై మంత్రమును జపము చేయవలయును. పిమ్మట మరల ఇంద్రధనువు ఉదయించు కాలములో వావిలిచెట్టు వద్దకుబోయి, మనస్సులో చక్కగా మహేంద్రీ దేవిని ధ్యానముచేసి మరల యథాప్రకారము చేసిన యెడల "మహేంద్రీ" యను యక్షిణీదేవి ప్రసన్నయై పాతాళలోకము నుండి నొక సిద్ధి ద్రవ్యమును ప్రసాదించును. ఆ సిద్ధి ద్రవ్యముచే కోరినకోరికలు నెరవేరుచుండును.

### శంఖినీ సాధన

మంత్రము : ఓం శంఖధారిణి శంఖాభరణే హ్రాం హ్రీం క్లీం క్లీం శ్రీం స్వాహా॥

వేరొక విధమగు మంత్రము : ఓం హ్రీం శంఖధారిణి శంఖాభరణే హ్రాం హ్రీం క్లీం ఐం అం స్వాహా ॥

శ్లో ॥ మంత్రాయుతంజపేన్మంత్రం ప్రాతః సూర్యోదయేసతి
మాసమేకం జపేదేవం పూజాం కుర్యాద్ధి వేదివే ।
శుద్ధ సంతప్త పక్వైతు శుభ్రపుష్పై స్వహాయసైః ।
దశాంశం హోమయేతాజ్యైరింధనైః కదిరోత్థైః ।
దదాతిశంఖినీ తుష్టా నిత్యం రూప్యంచ పంచకం ।

తా ॥ ప్రతినిత్యము తెల్లవారుజామున నిద్రమేల్కొని లేచి స్నానాదుల నొనర్చుకొని సూర్యోదయ మగుచుండగా ప్రారంభించి పదివేలు జపము చేయవలయును. మరియు బాగుగా కుంపుతో అలికబడిన పీటయందు నొక తెల్లటి వస్త్రముపై పై మంత్రమును వ్రాసి దానిని తెల్లపువ్వులతో పూజచేసి, నెయ్యి చేత అరటి పండ్లను పాలతో కలిపి వండిన పాయసమును నైవేద్యము పెట్టవలయును. ఈ ప్రకారముగా విడువకుండా ఒక మాసము చేయవలయును. పిమ్మట తెల్ల గన్నేరు సమిధలచే అగ్నిని ప్రజ్వలింపజేసి అందు ఆజ్యముతో మువ్వదివేలు హోమము చేయవలయును. తరువాతను సూర్యోదయ మగుచుండగా శంఖినీదేవిని ధ్యానముచేసి పైమంత్రము లలోయే మంత్రము నైనను జపము చేయుచుండవలయును. అంత "శంఖినీ" యను యక్షిణీదేవి ప్రసన్నయై వరమునిచ్చి ప్రతినిత్యము ఐదు రూపాయలను తెచ్చి యిచ్చు చుండును.

### చంద్రికా సాధన

మంత్రము : ఓం హ్రీం చంద్రికే హంసః స్వాహా ॥

వేరొక విధమైన మంత్రము : ఓం హ్రీం చంద్రికే హంసః క్లీం స్వాహా ॥

శ్లో ॥ శుక్ల పక్షే జపేన్మాసద్యాన శ్చంద్ర్యోశ్యతేవిదుః ।
ప్రతి పత్ పూర్వపూర్ణాంతం సహస్రమిదం జపేత్ ।
అమృతంచంద్రికాదత్తం పీత్వాతీవ్ర ఓ మరో భవేత్

తా ॥ ఏకాంత ప్రదేశమున శుచిర్భూతుడై శుద్ధ పాడ్యమి మొదలుకొని పూర్ణిమ వరకు గల కాలములో ప్రతిదినము చంద్రోదయము మొదలుకొని చంద్రాస్తమయము వరకును చంద్రుని జూచుచు తొమ్మిది లక్షలు పైమంత్రములలో నేదైనానొక మంత్రమును జపము చేయవలయును. ఈ ప్రకారముగా చేయుటవలన చంద్రికయను యక్షిణీదేవి ప్రత్యక్షమై అమృతమును ప్రసాదించును. ఆ అమృతమును సాధకుడు "చంద్రికా" యను నీ యక్షిణీదేవిని ధ్యానముచేసి త్రాగియెడల దీర్ఘ యుర్దాయము కలుగును అమరుడగును.

### శ్మశానీ సాధన

మంత్రము : ఓం హాం హ్రీం స్ఫ్రాం స్మశానవాసిని స్మశానే స్వాహా ॥

శ్లో ॥ చతుర్లక్షమిదంమంత్రం స్మశానేప్రజపేత్సుధీః ।
నగ్నో ముక్తశిఖాతుష్టా సాయం యచ్ఛతి యక్షిణీ ।

గతమైన సిద్ధిద్రవ్యమును ప్రతిదినము తెచ్చియిచ్చుచుండును. భూతభవిష్య ద్వర్తమానమ్ములను తెలుపుచుండును. భార్యా భావముతో ధ్యానముచేసిన యెడల వారేవి విశేషముగా ధనమును అన్నాదులతోను, ఉపహారములతోడను కూడిన కామ భోజనము ఎల్లప్పుడు స్వర్ణముద్రికలు మున్నగువానిని ఇచ్చుచుండును ఇంతియగాక ఏవస్తువును కోరిన నా వస్తువును ఇచ్చుచుండును. ఇందుకు సంశయములేదు.

శ్లో॥ స్వసాదదాతి విత్తంచ దివ్యం వస్తుతదేవత ।
దివ్యకన్యాంచసమానీయ నాగ కన్యా దదేదదే ।
భ్రాతృవత్పాలయేల్లోకే నామదిస్తుమహోగతైః ॥

తా॥ సోదరీ భావముతో ధ్యానముచేసిన యెడల ధనమును దివ్యవస్తువులను తెచ్చియిచ్చుచుండును. మరియు మహోగతమైన దివ్య కన్యనుగాని, దేవకన్యనుగాని ప్రతిదినము తెచ్చి యిచ్చును. సోదరునివలె పాలించుచుండును.

## యక్షిణీ సాధన సూచన
## (క్రోధ యక్షిణీ)

యది యక్షిణీ నమయేన తిష్ఠతి తదాక్రోధ మంత్రం కృత్వా క్రోధముద్రయా ఽఽ కర్షయేత్। తథాప్రయమాగచ్ఛతి యదినాగచ్ఛతి। యక్షిణీమూర్ధ్ని స్ఫుటతి। తద్దర్శనాన్మృయతే మహానరకేపతతి ॥

క్రోధమంత్రము : ఓం జూం కట్ట కట్ట అముక యక్షిణీ హ్రీం యః యః హుం ఫట్ ॥

అనేక క్రోధమంత్రం సహస్రమేకం జపేత్ ॥

తా॥ సాధనప్రక్రియలో చెప్పిన సమయమునకు యక్షిణీదేవి ప్రత్యక్షముగా రాకపోయిన యెడల క్రోధముద్రతో ఆకర్షణచేసి పై క్రోధమంత్రమును వెయ్యి పర్యాయములు జపముచేసిన వెంటనే వచ్చి ప్రత్యక్షమగును.

క్రోధముద్రా లక్షణంతు :

ముష్టింకృత్వాకనిష్ఠ ద్వయంచేష్టయేత్ తర్జనీం ప్రసార్యాంకుర్యాత్। ఏషా ఽ ప్రతిహత క్రోధాంకుశముద్రాక్షణేన త్రైలోక్య మప్యాకర్షయేత్ ।

## యక్షిణీ సాధనముద్రాదులు

సమతల పాణిం కృత్వా మధ్యమాంగుష్ఠౌ వివరీత అనామికాదిర్గతే బాహ్యతః సంస్థాప్య తర్జన్యాదిష్ట కనిష్ఠ గర్భస్థితా సర్వయక్షిణీనాం సమముద్రా। అనయాబద్ధ మాత్రయా సర్వయక్షిణ్య ఆగచ్ఛన్తి అస్యా ఏవముద్రాయా వామాంగుష్ఠే నావాహనమ్ ।

### ఆవాహన మంత్రము

ఓం హ్రీం ఆగచ్ఛ అముక యక్షిణీ స్వాహా ॥

మంత్రము : యక్షిణీదేవి యొక్క ఆవాహనమునకు ఈ మంత్రమును పఠించవలయును.

### పునరాగమన మంత్రము

అస్యాఏవముద్రాయా వామాంగుష్ఠం విసర్జయేత్।

మంత్రము : ఓం హ్రీం గచ్ఛ అముక యక్షిణీ శీఘ్రం పునరాగమనాయ స్వాహా।

తా॥ ప్రత్యక్షమైన యక్షిణీదేవి మరల వచ్చుటకు పై మంత్రమును పఠించవలయును.

### అభిముఖీకరణ మంత్రము

ముష్టిం తర్జనీం మధ్య మాంగుళిం ప్రసారయేత్। సర్వ యక్షిణ్యభి ముఖీకరణముద్రా

మంత్రం : ఓం మహాయక్షిణీ మై ధన్యప్రియే స్వాహా।

తా॥ అభిముఖముగా చేసుకొనుటకు ఈ మంత్రమును పఠించవలయును.

### సాన్నిధ్య కరణ మంత్రము

ముష్టింకృత్వా ప్రసార్య కుంచయేత్ । సర్వయక్షిణీ సాన్నిధ్యకరణముద్రా

మంత్రము : ఓం కామేశ్వరీ స్వాహా ॥

తా॥ సాన్నిధ్యము కొరకు ఈమంత్రమును పఠించవలయును.

### హృదయ మంత్రము

హస్తంముకుళాకారేణ సంస్థాప్య యక్షిణీ హృదయముద్రా

మంత్రము : హ్రీం

తా : హృదయ మంత్రము

### ధూపాదులను సమర్పించు మంత్రము

ముష్టిం కృత్వా తర్జనీం మధ్యమాం ప్రసారయేత్। సర్వయక్షిణీ గంధ పుష్ప ధూప దీపముద్రా

మంత్రము : ఓం సర్వమనోహారిణీస్వాహా ॥

తా॥ ఈ మంత్రముతో గంధము, పుష్పము, ధూపము, దీపము సమర్పించవలయును. ఈ ప్రకారముగా పైవిషయములను చక్కగాతెలుసుకొని పై యక్షిణీ దేవతలను సాధించవలయును.

సూచన : పై యక్షిణీవిద్యలు, కిన్నరవిద్యలు, కాత్యాయినీలు, సుందరీలు, అప్సరసలు మున్నగు మహావిద్యలను ఉపదేశము నొంది ఉపాసించుచు సాధించువారు శాంతి, వశ్యము, మోహన, ఆకర్షణ, ఉచ్చాటన, విద్వేషణ, స్తంభన, మారణాది అష్టకర్మల స్వరూపములను, వాని అధిదేవతలను, కాలములను లక్షణములను, నిబంధనములను, ప్రయోగములను, సిద్ధాసిద్ధ లక్షణములను చక్కగా తెలుసుకొని యోగ్యమైన పద్ధతి ననుసరించుచు వాయువిద్యాకల్పములో చెప్పబడినప్రకారము సాధించిన సంపూర్ణముగా సిద్ధించును, లేనియెడల నీ యక్షిణ్యాదులు సిద్ధించుట దుర్లభము.

## చేటక ప్రభావములు
## నానా సిద్ధిచేటి సాధన

ప్రాకృత గ్రంథే :

మంత్రము : ఓం నమోభూత నాథాయనమః మమ సర్వ సిద్ధిందేహి దేహి శ్రీం క్లీం స్వాహా ॥

అన్యవిధానం : అశ్వత్థవృక్షస్యాధః ఉపవిశ్య పంచలక్షం జపేత్ । తద్దశాంశంపలాశసమిద్భిః ఘృతమ్మృతం జుహుయాత్ దశాంశాహుతిశ్చాప్తి పూర్వక మన్నందేయం । తతోనిశా చేటకః ప్రసన్నో భూత్వా ప్రార్థితం దదాతి । కర్పూర వటక నారికేళ ద్రాక్షాఫలాన్యనేకాని దదాతి ।

తా॥ సాధకుడు పవిత్రుడై ప్రతి నియమాదులు గలవాడగుచు ఒక అశ్వత్థవృక్షము క్రింద కూర్చుండి నియమముగా ఐదులక్షలు జపము చేయవలయును. తద్దశాంశమైన యాభైవేల పర్యాయములు మోదుగ సమిధలతో అగ్నిని ప్రజ్వలింపజేసి

ధూమ్రార్చి ర్జటిలా కపాలివిలసత్పాణిద్వయాం చండికాం
సర్వజ్ఞాం శవహృత్ కృతాధి వసతీం ప్రేతాధిపాం తాంనమః

ఈ ప్రకారముగా ధ్యానముచేసి, రక్తచందనముతో షాక మండలమును నిర్మించి, రక్తచందనము, మంకెన పువ్వులు దాసానిపువ్వులు మున్నగు పూజాద్రవ్యములను "ఓం అమృతం కురుకురు స్వాహా" అను మంత్రముచే సంప్రోక్షించి, మంత్రము నందు కర్ణపిశాచినిని చక్కగా పూజించి "ఓం కర్ణపిశాచి దృష్టిమంబలిం గృహ్ణ గృహ్ణ మమసిద్ధిం కురుకురు స్వాహా" అనుమంత్రముతో యెండుచేపలను యిచ్చి అర్ధరాత్రమందు పై మంత్రమును జపము చేయవలయును. తరువాత ప్రాతఃకాలమునందు కొంచెముగా జపముచేసి మధ్యాహ్నమునందు మాంసాదులచే భుజించకుండా ఒకే పదార్థము భుజింపవలయును. రాత్రియందు జపసంఖ్య ప్రకారము జపము చేయవలయును. మధ్యాహ్న కాలమందు మాత్రము ఒకే పదార్థము భుజించవలయును గాని యితరములైన వానినియే కొంచెమును భుజింపరాదు. తాంబూలాదులను వర్జించవలయును జపదశాంశము ప్రతిదినము "ఓం కర్ణపిశాచి హీం తర్పయామిస్వాహా" అని తర్పణము చేయవలయును. ఈ మంత్రమునకు లక్ష పురశ్చరణము అనగా లక్షజపము, పదివేలు హోమము, వెయ్యి తర్పణము. నూరు మార్జనము పదిమందికి భూతతృప్తి. పురశ్చరణ నియమములను పాటించుచు చేయ వలయును తరువాత వరమును కోర వలయును. అప్పుడు కర్ణపిశాచి ప్రసన్నమై వరము నొసగును. ఎల్లప్పుడు భూత భవిష్యద్వర్తమానములను ప్రబోధించును.

## వేతాళ మంత్రము

ఓం ఐం హ్రీం ఐం క్లీం గ్లాం ఓం నమః కర్ణగొప్ప కర్ణపిశాచికాదేవి అతీతానాగత వర్తమాన వార్తాంకథయ మమ కర్ణే కథయ కథయ తత్వం ముద్రావార్తాం కథయ కథయ ఆగచ్ఛాగచ్ఛ సత్యం సత్యం వద వద వాగ్దేవి స్వాహా ।

అస్యవిధానం : మూలం రక్తచందనేన లిఖిత్వా పంచామృతేన స్నపయిత్వా లక్షంజ పేత్ । దశాంశతో హోమః । మంత్రసిద్ధోభవతి । వార్తాంకథయతి ।

తా ॥ మూలమును రక్త చందనమ్ముతో వాక కట్టుపై వ్రాసి పంచామృతముచే స్నానముచేయించి పైప్రకారముగా పూజ చేసి లక్షజపమును, పదివేలు హోమమును చేసిన మంత్రసిద్ధి యగును. వార్తలను చెప్పును.

## ఇంకొక మంత్రము

ఓం నమః కర్ణపిశాచిని మమకర్ణే ప్రవిశ్య అతీతా నాగత వర్తమానం సత్యం సత్యం కథయమే స్వాహా ।

అస్య విధానం ॥ లక్ష జపాత్సిద్ధిః । పునః అమావస్యాయాం అష్టోత్తర శతవారం మంత్రం లిఖిత్వా ప్రత్యేకం చ పూజ-యిత్వా తం మంత్రం శిరో ఉపరి ధృత్వా శయనం కార్యం । స్వప్నే వదతి సత్యమేవ ఇయతి సాధకః లక్ష త్రయం జపేత్త దాసా ప్రత్యక్షా భవతి భూతభవిష్యద్వర్తమానవార్తాః ఉ ద సర్వాః కర్ణే కథయతి ।

తా ॥ పైకర్ణపిశాచీదేవి మంత్రమును పైన వ్రాసిన విధానమునననుసరించి లక్షపురశ్చరణ జపము చేసిన మంత్ర సిద్ధియగును. తరువాత మామిడిపట్టయందు 108 పర్యాయములు మంత్రమును వ్రాసి ప్రత్యేకముగా పూజచేసి ఆ మంత్రమును తలక్రింద పెట్టుకొని నిద్రపోవలయును. స్వప్న మందు వార్తను చెప్పును. ఇతే సాధకుడు ఈ మంత్రమును మూడు లక్షలు జపాదులతో పురశ్చరణచేసిన యెడల ప్రత్యక్షమగును. భూత భవిష్యద్వర్తమాన వార్తలన్నింటిని చెవిలో చెప్పు ను.

## వేరొక విధమగు మంత్రము

ఓం నమః కర్ణపిశాచినీ అమోఘ సత్యవాదిని మమకర్ణే అవతరావతరాతీతా నాగత వర్తమానాని దర్శయ దర్శయమమ భవిష్యం కథయ కథయ హ్రీం కర్ణపిశాచిని స్వాహా ।

విధానము : మూడులక్షలు జపముచేసిన సిద్ధించును విధానాదులన్నియు పై మంత్రమునకు వలెనే చేయవలయును.

## కర్ణ దుర్గ చేటకీ సాధన

మంత్రము : ఓం ఐం హ్రీం శ్రీం దుం హుం ఫట్ కనక వజ్రవైడూర్యముక్తాలంకార భూషితే ఏహ్యేహి ఆగచ్ఛ గచ్ఛ మమకర్ణే ప్రవిశ్య । భూతభవిష్యద్వర్తమాన కాలజ్ఞాన దూరదృష్టి దూరశ్రవణం బ్రూహి బ్రూహి అగ్ని స్తంభనం శత్రుముఖస్తంభనం శత్రుగతి స్తంభనం శత్రుమతి స్తంభనం పరేషాం శత్రుకార్య గతిం మతిం సర్వ శత్రూణాం వాక్యం జల స్తంభనం కురుకురు శత్రుకార్య హానిః మమ కార్యసిద్ధి కరిత్రతూరా మూర్ధ్ని విద్యుతరిష పీతాంబర హాటక ధారిణీ, నగరపురీ పట్టణ స్థానమోహిని ఆకర్షణాదిని ఓం శ్రీం హ్రీం ఐం ఓం దేవి హన హన హుంఫట్ స్వాహా ।

అస్యవిధానము ॥ ఇమం మంత్ర మయుతంజపేత్ సిద్ధిః సర్వం కర్ణేవదతి శత్రూన్ నాశయతి సర్వకార్యాణి సిద్ధ్యంతి

తా॥ ఈ మంత్రమును పదివేలు జపము చేయవలయును. అంతట సిద్ధియగును. సర్వము చెవిలో చెప్పును. శత్రువులను నశింపజేయును సర్వకార్యములు సిద్ధించును.

## అప్సరసల ప్రభావము

'అప్సరసలనగా అప్సర్వై ప్రాప్యతే పుణ్యకృద్భిరిత్యప్సరసః' పుణ్యము చేసిన వారిచే పొందబడువారని యర్థము:

ఈ అప్సరసలు (1) శశిదేవి (2) తిలోత్తమ (3) కాంచనమాల (4) కుండలహారిణి (5) రత్నమాల (6) రంభ (7) ఊర్వశి (8) శ్రీ భూషణ యను పేర్లతో నెనిమండుగురు గలరు. ఈ అప్సరసలు

శ్లో ॥ విద్యాధరో ఽ ప్సరో యక్షరక్షో గంధర్వకిన్నరాః ।
పిశాచోగుహ్యక స్సిద్ధో భూతో ఽ మీ దేవయోనయః ।

అని చెప్పియుండుటచే దేవయోనులగుట కేవలము దైవాంశము గల కామోపభోగలాలస విలాసినులుగా వున్నారు. కనుక నీ అప్సరసలలో దేనినైనను సాధకుడు శ్రద్ధతో జపాదుల చేసి ఆహ్వానించి ప్రత్యక్షము చేసుకొని దానిని భోగించినయెడల నాయప్సరస తృప్తిజెంది సంతోషముగా ప్రేమభావముతో సాధకుని సంరక్షించగలదు. సాధకుడు కోరిన ప్రకారము సకలోప భోగ్యాదులనిచ్చుచు ఎల్లప్పుడు సాధకుని కాపాడు చుండును. మరియు దీర్ఘాయుష్మంతునిగా గూడ చేయును.

## శశిదేవి సాధన

భూతడామరతంత్రే ।

మంత్రము : ఓం శ్రీం శశిదేవ్యా గచ్ఛగచ్ఛ స్వాహా ।

అర్ఘ్యవిధానం । పర్వత శిఖరమారుహ్య లక్షం జపేత్ సిద్ధోభవతి । పౌర్ణమాస్యాం యథావిభవైః । పూజాంకృత్వా । ఘృతదీపం ప్రజ్వాల్య సకలరాత్రిం జపేత్ । ప్రభాతే నియత మాగచ్ఛతి । స్వయం దేవ్యై అగురాయై చందనార్ఘ్యదేయః సాధకాపవేత్ । సాధకో నైవం వక్తవ్యం మమభార్యాభవేతి । సిద్ధిద్రవ్యం రసరసాయనం దదాతి వర్షసహస్రం జీవయతి ।

తా ॥ సాధకుడు పర్వత శిఖరమునకు పోయి అచ్చట కూర్చుండి నియమముగా ఒక లక్ష పర్యాయములు పైమూల మంత్రమును జపము చేయవలయును. అప్పుడు మంత్రసిద్ధి యగును. పిమ్మట పౌర్ణమి రోజున యథావిభవముతో శశిదేవిని పూజించి నేతితో దీపమును వెలిగించి సర్వరాత్రి అంతయు జపము చేయవలయును. అంత నాశశిదేవి ప్రభాత సమయమునకు వచ్చి ప్రత్యక్షమగును. అప్పుడు సాధకుడు శశిదేవికి చందనాదులతో అర్ఘ్యము నియ్యవలయును. అప్పుడాదేవి సంతుష్టురాలగును. అంత సాధకుడు దేవితో "మమ భార్యా భవ" అని చెప్పవలయును. అందులకు శశిదేవి సంతసించి రసరసాయనమును ఇచ్చును ఆ రసరసాయనముచే సాధకుడు వెయ్యి సంవత్సరములు జీవించును.

## తిలోత్తమ సాధన

భూతడామర తంత్రే ।

మంత్రము । ఓం శ్రీం తిలోత్తమే ఆగచ్ఛ గచ్ఛ స్వాహా

అర్ఘ్య విధానము । క్షీరాహారేణాయుతం జపేత్. దివసాన్ సప్తదివసే సప్తమే ఉదారపూజాం కృత్వా శుక్లాష్టమ్యాం పర్వతమూర్ధ్ని ఉత్థాయితః సకలరా త్రికాలం ప్రజపేత్ । ప్రభాతే నియతమాగచ్ఛతి । ఈషద్ధసితరాగేణ పురతః తిష్ఠతి । ఆలింగన చుంబనంచ తయాసహ కర్తవ్యం తూష్ణీం భావేన కామయేత్ ఏవం సిద్ధాభవతి । యమిచ్ఛతి కామంతం దదాతి పృష్ఠే మారోప్య స్వర్గ మపి గమయతి రాజ్యం దదాతి ।

తా ॥ సాధకుడు ఇతరములైన ఆహారములను భుజించకుండా కేవలము పాలను త్రాగుచు యేడుదినములు విడువకుండా దినము ఒక్కింటికి పదివేల పర్యాయములు చొప్పున పై మంత్రమును జపము చేయవలయును. ఆఖరు దినమగు యేడవ దినమున సంపూర్ణముగా తిలోత్తమకును పూజచేసి పిమ్మట శుక్ల పక్షమునందలి అష్టమితిథి రోజునసాక పర్వత శిఖరమునకు పోయి అచ్చట రాత్రియంతయు జపము చేయవలయును. ఈ ప్రకారముగా చేసిన యెడల ప్రభాత సమయమునకు "తిలోత్తమ" సాధకుని వద్దకువచ్చి, కొంచముగా నవ్వుచు అనురాగముతో సాధకుని యెదురుగా కూర్చుండును. అంత సాధకుడు ఆలింగనము, చుంబనమును ఆమెతో గూడాచేయవలయును. మరియు మాట్లాడకుండా కామించవలయును. ఈ ప్రకారముగా సిద్ధియగును సాధకుడు దేనిని కోరిన యెడల దానిని తెచ్చియిచ్చును మరియు సాధకుని వీపుపై కూర్చుండ బెట్టుకొని స్వర్గమునకు కూడ తీసుకొని పోవును. మరియు రాజ్యమును గూడ ప్రసాదించును.

## కాంచన మాలా సాధన

భూతడామరతంత్రే ।

మంత్రము । ఓం శ్రీం కాంచనమాలే ఆగచ్ఛ గచ్ఛ స్వాహా

అర్ఘ్య విధానం ః నదీ సంగమం గత్వా అష్ట సహస్రం జపేత్ । దివసాని సప్తసప్తమేదివసే ఉదారపూజాం కృత్వా । గుగ్గులు ధూపం దత్వా । సకలాంరాత్రిం జపేత్ । ప్రభాతేని యత మాగచ్ఛతి హేన సర్వాకాంపూరయతి ।

తా ॥ సాధకుడు నదీ సంగమ ప్రదేశమునకు పోయి దినము ఒక్కింటికి ఎనిమిదివేలు చొప్పున యేడుదినములు పై కాంచన మాలయను అప్సరామంత్రమును జపము చేయ వలయును. ఆఖరుదినమగు యేడవరోజున ఉదారముగా పూజచేసి గుగ్గిలము ధూపమువేసి యథాప్రకారముగా నా రాత్రియంతయు జపము చేయవలయును. అంతట కాంచనమాల ప్రభాత సమయమునకువచ్చి ప్రత్యక్ష మగును. అప్పుడు సాధకుడు కుసుమోదకముతో అర్ఘ్యము నిచ్చిన యెడల కాంచనమాల ప్రీతిచెంది సాధకునికి భార్యగానుండి సాధకుని ఆశయము లన్నింటిని తీర్చుచుండును.

## కుండల హారిణీ సాధన

భూతడామరత త్రే

మంత్రము । ఓం హ్రీం శ్రీం కుండలహారిణి ఆగచ్ఛ గచ్ఛ స్వాహా ॥

అర్ఘ్య విధానం । వటవృక్ష నక్షత్రం గోపాహారవిద్భ్యాం పర్వతమూర్ధ్ని గత్వా అయుతం జపేత్వా సమేతం । తతో ఉర్ధ్వరాత్రే నియత మాగచ్ఛతి । అర్ఘ్యదేయః । భార్యాభవతి దినా లక్షం ప్రతిదినం దదాతి । పృష్ఠే మారోప్య సర్వతో భ్రామయతి రసరసాయనం సిద్ధద్రవ్యంచ దదాతి ।

తా ॥ ఈ కుండలహారిణియను అప్సరసను సాధించుటకు తిథి నియమము నక్షత్ర నియమము ఉపవాస నియంత్రణము మున్నగునవి లేవు. సాధకుడు తనకిష్టమైన కాలములో ఒక పర్వత శిఖరమునకు పోయి అచ్చట పదివేల పర్యాయములు జపము చేయవలయును. ఈ ప్రకారముగా ఒక మాసమువరకు జపము చేసి జపాంత్య దినము నందు ధూపము వేసి ఆ రాత్రియంతయు జపము చేయుచున్న యెడల ప్రభాత సమయమునకు కుండల హారిణి వచ్చి ప్రత్యక్షమగును. అప్పుడు సాధకుడు అర్ఘ్యము నియ్యవలయును. అంత నా కుండలహారిణి ప్రేమతో సాధకుని దగ్గరకు వచ్చి సాధకునికి భార్యగా నుండి ప్రతిదినమును లక్షసువర్ణము త్రికలనుతెచ్చి యిచ్చు చుండును మరియు సాధకుని వృష్ఠమునందెక్కించుకొని యెచ్చటకు పోవలయునన్నను నచ్చటకు తీసుకొనిపోవును మరియు రస రసాయనమును సిద్ధద్రవ్యమును కూడ తెచ్చియిచ్చును.

## రత్నమాలా సాధన

భూతడామర తంత్రే ।

మంత్రము । ఓం హ్రాం రత్నమాలే ఆగచ్ఛ గచ్ఛ స్వాహా

అర్ఘ్య విధానం । దేవతాయతనం గత్వా అష్ట సహస్రం జపే న్మాసమేకం తతో మాసాన్తే పౌర్ణమాస్యాంశ్చ పూజాంకృత్వా పునర్జపేత్ । తావద్య పేద్యావదర్ధరాత్రే మహానూపురోత్థే నాగచ్ఛతి అగతాయై పుష్పై ససందద్యాత్ । స్వాగతం దేవ్యా ఇతి వక్తవ్యం స్వామినీ మాహ్లాదయసి తదా సాధకేన వక్తవ్యం మమభార్యా భవేతి । భార్యా కర్మకరోత్యేవం భోజ్యం యదిచ్ఛతి కామికం । పాలిత వర్ష సహస్రాణి రత్నమాలా మనోరమా

తా ॥ సాధకుడు ఒక దేవాలయమునకు వెళ్ళి పైరత్నమాలా మంత్రమును ఎనిమిదివేల పర్యాయములు జపము చేయవలయును. అట్లువెల దినములు వరుసగా చేయవలయును.

మాహింతమైన పిమ్మట పౌర్ణమి తిథియందు రత్నమాలను యథావిధిముగా పూజించితిరుగ జపము చేయవలయును ఇట్లు జపము చేయుచుండగా అర్ధరాత్రియగు. పరికి పెద్ద గజ్జలధ్వనితో వచ్చి సాధకునికి ప్రత్యక్షమగును. అంత సాధకుడు రత్నమాలకు పుష్పాసన మివ్వవలెయును. పిమ్మట "స్వాగతం విదేవ్యాఅని చెప్పవలెను." "స్వామిన్ కిమాజ్ఞాపయసి" అని మరల ప్రశ్నించును అప్పుడు సాధకుండా రత్నమాలతో "మమ భార్యాభవ" అని చెప్పవలయును. ఇట్లొనర్చిన యెడల రత్నమాల సాధకునికి భార్యవలె వచ్చి పనులను జేయుచు వాంఛిత భోజనములను ద్రవ్యములను నిచ్చును ఈ ప్రకారముగా సాధకుని వెయ్యి సంవత్సరము పాలించును.

### రంభా సాధన

భూతడామరత న్త్రే :

మన్త్రము : ఓం సః రంభే ఆగచ్ఛ గచ్ఛ స్వాహా ॥

అస్య విధానం । ప్రతి పదమారభ్య పూజాంకృత్వా చందనేన మండలం కృత్వా । గుగ్గులు ధూపందత్వా ఓ స్తసహస్రం జపే త్రి సంధ్యం । తతః పౌర్ణమాస్యాం మహతీం పూజాం కృత్వా । సకలాంరాత్రిం జపేత్ । ప్రభాతే శీఘ్రమాగచ్ఛతి ఆగత్య సాభార్యాభవతి యదేష్టం కామితవ్యా । దశవర్ష సహస్రాణిజీవతి సర్వాశాంపూరయతి । మృతో రాజకులే జాయతే

తా ॥ పాడ్యమి రోజున రంభా వ్రతమును ప్రారంభించ వలయును. సాధకుడు రంభాదేవిని పూజచేసి చందనముతో నొక మండలమును చేసి గుగ్గిలముతో ధూపము యిచ్చి మూడు సంధ్యల యందు ఎనిమిదివేలు జపము చేయవలయును.

ఈ ప్రకారముగా పాడ్యమి మొదలు పౌర్ణమివరకు ప్రతి దినము పూజించుచు, మండల మొసర్చి ధూపము యిచ్చి సంధ్యాత్రయ కాలముల యందును జపము చేయవలయును: అనంతరమున పౌర్ణమితిథియందు యథా విధముగా మహతీ పూజనుచేసి ఆ రాత్రియంతయు జపము చేయవలయును. అంత ప్రభాత సమయమునకు రంభాదేవి వచ్చి ప్రసన్న మగును అప్పుడామెకు అర్ఘ్యపాద్యములిచ్చి "మమ భార్యాభవ" అని చెప్ప వలయును. పిమ్మట నామెను యథేష్టముగా కామించవలయును. అంత నామెంత సంతసము నొంది సాధకుని వాంఛలన్నిటిని తీర్చును పదివేల సహస్రములు జీవింపచేసి పాలించుచుండును. అనంతరము రంభ సహాయమున రాజకులమున రాజాజగ జన్మించును.

### ఊర్వశీ సాధన

భూత డామరతన్త్రే :

మన్త్రము : ఓం శ్రీం ఊర్వశీ ఆగచ్ఛ గచ్ఛ స్వాహా ।

అస్య విధానం ॥ ప్రతి పదమారభ్య పూజాం కృత్వా । చందనేనమండలం కృత్వా గుగ్గులు ధూపం దత్వా । అష్ట సహస్రం జపేత్రి సంధ్యం । తతః పౌర్ణమాస్యాం మహతీ పూజాం కృత్వా । సకలాం రాత్రిం జపేత్ । ప్రభాతే శీ ఘ్రమాగచ్ఛతి కుసుమాస నందద్యాత్ స్వాగతమితి వక్తవ్యం । భో భో సాధక కిమాజ్ఞాపయసి, తదా సాధకేన వక్తవ్యం, మమ భార్యా భవేతి. రసరసాయనసిద్ధి ద్రవ్యాణిదదాతి, పర స్త్రీ యాంగమనంన కర్తవ్యం పంచవర్ష సహస్రాణి జీవతి ।

తా : పాడ్యమి రోజున ప్రారంభించి, ముందుగా ఊర్వశిని పూజించి, చందనముతో నొక మండలము నిర్మించి, గుగ్గిలం ధూపమువేసిన పిమ్మట నచ్చట కూర్చుండి మూడు సంధ్యా కాలములయందును ఎనిమిదివేల జపము చేయవలయును ఈ ప్రకారముగా పౌర్ణమి వఱకు ప్రతినిత్యము జపము చేయవలయును. తరువాత పూర్ణిమ రోజున సాధకుడు యథావిధముగా మహతీ పూజనుచేసి ఆ రాత్రి యంతయు జపము చేయవలయును అంత ఆ ఊర్వశి ప్రభాత సమయమునకు శీఘ్రముగావచ్చి ప్రత్యక్షమగును అపుడామెకు కుసుమాసనమును, అర్ఘ్యమునుయిచ్చి 'స్వాగతం' అని సాధకుడు చెప్పవలయును అందుకా ఊర్వశి "భో భో సాధక కిమాజ్ఞాప యసి?" అని ప్రశ్నించును. అపుడు సాధకుడు "మమ భార్యా భవ" అని చెప్పవలయును. అనంతరమున నామెను యథేష్టముగా కామించవలయును. అంతనామె తృప్తి నొందిసంతోషముతో సాధకునకు సతి భావముతో రస రసాయన సిద్ధి ద్రవ్యములను, వాంఛిత పదార్థములను యిచ్చుచు ఐదువేల సంవత్సరములు జీవింపజేసి పాలించు చుండును. ఈ ఊర్వశీ సాధనము చేయువాడు పరస్త్రీ గమనము చేయ కూడదు ఊర్వశీ సాధనచేయువాడు భార్యను కూడా విడువవలెను. లేని యెడల సాధకుడు ఊర్వశీ ఆగ్రహమునకు మరణము నొందునని కొన్ని తంత్రములలో గలదు.

### శ్రీ భూషాసాధన

భూత డామరతన్త్రే :

మన్త్రము : ఓం హ్రాం శ్రీం హ్రాం శ్రీ భూషా ఆగచ్ఛ గచ్ఛ స్వాహా ।

అస్య విధానం । కుంకుమేన భూర్జపత్రే శ్రీ భూషణి ప్రతి మాంలిఖ్య రాత్రా వేకాకినః ప్రతి దినమష్ట సహస్రం జపే న్మాసమేకం యావత్ । మాసాంతే ఉదారపూజాం కృత్వా । తావజ్జపేత్ యావదర్ధరాత్రం నియతమాగచ్ఛతి ఆగతా సాక్షాం కామితవ్యా । తుష్టాభవతి । సువర్ణము క్తాదీనిదదాతి దినేదినే కామిక భోజనం దదాతి రసరసాయనందదాతి

తా । కుంకుమపుష్పముతో భూర్జపత్రమందు శ్రీ భూషిణి ప్రతిమను వ్రాసి, రాత్రి కాలములో యొంటరిగా నెనిమిదివేల ప్రతిదినము ఆ ప్రతిమకు పూజచేసి ఎనిమిదివేల చొప్పునపొక మాసము జపము చేయవలయును. అనంతరమున యథా విధముగా ఉదారపూజనుచేసి మరల జపము చేయ వలయును. అంతనా శ్రీ భూషిణి అర్ధరాత్రి సమయమునకు సాధకునివద్దకు శీఘ్రముగా వచ్చును. ఆమెవచ్చిన వెంటనే ఆమెను కామించ వలయును అంతనామె తృప్తి నొంది సాధకునకు సువర్ణము, ముత్యములు మున్నగువానిని ఇచ్చును. మరియు ప్రతి దినము కామిక భోజనము తెచ్చియుచ్చును. ఇంతియేగాక రసరసాయన మును గూడ తెచ్చి యిచ్చి సాధకుని భర్తవలె జూచు కొనుచు కాపాడుచుండును.

### అప్సరసల సాధనోపాయము

తత్రాదౌ ఆవాహనాది ముద్రాది ప్రదర్శ్యతే । ద్విముష్టి సంయుక్తౌ । ఊర్ధ్వహస్తౌ కమలా వర్తయోగేన మధ్యమాం గుళ్య మూలేతా అష్టప్సర ఆవాహనముద్రా ।

ఊర్ధ్వాభ్యాంమువ్యకరాభ్యాం సర్వాప్సరోపాంగణీ సాన్నిధ్యే అగ్ని ముఖముద్రా సర్వత్ర కామ సాధినీ

ఉభాభ్యాం హస్తాభ్యాం కమలావర్తయోగేన సర్వాస్వరో మోహినీ అనయా ముద్రయా బద్ధమాత్రయాదాసీభవతి.

మంత్రము : తత్షణాత్సర్వాస్సరస ఆగచ్ఛాగచ్ఛ హ్రాం యః యః

తా ! ఈ మంత్రముతో సర్వాప్సరసలను ఆవాహనము చేయవలయును.

మంత్రము : ఓం సర్వసిద్ధి భోగేశ్వర స్వాహా !

తా ! ఈ మంత్రముతో సర్వాప్సరసలను స్వాధీనముకీకరణ మొనరు చ్చోనవలయును. ఏకారణముచేతనైనను అప్సరసవిద్య సకాలములో సిద్ధించనియెడల నపుడు సాధకుడు కోపముతో క్రోధముద్రను ప్రదర్శించి క్రోధమంత్రమును జపించవలెను.

క్రోధమంత్రము : ఓం హ్రీం ఆకట్టు కట్టు హ్రాం మ ఫట్ !

ఏతజ్జ పమాత్రేణశిరః స్ఫుటతి ! శతఖండంవి శీర్యతి తదా గచ్ఛతి !

తా ! ఈ క్రోధమంత్రమును జపము చేసిన యెడల వెంటనే సాధకుని దగ్గరకు వచ్చును.

మంత్రము : ఓం సంబంధ సంబంధినమా వేష్టయేత్ అనేన మంత్రేణ దేష్టయేత్ !

తా ! ఈ మంత్రముతో వేష్టన చేయవలయును.

మంత్రము : ఓం వం వం వశమానయ హ్రాం ఫట్ !

తా : ఈ మంత్రముతో సర్వాప్సరసలు వశ్యమగుదురు.

సూచన : సాధకుడీ రహస్య విషయములను గుర్తించు కొనుచు అప్సర విద్యలను కల్పములో చెప్పబడిన ప్రకరము సాధించవలయును.

## కాత్యాయనీ ప్రభావము సుభగాకాత్యాయనీ సాధన

భూత డామరతంత్రే :

మంత్రము : ఓం సురత్నప్రియే దివ్యలోచనే కామేశ్వరి జగన్మోహనే సుభగే కాంచనమాలా విభూషణనూపురశబ్దే నా దానినిపూరయ సాధకం ప్రియం స్వాహా !

అస్యవిధానం : రాత్రౌ రాజగృహే గత్వా ఉష్ణ సహ స్రం జపేత్ ! కరవీర కాష్ఠైరగ్నిం ప్రజ్వాల్య మాంసపూపైః దధి మధుమిశ్రైః త్రైరష్ట శతం జుహుయాత్ ! తదారంభదినాత్ రాత్రి మహాభూతేశ్వరీ భూతరాజ్ఞీ మహాకాత్యాయనీ పంచశత పరివారేణ మహానూపురశబ్దే నాగచ్ఛతి ! ఆగతాయై కుసుమై రార్ఘ్యం దత్వా వక్తవ్యం మాతా భగినీ భార్యావా భవేతి ! యదిమాతా భవతి వితం దూషితవ్యం దివ్య కామకథ జనందదాతి సువర్ణాలంకారం హారదాతి ! యదిభగినీ భవతి తదా రాజ్యం దదాతి యోజనశతాదపి స్త్రియ మానీయ దదాతి ! యది భార్యాభవతి తదాదివ్య స్త్రీ సంభోగం దదాతి ! సర్వాః పరిపూరయతి ! శతవర్ష సహస్రాణి జీవతి మృతో రాజకులే జాయతే !

తా ! సాధకుడు నిశీధ సమయమునందు రాజగృహమునకు వెళ్ళి అచ్చట ఏనిమిదివేలు జపముచేయవలెను. తరువాత ఎర్రగన్నేరు కాష్టములతో అగ్నిని ప్రజ్వరింపజేసి, పెరుగు తేనె, నెయ్యి ఈ మూడింటితో కలిపిన మాంసపుప్పలతో ఏనిమిదివందలు హోమము చేయవలయును. ఈ ప్రకారముగా ఐదుదినములు చేయుచున్న యెడల ఆ ఐదుదినములలోగా మహాభూతేశ్వరియు భూతరాజ్ఞియునైన "సుభగ" యను మహాకాత్యాయని ఐదు వందల పరివారముతోగొప్ప నూపుర ధ్వని చేయుచు వచ్చును. అప్పుడేవచ్చిన సుభగ కాత్యాయనిని సాధకుడు భయమునొంద కుండా పుష్పములతో అర్ఘ్యమునిచ్చి "మాతాభగినీ భార్యా వాభవ" అని మాట్లాడవలెను. అనగా ఓ సుభగ కాత్యాయనీ తల్లిగాగాని సోదరిగాగాని భార్యగాగాని కావలయునని కోరవలయునని భావము. అప్పుడు తల్లిగాయైన ఎడల మనస్సులో గూడ దూషించ కూడదు. అంత ఆ కాత్యాయని దివ్యమైన కోరిన భోజనమును గాని సువర్ణా లంకారములను గాని ప్రసాదించును. లేక సోదరిగా యైన యెడల రాజ్యమును యిచ్చును. నూరు యోజనములలో నున్న స్త్రీని కూడ తీసుకొనివచ్చి యిచ్చును. లేక భార్యగాయైన యెడల దివ్యస్త్రీ సదృశమైన భోగము నిచ్చును పదివేలు సంవత్సరములు జీవింపజేయును. తరువాత రాజకులము నందు జనించు నాడగును.

## కుండల కాత్యాయనీ సాధన

భూత డామరతంత్రే :

మంత్రము : ఓం యామిని కృతిని ఆకాల మృత్యు నివారిణి ఖడ్గ త్రిశూలహస్తే త్రీముం సిద్ధింద దాతి విశాం సాధక ఆజ్ఞాపయతి హ్రీం స్వాహా !

అస్య విధానం ! రాత్రౌ ఉద్యానవనం గత్వా ఉ ష్ట సహస్రం జపేత్ ! దినాని త్రీణి ! నూపురశబ్దం శ్రూయతే ! చతుర్థే దివసే అష్టమేదినపేవా శిరస్సి నేమిండలం కృత్వా గుగ్గులు ధూపం దత్వా ఉ ష్ట సహస్రం జపేత్ ! దివ్యరూపి నీ కన్యా కుండల కాత్యాయనీ స్వగృహే మాగచ్ఛతి ! ఆగతాన కామితవ్యా భార్యా భవేతి దివ్యముక్తాహారంశయనే పరిత్యజ్య ప్రభాతే గచ్ఛతి

తా ! రాత్రి కాలములో ఉద్యానవనమునకుబోయి అచ్చట ఎనిమిదివేలు పైమంత్రమును జపమును చేయవలయును. ఈ ప్రకారముగా ఎనిమిది దినములు చేయవలయును. ఈ జపము చేయుచున్న మొదటి మూడు రోజులలోను నూపుర ధ్వని వినబడును. అట్లు ధ్వని వినబడిన యెడల నాల్గవరోజున రాత్రి కాలములో తన యింటిలో నొక ఏకాంతప్రదేశమున తాను పరుండబోవు మంచమునకు శిరః ప్రదేశమున నొక మండలము చేసి, గుగ్గిలముతో ధూపమువేసి ఎనిమిదివేలు పై మంత్రమును మరల జపము చేయవలయును. అంత కుండల కాత్యాయని అచ్చటకు వచ్చును. అయితే ఉద్యానవనములో మొదటి మూడు దినములందు రాత్రి సమయములో జపముచేయునప్పుడు నూపురధ్వని సాధకునకు వినబడని యెడల (నాల్గవదినమున తన గృహమునందు పై ప్రకారము చేయకుండా) విడువకుండా ఏడు దినములు జపము చేయవలయును. పిమ్మట ఎనిమిదవ దినమున రాత్రి సమయమందు తన గృహములో నొక రహస్య ప్రదేశమున తాను నిద్రించుచున్న మంచమునకు శిరః ప్రదేశము నందొక మండలముచేసి, గుగ్గిలముతో ధూపమువేసి, అచ్చట కూర్చుండియెనిమిదివేల పర్యాయములు పైమంత్రమును జపము చేయవలయును. అంతలో కుండల కాత్యాయనీ దివ్యరూపిణి అయి అచ్చటకు వచ్చును. వచ్చిన కాత్యాయనిని భార్యగా భావించి కామించవలయును. అంత ఆ కాత్యాయని దివ్యమైన ముత్యాలహారమును ఆ మంచముపై విడిచి వెళ్ళి పోవును. ఈ ప్రకారము ప్రతి దినము జరుగుచుండును.

## చండ కాత్యాయనీ సాధన

భూత డామర తంత్రే :

మంత్రము : ఓం వం కంఠ్య దళయికరి అట్టాట్టహాసిని సాధకప్రియే మహావిద్యే తథాచ ఉత్పాతనిమగ్నహస్తేయ మని

క్లీంకార సర్వరూపిణి ప్రణవమ్ ఓం ఠం ఠం ఠం ఠం హ్రాం హ్రాం హ్రాం శ్రీమం సిద్ధిం ప్రయచ్ఛ హ్రీం జః స్వాహా ॥

అస్య విధానం : రాత్రావేకలింగే గత్వా సహస్రం జపేదేక స్మిన్ దివసే నూపుర శబ్దం శ్రూయతే ద్వితీయదివసే దివ్య స్త్రీ పురః తిష్ఠతి సదూపయతి సభాషయతే । తృతీయ దివసేచ భాషతే భో సాధక కిమాజ్ఞాపయసి సాధకేనవక్తవ్యం భో దేవి ఉపస్థితాభవేతి యావజ్జీవతి తావదుపస్థానం కరోతి పృష్ఠమారోప్య మేరుస్యాగ రాదీన్నయతి వైశ్రవణ్యా హే గంధ ద్రవ్య మానీయ దదాతి జంబూద్వీప సాధకే ఉత్తమ కన్యా రూపమానీయ దదాతి జీవతి వర్షశతాని పశ్చాన్నృపతేః సామం తకులేషుజాయతే ॥

తా॥ ఇతరదేవతా మూర్తులు లేకుండా ఒకే ఒక శివలింగ మున్న ప్రదేశమునకు రాత్రి కాలమునందు పోయి ఆ శివలింగము వద్ద కూర్చుని ఒక వెయ్యి పర్యాయములు పై మంత్రమును జపము చేయవలయును. ఒక దినము జేసినంతలోనే సవ్వటుమా పురొష్టము వినబడును. తరువాత రెండవదినమున మరల ఆ శివలింగమువద్దకు వెళ్ళి వెయ్యి పర్యాయములు జపము చేయవలయును. ఇట్లు రెండవ దినము జపము చేయుచుండగా ఒక దివ్య స్త్రీ రూపముతో చండకాత్యాయని వచ్చి తనకు ఎదురుగా కూర్చుండును. కాని ఆమెను మాట్లాడించి మాట్లాడదు, రూపించదు పిమ్మట మూడవదినమున మరల ఆ శివలింగము వద్దకుపోయి వెయ్యి పర్యాయములు జపము చేయవలయును. పిమ్మట ఆమె మాట్లాడించిన మాట్లాడును.

భో సాధక! కిమాజ్ఞాపయసి, ఓ సాధకా! ఏమి ఆజ్ఞాపించు చున్నావు?" అని ప్రశ్నించును. అంత ఆ సాధకుడు భో దేవి ఉపస్థితా భవ-ఓ చండ కాత్యాయనీ! ఉపస్థితవై యుండుము, అని సమాధానము చెప్పవలయును అంతట చండకాత్యాయని సాధకుని కోరిక ప్రకారముయావజ్జీవము ఉపస్థితయై యుండును. అనంతరమున సాధకుడు తనకు కావలసినప్పుడు చండకాత్యాయని భోదేవి! చండకాత్యాయని ఆగచ్ఛాగచ్ఛ" అని పిలిచిన యెడల చండకాత్యాయని వచ్చును అప్పుడామెతో తనకు కావలసినదానిని తీసుకురావలసినదిగా ఆజ్ఞాపించిన యెడల ఆ చండకాత్యాయని మేరు పర్వతము, మున్నగు వెంత పెద్దదానినైన గూడా తనవీపుపై పెట్టుకొని తెచ్చిసాధకుని కిచ్చుచుండును.. ఇంతియేగాక కుబేరుని గృహమునకు కూడవెళ్ళి ధనమును తీసుకొని వచ్చియిచ్చును మరియు జంబూద్వీప సమీపము నందున్న ఉత్తమ కన్యను గూడ తెచ్చియిచ్చును. సాధకుని నూరు సంవత్సరములు జీవింప చేయును. అనంతరము సామంత కులమునందు జన్మింప జేయును.

## రుద్ర కాత్యాయనీ సాధన

భూత డామరతంత్రే ।

మంత్రము : ఓం హ్రీం హ్రీం హ్రాం హ్రాం హే హే ఫట్ స్వాహా ॥

అస్య విధానం॥ శ్మశానే గత్వా, సహస్రం జపేత్ససాధి త్రిశే ।తదా సర్వభూతాని రుద్ర కాత్యాయనీ శీఘ్రమాగచ్ఛతి। ఆగతాయా కపాలే కంఠే సప్తూర్ణా భందేయం తుష్టాభవతి । వదతి చకిం మయాకర్తవ్యమితి।సాధకేన వక్తవ్యం మాతేవ భవేతి।మాతృవత్సతి పాలయతి రాజ్యందదాతి సర్వాశాం పూరయతి మహాధనవతి ర్భవతి పంచవర్ష శతాన్ జీవతిమృతో రాజకులేజా యతే ।

తా॥ నిశీధ సమయమున శ్మశానమునకు సాధకుడు వెళ్ళి మూడు దినములు దినము ఒక్కింటికి వెయ్యి పర్యాయములు చొప్పున జపము చేయవలెయును. ఈ ప్రకారముగా జపము చేసిన యెడల సమస్తైశ్వర్యములను నిచ్చగల రుద్రకాత్యాయనీ దేవి శీఘ్రముగా వచ్చును. ఆ వచ్చిన రుద్రకాత్యాయనీ యొక్క కపాలమందును కంఠమందును, పూర్ణాక మొసగిన తృప్తి నొందును పిమ్మట మాట్లాడును. కిం మయాకర్తవ్యం" నే చేయవలసిన దేమి? అని సాధకుని ప్రశ్నించును. అంత నా సాధకుడు "మాతా భవ = తల్లిగా నుండుమా" అని చెప్పవలయును తరువాతను ఆరుద్ర కాత్యాయని సాధకునకు తల్లిగా నుండి సాధకునికి కావలసిన ద్రవ్యములను తెచ్చి యిచ్చుచు పాలించుచుండును. మరియు రాజ్యము నిచ్చును. సమస్త కోరికలను తీర్చును ధనవతిని చేయును. ఐదువందల సంవత్సరములు జీవింపజేయును పిమ్మట రాజకులము నందు సాధకుడు పుట్టును.

## మహా కాత్యాయనీ సాధన

భూత డామరతంత్రే ।

మంత్రము : ఓం భూహాహా హ్రాం ఫట్

అస్య విధానం । రాత్రౌనదీ సంగమం గత్వా ఉత్తె సహస్రం జపేత్ తదా దివ్య స్త్రీ ధృతిని మహాకాత్యాయనీ సహాపరివారేణా గచ్ఛతి ఆగతా వ మంత్రయుత వ్యాధుస్త్రీ భావేన కామయేత్। దినేదినే పంచదీ నారాన్ వస్త్రయుగ్మం దదాతి ।

తా॥ రాత్రి సమయమందు సాధకుడు ఒంటరిగా రెండు నదులు కలిసిన ప్రదేశమునకుపోయి ఏనిమిదివేలు జపము చేయవలయును అప్పుడు దివ్యస్త్రీ రూపముతో ధృతినియైన మహాకాత్యాయని పరివారముతో గూడవచ్చును. ఆ వచ్చిన కాత్యాయనితో మాట్లాడకుండా మంత్ర జపము చేయుచు కామించవలయును. ఆమె ప్రతి దినము ఐదు దీనారములు రెండు వస్త్రములు తెచ్చి యిచ్చుచుండును.

## సుర కాత్యాయనీ సాధన

భూత డామరతంత్రే ।

మంత్రము : ఓం భ్రూం హ్రాం ఫట్ ॥

అస్య విధానం । శూన్యదేవాలయేగ త్వాష్ట సహస్రం జపేత్ తదాన్వయసేన సురకాత్యాయనీ మహోత్సాహం కృత్వా-ష్టశత పరివారేణ నియతమాగచ్ఛతి । ఆగతాయై చందనోదకేన అర్ఘ్యందేయం । తుష్టాభవతి రసరసాయనం ప్రయచ్ఛత్యష్ట శతపరివారస్య వస్త్రాలంకార భోజనాదీని దదాతి పంచవర్ష సహస్రాణి జీవతి మృతో రాజకులే జాయతే ।

తా॥ రాత్రి సమయములో ఒంటరిగా శూన్యదేవాలయము నకు వెళ్ళి అచ్చట ఎనిమిదివేలు జపము చేయవలయును. ఈ ప్రకారముజపము ప్రతి దినము చేయుచున్న యెడల స్వయముగా సురకాత్యాయని మహోత్సాహము చేసి 8 దినందల పరివారముతో వచ్చుచుండును. ఆ వచ్చిన సురకాత్యాయనికి చందనో దకముతో అర్ఘ్యము నివ్వవలయును. అంత ఆ సురకాత్యాయని సంతోషము నొంది ఒక రస రసాయనమును ప్రసాదించును.

మండలమును నిర్మించి అర్ఘ్యోదకము వొసగి రాత్రి సమయమందు పదివేల పర్యాయములు జపము చేయవలయును. ఈ ప్రకారము ప్రతి దినము ఒక మాసము వరకు చేయవలయును. ఈప్రకారము ప్రతిదినము ఒకమాసము వరకు చేయవలెను. పిమ్మట మాసాంతము నందు సుభగా యను కిన్నరీ దేవతకు వైభవముగా పూజచేసి, గుగ్గిలము ధూపము వేసి యధాప్రకారము మరల జపము చేయవలయును అంతట సుభగయను కిన్నరీ ప్రభాత సమయమునకు సాధకుని కడకు వచ్చి తన దివ్యమైన కోమల హస్తముచే సాధకుని హృదయమునకు ఉపచారము చేయును. అప్పుడు సాధకుడు శీఘ్రముగా కామించవలయును. సుభగాయను కిన్నరీదేవి సాధకునకు భార్యగా యుండి ప్రతిదినము ఐదు సువర్ణముద్రల నిచ్చు చుండును.

## విశాలనేత్రాసాధన

భూత డామరతంత్రే ।

మంత్రము : ఓం విశాల నేత్రే స్వాహా ।

అస్య విధానం । నదీకూలే గత్వా ఒ యుతం జపేత్ । పునర్మాసాంతేవకలాం రాత్రింజపేత్ । ప్రభాతే నియతమాగచ్ఛతి ఆగతాసాభార్యా భవతి దినే దినేపంచదీ నారాన్ దదాతి ।

తా । నదీతీరమునకుబోయి అచ్చట ఒంటరిగా నిశీధ సమయమున విశాలనేత్రయను కిన్నరీశక్తిని పూజించి చందన ముతో మండలమును నిర్మించి గుగ్గిలము ధూపమువేసి పదివేల పర్యాయములు జపము చేయవలయును. ఈ ప్రకారముగా ఒక మాసము వరకు చేయవలయును. మాసాంతమున తిరిగి వైభవముతో విశాలనేత్రయను కిన్నరీదేవిని పూజించి మరల గుగ్గిలము ధూపమువేసి యధాప్రకార మారాత్రి జపము చేయవలయును. అంతనా విశాల నేత్రయను కిన్నరిదేవి ప్రభాతసమయమునకు సాధకుని కడకు వచ్చును. అంత సాధకుడు కుసు మాసనము, అర్ఘ్యము ఇచ్చి పూర్వము వలెనే "మమ భార్యా భవ" అని కోరవలయును. అపుడామె "తథాస్తు" యను సమాధాన మొసగును సాధకుడు యథేష్టముగా కామించవలయును. ఆమె సాధకునకు భార్యగానుండి ప్రతిదినము ఐదు దీనారములు, తెచ్చియిచ్చుచుండును.

## సురత ప్రియా కిన్నరి సాధన

భూత డామరతంత్రే ।

మంత్రము : ఓం సురత ప్రియే స్వాహా ।

అస్య విధానం । రాత్రౌ నదీసంగమం గత్వా ఒష్ట సహస్రం జపేత్ మాసాంతే నియతమాగచ్ఛతి ప్రథమదివసే దర్శనం దదాతి ద్వితీయ దివసే పురతస్తిష్ఠతి సాహాభాషతే తృతీయ దివసే కామ యుతత్వాని యతంతిష్ఠతి భార్యాభవతి సర్వ కర్మాణి కరోతి అష్టదీనారాన్ వస్త్రయుగళం దదాతి.

తా । రాత్రి సమయమునందు నదీ సంగమమునకు బోయి యెనిమిది వేలు జపము చేయవలయును. జపాంతమున నియమముగా వచ్చును. మొదటి దినమున దర్శనమిచ్చును. రెండవ దినమున జపాంతమునకు సాధకుని యెదుటకు వచ్చును మరియు మాటలాడును. మూడవ దినమున జపాంతమున కామించిన నియమముగా నుండును భార్యయగును. సాధకునికి కావలసిన అన్ని పనులను చేయును. దినమునకు ఎనిమిది సువర్ణముద్రలను వస్త్రయుగళమును తెచ్చియిచ్చు చుండును.

## అశ్వముఖీ సాధన

భూతడామర తంత్రే ।

మంత్రము : "ఓం అశ్వముఖీ స్వాహా"

అస్య విధానం । పర్వత మూర్ధ్ని గత్వా ఒ యుతం జపేత్ । తదాశీఘ్రం గచ్ఛతి, ధన రూపేణ పురతస్తిష్ఠతి ఆలింగ్యమంచేత్ తూష్ణీంభావేన కామిత వ్యా భార్యాభవతి। అష్టదీనారాన్ ప్రయచ్ఛతి దివ్య కామిక భోజనం దదాతి.

తా । సాధకుడు పర్వతశిఖరమునకు బోయి అచ్చట నియమబద్ధుడై పదివేల పర్యాయములు జపము చేయవలెను. అప్పుడు శీఘ్రముగా అశ్వముఖీయను కిన్నరీదేవి వచ్చి ధనరూపముతో సాధకునియెదుట కూర్చుండును. తూష్ణీం భావముగా కామించవలయును. భార్యగాయగును ప్రతి దినము ఎనిమిది దీనార ములను సాధకునికి తెచ్చి యిచ్చుచుండును.

## దివాకర ముఖీ సాధన

భూతడామర తంత్రే ।

మంత్రము : "ఓం దివాకర ముఖీస్వాహా ।"

అస్యవిధానము । పర్వత మూర్ధ్ని గత్వా ఒ యుతం జపేత్ । నియత సమయే సమాగచ్ఛతి భార్యాభవతి అష్టదీనారాన్ దదాతి

తా । పర్వతశిఖరమందు కూర్చొని పదివేలు జపము చేయవలయును నియత సమయమునకు దివాకరముఖి వచ్చును. భార్యగాయగును. ప్రతి దినము ఎనిమిది దీనారములనిచ్చును.

## సర్వకిన్నరీ సాధనోపాయము

శైలాదౌ మాసం యద్వేష్టకార్యాణిన సిద్ధ్యంతి తదా క్రోధ సహితః క్రోధమంత్రం జపేత్ ।

క్రోధమంత్రో యథా : ఓం హ్రీం ఆకట్ట కట్ట హుం ఫట్ అన్యజపమాత్రేణ శిరః స్ఫుటతి శతఖండం వీర్యతి తదా గచ్ఛతి

తా । ఇంపై కిన్నరీలు ఇందు వ్రాయబడిన కాలములో యథాశాస్త్రముగా చేయబడినను సిద్ధించని యెడల క్రోధముతో పైక్రోధ మంత్రమును జపము చేసిన సిద్ధించును మిగతా విషయములన్నియు శాస్త్రప్రకారముగనే చేయవలయును.

# తంత్ర ప్రభావములు

## సర్వజనవశ్య యోగములు

### వశ్యముఖీ మంత్ర క్రమము

మంత్రము : ఓం రాజముఖీ వశ్యముఖీ స్వాహా

అస్య విధానం : హమహాస్తైలెం పంస్థాప్య, అనామిక యాత్రిధా ఆ మంత్రేణ్యనేన నిర్మాణితమంత్రం త్రితావతిత్వా ప్రాతః కాలేయస్య యాంస్తేత్వా ముఖకేశ దౌని లేపయేత్ । తదాసర్వే జనావశ్యా భవన్తి వ్యాఘ్రోఽపివశ్యతాం ।

తా । సాధకుడు ప్రాతః కాలమందు శయ్యయందుండి, తన యెడమచేతిలో నూనెవేసుకొని, కుడిచేతి అనామిక వ్రేలుతో పైమంత్రమును పఠించుచు మూడు పర్యాయములు అభిమంత్రించ వలయును. ఆనూనెను ముఖమునకు కేశములకును వ్రాసు కొనవలయును. ఈ ప్రకారము చేయుచున్న యెడల సర్వ జనవశ్యమగును. వ్యాఘ్రము కూడా లోబడును. అనగా వ్యాఘ్రము గూడా వశ్యమగునని భావము సాధకుడు ముందుగా ౧౦౦౦౦లు జపముచేసి మంత్రసిద్ధిని పొందిన పిమ్మట ఉపయోగించు కొనవలయును.

## శ్రీ వశ్య యోగములు

శ్లో॥ పుష్యే పుష్పంచ సంగ్రాహ్య భరణ్యాంచ ఫలంతథా।
శాఖా చైవ విశాఖాయాం హస్తేపత్రం తథైవచ
మూలేమూలం సముద్ధృత్య కృష్ణోన్మత్తస్య తత్ర్యమాత్
పేష్యం కర్పూర సంయుక్తం కుంకుమం రోచనాసమం।
తిలకాత్ ప్రవశంయాతి అపి స్త్రా దరుదంతి।

విధానము : సాధకుడు పుష్యమీ నక్షత్రము రోజున నల్ల ఉమ్మెత్తచెట్టు పువ్వును, భరణీనక్షత్రము రోజున నల్ల ఉమ్మెత్త కాయను, విశాఖానక్షత్రము రోజున నల్ల ఉమ్మెత్త చెట్టు యొక్క కొమ్మను, హస్తానక్షత్రము రోజున నల్ల ఉమ్మెత్తచెట్టు ఆకును మూలానక్షత్రము రోజున నల్ల ఉమ్మెత్తచెట్టు వేరును, క్రమముగా సమంత్రకముగా తీసుకురావలయును. పిమ్మట వాటి యన్నింటిలో పచ్చకర్పూరము, కుంకుమపువ్వు గోరోచనము సమభాగములుగా చేసి తిలకముగా తయారు చేయవలయును. ఆ తిలకమును ఓం నమో భగవతే రుద్రాయ చాముండే అముం మేవశ్య మానయ స్వాహా ॥ అను మంత్రముతో ౧౦౦౦౦ పర్యాయములు అభిమంత్రించి తిలకము పెట్టుకొనినయెడల శ్రీవశ్యమగును.

## మోహన యోగములు

శ్లో॥ అపామార్గం భృంగరాజ లజ్జాలు సహదేవికా।
ఏ భిస్తు తిలకంకృత్వా త్రైలోక్యం మోహయేన్నరః।

విధానము : ఉత్తరేణివేరును, గుంటకలగరవేరును లజ్జాలు (అత్తిపత్తి) వేరును, సహదేవి వేరును సమంత్రకముగా తీసుకునివచ్చి నీడనెండబెట్టి తిలకముగా చేసి ఆ తిలకము ఓం నమః సర్వలోక వశంకరాయ మోహనం కురు కురు స్వాహా" అను మంత్రముతో ౧౦౦౦౦ పర్యాయములు అభిమంత్రించి, పిమ్మట కార్యార్థమై ౧౦౮ పర్యాయములు అభిమంత్రించి, తిలకమును ధరించిన సర్వజనులను మోహింప జేయువాడగును.

శ్లో॥ శ్వేతార్క మూల మాదాయ శ్వేతచందన సంయుతం
అనేనతిలకం ఫాలేకుర్వాల్లోకమోహయేద్ధ్రువం।

విధానము : తెల్లజిల్లేడు వేరును సమంత్రముగా తీసికొని వచ్చి, నీడను ఎండబెట్టి, పిమ్మట ఆవేరును శ్వేత చందనమును గంధముగా అరగదీసి ఆతిలకమును "ఓం నమస్సర్వ లోక వశంకరాయ మోహనం కురు కురు స్వాహా" అను మంత్రముతో ౧౦౦౦౦ పర్యాయములు అభిమంత్రించి, పిమ్మట కార్యార్థమై ౧౦౮ పర్యాయములు అభిమంత్రించి నుదుట ధరించిన సర్వజనులను మోహింప జేయువాడగును.

శ్లో॥ మృతకాలే లిఖేన్మంత్రం గోరోచనరసేనతు।
తాపయేత్ఖదిరాంగారే త్రిసంధ్యంచ ప్రయత్నతః।
ఊర్ధ్వకృష్ణసమాయాతి హ్యావ్యదాశంకరోదితం।
యస్మై కస్మై సదాతవ్యం దేవా నామపిదుర్లభం।

విధానము : మనిషి కపాలమునందు గోరోచనముతో "ఓంనమః ఆది రూపాయ అముక స్యాకర్షణం కురు కురు స్వాహా" అను మంత్రమును వ్రాసి, ఆకపాలమును, సంధ్యా త్రయమునందు అనగా ఉదయమునందు, మధ్యాహ్నమునను, సాయంకాలము నందును పై మంత్రమును ౧౦౦౦ పర్యాయములు జపము చేయుచు చంద్రనిప్పులతో తాపనము చేసినచో కోరిన వ్యక్తి తనవద్దకువచ్చును. ఇది శంకరునిచే చెప్పబడిన యోగము గనుక తప్పక జరుగును.

శ్లో॥ కృష్ణదత్తూర పత్రస్య గోరోచనరసేనతు।
శ్వేతకర్వీర లేఖిన్యాచ్చ భూర్జపత్రేలిఖేన్మనుం।
యస్యనామలిఖేన్న ఖదిరాంగార తాపితం।
శతయోజనమాయాతి హ్యావ్యదా శంకరోదితం।

విధానము : నల్ల ఉమ్మెత్త ఆకు పసరలో గోరోజనము కలిపి, దానిని తెల్లగన్నేరు పుల్లతో భూర్జపత్రముపై వ్రాసి దానిని "ఓంనమఆదిరూపాయ అముకస్యాకర్షణం కురు కురు స్వాహా" అను మంత్రముతో అభిమంత్రించి పిమ్మటకార్యార్థమై చంద్ర నిప్పులతో ౧౦౮ పర్యాయములు మూల మంత్రమును పఠించి తాపనము చేయువెడల నూరు యోజనముల దూరములోనున్న వ్యక్తియైనను తనవద్దకు వచ్చును. ఇది శంకరునిచే తెలుపబడినది గనుక తప్పక జరుగును.

## విజయకర యోగములు

శ్లో॥ మార్గశీర్ష పూర్ణాయాం శిఖిమూలం సముద్ధరేత్।
బాహౌ శిరసి వా ధార్యం వివాదే విజయీ భవేత్।

విధానము : సాధకుడు మార్గశిర పూర్ణిమ రోజున మయూర శిఖియొక్క వేరును సమంత్రముగా తీసికొనివచ్చి దానిని అభిమంత్రించి బాహువునందుగాని, శిరస్సునందుగాని ధరించిన ఎడల వివాదములో విజయము పొందును.

శ్లో॥ గోజిహ్వా శిఖిమూలేవా ముఖే శిరసి సంస్థితా।
కురుతే సర్వవాదేషు జయం పుష్యే సముద్ధృతా।

విధానము : ఎద్దునాలుక చెట్టు వేరునుగాని, మయూర శిఖివేరునుగాని పుష్యమీనక్షత్రమున సమంత్రముగా తీసుకొని వచ్చి అభిమంత్రించి ముఖమునందుగాని, శిరస్సునందుగాని, ధరించిన ఎడల సమస్త వాదములయందును జయము గలుగును.

శ్లో॥ జయమూలం రాజకులేముఖే సంస్థం జయప్రదం।

విధానము: సాధకుడు లక్క చెట్టు వేరును సమంత్రముగా తీసుకొనివచ్చి, అభిమంత్రించిదండకు కట్టుకొన్న యెడల రాజస్థానమున జయము సంభవించును.

శ్లో॥ కరేసుదర్శనామూలం జిహ్వారాజకులేజయా।

విధానము: సాధకుడు సుదర్శనచెట్టు వేరును సమంత్రముగా తీసుకొనివచ్చి, అభిమంత్రించి దండకు కట్టుకొన్న యెడల రాజాస్థానమున జయము సంభవించును.

### మల్ల యుద్ధములో జయముపొందుటకు

శ్లో॥ హస్తేర్క లాంగలీ మూలం మూలమంత్రాభిమంత్రితం
తమాల్లోద్ధృతమాన్మల్లోమల్లాన్ మోహయతేమహాన్

విధానము : హస్తానక్షత్ర ఆదివారమునందు తెల్లజిల్లేడు వేరును సీరు పిప్పలివేరును సమంత్రముగా తీసుకొనివచ్చి, నీడను యెండ బెట్టి చూర్ణముచేసి చూర్ణమును "ఓం నమో మహాబలపరాక్రమ శత్రు విధ్వంసకాయ అంగాని ధూపయ ధూపయ హతయ హతయ మహాతలే స్వాహా" అను మంత్రముతో ౧౦౦౦౦ పర్యాయములు అభిమంత్రించి, పిమ్మట కార్యార్థమై ఉపయోగించు నప్పుడు ౧౦౮ పర్యాయములు అభిమంత్రించి శరీరమునకు పూసుకొనిన యెడల మల్లయుద్ధము నందు జయము సంప్రాప్తమగును. అనేక మల్లవీరులను మోహింపజేసి జయమును సమకూర్చును.

మయూరాల వంటివి. ఆగమము లన్నింటికి మూలాధారము ప్రణవము అవగాహనమైయున్న నేమియు నవిరువించవు. ప్రణవార్థమువెతికిన వారికే ఋగాదిసప్త వ్యర్థమానములన్ని కాలత్రయమునందును జరిగెడు సర్వ మానవుల వెల్ల వెలుంగునట్టి శక్తి గలుగును. ప్రణవార్థ మెఱుంగని యెడల సజ్జనభావన, పండితా భావన వివేక భావనలును, లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసనలును, కామ క్రోధాది దుర్గుణములను నశింపజేయని సుజ్ఞాన మునియించు వేదము అష్టాక్షరి ద్వాదశాక్షరి పంచాక్షరములను మంత్రరాజము లకింగల బలమంతయు ప్రణవమేగాని మరియొకటికాదు. తమపురులకు బలములను వనితలకు పాతివ్రత్యమును పురుషులకు వివేకమును గృహములకును మహాదియు వాధారముగా నున్నట్లు సకల మంత్రములకు ప్రణవ మాధారముగా నున్నది. "బ్రహ్మహమస్మి, జగత్ర్బహ్మాహం, హం సోహం, శివోహం" అన్న మహావాక్యముల తత్వ మెవ్వనికి అర్థార్థ సహితముగా పట్టుపడునో వాడొక్కడే ప్రణవార్థవేత్తయని చెప్పబడును. అట్టి వానినే పండితుడనియు, ముముక్షువనియు, నాత్మవేత్త యనియు, జ్ఞానవంతుడనియు, శుద్ధుడనియు, సిద్ధుడనియు, భక్తుండనియు, ముక్తుడనియు, స్వబ్రహ్మానందుడనియు వార్యులు ప్రశంసింతురు. అనర్థవిక వేద్య మగు ప్రణవార్థమును సద్గురుముగా గురుముఖమునం దెలిసికొన్న వాని కొక్కనికిదక్క, నితరుల కెంతవారికయిన బ్రహ్మైక్యానుసంధానము సాధ్యముకాదు. క్షీరమునందు నెయ్యియు, తిలలయందు తైలమును వావరించు కొనియున్న లాగునం బ్రపంచము నందంతటను పరిపూర్ణముగా వ్యాపించి యున్న పరబ్రహ్మమునందేకీ భవింపక వేఱుపడి యుండుటే భ్రమ యనబడును. జననీ జనకుల యత్నీనమున లేక పరాధీనుడయి యున్న పుత్రుడువిరలే పరబ్రహ్మము నందేకీభవించి నేనన్న దురభి మానమును నాశనము చేయని యవివేకికి గురు వైపరీత్యము కలిగి బ్రహ్మ ద్వేషమును, మతద్వేషమును, దేహాభిమానమును, దినముల పేర ముదిరి పదిలముగా హృదయమునగుదురు కొనుటవలన తుదకు జనన మరణము లను నుత్తుంగ సంఘములచేత నుప్పొంగి వచ్చుచున్న సంసార సాగరమున బడిపోయి దరిచేరుటకు నెరవుగానక కల్పాంతములు పెక్కులు గడచినను దుఃఖ సాధనములేక నానా విధములయిన భేదముల నొందవలసి వచ్చును.

ప్రణవమునకు పాదములు నాల్గును అంగము లెనిమిదియు, స్థానములు మూడును, దేవతము లయిదును గలిగియుండును. అకార ఉకార మకార అర్ధమాత్రలయొక్క, స్వరూపములయిన అవిద్యాపాద విద్యాపాద ఆనందపాద తురీయ పాదాత్మకములయిన సమిష్టి వ్యష్టి స్థూలసూక్ష్మకారణ మహాకారణములను యెనిమిది శరీరముల యొక్క, కార్యములయిన జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములను నాలుగవస్థలకు బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వరులు నలుగురు, అధిదేవతలౌదురు. అయిదవవాడయిన సదాశివమూర్తి కిందులో స్థానములేదు కనుక పైందెప్పిన నాలుగు పాదములను పదునారు భాగములు లోక కళలు పదునేనింటికిని మీటిన పదునారవకళ సదాశివమూర్తికి స్థానముగా నేర్పడుచున్నది. కాబట్టి ప్రణవము జాగ్రత్తలో జాగ్రత్త జాగ్రత్తలో స్వప్నము, జాగ్రత్తలో సుషుప్తి, జాగ్రత్తలో తురీయము, స్వప్నములో జాగ్రత్త, స్వప్నములో స్వప్నము, స్వప్నములో సుషుప్తి, స్వప్నములో తురీయము, సుషుప్తిలో జాగ్రత్త, సుషుప్తిలో స్వప్నము, సుషుప్తిలో సుషుప్తి సుషుప్తిలో తురీయము, తురీయములో జాగ్రత్త తురీయములో స్వప్నము తురీయములో సుషుప్తి, తురీయములో తురీయము అని పదునారు భాగములకును, ప్రత్యేకముగా సమష్టి వ్యష్టి తనువులయ చైతన్యైక్య బ్రహ్మవేత్తలు గనుక సమిష్టి రూపుడయిన ఈశ్వరునకును వ్యష్టిరూపుడయిన జీవునకు సమిష్టి చైతన్యైక్యము డగు బ్రహ్మవేత్తకును జాగ్రదవస్థయందు అకారమును ఆ విద్యా పాదమును స్థూలదేహమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు విరాట్టు వైశ్వానరుడు వైరాజుడనియు, జీవునకు విశ్వుడు వ్యావహారికుండు చిదాభాసుడనియు, బ్రహ్మవేత్త యనియు జెప్పగను ఇవి చేరి బ్రహ్మపీఠము, సద్యోజాత ముఖము పృథివీ తత్వము, నకారము నివృత్తికళ తారకము ననబడును.

జీవేశ్వర బ్రహ్మవిదులకు జాగ్రత్తలో జాగ్రత్త గలిగినప్పుడు అకారములో అకారమును, అవిద్యాపాదములో అవిద్యాపాదమును, స్థూలదేహము నందు స్థూలదేహమును తారతమ్యములు, ఈశ్వరునకు విరాట్టులో విరాట్టనియు, జీవునకు విశ్వునిలో విశ్వుడనియు, బ్రహ్మవిదునకు ఓతలో ఓత యనియు నామము.

జాగ్రత్తలో స్వప్నము కలిగినప్పుడు అకారములో ఉకారమును, అవిద్యా పాదములో విద్యాపాదమును, స్థూల దేహమునందు సూక్ష్మ దేహమును తారతమ్యములు, ఈశ్వరునకు విరాట్టులో హిరణ్య గర్భుడనియు, జీవునకు విశ్వునిలో తైజసు డనియు, బ్రహ్మవిదునకు ఓతలో ననుజ్ఞాత యనియు నామములు.

జాగ్రత్తలో సుషుప్తి కలిగినప్పుడు అకారములో మకా రమును ఆ విద్యాపాదములో ఆనంద పాదమును, స్థూల దేహమునందు కారణదేహమును తారతమ్యములు, ఈశ్వరునకు విరాట్టులో సర్వజ్ఞుడనియు, జీవునకు విశ్వునిలో ప్రాజ్ఞ డనియు బ్రహ్మవిదునకు ఓతలో ననుజ్ఞైక రసికుడనియు నామములు.

జాగ్రత్తలో తురీయము గలిగినప్పుడు అకారములో అర్ధమాత్రయు, అవిద్యా పాదములో తురీయ పాదమును, స్థూలదేహమునందు మహాకారణ దేహమును, తారతమ్యములు, ఈశ్వరునకు విరాట్టులో పరమాత్మ యనియు, జీవునకు విశ్వునిలో కూటస్థుడనియు, బ్రహ్మవిదున కోతలో వికల్పు డనియు నామములు.

సమిష్టిరూపుడయిన ఈశ్వరునకు వ్యష్టిరూపుడయిన జీవునకును ఉభయ చైతన్యైక బ్రహ్మవిదునకును. స్వప్నా వస్థయందు ఉకారమును విద్యాపాదమును, సూక్ష్మదేహమును తారతమ్యములు, అప్పుడీశ్వరునకు హిరణ్యగర్భుడనియు, సూత్రాత్మయనియు, జీవునకు తైజసుడనియు, స్వప్నకల్పితు డనియు, బ్రహ్మవిదున కనుజ్ఞాతయనియు జెప్పగును. ఇవిచేరి విష్ణుపీఠము వామదేవ ముఖము జలతత్వము మకారము ప్రతిష్ఠాకళ దండమును నగును.

జీవేశ్వర బ్రహ్మవిదులకు స్వప్నములో జాగ్రత్త కలిగి నప్పుడు ఉకారములో అకారమును, విద్యాపాదములో నవిద్యా పాదమును, సూక్ష్మ దేహములో స్థూలదేహమును తారతమ్యములు, జీవునకు తైజసునిలో విశ్వుడనియు, ఈశ్వరునకు హిరణ్య గర్భునిలో విరాట్టనియు, బ్రహ్మవిదునకను జ్ఞాతలో ఓత యనియు నామములు.

స్వప్నములో స్వప్నము వచ్చునప్పుడు ఉకారములో ఉకారమును విద్యా పాదములో విద్యాపాదమును, సూక్ష్మ దేహములో సూక్ష్మదేహమును తారతమ్యములు, జీవునకు తైజసునిలో తైజసుడనియు, ఈశ్వరునకు హిరణ్యగర్భునిలో హిరణ్య గర్భుడనియు, బ్రహ్మవిదున కనుజ్ఞాతలో ననుజ్ఞా తయనియు నామములు.

స్వప్నములో సుషుప్తి కలిగినప్పుడు ఉకారములో మకారమును, విద్యాపాదములో ఆనందపాదమును, సూక్ష్మ దేహములో కారణ దేహమును తారతమ్యములు జీవునకు తైజస నిలో ప్రాజ్ఞుడనియు, ఈశ్వరునకు హిరణ్య గర్భునిలో సర్వజ్ఞు డనియు, బ్రహ్మవిదున కనుజ్ఞాతలో ననుజ్ఞైకరసుడనినామములు.

స్వప్నములో తురీయము కలిగినప్పుడు ఉకారములో అర్ధమాత్రయు, విద్యాపాదములో తురీయ పాదము, సూక్ష్మ దేహములో మహాకారణ దేహమును, తారతమ్యములు, జీవునకు తైజసునిలో కూటస్థుడనియు ఈశ్వరునకు హిరణ్యగర్భునిలో పరమాత్మ యనియు, బ్రహ్మవిదున కనుజ్ఞాతలో వికల్పుడనియు నామములు.

సమిష్టి రూపుడయిన ఈశ్వరునకు వ్యష్టి రూపుడయిన జీవునకును ఉభయ చైతన్యైక బ్రహ్మవిదునకును సుషుప్తి వస్థయందు మకారమును, ఆనంద పాదము, కారణశరీరమును తారతమ్యము అప్పుడీశ్వరున కవ్యాకృతుడనియు, అంతర్యామి

యనియు, జీవునకు ప్రాజ్ఞుడనియు పారమార్థికుడనియు బ్రహ్మవిదుని కనుజ్ఞై కరసుడనియు నామములు గల్గును. ఇవియన్నియు జేరి రుద్రపీఠము. అఘోరముఖము అగ్నితత్వము శికారము విద్యాకళ కుండలాకృతియు నగును.

జీవేశ్వర బ్రహ్మవిదులకు సుషుప్తిలో జాగ్రత్త కలిగినప్పుడు మకారములో అకారమును, ఆనంద పాదములో అవిద్యాపాదమును, కారణదేహములో స్థూల దేహమును తారతమ్యములు జీవునకు ప్రాజ్ఞునిలో విశ్వుడనియు ఈశ్వరున కవ్యాకృతునిలో విరాట్టనియు బ్రహ్మవిదున కనుజ్ఞైక రసునిలో నోతయనియు నామములు.

సుషుప్తిలో స్వప్నము కలిగినప్పుడు మకారములో మకారమును, ఆనందపాదములో విద్యాపాదమును కారణ శరీరములో సూక్ష్మ శరీరము తారతమ్యములు జీవునకు ప్రాజ్ఞునిలో తైజసుడనియు ఈశ్వరున కవ్యాకృతునిలో హిరణ్యగర్భుడనియు బ్రహ్మవిదున కనుజ్ఞైక రసునిలో అనుజ్ఞాత యనియు నామములు.

సుషుప్తిలో సుషుప్తి కలిగినప్పుడు మకారములో మకారమును ఆనందపాదములో నానందపాదమును, కారణ శరీరములో కారణ శరీరమును తారతమ్యములు జీవునకు ప్రాజ్ఞునిలో ప్రాజ్ఞుడనియు ఈశ్వరున కవ్యా కృతునిలో నవ్యాకృతుడనియు, బ్రహ్మవిదున కనుజ్ఞైక రసునిలో ననుజ్ఞైకరసు డనియు నామములు.

సుషుప్తిలో తురీయము గలిగినప్పుడు మకారములో అర్ధమాత్రము, అర్ధపాదములో తురీయ పాదమును, కారణ శరీరములో మహాకారణ శరీరమును తారతమ్యములు జీవునకు ప్రాజ్ఞునిలో కూటస్థుడనియు, ఈశ్వరున కవ్యాకృతునిలో పరమాత్మ యనియు, బ్రహ్మవేత్తకనుజ్ఞైక రసునిలో నవికల్పు డనియు నామము.

సమిష్టి రూపుడగు ఈశ్వరునకును వ్యష్టి రూపుడగు జీవునకును ఉభయ చైతన్యైక్యతగల బ్రహ్మవేత్తకును తురీయావస్థ యందు అర్ధమాత్రయు, తురీయ పాదమును, మహాకారణ శరీరమును గలుగును. అప్పుడీశ్వరునకును పరమాత్మ యనియు, జీవునకు కూటస్థుడనియు బ్రహ్మవిదున కవికల్పు డనియు నామములగును. ఇవి యెల్లజేరి మహేశ్వరీ పీఠము తత్పురుష ముఖము, వాయు తత్వము, వకారము, శాంతి కళ, అర్ధ చంద్రా కారమునునగును.

జీవేశ్వర బ్రహ్మవిదులకు తురీయమున జాగ్రత్త గలిగినప్పుడు అర్ధమాత్రలో అకారమును తురీయ పాదమునందు విద్యా పాదమును, మహాకారణ శరీరమునందు స్థూలశరీరమును తారతమ్యములు, ఈశ్వరునకు పరమాత్మలో విరాట్టనియు, జీవునకు కూటస్థునిలో విశ్వుడనియు, బ్రహ్మవిదున కవికల్పునిలో నోతయనియు నామములు.

తురీయములో స్వప్నము కలిగినపుడు అర్ధమాత్రలో ఉకారమును, తురీయ పాదములో విద్యా పాదమును, మహాకారణ శరీరములో సూక్ష్మ శరీరమును తారతమ్యములు ఈశ్వరునకు పరమాత్మలో హిరణ్య గర్భుడనియు జీవునకు కూటస్థునిలో తైజసుడనియు, బ్రహ్మవిదున కవికల్పునిలో నను జ్ఞాతయనియు నామములు.

తురీయములో సుషుప్తి కలిగినప్పుడు అర్ధమాత్రలో మకారమును, తురీయ పాదములో నానంద పాదమును, మహాకారణ శరీరములో కారణ శరీరమును తారతమ్యములు ఈశ్వరునకు పరమాత్మలో నవ్యాకృతుడనియు, జీవునకు కూటస్థునిలో ప్రాజ్ఞ డనియు, బ్రహ్మవిదున కవికల్పునిలో ననుజ్ఞైక రసుడనియు నామములు.

మీద జెప్పినవెల్లను జేరి సదాశివ పీఠము ఈశాన్య ముఖము, ఆకాశతత్వము, యకారము, శాంత్యతీతకళ బిందు రూపము నగును.

తురీయములో తురీయము కలిగినప్పుడు అర్ధమాత్రలో నర్ధమాత్రయు తురీయ పాదములో తురీయపాదమును, మహా కారణ శరీరములో మహాకారణ శరీరమును తారతమ్యములు. ఈశ్వరునకు పరమాత్మలో పరమాత్మ యనియు జీవునకు కూటస్థునిలో కూటస్థుడనియు, బ్రహ్మవిదున కవికల్పునిలో నవి కల్పుడనియు నామములు.

వీనిలో పదునేను కళలు శక్తితత్వములనియు, పదునారవ కళ శివ తత్వమనియు చెప్పబడును. శక్తిశివతత్వముల కతీత మయినదే నిర్గుణ బ్రహ్మము అది నిష్కళమయి నిరీహమయి నిష్ప్రపంచమయి నిర్మలమయి నిరంజనమయి నిర్వికారమయి నిత్యమయి బుద్ధమయి కేవలమయి అఖండమయి అప్రమేయ మయి అద్వితీయమయి అద్యంతరహితమయి అపరోక్షమయి పరాత్పరమయి స్వయంజ్యోతియై సర్వవ్యాపకమయి నిరతి శయానందమయి వెలయుచుండును.

ఈ ప్రకారముగా విభజింపబడిన పదునారవస్థలయందును సమిష్టి రూపుడయిన ఈశ్వరుడు సర్వేశ్వరత్వ సర్వస్రష్టృత్వ సర్వపాలకత్వ సర్వ సంహారకత్వ సర్వాంతర్యామిత్వ మహా గుణములును, వ్యష్టిరూపుడగు జీవుడు నేనుకర్తను, నేను భోక్తను, నేనుసుఖిని, నేనుదుఃఖిని, నేనుపాపిని, నేను జీవ సమలోనగు నల్పగుణములును, బ్రహ్మవిదుడా సర్వజ్ఞత్వ కించిజ్ఞత్వాది గుణములయందు నిరభిమానమును యదృచ్ఛా లాభసంతుష్టియు పరబ్రహ్మను సంధానమును మహాయోగ మహాత్యాగములు మొదలగు సుగుణములును గలిగి వెలయు చుండును.

గురుసన్నిధానమున శాస్త్రశ్రవణము చేయు సమయమున నడుగవలసిన విషయములనెల్ల నడిగి తెలిసికొని మరల మఱవ కుండుట జాగ్రత్తలో జాగ్రత్తయనియు, గురువు వాక్యముంచి శాస్త్రవిషయముల నాలకించు నప్పుడు ప్రమాద వశమున నా విషయములు జ్ఞప్తిలో నుండియు నుండకపోవుట జాగ్రత్తలో స్వప్నమనియు, గురువువద్ద సద్విషయములను వినవలె నన్న కుతూహలము గలిగి యీ "పనికి పూనుకొన్న మీదట నెవ్వరికలనైనంతవేళ విన్న విషయము లేవియును జ్ఞప్తిలో నిలువక పోవుట జాగ్రత్తలో సుషుప్తియనియు గురువులవద్ద శ్రద్ధతో శ్రవణము చేసినందున వస్తుతత్వ జ్ఞానము కలిగి తెలిసికొన్న వస్తువు నెప్పుడును చింతించుట జాగ్రత్తలో తురీయమనియు, చెప్పబడును. కలగని మేల్కొనికలలో నాగన్న వానినెల్ల దప్పక చెప్పుట స్వప్నములో జాగ్రత్తయనియు, కలగని మేల్కొన్న తరువాత కలయందుగన్న విషయములను మఱచియు మఱవకుండుట స్వప్నములో స్వప్నమనియు, కలగని మెలకువ వచ్చునప్పటికి కలలోగన్న సంగతిని మఱచి పోవుట స్వప్నములో సుషుప్తియనియు, కలయందుగన్న విషయములను బట్టి కష్ట సుఖములు కలుగునన్న ఫలమునందలి విచారము మాని ఇది యంతయు మనః ప్రవృత్తిగాని మరియొకటి కాదని నిశ్చయించుకొని బ్రహ్మను సంధానము నెలకడ గలిగియుండుట స్వప్నములో తురీయ మనియు చెప్పబడును. సుఖముగా నిద్రపోయి లేచినతర్వాత నిద్రాసుఖ మిట్టిదని తెలియజేయుట సుషుప్తిలో జాగ్రత్తయనియు, సుఖనిద్రచేసి లేచినను దాని సుఖమిట్టిదని తెలిసియూ తెలియకుండుట సుషుప్తిలో స్వప్న మనియు, నిద్రపోయి లేచినప్పుడు తత్సుఖ మిట్టిదని తెలియకుండుట సుషుప్తిలో సుషుప్తియనియు సుఖముగా నిద్రపోయినను నిద్రావస్థయజ్ఞాన విషయమే గాని ప్రజ్ఞాన ఘనప్రత్యగాత్మ యయిన తనకు విషయము కాదని తెలిసికొనుట సుషుప్తిలో తురీయమనియు చెప్పబడును.



## శ్రీ లఘుగాయత్రీ యంత్ర మహిమ

సమస్త శుభములనిచ్చి ఐహికములగు సమస్త కష్టములను దూర మొనర్చి జ్ఞానశక్తిని, సంపదను, బ్రహ్మజ్ఞానమును కలుగజేసెడి ఈ యంత్రాధిష్ఠాత్రియైన గాయత్రీదేవిని ఏక, చిత్త ప్రాప్తులచే భక్తితో పూజించి ఈ యంత్రమునకు మూలమంత్రమైన "ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వ రేణియం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్" అను మూలమంత్రమును ప్రతినిత్యము యథాశక్తిగా జపించు చుండువారలకు సమస్త పాపములు నశించి ఇహమున సమస్తసుఖములు పరమందు మోక్షమును పొందెదరు.





## శ్రీ బృహద్గాయత్రీ యంత్ర మహిమ

ఈ బృహద్గాయత్రీ యంత్రాధి దేవతయగు శ్రీ గాయత్రీదేవిని, ఫల పత్ర, పుష్పాదులతో పూజించి, ఈ యంత్రమునకు మూలమంత్రమైన "ఓం భూర్భువస్సువః ఓం తత్సవి తుర్బ్రహ్మణేనమః వరేణ్యం విష్ణవేనమః ధియోయోనః సదాశివాయ నమః ప్రచోదయాత్ సర్వాత్మనేనమః" అను మూలమంత్రమును ప్రతినిత్యము యథాశక్తి జపించుచుండు వారలకు సంతాన ప్రాప్తి, ఐశ్వర్యాభివృద్ధి యిహపర ముక్తి లభించును.



## శ్రీ శ్రీ సూక్త యంత్రము

వేదోదితమగు శ్రీ సూక్తముయొక్క యంత్రం ఐశ్వర్యములు ప్రసాదించుటలో అగ్రగణ్యమైనది. ఈ యంత్రమును రాగి రేకుపై వేయించి గాని, ఈ యంత్రకాగితమునే పటముగా కట్టించిగాని, ప్రతినిత్యము ప్రాతస్సాయం సంధ్యా సమయములందు భక్తిశ్రద్ధలతో పత్రం పుష్పం ఫలంతోయం అను శాస్త్రానుసారము ఈ యంత్రాధిష్ఠాత్రియై యున్న శ్రీ మహాలక్ష్మీ దేవికి పత్రము, పుష్పము ఫలము ఉదకము, కుంకుమ మున్నగువానిని సమర్పించి, నమస్కరించి, ధ్యానము చేయుచున్న యెడల సమస్త కోరికలు నెరవేరును ఐశ్వర్యము కలుగును.

మరియు ఈ యంత్రమునకు యథావిధిగ పంచపూజలు చేసి శ్రీ సూక్తమును ప్రాతస్సాయం కాలములందు జప పారాయణ చేయుచున్న యెడల ఋణవిముక్తి గౌరవము, ధనకనకవస్తు వాహనా ద్యష్టైశ్వర్యములు కలుగును.

ఇంతియేగాక ఈ యంత్రమునకు యథాశాస్త్రీయముగ ప్రాణ ప్రతిష్ఠ జీవ న్యాసం కళా న్యాసాదులు చేసి, ఆవరణసపర్యలు గావించి "హిరణ్య వర్ణాం హరిణీం సువర్ణ రజత స్రజాం చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ" అను మంత్రములతో గని ఉపచార సపర్యలను చేసి శ్రీ సూక్తమును పారాయణ చేయుచున్న యెడల సమస్తైశ్వర్యములు మోక్షగోగ్యైశ్వర్యములు యశస్సు, ధన కనక వస్తు వాహనాది సమృద్ధి ఇవి అవి అననేల సమస్తైశ్వర్యములు కలుగును. మరియు ఈ యంత్రము గల గృహమునందు లక్ష్మీదేవి నివాసము చేయును ఆ గృహములో నుండు వారలను సర్వదా సంరక్షించు చుండును

## శ్రీ సూక్త శ్రీలక్ష్మీ పంచపూజలు

ఓం లం పృథివీ తత్త్వాత్మికాయై గంధతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ సూక్తాధిష్ఠాత్రై మహాలక్ష్మ్యై గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్త్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ సూక్తాధిష్ఠాత్రై మహాలక్ష్మ్యై పుష్పం సమర్పయామి నమః



# శ్రీ సౌభాగ్య లక్ష్మీ యంత్రము

ఈ సౌభాగ్యలక్ష్మీ మహాయంత్రము ఐశ్వర్యము విషయంలో చాలా అత్యుత్తమమైనది. ఈ సౌభాగ్యలక్ష్మీ మహా యంత్రము రాగిరేకుపై చెక్కించిగాని, ఈ యంత్రకాగితమునే పటము కట్టించిగాని మూలమంత్రముతో షోడశోపచార పూజలు చేసి మూలమంత్రమును యథావిధిగ జపము చేయువారలకు శ్రీ సౌభాగ్యలక్ష్మీ దేవి యొక్క కటాక్షముచే సమస్త ఐశ్వర్యములు సులభముగా సంప్రాప్తమగును. ఈ యంత్ర కాగితమును పటముగా కట్టించి 'పత్రం, పుష్పం ఫలం తోయం' అన్నట్లు పుష్పము, ఫలము, ఉదకము, మున్నగు వానిని సమర్పించి, నమస్కారము చేయుచున్న యెడల సమస్త కోరికలు నెరవేరును మరియు వ్యాపారమునందు అభివృద్ధియు, వ్యాపారముల యందు నానా ప్రకారముల అధికతర ఆదాయాదులను గౌరవాది ప్రాప్తియు గలుగును.

మరియు ఈ సౌభాగ్యలక్ష్మీ మహాయంత్రమునకు ప్రతి నిత్యము పంచపూజలు చేయుచు మూలమంత్రమును యథాశక్తిని జపము చేయువారలకు భుక్తిముక్తి ఐశ్వర్యప్రాప్తి ఆరోగ్యము, సౌఖ్యము మనశ్శాంతి, సత్సంతానము మున్నగునవి సంప్రాప్తించును.

ఈ సౌభాగ్యలక్ష్మీమహాయంత్రమును పటముగా కట్టించి వ్యాపార స్థానములయందు, ఇళ్లలు మొదలగు వానియందు పెట్టి ప్రతినిత్యముగాని ప్రతి శుక్రవారము గాని ప్రతి మంగళవారముగాని సాయంప్రదోషసమయమందు షోడశోపచార పూజలు చేయుచున్నయెడల ఆవ్యాపార స్థానమందు యెల్లప్పుడు ధనాదాయము వచ్చు చుండును. మరియు ఆ వ్యాపారములు వృద్ధిప్రదములై లాభదాయకముగా నుండును. పూర్వమొకప్పుడు కుబేరుడు ఈసౌభాగ్యలక్ష్మీ దేవిని ఉపాసించి యున్నందుననే ఐశ్వర్యవంతు డయ్యెను. ధనవృద్ధిని ఐశ్వర్యమును కలుగ జేయుటలో శ్రీ సౌభాగ్యలక్ష్మీ యంత్రముతో సమానమైన యంత్రము వేరొకటి లేదు.

## పంచపూజలు

ఓం లం పృథ్వీ తత్వాత్మికాయై గంధతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ సౌభాగ్యలక్ష్మీ పరాదేవ్యై గంధం సమర్పయామి నమః



ఓం హం ఆకాశతత్త్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ సౌభాగ్యలక్ష్మీ పరాదేవ్యై పుష్పం సమర్పయామి నమః

ఓం యం వాయుతత్త్వాత్మికాయై స్పర్శతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ సౌభాగ్యలక్ష్మీ పరాదేవ్యై ధూపమాఘ్రాపయామి నమః

ఓం రం వహ్నితత్త్వాత్మికాయై తేజస్తన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ సౌభాగ్యలక్ష్మీ పరాదేవ్యై దీపం దర్శయామి నమః

ఓం వం అమృతతత్త్వాత్మికాయై అమృతతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ సౌభాగ్యలక్ష్మీ పరాదేవ్యై అమృతోపహార నైవేద్యం పరికల్పయామి నమః

ఓం సం సర్వతత్త్వాత్మికాయై సర్వతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ సౌభాగ్యలక్ష్మీపరాదేవ్యై తాంబూలాది సర్వోపచార పూజాం సమర్పయామి నమః ।

**ఋష్యాదిన్యాసము**

అస్య శ్రీ సౌభాగ్యలక్ష్మీ మహామంత్రస్య । నారాయణ భగవాన్ ఋషిః త్రిష్టుప్ఛందః శ్రీ సౌభాగ్యలక్ష్మీ పరాదేవతా । శ్రీం బీజం । హ్రీం శక్తిః । క్లీం కీలకం । శ్రీ సౌభాగ్యలక్ష్మీ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః ।

**కరన్యాసము**

శ్రాం హ్రాం అంగుష్ఠాభ్యాం నమః
శ్రీం హ్రీం తర్జనీభ్యాం నమః
శ్రూం హ్రూం మధ్యమాభ్యాం నమః
శ్రైం హ్రైం అనామికాభ్యాం నమః
శ్రౌం హ్రౌం కనిష్ఠి కాభ్యాం నమః
శ్రః హ్రః కరతల కరపృష్ఠాభ్యాంనమః

**హృదయన్యాసము**

శ్రాం హ్రాం హృదయాయనమః
శ్రీం హ్రీం శిరసే స్వాహా
శ్రూం హ్రూం శిఖాయై వషట్
శ్రైం హ్రైం కవచాయహుం
శ్రౌం హ్రౌం నేత్రత్రయాయ వౌషట్
శ్రః హ్రః అస్త్రాయఫట్
ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః ।

**ధ్యానము**

యాసాపద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ
గంభీరావర్తనాభిస్తనభరనమితా శుభ్రవస్త్రోత్తరీయా ।
లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైర్మణిగణఖచితైః స్నాపితా హేమకుంభైః
నిత్యంసాపద్మహస్తా మమవసతుగృహే సర్వమాంగళ్య
యుక్తా ।

ఇమిత్యాది పంచపూజలుచేసి,గురువందనము చేయవలయును.

**మూలమంత్రము**

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః జగత్ప్రసూత్యై సౌభాగ్య లక్ష్మ్యై ధనదాత్ర్యై నమః

**పురశ్చరణవిధానము**

ఈ సౌభాగ్యలక్ష్మీ మూలమంత్రమును యథాశాస్త్రముగ ఆరులక్షలు జపము, తద్దశాంశము హోమము, తద్దశాంశము తర్పణము, తద్దశాంశము మార్జన, తద్దశాంశము భూతతృప్తి చేయుచు,పురశ్చరణదినములలో త్రికాలములయందు పై యంత్రమునకుమూలమంత్రముతో షోడశోపచార పూజలు చేయుచున్న యెడలమంత్రసిద్ధి యగును.

మంత్రసిద్ధ్యం సంతరము ఋణగ్రస్తులైనవారు పదివేల పర్యాయములు పాయసముతో హోమముచేసిన యెడల శీఘ్రముగా ఐశ్వర్యవంతులగుదురు.గుగ్గిలముతో పదివేల పర్యాయములు హోమము చేసినయెడల సర్వవిధములగు కార్యములు సిద్ధించును. ఈ సౌభాగ్యలక్ష్మీ యంత్రమునకు పంచామృత హోమము లక్షపర్యాయములు చేసిన యెడల మిక్కిలి ఐశ్వర్యవంతుడగును. పరరాష్ట్రము గూడ వశము చేసుకొను వాడగును.

ఈ సౌభాగ్యలక్ష్మీ యంత్రమును ప్రతినిత్యము పూజ చేయువారు సమస్తైశ్వర్యములను పొందుచుందురు. ఐశ్వర్యమును ప్రసాదించుటలో అత్యుత్తమమైనది. పురుషులకు చేయుటకు అవకాశము లేని యెడల స్త్రీలు శ్రద్ధాభక్తులతో ప్రతినిత్యము ఈ యంత్రమునకు పూజ చేయుచున్న యెడల సర్వవిధముల ఆ కుటుంబములో ఐశ్వర్యవృద్ధి, ధనధాన్యసంపదాభివృద్ధి ప్రాప్తి, గౌరవవృద్ధి, మనశ్శాంతి మొదలగునవి సంప్రాప్తించును.

( పేజీ 204 తరువాయి )

పుంలాత్రి రవి సాహస్రం హావ్యేర్ద్వాదశ్య సంఖ్యకైః ।
ఏవం సిద్ధమనుర్మంత్రీ కామ్యకర్మాణి సాధయేత్ ।

తా : శ్రీ జ్ఞానదుర్గా యంత్రమును యథాశాస్త్రముగా మూలమంత్రమును మూడు లక్షల పర్యాయములు జపమును, జపదశాంశముగాని, శతాంశముగాని మోదుగపువ్వులతోను గుడత్రయముతోను హోమము చేయవలయును. తరువాత ధ్యానము, ఆజ్యము కలిపియు, సంపెంగ పువ్వులతోను పన్నెండువేల పర్యాయములు హోమమును చేయవలయును. పిమ్మట హోమదశాంశము తర్పణమును, తర్పణదశాంశము మార్జనమును, తద్దశాంశము భూతతృప్తి చేయవలయును. ఇట్లొనర్చిన జ్ఞానదుర్గా మంత్రము సిద్ధించును. ఈ ప్రకారముగా మంత్రసిద్ధి బొందినతరువాత కామ్యకర్మలను సాధించ వలయును.

**మంత్ర ప్రయోజన క్రమము**

శ్లో ॥ సూర్యమండల గాం దుర్గాం ధ్యాయేత్ప్రత్యహ మితివం జపేత్,
సహస్రత్రితయంయస్తు త్రిమాసాన్మూకవాక్పతిః ।

తా : ప్రతినిత్యము శ్రీ జ్ఞానదుర్గా యంత్రమును పూజించుచు సూర్యబింబమునందు శ్రీ జ్ఞానదుర్గాదేవిని ధ్యానము చేసి మూడువేల పర్యాయములు మూలమంత్రమును జపము చేయవలయును. ఈ విధముగా మూడుమాసములు చేసిన ఎడల మహాకవియగును.

శ్లో ॥ ప్రాతర్బ్రాహ్మ్యా సహస్రంతు పిబేద్బ్రాహ్మ్యంబుసాన్వితాం
జపన్మృతబతిమేధావీ కృత్స్నాన్ వేదాగమానపి ।

ప్రాతః కాలమందు శ్రీజ్ఞానదుర్గా యంత్రమునకు యథావిధిగ పూజనుజేసి తరువాత బ్రాహ్మీ (సరస్వతీ ఆకు) రసము కలిపి వెయ్యి పర్యాయములు శ్రీ జ్ఞానదుర్గా మూల మంత్రముచే జపించుచు, అభిమంత్రించుచు త్రాగినయెడల మిక్కిలి జ్ఞానశక్తి కలుగును. అంతియేగాక వేదములు ఆగమములు మొదలగునవి వినినంత మాత్రముననే మరచిపోకుండా యుండునట్టి ధీశక్తిని, జ్ఞానశక్తిని గూడ కలుగజేయును.

# శ్రీ మహాలక్ష్మీ యంత్రము

"ధనమగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యోధనం వసుః ధనమింద్రో బృహస్పతిర్వరుణం ధనమశ్నుతే" అను శృతి ప్రకారము ప్రపంచమున కారాణభూతమై వర్తిల్లె ! రాజ్యవిద్యా స సౌభాగ్య ౼ అమృతకామ్య పరాది కా ! సత్యభోగ యోగ లక్ష్మీ ౼ శ్రీ వ ప్రతిష్ఠితా ! అష్టలక్ష్మి 1) సత్యలక్ష్మి 2) భోగలక్ష్మి 3) యోగలక్ష్మి 4) రాజ్యలక్ష్మి 5) విద్యాలక్ష్మి 6) సౌభాగ్యలక్ష్మి 7) అమృతలక్ష్మి 8) కామ్యలక్ష్మి అను అష్టవిధరూపములను బొందిన శ్రీ మహాలక్ష్మీదేవియొక్క యంత్రమును రాగిరేకుపై చేయించి గాని, ఈయంత్రకాగితమునే పటముగా కట్టించి గాని ఈ యంత్రాధిష్ఠాత్రియైన శ్రీ మహాలక్ష్మి దేవికి "పత్రం పుష్పం ఫలం తోయం" అనున్యాయానుసారము పత్ర పుష్ప ఫల చందన కుంకుమాదులను యథాశక్తిని సమర్పించి, నమస్కారము చేయుచు ధ్యానము చేయుచున్న వృద్ధి, ఆరోగ్యము, మన స్వాస్థ్యము, వృత్త్యాదులయందు లాభము, వర్ధిల్లగోర్లకు వృద్ధి మున్నగునావిని గలుగ చేయును.

ఇంతియగాక ప్రతినిత్యము ఉదయాస్తమయములందు యథావిధిగా పంచపూజలు చేసి మూలమంత్రమును యథాశక్తి జపము చేయుచున్నయెడల పలువిధములగు ఐశ్వర్యములను సుఖభోగములను గలుగజేయుచు సమస్తములగు వృద్ధికోరికలను సిద్ధింపచేయును. మరియు ఈ యంత్రమును యథాక్రమముగా ప్రాణప్రతిష్ఠచేసి "ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీద ప్రసీద శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః" అనుమూలమంత్రముతో షోడశోపచార పూజలు చేయువారలకు శ్రీమహాలక్ష్మీదేవి తన అష్టవిధ రూపములతో సత్యము, భోగము, యోగము రాజ్యము, విద్య, సౌభాగ్యము అమృతత్వము (దీర్ఘాయుర్దాయము) కామ్యము, మున్నగు ఐశ్వర్యములను సిద్ధింప చేయుటయే గాక అణిమాద్యష్ట సిద్ధులను గూడ గలుగచేయును



# శ్రీ మహాలక్ష్మీపంచపూజలు

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః జగత్ప్రసూత్యై మహాలక్ష్మ్యై ఓం లం పృథ్వీ తత్వాత్మికాయై గంధం సమర్పయామినమః

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః జగత్ప్రసూత్యై మహాలక్ష్మ్యై ఓం హం ఆకాశ తత్వాత్మికాయై పుష్పం సమర్పయామి నమః

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః జగత్ప్రసూత్యై మహాలక్ష్మ్యై ఓం యం వాయు తత్వాత్మికాయై ధూపం సమర్పయామి నమః

శ్రీం-హ్రీం క్లీం ఐం సౌః జగత్ప్రసూత్యై మహాలక్ష్మ్యై ఓం రం వహ్నితత్వాత్మికాయై దీపం దర్శయామి నమః

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః జగత్ప్ర సూత్రై మహాలక్ష్మ్యై వం అమృతతత్వాత్మికాయై నైవేద్యం సమర్పయామి నమః ।

శ్రీం హ్రీంక్లీం ఐం సౌః జగత్ప్రసూత్యై మహాలక్ష్మ్యై ఓం సం సర్వతత్వాత్మికాయై తాంబూలాది సర్వోపచార పూజాం సమర్పయామి నమః

## శ్రీ మహాలక్ష్మీ మంత్ర విధానము

అస్య శ్రీ మహాలక్ష్మీ మహామంత్రస్య । దక్ష ప్రజాపతి ఋషిః గాయత్రీ ఛందః । శ్రీం బీజం । హ్రీం శక్తిః । నమః కీలకం శ్రీ మహాలక్ష్మీ ప్రసాదేన మమ సకలైశ్వర్యప్రాప్త్యర్థా మనోవాంఛా ఫలసిద్ధ్యర్థే జపేవినియోగః

### కరన్యాసము

శ్రీం హ్రీం శ్రీం కమలే శ్రీం హ్రీం శ్రీం అంగుష్ఠాభ్యాం నమః ।

శ్రీం హ్రీం శ్రీం కమలాలయే శ్రీం హ్రీం శ్రీం తర్జనీభ్యాం నమః

శ్రీం హ్రీం శ్రీం ప్రసీద శ్రీం హ్రీం శ్రీంమధ్యమాభ్యాం నమః ।

శ్రీం హ్రీం శ్రీం ప్రసీద శ్రీం హ్రీం శ్రీం అనామికాభ్యాం నమః

శ్రీం హ్రీం శ్రీం మహాలక్ష్మ్యై శ్రీం హ్రీం శ్రీం కనిష్ఠికాభ్యాం నమః ।

శ్రీం హ్రీం శ్రీం నమః శ్రీంహ్రీం శ్రీం కరతల కరపృష్ఠాభ్యాంనమః ।

### హృదయన్యాసము

శ్రీం హ్రీం శ్రీం కమలే శ్రీం హ్రీం శ్రీం హృదయాయ నమః ।

శ్రీం హ్రీం శ్రీం కమలాలయే శ్రీం హ్రీం శ్రీం శిరసేస్వాహా

శ్రీం హ్రీం శ్రీం ప్రసీద శ్రీం హ్రీం శ్రీం శిఖాయై వషట్
శ్రీం హ్రీం శ్రీం ప్రసీద శ్రీం హ్రీం శ్రీం కవచాయహుం
శ్రీం హ్రీంశ్రీం మహాలక్ష్మ్యై శ్రీం హ్రీం శ్రీం నేత్రత్రయాయ వౌషట్ ।
శ్రీం హ్రీం శ్రీం నమః శ్రీం హ్రీం శ్రీం అస్త్రాయ ఫట్
భూర్భువ స్సువరోమితి దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ సిందూరాభాంచపద్మస్థాం పద్మపత్రంచ దర్పణం ।
అర్ఘ్యపాత్రం వరదతీం పద్మారముకుటాన్వితాం ।
నానాదానపరిప్రీతాం కాంచీకుండలమండితాం ।
లావణ్యరూపిణీంవందే సుందరాంగదలాహుకాం ॥

ఈ ప్రకారముగా ధ్యానము చేసినపిమ్మట పంచపూజలు చేసి గురువందనము చేయవలయును.

### మూల మంత్రము

ఓం శ్రీం హ్రీంశ్రీం కమలేకమలాలయే ప్రసీద ప్రసీద శ్రీం హ్రీం శ్రీం మహాలక్ష్మ్యై నమః

(౨౭ అక్షరముల మంత్రము)

## శ్రీ మహాలక్ష్మీ గాయత్రీ మంత్రము

మహాదేవ్యైచవిద్మహే విష్ణుపత్న్యైచ ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥

ఈ మంత్రములను ప్రతినిత్యము ఉదయాస్తమయము లయందు యథాశక్తిగ జపము. జేయు యెడల సమస్త కోరికలు నెరవేరును పలువిధములగు ఐశ్వర్యములు, సుఖభోగములు, ఋణబాధ, ధనవృద్ధి, జయము, యశస్సు మున్నగునవి లభించును.

### మంత్ర ప్రయోజన క్రమము

మేరు తంత్రే :

శ్లో ॥ ఏవం సంపూజయే ల్లక్ష్మీం యోను ర్భక్తిపరిభవేత్ ।
లక్షంజపేత్సురై బిల్వైర్హుత్వా యమ్మధురోక్షితైః ॥
దశాంశంపంక్త్యతేవహ్నౌప్రాశ్యలోక్తైసదర్శనా ।
ఏవంసిద్ధమనుర్మంత్రీ సాధయేదిష్టమాత్మనః ॥

తా : ఈ మహాలక్ష్మీ యంత్రమును యథావిధిగ పూజచేయుచు పై మూలమంత్రమును లక్షపర్యాయములు జపముచేసి, తద్దశాంశము మారేడు ఫలముతోగాని, మధుర పదార్థములతో గాని హోమము చేసిన యెడల మంత్రసిద్ధియగును. ఈ ప్రకారము మంత్రసిద్ధిని పొందినతరువాత కామ్యకర్మలను సాధించుకొనవలయును. ఎట్లన :

శ్లో ॥ చందనాక్తైస్సుమై ర్బిల్వైః ప్రజుహోయాత్సుధీః ।
అరిభిర్వైరిణాం రాజ్యం తద్ధైవసమరంవినా
రాజ్యలక్ష్మీ మమంత్రైవప్రాప్యరాజసభాంవ్రజేత్
తదావశ్యంప్రాప్యతే నిత్యం వాత్రకార్యావిచారణా ॥

తా : చందనముతో గూడిన తామరపువ్వులతో హోమము చేసిన యెడల యుద్ధము చేయకుండగనే శత్రువుల రాజ్యమును పొందుదురు. ఈ శ్రీమహాలక్ష్మీ మహాయంత్రమును జపము చేసుకొని రాజసభలు వ్యాపారస్థానములు మున్నగువానికి వెళ్ళిన యెడల సర్వులు ప్రతినిత్యము ధనాదాయము తప్పక గలుగుచుండును.

ఈ యంత్రము ముఖ్యముగా వ్యాపారస్థానముల యందును ధనాగారములయందును, యంత్రాగారముల యందునుపెట్టిపూజ చేయువారలకు అనన్యమైన ధనలాభము, ఐశ్వర్యము సుఖభోగములు మున్నగునవి సంప్రాప్తించును.



శ్రీ దుర్గాదేవి చిత్రము

## శ్రీ దుర్గాయంత్రము

ఈ యంత్రమునకు అద్దము కట్టించి ప్రతి రోజూ స్నానానంతరము ఈయంత్రాధిష్ఠాత్రియైన శ్రీ దుర్గాదేవిని "పత్రం, పుష్పం, ఫలం, తోయం" అనెడు రీతిని పత్ర, పుష్ప,ఫల అక్షతాదులచే భక్తి శ్రద్ధలతో పూజించి అనంతరం "ఓం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే" అనెడి శ్రీ దుర్గాదేవి మూలమంత్రమును యథాశక్తిగా జపించు చుండువారికి సమస్తము లగు గ్రహబాధలు, దుష్టగ్రహ బాధలు, కష్టములు, పాపములు తొలగిపోయి సమస్త శుభములు సంపదలు సుఖములు లభించును.



# శ్రీ దుర్గా యంత్రము

దేవీ రహస్యతంత్రే శ్లో॥ తత్రైవ సంరివిష్యామి దుర్గమాఖ్యం మహాసురం । దుర్గాదేవీతి విఖ్యాతం తన్మే నామ భవిష్యతి । హింగులాద్రిఖండే ఉత్తర సంహితాయాం శ్లో॥ అత్ర వేదు పితామ్నామ్యాం సంగ వేదుపాతే ఉసురః తయాదేవ్యా మహా విష్ణోత్రైలోక్య సుఖ హితవే రురుదైత్యస్య పుత్రో యోదుర్గ సంజ్ఞోతి దారుణః తన్నాశకరణే నైవదుర్గానామాభవిష్యం ।

శ్రీ దుర్గాదేవియొక్క మంత్రజపమును యంత్ర పూజను చేయుచున్నయెడల సులభముగ దుఃఖ నివారణయు, నైనివృత్తిని బొందుచు సుఖమును ఆరోగ్యమును, ఐశ్వర్యమును, బడయవచ్చును. ఈ దుర్గా యంత్రమును రాగిరేకుపైచేయించి కాని ఈ యంత్ర కాగితమునే పటముగా కట్టించికాని ఈ యంత్రాధిష్ఠాత్రియై యున్నదుర్గాదేవిని ప్రతినిత్యము ప్రాతః స్సాయం సమయములందు "పత్రం పుష్పం ఫలం తోయం" అను న్యాయానుసారముగ పత్రము, పుష్పము, ఫలము ఉదకము, కుంకుమ మున్నగువానిని యథాశక్తి సమర్పించి నమస్కరించుచున్న యెడల సమస్త బాధలు తొలగి సుఖము బగును.

మరియు నీ యంత్రమునకు, యథాశాస్త్రముగ ప్రాణ ప్రతిష్ఠ జీవన్యాస కళాన్యాసములు మున్నగువానిని చేసి "ఓం హ్రీందుం జ్వల జ్వల శూలినీ దుష్ట గ్రహాన్ హుంఫట్ స్వాహా" అను మూలమంత్రముతో షోడశోపచార పూజలు గావించుచు మూలమంత్రమును యథాశక్తిగా జపము చేయుచున్న యెడల అపమృత్యుభయములు, కష్టనష్టములు, అనారోగ్యాదిబాధలు, దీర్ఘరోగములు, భూత ప్రేత పిశాచబ్రహ్మ రాక్షసాది భయములు మున్నగునవి తొలగి, ఐశ్వర్యము, సౌఖ్యము దీర్ఘాయుర్దాయములు, శత్రువిజయము మున్నగునవి గలుగును.

ఇంతియే గాక ఈ యంత్రమునకు యథావిధిగా పంచపూజలు ప్రతినిత్యము చేయుచు మూలమంత్రము జపము చేయుచున్న ప్రజల దుఃఖములు కష్టనష్టములు దారిద్ర్యరోగములు, మున్నగునవి తొలగి సౌభాగ్యారోగ్య విజయములు కలుగును.



## శ్రీ దుర్గాదేవి పంచపూజలు

ఓం లం పృథివీ తత్త్వాత్మికాయై గంధతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ దుర్గాపరమేశ్వర్యై గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్త్వాత్మికాయై శబ్దతన్మాత్రప్రకృత్యానందాత్మికాయై శ్రీ దుర్గాపరమేశ్వర్యై పుష్పం సమర్పయామి నమః

ఓం యం వాయుతత్త్వాత్మికాయై స్పర్శతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ దుర్గాపరమేశ్వర్యై ధూపంమాఘ్రాపయామి నమః

ఓం రం వహ్నితత్త్వాత్మికాయై తేజస్తన్మాత్రప్రకృత్యానందాత్మికాయై శ్రీ దుర్గాపరమేశ్వర్యై దీపం దర్శయామి నమః

ఓం వం అమృతతత్త్వాత్మికాయై అమృత తన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ దుర్గాపరమేశ్వర్యై అమృతోపహారనివేదనం సమర్పయామి నమః

ఓం సం సర్వతత్త్వాత్మికాయై సర్వతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ దుర్గాపరమేశ్వర్యై తాంబూలాది సర్వోపచార పూజాం సమర్పయామి నమః

### శ్రీ దుర్గా మంత్ర జప విధానము

ఆచమ్య ప్రాణానాయమ్య, దేశ కాలౌ సంకీర్త్య శ్రీమాన్ అముక గోత్రః అముక నామధేయోహం మమ ఆత్మనః సకుటుంబస్య శ్రీ దుర్గాపరమేశ్వరీ ప్రసన్నతాప్రాప్తి పూర్వక శ్రీ దుర్గాపరమేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థం శ్రీ దుర్గాపరమేశ్వరీ ప్రసాదేన సర్వాపన్నివృత్తి పూర్వక దీర్ఘాయుర్విపుల ధనకళత్ర పుత్ర పౌత్రాద్యనవచ్ఛిన్న సంతతివృద్ధి స్థిర లక్ష్మీ కీర్తిలాభ శత్రుపరాజయాది సదభీష్ట ఫలసిద్ధ్యర్థం శ్రీ దుర్గాపర మేశ్వరీ మహామంత్ర జపం కరిష్యే ।

### ఋష్యాది న్యాసము

అస్య శ్రీ దుర్గాపరమేశ్వరీ మహామంత్రస్య
బ్రహ్మ ఋషయేనమశ్శిరసి,
గాయత్రీ ఛందసేనమో ముఖే
శ్రీ దుర్గాపరమేశ్వరీదేవతాయై నమోహృది,
దుం బీజాయ నమోనాభౌ
స్వాహాశక్తయేనమోగుహ్యే
ఫట్ కీలకాయ నమః పాదయోః

శ్రీ దుర్గాపరమేశ్వరీ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే॥

### కరన్యాసము

ఓం దుం హ్రాం అంగుష్ఠాభ్యాం నమః
ఓం దుం హ్రీం తర్జనీభ్యాం నమః
ఓం దుం హ్రూం మధ్య మాభ్యాం నమః
ఓం దుం హ్రైం అనామికాభ్యాం నమః
ఓం దుం హ్రౌం కనిష్ఠి కాభ్యాం నమః
ఓం దుం హ్రః కరతల కరపృష్ఠాభ్యాం నమః

### హృదయన్యాసము

ఓం శ్రీం శ్రీ శూలినీదుర్గే దేవసిద్ధసురముని పూజితే నందిని మాం రక్ష రక్ష మహాయోగేశ్వరి హుంఫట్ హృదయాయ నమః

ఓం శ్రీం శ్రీ శూలినీ దుర్గేవరదే దేవసిద్ధసురముని పూజితే నందిని మాం రక్ష రక్ష మహాయోగేశ్వరి హుం ఫట్ శిరసే స్వాహా ।

ఓం శ్రీం శ్రీ శూలినీదుర్గే వింధ్య వాసిని దేవసిద్ధసుర ముని పూజితే నందినిమా రక్ష రక్ష మహాయోగేశ్వరి హుం ఫట్ శిఖాయై వషట్

ఓం శ్రీం శ్రీ శూలినీ యుద్ధప్రియేదేవసిద్ధసురముని పూజితే నందిని మాం రక్ష రక్ష మహాయోగేశ్వరి హుం ఫట్ కవచాయ హుం ।

ఓం శ్రీం శ్రీ శూలినీదుర్గే మహిషాసు మర్దిని దేవసిద్ధసురముని పూజితే నందిని మాం రక్ష రక్ష మహాయోగేశ్వరి హుం ఫట్ నేత్రత్రయాయ వౌషట్ ।

ఓం శ్రీం శ్రీ శూలినీదుర్గే సర్వసిద్ధి ప్రదాయిని దుష్ట భూతాది శత్రూన్ త్రాసయ దేవ సిద్ధసురమునిపూజితే నందిని మాం రక్ష రక్ష మహాయోగేశ్వరి హుంఫట్ అస్త్రాయఫట్ ।

### దిగ్బంధనము

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ దీప్తాభాసూర్యబాణాసి ముసలగదా । పాశహస్తాం త్రినేత్రాం
మేఘశ్యామా కిరీటోల్లసితశశికళా । భీషణాభూషణాఢ్యా ।
సింహస్కంధాధిరూఢా చతసృభిరసి । ఖేటాన్వితాభిః పరీతా
కన్యాభిర్భిన్నదైత్యా భవతు భవభయ । ధ్వంసినీ శూలినీ నః ।
ఏవం ధ్యాత్వా, లమిత్యాది మానసైరుపచారైస్సంపూజయేత్

### మూల మంత్రము

ఓం హ్రీం దుం జ్వల జ్వల శూలినీ దుష్టగ్రహ హుం ఫట్ స్వాహా ।

### మంత్రసిద్ధి క్రమము

శ్లో ॥ మనుమేవం జపేన్మంత్రీ వర్ణలక్షం వినిశ్చితః
సర్పిషాన్నే మహాహోమః తద్దశాంశం తోషయేత్ ।
ఇత్థం జపాదిభిస్సిద్ధం కుర్యాత్కర్మనిజేప్సితం ।

తా ॥ శ్రీ దుర్గాదేవి యొక్క యంత్రమును ప్రతినిత్యము త్రికాలములయందును యథాశాస్త్రముగ పూజించుచు అక్షర లక్షలు మూలమంత్రమును జపముచేసి, నెయ్యిలో అన్నము, అన్నములతో జపదశాంశము హోమము చేయవలయును. తరువాత హోమదశాంశము గోక్షీరములతో తర్పణమును, మార్జన భూతతృప్తులను చేయవలయును. ఇట్లొనర్చిన దుర్గాదేవి యొక్క మంత్రసిద్ధియగును. అనంతరమున కామ్యకర్మలను సాధింప వలయును.

### మంత్ర ప్రయోజన క్రమము

శ్లో ॥ అష్టోత్తరశతం నిత్యం సర్పిషాజ్య పాయసాన్నయోః ।
హావితం వత్సరాదర్వాక్ప్రాప్నోతి మహతీంశ్రియం ।

తా ॥ ప్రతి నిత్యము విడువకుండా ఒక సంవత్సరము దుర్గాదేవిని పూజించుచు, మూలమంత్రముతో 108 పర్యాయములు అన్నము, ఆజ్యము కలిపి హోమము చేయుచున్న యెడల ఆ సంవత్సరము లోగానే గొప్ప ఐశ్వర్యము కలుగును.

శ్లో ॥ ధ్యాత్వాదేవీం జపేన్మంత్రం స్పృష్ట్వా తం ముంచతి గ్రహ
సర్పాభివృశ్చికాదీనాం విషమాశువినాశయేత్ ।

తా ॥ దుర్గాదేవిని ధ్యానముచేసి భూత ప్రేత పిశాచ బ్రహ్మ రాక్షసాది గ్రహములు ఆవేశించియున్నవారిని స్పృశించి మూలమంత్రమును జపముచేసిన యెడల వారికిగల ఆ భూతప్రేత పిశాచ బ్రహ్మరాక్షసాది గ్రహములు తొలగిపోవును. సర్పదష్టులైన వారిని స్పృశించుచు మూలమంత్రమును జపము చేసిన యెడల వా సర్పవిషము తొలగిపోవును. ఈ ప్రకారముగనే తేళ్ళు వృశ్చికములు మున్నగువానివిషములు గూడ తొలగిపోవును ఈ దుర్గామంత్ర ప్రభావముచే సమస్త కార్యములను సులభముగ సాధించవచ్చును.

## శ్రీ మహాదుర్గామహా యంత్రము

దేవీమాహాత్మ్య తంత్రే ।

శ్లో ॥ తత్రైవ చ వధిష్యామి దుర్గమాఖ్యం మహాసురం
 దుర్గాదేవీతి విఖ్యాతం తన్మేనామ భవిష్యతి ॥

మహాప్రకృతియైన జగన్మాత దుర్గముడను మహా రాక్షసుని సంహరించినందున దుర్గాదేవి యను పేరుబడసెను. ఈ శ్రీ దుర్గాదేవి యొక్క మహాయంత్రము శ్రేష్ఠమై విలసిల్లు చున్నది.

ఈ దుర్గాయంత్రమును రాగిరేకుపై చేయించిగాని, ఈ యంత్రకాగితము పటము కట్టించిగాని, ఈ యంత్రాధిష్ఠాత్రియై యున్న శ్రీ మహాదుర్గాదేవికి ప్రతినిత్యము ప్రాతఃకాలమందును సాయంకాలమందును "పత్రం పుష్పం ఫలం తోయం" అను వ్యాయామనుసారము పత్రము, పుష్పము, ఫలము, ఉదకము, కుంకుమ మున్నగు వానిని యధాశక్తిగా సమర్పించి నమస్కరించుచున్నయెడల వివిధములగు ఉపద్రవములు అనారోగ్యాది బాధలు దుర్గరోగకలహ శత్రుత్వాదుల వలన సంప్రాప్తమైన సకలవిధముల బాధలు కలహములు మున్నగునవి తొలగిపోవును.

ఇంతియగాక ఈ యంత్రమునకు యధావిధిగ ప్రతినిత్యము పంచపూజలు చేయుచు, మూలమంత్రమును జపముచేయుచున్న యెడల ప్రబలమైన దుఃఖములు, బలవ ద్విపత్యములు, ఇత్యాదిని కష్టనష్టములు మున్నగునవి తొలగిసౌఖ్యా రోగ్య విజయములు సమకూరును.

మరియు ఈ యంత్రమునకు యధాశాస్త్రీయముగ ప్రాణప్రతిష్ఠ-జీవన్యాస-కళాన్యాసాదులు మున్నగువానిని కల్పముతో చెప్పబడిన ప్రకారము చక్కగాజేసి, ఓం ఐం హ్రీం క్లీం శ్రీం హ్రీం క్లీం సౌః దుం ఓం నమో మహాదుర్గే సర్వరాజ్యం రక్ష రక్ష స్వాహా అను మంత్రముతో షోడశోపచార పూజలు సాగించుచు, మూలమంత్రమును యధాశక్త్యనుసారము జపముచేయు చున్నయెడల దీర్ఘరోగములు అపమృత్యు భయములు గ్రహబాధలు శత్రుబాధలు మున్నగునవి తొలగి సౌఖ్యము మున్నగునవి గలుగును.



## శ్రీ మహాదుర్గాదేవి పంచపూజలు

ఓం లం పృథ్వీతత్వాత్మికాయై గంధతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ మహాదుర్గాదేవ్యై గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ మహాదుర్గాదేవ్యై పుష్పంసమర్పయామి నమః

ఓం యం వాయుతత్వాత్మికాయై స్పర్శతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీమహాదుర్గా దేవ్యై ధూప మాఘ్రాపయామినమః

ఓం రం వహ్నితత్వాత్మి కాయై తేజసతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ మహాదుర్గాదేవ్యై దీపం దర్శయామి నమః

ఓం వం అమృత తత్వాత్మికాయై మహాదుర్గా దేవ్యై అమృతోపహారనైవేద్యంసమర్పయామి నమః

ఓం సం సర్వతత్వాత్మికాయై సర్వతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ మహాదుర్గా దేవ్యై తాంబూలాది సర్వోపచార పూజాం సమర్పయామినమః ।

## శ్రీ మహాదుర్గా మహామంత్ర జపవిధానము

ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశకాలౌ సంకీర్త్య, శ్రీమాన్ అముక గోత్రః అముక నామధేయోఽహం, మమోపాత్త ఆత్మనః సకుటుంబస్య శ్రీ జగన్మాతా మహాదుర్గా పరమేశ్వరీపరాదేవీ దేవతా ప్రసన్నతా ప్రాప్త్యర్థం పరమేశ్వరీ ప్రసాదేన సర్వాపన్నివృత్తి, పూర్వక దీర్ఘాయుర్విపుల ధన కళత్ర పుత్ర పౌత్రా ద్యనవచ్ఛిన్న సంతతి వృద్ధి స్థిరలక్ష్మీ కీర్తి లాభ శత్రుపరాజయాది సదభీష్ట ఫల సిద్ధ్యర్థం శ్రీ మహాప్రకృతిమయీ శ్రీ మహాదుర్గా మహామంత్ర జపం కరిష్యే ।

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ మహాప్రకృతిమయీ శ్రీ మహాదుర్గామహామంత్రస్య

ఓం బ్రహ్మణే ఋషయే నమశ్శిరసి ।

ఓం గాయత్రీ ఛందసే నమో ముఖే ।

శ్రీ మహాప్రకృతిమయీ శ్రీమహాదుర్గా దేవతాయై నమోహృది

ఓం దుం బీజాయ నమోనాభౌ ।

ఓం స్వాహా శక్తయేనమః గుహ్యే ।

ఓం రక్ష రక్ష కీలకాయనమః పాదయోః ।

శ్రీ మహా ప్రకృతిమయీ శ్రీ దుర్గాపరమేశ్వరీ దేవతా ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే.

### కరన్యాసము

ఓం దుం హ్రాం హ్రాం అంగుష్ఠాభ్యాం నమః

ఓం దుం హ్రీం శ్రీం తర్జనీభ్యాం నమః

ఓం దుం హ్రూం హ్రూం మధ్యమాభ్యాం నమః

ఓం దుం హ్రైం హ్రైం అనామికాభ్యాం నమః

ఓం దుం హ్రౌం హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః

ఓం దుం హ్రః హ్రః కరతల కరపృష్ఠాభ్యాం నమః ।

### హృదయన్యాసము

ఓం దుం హ్రాం హ్రాం మహాదుర్గే మాం రక్ష రక్ష హృదయాయనమః

ఓం దుం హ్రీం శ్రీం మహాదుర్గే మాం రక్షరక్ష శిరసేస్వాహా

ఓం దుం హ్రూం హ్రూం మహాదుర్గే మాం రక్ష రక్ష శిఖాయై వషట్

దుం హ్రైం హ్రైం మహాదుర్గే మాం రక్ష రక్ష కవచాయహుం

ఓం దుం హ్రౌం హ్రౌం మహాదుర్గే మాం రక్ష రక్ష నేత్రత్రయాయవౌషట్

ఓం దుం హ్రః హ్రః మహాదుర్గే మాం రక్షరక్ష అస్త్రాయఫట్

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః ।

### ధ్యానము

శ్లో ॥ సింహస్థా శశిశేఖరా మరకత ప్రఖ్యైశ్చతుర్భిర్భుజైః
శంఖంచక్రధను శ్శరాంశ్చదధతీ నేత్రై స్త్రిభిశ్శోభితా
ఆముక్తాంగదహారకంకణరణత్కాంచీ క్వణన్నూపురా
దుర్గా దుర్గమహారిణీ భవతునోరత్నోల్లసత్కుండలా
సేవంద్యాత్వా, ఉమిత్యాది మానసైరుపచారై స్సంపూజయేత్

### మూలమంత్రము

ఓం ఆం హ్రీం క్రోం శ్రీం హ్రీం క్లీం సౌ దుం ఓం నమో మహాదుర్గే సర్వతో మాం రక్షరక్ష స్వాహా

### మంత్రసిద్ధి క్రమము

శ్లో ॥ సమలక్షం జపేన్మంత్రం తిలైర్మధురలోడితైః ।
జుహుయాద్ధ్యాపయేత్ విప్రాన్ విజితేంద్రియః ।

తా : శ్రీ మహాదుర్గాదేవి యంత్రమును ప్రతినిత్యము త్రికాలములయందును ఆవరణార్చనాదులతో యధాశాస్త్రముగ పూజించుచు ఏడుమిలక్షల పర్యాయములు మూలమంత్రమును జపము చేసి పిమ్మట నువ్వులతో మధురత్రయమును కలిపి జపదశాంశము హోమము చేయవలయును. అనంతరమున విజితేంద్రియుడై వెయ్యి పర్యాయములు క్షీరాన్నముతో హోమము చేయవలయును. పిమ్మట హోమ దశాంశమును గోక్షీరములతో తర్పణమును, పురశ్చరణ విధానము ననుసరించి తరువాత మార్జన భూతశుద్ధులను చేయవలయును. ఇట్లొనర్చిన యెడల శ్రీ జగన్మాతయైన మహాదుర్గాదేవి యొక్క మంత్రము సిద్ధించును.

### మంత్ర ప్రయోజన క్రమము

శ్లో ॥ ఇత్థం జపాదిభిర్మంత్రే మంత్రసిద్ధేర్విధానవిత్ ।
కుర్యాత్ప్రయోగా నేతేన మనునా స్వేప్సితాన్ ।
ప్రతిష్ఠాప్య విధానేన కలశాన్నవశోభనాన్ ।
రత్నహేమాది సంయుక్తాన్ వరేషువ నవ స్థితాన్ ।
మధ్యే సంపూజయేద్దేవీం ఇతరేషుజయాదికాః ।
సంపూజ్య గంధపుష్పాద్యైః అభిషించేన్న రాధిపం ।
రాజాసౌమ్యన్వితే శత్రూన్ సాధకో విజయం శ్రియం ।
ప్రాప్నోతి రోగీ దీర్ఘాయుః సర్వాన్కార్యా ప్నర్వశ్నుతే ।
సంధ్యా ఉ భిషిక్తా విధివాలభతే తనయం వరం ।
మంత్రేణానేన సంజప్త మాజ్యం స్తుత్వా గ్రహాపహం ।
గర్భిణీనాం విశేషేణ జప్తంత స్మారికంతథా । ఇత్యాది

తా : పై ప్రకారముగా జపాదులతో మంత్రసిద్ధిని పొందిన పిమ్మట ప్రయోగములను సాధించవలయును. శాస్త్రములో చెప్పబడిన విధానము ననుసరించి తొమ్మిది కలశములను తొమ్మిది పదములయందు స్థాపించవలయును. అందు మధ్య కలశమందు శ్రీ మహాదుర్గాదేవిని మిగిలిన యెనిమిది కలశము యందును క్రమముగా 1. జయా 2. విజయా 3. కీర్తి 4. ప్రీతి 5. సుప్రభా 6. శ్రద్ధా 7. మేధా 8. శ్రుతి అను ఎనిమిది దేవతలను యధావిధిగా సమంత్రకముగా ఆవాహనము చేసి, ప్రాణప్రతిష్ఠా - కళాన్యాసాదులను సల్పి,గంధ పుష్పాక్షతాదులతో యధాశాస్త్రీయముగా పూజచేసి ఆందలి యుదకముచే రాజునకు అభిషేకము చేసిన యెడల వారాజు శత్రువులను నశింపజేయువాడగును. సాధకుడు స్వయముగా అభిషేచనము చేసికొన్న యెడల విజయమును ఐశ్వర్యమును బడయు వాడగును. రోగగ్రస్తునకు అభిషేచనము చేసిన యెడల వారోగములన్నియు నశించి దీర్ఘాయుర్దాయము పొందు వాడగును.

# శ్రీ కనకదుర్గా దేవీయంత్రము

ఈ కనకదుర్గాదేవి యంత్రము ఐశ్వర్యమును ప్రసాదించుటలో సుప్రసిద్ధమైనది. ఈ కనక దుర్గా యంత్రమంత్రములను పాఠించువారు గొప్ప ఐశ్వర్యమును బడయుదురు. ఎట్టి దుర్దృష్టవంతుడైనను ఈ కనకదుర్గా యంత్రమంత్రములు ఐశ్వర్యవంతునిగ జేయుననుట ఎంత మాత్రము అతిశయోక్తి గాదు.

ఈ కనకదుర్గా యంత్రమును రాగిరేకుపై చెక్కించిగాని, ఈ యంత్రకాగితమునే పటముగా కట్టించిగాని యంత్రాధిష్ఠాత్రియైన శ్రీ కనకదుర్గాదేవికి "పత్రం పుష్పం ఫలం తోయం" అను న్యాయానుసారము పత్రము, పుష్పము, ఫలము, ఉదకము, కుంకుమ, అక్షతలు మున్నగువానిని భక్తిశ్రద్ధలతో సమర్పించుచు ధ్యానము చేయుచున్న యెడల సమస్త కోరికలు నెరవేరును. వ్యాపారాది వృత్తులయందు అభివృద్ధియు వివిధ రూపంబుల ధనాదాయమును, గౌరవాధిక్యత్వయు సంతోషమును గలుగును.

మఱియు కనకదుర్గాయంత్రమునకు ప్రతి నిత్యము పంచపూజలు చేయుచు మూలమంత్రమును 108 పర్యాయములు జపము చేసిన యెడల ఋణగ్రస్తులకు ఋణవిముక్తి, వ్యాపారులలో అధిక ధనలాభము, ఐశ్వర్యప్రాప్తి, శత్రువిజయము సౌభాగ్యములు గలుగును.

ఇంతియగాక ఈ కనకదుర్గా యంత్రమునకు అతిరహస్యగ్రంథములలో చెప్పబడిన ప్రకారము ప్రాణ ప్రతిష్ఠ, ప్రాణన్యాస, జీవన్యాస, కళాన్యాసాదులు, ఆవరణ సపర్య మున్నగు సపర్యలను యథాశాస్త్రీయముగ జేసి షోడశోపచార సపర్యనాగావించి "ఐం హ్రీం క్రోం శ్రీం హ్రీం క్లీం దుం శ్రీం కనకదుర్గే సకలైశ్వర్యం దాపయ దాపయ హ్రీం హుంఫట్ స్వాహా" అను మూలమంత్రము నుపాసించిన యెడల ధనవృద్ధియు ధాన్య కనక వస్తు గృహ భూవాహనాది ప్రాప్తియుగలుగును. మరియు దారిద్ర్యనిర్మూలనము, ఋణవిమోచనముగల్గించుచు దురదృష్టవంతుని నైనను ఐశ్వర్యవంతునిగ జేయును.



## శ్రీ కనక దుర్గాదేవి పంచపూజలు

ఓం లం పృథివీతత్వాత్మికాయై గంధతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీకనకదుర్గా పరమేశ్వర్యై గంధం సమర్పయామినమః

ఓం హం ఆకాశతత్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ కనక దుర్గాపరమేశ్వర్యై పుష్పం సమర్పయామినమః

ఓం యం వాయుతత్వాత్మికాయై స్పర్శ తన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ కనక దుర్గాపరమేశ్వర్యై ధూపమాఘ్రాపయామినమః

ఓం రం వహ్ని తత్వాత్మికాయై తేజసతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ కనకదుర్గా పరమేశ్వర్యై దీపందర్శయామి నమః

ఓం వం అమృత తత్వాత్మి కాయై అమృత తన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ కనకదుర్గా పరమేశ్వర్యై అమృతోపహారనైవేద్యం సమర్పయామి నమః

ఓం సం సర్వతత్వాత్మి కాయై సర్వతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ కనకదుర్గా పరమేశ్వర్యై తాంబూలాది సర్వోపచార పూజాం సమర్పయామినమః

## శ్రీ కనకదుర్గా మంత్ర విధానము

ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశకాలౌ సంకీర్త్య శ్రీమాన్ అముక గోత్రః అముక శర్మ నామ్నాధేయోహం మమాఽఽత్మనః సకుటుంబస్య శ్రీ కనకదుర్గా పరమేశ్వరీ ప్రసన్నతాప్రాప్తి పూర్వక శ్రీ కనకదుర్గాపరమేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థం శ్రీ కనకదుర్గాపరమేశ్వరీ ప్రసాదేన సర్వాపన్నివృత్తి పూర్వక దీర్ఘాయుర్విపుల ధనపుత్ర పౌత్రాద్యనవచ్ఛిన్న సంతతి వృద్ధి స్థిరలక్ష్మీ కీర్తిలాభశత్రు పరాజయాది సదభీష్టఫల సిద్ధ్యర్థం శ్రీ కనకదుర్గా మహామంత్ర ముపాసిష్యే ।

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ కనకదుర్గా పరమేశ్వరీ మహామంత్రస్య ।
బ్రహ్మణే ఋషయేనమః శిరసి ।
పంక్తిశ్ఛందసే నమోముఖే ।
ఓం దుం శ్రీం బీజాభ్యాం నమోనాభౌ ।
ఓం హ్రీం శక్తయే నమో గుహ్యే ।
ఓం క్లీం కీలకాయనమః పాదయోః

శ్రీ కనకదుర్గా పరమేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే ।

### కరన్యాసము

ఓం దుం శ్రాం హ్రాం క్లాం అంగుష్ఠాభ్యాంనమః ।
ఓం దుం శ్రీం హ్రీం క్లీం తర్జనీభ్యాం నమః ।
ఓం దుం శ్రూం హ్రూం క్లూం మధ్యమాభ్యాంనమః ।
ఓం దుం శ్రైం హ్రైం క్లైం అనామికాభ్యాంనమః ।
ఓం దుం శ్రౌం హ్రౌం క్లౌం కనిష్ఠి కాభ్యాంనమః ।
ఓం దుం శ్రః హ్రః క్లః కరతల కరపృష్ఠాభ్యాంనమః ।

### హృదయన్యాసము

ఓం దుం శ్రాం హ్రాం క్లాం హృదయాయనమః ।
ఓం దుం శ్రీం హ్రీం క్లీం శిరసేస్వాహా ।
ఓం దుం శ్రూం హ్రూం క్లూం శిఖాయై వషట్ ।
ఓం దుం శ్రైం హ్రైం క్లైం కవచాయహుం ।
ఓం దుం శ్రౌం హ్రౌం క్లౌం నేత్రత్రయాయ వౌషట్ ।
ఓం దుం శ్రః హ్రః క్లీం అస్త్రాయఫట్ ।

### దిగ్బంధనము

ఓం దుం శ్రీం హ్రీం క్లీం ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః ।

### ధ్యానము

శ్లో ॥ కళ్యాణీం కమలాసనస్థ కలశాం గౌరీంసువర్ణామలాం
మాలాదామ విభూషితాము వరదాభయాగ్రే కరత్ర్యక్షితే ।
శ్రీం హ్రీం క్లీం పరమంత్ర రాజసహితా మానంద పూర్ణాత్మికాం
తాం దుర్గాం కనకాత్మికాం శివయుతాం చిన్మాత్ర మూర్తింభజే
ఏవం ధ్యాత్వా, లమిత్యాది మానసోపచారై స్సంపూజయేత్

### మూల మంత్రము

ఐం హ్రీం క్రోం శ్రీం హ్రీం క్లీం దుం శ్రీం కనకదుర్గే సకలైశ్వర్యం దాపయ దాపయ హ్రీం హుంఫట్ స్వాహా

### తంత్రాన్తరే మూలామనుః

ఐం హ్రీం క్రోం శ్రీం హ్రీం క్లీం దుం శ్రీం కనకదుర్గే సకలలోక కళ్యాణ కారకే దివ కనక వస్తువాహనాద్యఖిలైశ్వర్యం దాపయ దాపయ దుం శ్రీం దుం హ్రీం దుం క్లీం దుం కనక వజ్రవైడూర్య ముక్తా లంకృత శరీరిణి అసాధ్య కార్య సాధిని మమ సకల మనోరథాన్ పూరయ పూరయ వాంఛా సిద్ధిం కురుకురు స్వాహా ।

### మంత్ర సిద్ధి క్రమము

శ్లో ॥ ఏవం సంపూజయేద్దుర్గాం యోమర్త్య స్సాధకోత్తమః ।
లక్షం జపేద్బిల్వదళై ర్హవనాయాన్న దర్శితః ।
దశాంశం సంస్కృతే వహ్నౌ ప్రోక్తైరేవవర్జనా ।
ఏవం సిద్ధమనుర్మంత్రీ సాధయేదిష్టమాత్మనః ।

తా ॥ శ్రీ కనకదుర్గా దేవియంత్రమును యథాశాస్త్రీయముగ పూజించిన మానవుడు ధనవంతుడగును. మరియు పై కనక దుర్గాదేవి మంత్రమును లక్షపర్యాయములు జపముచేసి, తద్దశాంశము మారేడు పత్రములతోగాని, మధుర పదార్థములతోగాని హోమమును తద్దశాంశము తర్పణమును, తద్దశాంశము మార్జనమును, తద్దశాంశము విప్రభోజనమును యథావిధిగా జేసినయెడల మంత్రసిద్ధి యగును. మంత్రసిద్ధిని బొందిన పిమ్మట కామ్యకర్మలను సాధించవలయును.

### మంత్ర ప్రయోజన క్రమము

శ్లో ॥ వంద హుత్వా సరోజైర్లక్షం ప్రజాహంయాత్మనః ।
లభతేవైరిణాం రాజ్యంత త్రైమాసమనంతరా ।

తా ॥ శ్రీ కనకదుర్గా యంత్రమును ప్రతినిత్యము పూజచేయుచు, లక్షపర్యాయములు చందనముతో కూడిన తామర పువ్వులతో హోమముచేసిన యెడల యుద్ధము చేయ నవసరము లేకుండగనే శత్రుధనమును, శత్రురాజ్యమును బొందుదురు.

మంత్రసిద్ధ్యనంతరము ఋణగ్రస్తులైనవారు పదివేల పర్యాయములు పాయసముతో హోమముచేసిన ఋణవిముక్తు లగుదురు.

మంత్రసిద్ధ్యనంతరము పదివేల పర్యాయములు తామర పువ్వులతో హోమముచేసిన శీఘ్రముగా ఐశ్వర్యప్రాప్తి గలుగును.

గుగ్గిలముతో పదివేల పర్యాయములు హోమము చేసిన యెడల సర్వకార్యములు సిద్ధించును.

శ్రీ కనకదుర్గా యంత్రమునకు సంహితాజ్య హోమములు లక్షపర్యాయములుచేసి ఆ యంత్రమును ధరించిన మిక్కిలి ఐశ్వర్య వంతులగుదురు.

ఈ కనకదుర్గా యంత్రమును ప్రతినిత్యమూ శ్రద్ధ భక్తులతో పూజించువారు సమస్తైశ్వర్యములను బొందుదురు. పురుషులు చేయుటకు అవకాశములేకున్న స్త్రీలు ప్రతినిత్యము శ్రద్ధా భక్తులతో ఈకనకదుర్గా యంత్రమును పూజించు వెడల సర్వ విధముల నారోగ్యములకు ధనవృద్ధి గృహారామాది ప్రాప్తి-సౌఖ్యము, మనశ్శాంతి మున్నగునవి సంప్రాప్తించును.

# శ్రీ విజయదుర్గా యంత్రము

ఈ శ్రీ విజయదుర్గాదేవి యొక్క యంత్రము ఎల్లప్పుడు విజయమును సమకూర్చుటలో అత్యుత్తమమైనది. ఈ విజయదుర్గా యంత్ర మంత్రములను ఉపాసించువారు ఎట్టి కఠినతరమగు శత్రుత్వము నుండి ఐనను తప్పించుకొనగలుగుదు సర్వదా విజయమును పొందుదురు.

ఈ విజయదుర్గా యంత్రమును రాగిరేకుపై చెక్కించిగాని, ఈయంత్రకాగితమునే పటముగా కట్టించిగాని, ప్రతినిత్యము ప్రాతఃకాలమందు "పత్రం పుష్పం ఫలం తోయం" అను న్యాయానుసారము పత్రము, పుష్పము, ఫలము, ఉదకము, కుంకుమ, అక్షతలు మున్నగువానిని భక్తిశ్రద్ధలతో సమర్పించి నమస్కారముచేసి ధ్యానము చేసిన యెడల శత్రువులు భయకంపితులగుట, శత్రువిజయము, వ్యవహార విజయము మున్నగునవి గలుగును.

ఈ విజయదుర్గా యంత్రమునకు ప్రతినిత్యము పంచపూజలు చేయుచు, విజయదుర్గా మంత్రమును జపము చేయుచున్న యెడల వివాదములలో జయము, రాజకీయ వ్యవహారములయందును, సాంఘిక కార్యముల యందును జయము, ఉత్సాహము, యశస్సు కలుగును.

ఇంతియేగాక ఈ విజయదుర్గా యంత్రమునకు అధర్వణ రహస్యాగమములో చెప్పబడిన ప్రకారము ప్రాణప్రతిష్ఠ-జీవన్యాస-ప్రాణన్యాసాదులు, కలాన్యాసము, ఆవరణసపర్య మున్నగువానిని యథాశాస్త్రీయముగ జేసి 'ఆం హ్రీం క్రోం హ్రీం శ్రీం సౌః దుం విజయదుర్గే సర్వత్ర యశోవిజయం దేహి దేహి స్వాహా' అను మూలమంత్రమును ఉపాసించిన యెడల శత్రుకార్యములు విధ్వంసమై తన కార్యములు సిద్ధించును. మరియు వివాదములయందును, రాజనీతులయందును, సివిల్ క్రిమినల్ మున్నగు కోర్టు వ్యవహారములయందును వ్యాపారసంబంధములగు వివాదములయందును, యుద్ధమునందును ఎల్లప్పుడు జయము కలుగును. యశస్సు పరాక్రమము, ధైర్యం, మున్నగునవి సంప్రాప్తించును.



## శ్రీ విజయ దుర్గా పంచపూజలు

ఓం లం పృథివీతత్వాత్మికాయై గంధ తన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీవిజయదుర్గా పరమేశ్వర్యై గంధం సమర్పయామినమః

ఓం హం ఆకాశతత్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ విజయ పరమేశ్వర్యై పుష్పం సమర్పయామినమః

ఓం యం వాయుతత్వాత్మికాయై స్పర్శతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ విజయ దుర్గాపరమేశ్వర్యై ధూప మాఘ్రాపయామి నమః

ఓం రం వహ్ని తత్వాత్మికాయై తైజసతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ విజయదుర్గా పరమేశ్వర్యై దీపందర్శయామినమః

ఓం వం అమృత తత్వాత్మికాయై అమృతతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ విజయదుర్గా పరమేశ్వర్యై అమృతోపహార నైవేద్యం సమర్పయామి నమః

ఓం సం సర్వతత్వాత్మికాయై సర్వతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ విజయదుర్గా పరమేశ్వర్యై తాంబూలాది సర్వోపచార పూజాం సమర్పయామి నమః

### శ్రీ విజయదుర్గా మంత్ర విధానము

ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశకాలౌ సంకీర్త్య, శ్రీమానాముక గోత్రః అముక శర్మ వర్మాదిరహం మమఉ...త్మనః సకుటుంబస్య శ్రీ విజయదుర్గా పరమేశ్వరీ ప్రసన్నతా పూర్వకం శ్రీ విజయదుర్గా పరమేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థం శ్రీ విజయదుర్గా పరమేశ్వరీ ప్రసాదేన మమలోకే విజయం రాజద్వారే వ్యవహారే వివాదే చ సర్వత్ర సర్వదా యశో విజయ ప్రాప్త్యర్థం శ్రీ విజయదుర్గా మహా మంత్ర మువాసిష్యే।

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ విజయదుర్గా పరమేశ్వరీ మహామంత్రస్య।
పరబ్రహ్మణే ఋషయేనమశ్శిరసి।
జగతీ ఛందసే నమోముఖే।
శ్రీ విజయదుర్గాపరమేశ్వరీ దేవతాయై నమోహృదయే
ఓం దుం బీజాయనమోగుహ్యే।
ఓం హ్రీం శక్తయేనమోపాదయోః।

ఓం సాః కీలకాయనమః పాదయోః।

శ్రీ విజయదుర్గా పరమేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే।

### కరన్యాసము

ఓం దుం హ్రాం హ్రాం సాం అంగుష్ఠాభ్యాం నమః।
ఓం దుం హ్రీం శ్రీం సీం తర్జనీభ్యాం నమః।
ఓం దుం హ్రూం శ్రూం సూం మధ్యమాభ్యాంనమః।
ఓం దుం హ్రైం శ్రైం సైం అనామికాభ్యాం నమః।
ఓం దుం హ్రౌం శ్రౌం సౌం కనిష్ఠికాభ్యాంనమః।
ఓం దుం హ్రః శ్రః సః కరతల కరపృష్ఠాభ్యాం నమః।

### హృదయ న్యాసము

ఓం దుం హ్రాం శ్రాం సాం హృదయాయనమః।
ఓం దుం హ్రీం శ్రీం సీం శిరసేస్వాహా।
ఓం దుం హ్రూం శ్రూం సూం శిఖాయై వషట్।
ఓం దుం హ్రైం శ్రైం సైం కవచాయహుం।
ఓం దుం హ్రౌం శ్రౌం సౌం నేత్రత్రయాయ వౌషట్।
ఓం దుం హ్రః శ్రః సః అస్త్రాయఫట్।

### దిగ్బంధనము

ఓం దుం హ్రీం శ్రీం సాః ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః।

### ధ్యానము

శ్లో॥ కీలాలాభాంకటాక్షైరరికులభయదాం మౌళిబద్ధేందు ఖండాం శంఖం చక్రం కృపాణం త్రిశిఖమపికరైరుద్వహంతీం త్రినేత్రాం సింహస్కంధాధిరూఢాం త్రిభువనమఖిలం తేజసాపూరయంతీం- ధ్యాయేద్దుర్గాంజయాఖ్యాం త్రిదశపరివృతాం సేవితాం సిద్ధికామైః॥ ఏవంధ్యాత్వా, లమిత్యాది మానసోపచారైః సంపూజయేత్

### మూలమంత్రము

ఐం హ్రీం క్లీం హ్రీం శ్రీం సాః దుం విజయదుర్గే సర్వత్ర యశో విజయం దేహి దేహి స్వాహా॥

విజయదుర్గా మాలామంత్రము : ఐం హ్రీం క్లీం శ్రీం హ్రీం సాః దుం విజయదుర్గే ప్రపంచాత్మికే భూపలోకాంతరాళ వ్యాప్తే శరీరిణి, మమ శత్రు కార్య విధ్వంసిని, మమకార్య సిద్ధిదే, సకలరిపు మర్దిని మమ లోకే సభాయాం రాజద్వారే వ్యవహారే వాదే వివాదేచ సర్వదా యశోవిజయం దాపయ దాపయ హ్రీం హుంఫట్ స్వాహా।

### మంత్రసిద్ధి క్రమము

శ్లో॥ లక్షం జపేన్మంత్రం సృతేనజుహుయాత్తతః।
దశాంశం సంస్కృతేనహ్నా బ్రాహ్మణానపి భోజయేత్।
ఏవం సిద్ధమన్మంత్రీతతః కామ్యానిసాధయేత్।

తా : విజయదుర్గా యంత్రమును ప్రతినిత్యమూ యథాశాస్త్రీయముగ పూజించుచు పురశ్చరణ విధుల ననుసరించి ఐదులక్షల పర్యాయములు మూలమంత్రజపమును, జపదశాంశము ఆజ్యముతో హోమమును, హోమదశాంశము తర్పణమును, తర్పణ దశాంశము మార్జనమును, మార్జనదశాంశము విప్రభోజనమును యథావిధిగ జేసిన ఎడల మంత్రసిద్ధియగును, మంత్రసిద్ధియైన పిమ్మట కామ్యకర్మలను సాధించవలయును.

### మంత్ర ప్రయోజన క్రమము

శ్లో॥ మంత్రంజపేత్వా శత్రుమ్యం శత్రుసహ్యారిశేషతః
ఆహతేరపి శీఘ్రం నైతత్రాపి విజయీభవేత్।

తా : శ్రీ విజయదుర్గా యంత్రమునకు యథాశాస్త్రీయముగ పూజచేసి, విజయదుర్గామంత్రమును జపముజేసి, యుద్ధ రంగములో ప్రవేశించిన యెడల సమస్త శత్రువులను సంహరించి విజయమును పొందువాడగును.

శ్లో॥ అస్త్రయే దస్త్రశస్త్రాణి జయార్థీవిద్యయా ఉ పయా।

తా : ఈ విజయదుర్గా మంత్రముచే అస్త్రములనుగాని, శస్త్రములనుగాని కలోక్తప్రకారము అభిమంత్రించి ప్రయోగించిన యెడల శత్రువులు నశింతురు. విజయము సమకూరును.

ఈ విజయదుర్గా యంత్రమును ఒక రేకుపైవ్రాసి, దానికి యంత్ర సంస్కార కర్మలో చెప్పబడిన ప్రకారము దశ సంస్కారములనుచేసి, యంత్ర చైతన్య ప్రాప్తికిని, జీవకళ సిద్ధార్థమును మూలమంత్రమును 40000 పర్యాయములు జపమును ప్రాణ ప్రతిష్ఠాదులును, వ్యాహృతులచేసి అంత్యమున 1000 పర్యాయములు సంపాతాజ్యహోమము చేసి, ఆ యంత్రమును వశు వాద్యము చేసి ధరించిన యెడల శత్రునాశనము, శత్రువులకు పరాభవమును ధైర్య విజయోత్సాహములు మున్నగునవి గలుగును. ఈ విజయదుర్గా ప్రయోగములు శారదా తిలకము, తంత్రసారము, అధర్వణ రహస్యము మున్నగు గ్రంథములందు విస్తారముగా చెప్పబడి యున్నవి గాన వచ్చుట చూడవలెను.

# శ్రీ గిరిదుర్గా యంత్రము

ఈ గిరిదుర్గా యంత్రమును పూజచేయుచు గిరిదుర్గా మంత్రము నుపాసించిన యెడల శత్రుక్షయమగును. ఈ గిరిదుర్గా మంత్రయంత్రములు ప్రబలమైన శత్రువులను నశింపజేయుటలో సర్వాగ్రగణ్యమైనవి.

ఈ గిరిదుర్గా యంత్రమును రాగిరేకుపై వేయించిగాని, ఈ యంత్ర కాగితమునే పటముగా కట్టించిగాని, యంత్రాధిష్ఠాత్రియై యున్న గిరిదుర్గాదేవికి ప్రతినిత్యము ప్రాతఃకాలమందు "పత్రం పుష్పం ఫలం తోయం" అను న్యాయానుసారము పత్రము, పుష్పం, ఫలం, ఉదకము, కుంకుమ, అక్షతలు మున్నగువానిని సమర్పించి, భక్తి శ్రద్ధలతో నమస్కరించి ధ్యానము చేయుచున్న యెడల శత్రునాశన మగును. తనను చూచినంతలోనే శత్రువులు భయకంపితులగుచుందురు.

మరియు ఈ గిరిదుర్గా యంత్రమునకు ప్రతినిత్యము పంచపూజలు చేయుచు, మూలమంత్రమును జపము చేయుచున్న యెడల బలవద్వైరోధములు శత్రుక్షయము గలుగును.

మరియు నీ యంత్రమునకు ప్రాణప్రతిష్ఠ జీవన్యాస కళాన్యాసాదికములు, కల్పములో చెప్పబడిన ప్రకారము ఆవరణ సపర్యమున్నగు సపర్యలను యథాశాస్త్రీయముగ జేయుచు "ఆం హ్రీం క్రోం ఓం దుం హ్రీం గిరిదుర్గే స్ఫుర స్ఫుర ప్రస్ఫుర కోటిసూర్య ప్రభా భామినీ మమశత్రూన్ భస్మీకురు భస్మీకురుహుం ఫట్ స్వాహా" అను మంత్రమును జపము చేయుచున్న యెడల శత్రువుల వలన గలుగు సమస్తకష్టనష్టములు తొలగిపోవుటయేగాక సాధకుని చూచినంతలో శత్రువులు భయకంపితులగుదురు. శత్రునాశనమగు చుండును. ఈ గిరిదుర్గా మంత్ర యంత్రముల నుపాసించువారికి శత్రువు వలన గలుగు విపరీతమైన మహోపద్రవములు గలుగనేరవు. ఈ గిరిదుర్గా మంత్రము నుపాసించిన వారిని ద్వేషించిన జనులుగూడ నశింతురు.



## శ్రీ రాజశ్యామలా పంచ పూజలు

ఓం లం పృథివీతత్వాత్మికాయై గంధతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ రాజశ్యామలాంబాయై గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ రాజశ్యామలాంబాయై పుష్పం సమర్పయామి నమః

ఓం యం వాయుతత్వాత్మికాయై స్పర్శతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ రాజశ్యామలాంబాయై ధూప మాఘ్రాపయామినమః

ఓం రం వహ్ని తత్వాత్మికాయై తైజసతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ రాజశ్యామలాంబాయై దీపం దర్శయామినమః

ఓం వం అమృతతత్వాత్మికాయై అమృత తన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ రాజశ్యామలాంబాయై అమృతో పహార నైవేద్యం సమర్పయామి నమః

ఓం సం సర్వతత్వాత్మికాయై సర్వతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ రాజశ్యామలాంబాయై తాంబూలాది సర్వోపచార పూజాం సమర్పయామి నమః ।

### రాజశ్యామలా మంత్ర విధానము

ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశకాలౌ సంకీర్త్య, శ్రీమాన్నాముక గోత్రఃఅముక నామధేయో ధర్మపత్నీ సమేతోఽహం మమసాత్మనః సకుటుంబస్య శ్రీ రాజశ్యామలాంబా ప్రసన్నతా ప్రాప్తి పూర్వక శ్రీ రాజశ్యామలాంబా ప్రసాద సిద్ధ్యర్థం, మమ శ్రీ రాజశ్యామలాంబా ప్రసాదేన సర్వాపన్నివృత్తిపూర్వక దీర్ఘాయుర్విపుల ధన పుత్రపౌత్రాద్యనవచ్ఛిన్న సంతతివృద్ధి స్థిరలక్ష్మీకీర్తిలాభ శత్రుపరాజయాది సదభీష్ట ఫల సిద్ధ్యర్థం శ్రీ రాజశ్యామలా మంత్ర జపం కరిష్యే॥

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ రాజశ్యామలాంబా మహామంత్రస్య ।
దక్షిణామూర్తిఋషయేనమశ్శిరసి,
గాయత్రీ ఛందసే నమోముఖే
శ్రీ రాజశ్యామలాంబాదేవతాయై నమోహృది ।
ఐం బీజాయ నమో నాభౌ ।
సౌః శక్తయే నమోగుహ్యే ।
క్లీం కీలకాయనమః పాదయోః ।
మమ అభీష్టసిద్ధయే వినియోగాయ నమః ఇతి కరసంపుటే

### కరన్యాసము

ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఐం సర్వజన మనోహరి అంగుష్ఠాభ్యాం నమః । ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఐం సర్వముఖరంజనీ తర్జనీభ్యాం నమః । ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఐం క్లీం హ్రీం శ్రీం సర్వరాజవశంకరి మధ్య మాభ్యాంనమః ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఐం సర్వ స్త్రీ పురుషవశంకరీ అనామికాభ్యాం నమః । ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఐం సర్వదుష్ట మృగవశంకరీ కనిష్ఠికాభ్యాంకనమః ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఐం సర్వసత్వవశంకరీ సర్వలోక వశంకరీ అముకంమే వశమానయ స్వాహా కరతల కరపృష్ఠాభ్యాంనమః ।

### హృదయన్యాసము

ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఐం సర్వజనమనోహరి హృదయాయనమః। ఐం హ్రీం శ్రీ ఐం క్లీం సౌః ఐం సర్వముఖరంజని శిరసే స్వాహా । ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఐం క్లీం హ్రీం శ్రీం సర్వరాజవశంకరి శిఖాయై వషట్। ఐం హ్రీం శ్రీ ఐం క్లీం సౌః ఐం సర్వస్త్రీపురుష వశంకరి కవచాయహుం । ఐం హ్రీం శ్రీం ఐంక్లీం సౌః ఐం సర్వ దుష్ట మృగవశంకరీ నేత్రత్రయాయవౌషట్। ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఐం సర్వసత్వవశంకరీ సర్వలోక వశంకరి అముకంమే వశమానయ స్వాహా అస్త్రాయఫట్ ।

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి లోకత్రయేణ దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ మాతంగీం భూషితాంగీ మధుమదముదితాం
నీపమాలాఢ్య వేణీం
సద్వీణాం శోణచేలాం మృగమదతిలకా
మిందురేఖావతంసాం ।
కర్ణోద్యచ్ఛంఖపత్రాం స్మిత మధురదృశా
సాదరస్నేహనేత్రాం
ధ్యాయే ద్దేవీం శుకాభ్యాం శుకమఖిలకలా
రూపమస్యాశ్చ హస్తే ।
అమిత్యాది పంచపూజాం కుర్యాత్

### మూలమంత్రము

ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఐం సర్వజన మనోహరి సర్వముఖరంజని క్లీం హ్రీం శ్రీం సర్వరాజవశంకరి సర్వస్త్రీ పురుష వశంకరి సర్వదుష్ట మృగవశంకరి సర్వసత్వవశంకరి సర్వలోకవశంకరి అముకంమే వశమానయస్వాహా ।

### మంత్రసిద్ధిక్రమము

ఈ రాజశ్యామలా యంత్రమును ప్రతినిత్యము త్రికాలములయందును యధాశాస్త్రీయముగ పూజించుచు లక్ష పర్యాయములు మూలమంత్రజపము చేయవలయును. పిమ్మట పుష్ప మధుశర్కర, ఆవుడు త్రిమధువుల చేతను జప దశాంశము హోమమును తద్దశాంశము గోక్షీరముతో తర్పణమును, మార్జన బ్రాహ్మణ సంతర్పణాదికములను యధాశాస్త్రీయముగ చేసినచో మంత్రసిద్ధియగును. ఈ రాజశ్యామల మంత్రయంత్రములను సిద్ధిని పొందిన సాధకుడు గొప్పసంపద సామ్రాజ్యమును, ఐశ్వర్యమును రాజ్య ప్రాప్తిని పొందువాడగును.

### మంత్రప్రయోగవిధ క్రమము

మంత్రసిద్ధిని పొందినపిమ్మట సాధకుడు త్రిమధువుల తోడను, కర వీర పుష్పములతోను హోమము చేసిన యెడల బ్రాహ్మణ వశ్యమగును. బిల్వములతో హోమము చేసిన యెడల రాజవశ్యమగును. తెల్లకలువ పుష్పములతోగాని, మోదుగ పుష్పములతో గాని హోమము చేసిన యెడల రాజస్త్రీ వశ్యమగును.

ప్రతినిత్యము ప్రాతఃకాలమున 128 పర్యాయములు జపముతో నభిమంత్రించి, నాశ్యము సేవించిన యెడల సమస్త సౌభాగ్యములు, ఐశ్వర్యములు గలుగును.

అగురు చెక్క, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు వీనిని గంధముగాజేసి, యాతిలకమును మూలమంత్రముతో అభి మంత్రించి నొసటను ధరించిన యెడల సర్వజనవశ్యమగును.

సాధకుడు కంఠములోతు నీళ్ళలోయుండి ఆ యుదకమందుగల సూర్యప్రతిబింబమును తిలకించుచు దినము ఒక్కింటికి 1008 పర్యాయములు చొప్పున యేడు దినములు వరుసగ జపము చేసిన యెడల అభీష్టమైన రాజవశ్యమును, సర్వజనవశ్యమును పొందువాడగును.

ఓం హ్రీం శ్రీం యం వాయు తత్త్వాత్మికాయై స్పర్శతన్మాత్రప్రకృత్యా నందాత్మికాయై శ్రీ కామాక్షి పరదేవ్యై ధూపమాఘ్రాపయామి నమః।

ఓం హ్రీం శ్రీం రం వహ్ని తత్త్వాత్మికాయై తేజస్తన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ కామాక్షి పరదేవ్యై దీపం దర్శయామినమః

ఓం హ్రీం శ్రీం వం అమృత తత్త్వాత్మికాయై అమృత తన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ కామాక్షి పరదేవ్యై అమృతోపహార నైవేద్యం సమర్పయామినమః

ఓం హ్రీం శ్రీం సం సర్వతత్త్వాత్మకాయై సర్వతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ కామాక్షి పరదేవ్యై తాం బూలాది సర్వోపచార పూజాం సమర్పయామినమః

## శ్రీ కామాక్షి మంత్ర జప విధానము

ఆచమ్య ప్రాణానాయమ్య, దేశకాలౌ సంకీర్త్య, శ్రీమాన్ అముక గోత్రః అముక నామధేయో ధర్మపత్నీ సమేతోఽహం మమోపాత్త సకుటుంబస్య శ్రీ కామాక్షి పరదేవతా ప్రసన్నతా ప్రాప్త్యర్థం శ్రీ కామాక్షి దేవతా ప్రసాదేన సర్వాపచ్ఛాంతిపూర్వక దీర్ఘాయుర్విపుల ధనపుత్రపౌత్రా ద్యనవచ్ఛిన్న సంతతివృద్ధి స్థిరలక్ష్మీ కీర్తి లాభ శత్రుపరాజయాది సదభీష్ట ఫల సిద్ధ్యర్థం శ్రీ కామాక్షి మహా మంత్రజపం కరిష్యే।

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ కామాక్షి పరదేవీ మహామంత్రస్య।
ఆనందభైరవ ఋషయేనమః శిరసి,
జగతీఛందసే నమోముఖే
శ్రీ కామాక్షి పరదేవతాయై నమో హృది
శ్రీం బీజాయనమోనాభౌ
హ్రీం శక్తయే నమో గుహ్యే।
క్లీం కీలకాయనమః పాదయోః।
మమ మనోవాంఛాఫలసిద్ధ్యర్థే
జపే వినియోగాయ నమ స్సర్వాంగే।

### కరన్యాసము

క్లాం అంగుష్ఠాభ్యాం నమః। క్లీం తర్జనీభ్యాం నమః
క్లూం మధ్యమాభ్యాం నమః। క్లైం అనామికాభ్యాం నమః
క్లౌం కనిష్ఠికాభ్యాంనమః
క్లః కరతలకర పృష్ఠాభ్యాంనమః।

### హృదయన్యాసము

క్లాం హృదయాయనమః। క్లీం శిరసేస్వాహా
క్లూం శిఖాయై వషట్। క్లైం కవచాయహుం
క్లౌం నేత్రత్రయాయ వౌషట్। క్లః అస్త్రాయఫట్

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి లోకత్రయేణ దిగ్బంధః

### ధ్యానము

శ్లో। మాయాది వ్యవహారతాం త్రిజగతాం మాతాం ప్రమోద ద్వయా।
మానం దామృత వారిధౌ జగతాంవిద్యాంవిపద్భుజాహాం
మాయామాముపమాపితేందుమతిం సన్మద్యాం మహామాతృకాం
కామాక్షీం గజరాజ మందగమనాం వందే మహేశ ప్రియాం।
తతః ఇత్యాది పంచపూజాం సమాచరేత్।

### మూలమంత్రము

ఓం శ్రీం హ్రీం క్లీం ఐం క్లీం సౌః హ్రీం శ్రీం కామాక్షి కామదాయిని సకలజన వశంకరి సకలైశ్వర్యప్రదే శ్రీం హ్రీం సౌః క్లీం ఐం క్లీం హ్రీం శ్రీం హ్రీం హుంఫట్ స్వాహా।

### మంత్రసిద్ధి క్రమము

ఈ మంత్రమును ప్రతినిత్యము త్రికాలములందును పునశ్చరణ విధుల ననుసరించి లక్షపర్యాయములు జపముచేసి, యంత్రమునకు యథాశాస్త్రీయముగ పూజను చేయుచు, జప దశాంశము హోమమును తద్దశాంశము తర్పణమును, తద్దశాంశము మార్జనమును తద్దశాంశము భూతతృప్తిని చేసిన యెడల మంత్ర సిద్ధియగును. ఈ మంత్రసిద్ధినొందిన సాధకునకు సమస్త కోరికలు నెరవేరును. ఐశ్వర్యము వశీకరణ సామర్థ్యము గల్గును.

### మంత్రప్రయోజన క్రమము

మంత్రసిద్ధిని బొందిన పిమ్మట సాధకుడు ప్రయోగ విధానమును సాధింపవలయును. ఈ కామాక్షి మంత్ర యంత్రము లచే తనకొఱకుగాని, ఇతరులకొఱకుగాని, వశ్య సమ్మోహనాకర్షణాది శుభప్రయోగములను గాని, ఐశ్వర్యకర ప్రయోగములను గాని ఆరోగ్యకరములగు ప్రయోగములను గాని సాధింపవలయును. కాని మారణాది దుష్టప్రయోగములను సాధింపకూడదు.

శ్లో। త్రిమధ్వక్తైస్తిలైర్హోమో వరవశ్యకరో మతః।
మధురత్రితయాక్తైస్తు లాక్షైర్హో ఽవకర్షణం।

తా॥ తేనె, నెయ్యి, పంచదార తిలలు వీనిని కలిపి హోమము చేసిన యెడల సర్వజనవశ్యమగును. తేనె నెయ్యి, పంచదార లవణము వీనిని కలిపి హోమము చేసిన యెడల సర్వజనాకర్షణ మగును.

ఎఱ్ఱని తామరపుష్పములతో హోమము చేసిన యెడల ధనప్రాప్తి ఋణవిముక్తి గలుగును. దూర్వ (గరిక)లతో హోమము చేసిన యెడల అపమృత్యుభయము తొలగి దీర్ఘాయుః ప్రాప్తిగలుగును. బెల్లము నెయ్యికలిపి హోమము చేసిన యెడల దీర్ఘవ్యాధులు తొలగును. కరవీర పుష్పములతో హోమము చేసిన యెడల దారిద్ర్యము తొలగి ఐశ్వర్యము సంప్రాప్తించును.

కరవీర పుష్పములతోగాని, దానిమ్మ పుష్పములతోగాని మందారపుష్పము ఇతరములైన ఎఱ్ఱని పుష్పములతో హోమము చేసిన యెడల సౌభాగ్యము లక్ష్మీకటాక్షము గలుగును. సుగంధ ద్రవ్యములతో హోమము చేసిన యెడల అణిమాది అష్టసిద్ధులు సంప్రాప్తించును. పాయసముతో హోమము చేసిన సకలమగు శుభములు కలుగును.

# శ్రీ కామాక్షీ యంత్రము

ఈ కామాక్షీ యంత్రము ఐశ్వర్యమును వశీకరణ సామర్థ్యమును ప్రసాదించుటలో అగ్రగణ్యమైనది. మనోభీష్ట సిద్ధులను నెరవేర్చుటలో నీయంత్రముతో సమానముగు యంత్రము వేరొండు కానరాదు. ఈ యంత్రమును రాగిరేకుపై వేయించిగాని: యంత్రకాగితమునే పటముగా కట్టించిగాని ప్రతి నిత్యము ప్రాతస్సాయం సంధ్యా సమయములందు శ్రద్ధాభక్తులతో "పత్రం పుష్పం ఫలం తోయం" అనుశాస్త్రానుసారము నీయంత్రాధిష్ఠాత్రియై యున్న శ్రీ కామాక్షీ దేవికి పత్రము, పుష్పము, ఫలము ఉదకము కుంకుమ మున్నగునవిని సమర్పించి. నమస్కరించి, ధ్యానము చేయునెడల సమస్తకోరికలు నెరవేరును. ధన ప్రాప్తి కలుగును.

మరియు నీ యంత్రమునకు యథావిధిగా పంచపూజలు చేసి, కామాక్షీ మూలమంత్రమును యథాశక్తిని జపము చేయునెడల బుణవిముక్తి గౌరవము, వశీకరణ సామర్థ్యము, ధన కనక వస్తువాహనాది ప్రాప్తి కలుగును.

ఇంతియెగాక నీ కామాక్షీ యంత్రమునకు యథా శాస్త్రీయముగ ప్రాణప్రతిష్ఠ జీవన్యాస కళాన్యాసాదులు జేసి, ఆవరణ సపర్యలు గావించి "ఓం శ్రీం హ్రీం క్లీం క్లీం ఐం క్లీం సౌః హ్రీం శ్రీం కామాక్షీ కామదాయిని సకలజన వశంకరి సకల ఐశ్వర్య ప్రదే శ్రీం హ్రీం సౌః క్లీం ఐం హ్రీం శ్రీం ఓం హ్రీం హుంఫట్ స్వాహా" అను మూలమంత్రముతో .షోడశోపచార సపర్యలు జేసి మూల మంత్రమును యథాశక్తిగ జపము చేయుచున్న యెడల సమస్త ఐశ్వర్యములు, సుఖసౌఖ్యములు, భోగభాగ్యములు, యశస్సు, వశీకరణశక్తి, సర్వజన ప్రీతి గలుగును.

## శ్రీ కామాక్షీ పంచపూజలు

ఓం హ్రీం శ్రీం లం పృథివీ తత్త్వాత్మికాయై గంధ తన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ కామాక్షీ పరదేవ్యై గంధం సమర్పయామినమః

ఓం హ్రీం శ్రీం హం ఆకాశతత్త్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై శ్రీ కామాక్షీ పరదేవ్యైగంధం పరికల్ప యామి నమః।



# ౧ శ్రీ మహాకాళీ యంత్రము

ఈ మహాకాళీ యంత్రము యొక్క మహిమ వర్ణనాతీతము. ఈ యంత్రమును రాగిరేకుపై వేయించిగాని, యంత్రకాగితమునే పటముగా కట్టించిగాని, యంత్రాధిష్ఠాత్రియై యున్న శ్రీ మహాకాళికా దేవిని ప్రతినిత్యము, "పత్రం పుష్పం, ఫలం తోయం" అనురీతిని పత్రము, పుష్పము' ఫలము, ఉదకము కుంకుము మున్నగు వానిని యథాశక్తిగ సమర్పించి, నమస్కరించుచు ధ్యానము చేయుచున్న యెడల సకలార్థిష్టములు, గ్రహబాధలు తొలగి వివిధ సుఖములు సంప్రాప్తించును. ఈ యంత్ర ప్రభావముచే సమస్తగ్రహ దోషములు, కర్మదోషములు, దారిద్ర్యము మున్నగు బాధలు తొలగి ఐశ్వర్యములు సంప్రాప్తించును.

మరియు ఈ యంత్రమునకు యథాశాస్త్రముగ ప్రతినిత్యము పంచపూజలుజేసి, మూలమంత్రమును యథాశక్తిగ జపము చేయుచున్న యెడల సకలార్థిష్టములు, దీర్ఘవ్యాధులు, భూతప్రేత పిశాచాది గ్రహబాధలు, అనారోగ్యములు మున్నగునవి తొలగి సౌఖ్యారోగ్య జయలాభోత్సాహములు గలుగును.

ఇంతియగాక నీయంత్రమునకు యథాశాస్త్రముగ ప్రాణ ప్రతిష్ఠ - జప పూజాదులొనర్చి "ఓం క్రీం క్రీం క్రీం హ్రీం హ్రీం హ్రూం హ్రూం దక్షిణే కాళికే క్రీం క్రీం క్రీం హ్రీం హ్రీం హూం హూం స్వాహా" అను మూలమంత్రముతో షోడశోపచార సపర్యలనుజేసి, యథాశక్తిగా మూలమంత్రమును జపముచేసిన యెడల సర్వత్ర జయము, శత్రుహాని, శత్రువిజయము, సర్వకార్యసిద్ధి - ఐశ్వర్యసుఖభోగములు, అణిమాద్యష్ట సిద్ధులు సంప్రాప్తించును. చైతన్యశక్తిని ప్రసాదించుటలో నీయంత్ర మగ్రగణ్యమై యది పూర్వము బ్రహ్మ ఇంద్రుడు మున్నగువారలు ఈ యంత్రసపర్యలుచేసి, ఈ మహాకాళికా మంత్రమును ఉపాసించిగొప్పశక్తివంతులైరి. ఐశ్వర్యవిజయ ఆరోగ్యములను ప్రసాదించుటలో నీయంత్రము అనన్యమైన సామర్థ్యము గలది.



## ౧ శ్రీ మహా కాళీ పంచపూజలు

ఓం లం పృథివీతత్త్వాత్మికాయై గంధతన్మాత్రప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహాకాళికా పరమేశ్వర్యై గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్త్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహాకాళికాపరమేశ్వర్యై పుష్పం సమర్పయామి నమః

ఓం యం వాయుతత్త్వాత్మికాయై స్పర్శతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహాకాళికాపరమేశ్వర్యై ధూపమాఘ్రాపయామి నమః

ఓం రం వహ్ని తత్త్వాత్మికాయై తైజసతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహా కాళికాపరమేశ్వర్యై దీపందర్శయామి నమః

ఓం వం అమృతతత్త్వాత్మికాయై అమృతతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహాకాళికా పరమేశ్వర్యై నైవేద్యం సమర్పయామి నమః

ఓం సం సర్వతత్త్వాత్మికాయై సర్వతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహాకాళికాపరమేశ్వర్యైసర్వోపచారపూజాం సమర్పయామి నమః ।

## శ్రీ మహాకాళీ మంత్ర జపవిధానము

ఆచమ్య, ప్రాణాయామ్య, దేశకాలౌ సంకీర్త్య శ్రీమాన్ అముక గోత్రః అముక నామధేయోహం మమాత్మనః సకుటుంబస్య శ్రీ మహాకాళీ పరమేశ్వరీ ప్రసన్నతాప్రాప్తి పూర్వక శ్రీమహాకాళీపరమేశ్వరీ ప్రసాదసిద్ధ్యర్థం, మమ మనోవాంఛాఫల సిద్ధ్యర్థం శ్రీ మహాకాళీ పరమేశ్వరీ మహా మంత్ర జపం కరిష్యే ।

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ మహాకాళీపరమేశ్వరీ మహామంత్రస్య ।
మహాభైరవ ఋషయే నమః శిరసి.
ఉష్ణిక్ ఛందసే నమోముఖే ।
శ్రీ మహా కాళీ పరమేశ్వరీ దేవతాయై నమో హృది క్రీం బీజాయనమో నాభౌ
హ్రీం శక్తయే నమో గుహ్యే ।
క్లీం కీలకాయనమః పాదయోః ।

శ్రీ మహాకాళీపరమేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థే శ్రీ మహాకాళీ మహా మంత్ర జపే వినియోగాయ నమస్సర్వాంగే ।

### కరన్యాసము

ఓం క్రాం అంగుష్ఠాభ్యాం నమః
ఓం క్రీం తర్జనీభ్యాం నమః
ఓం క్రూం మధ్యమాభ్యాం నమః
ఓం క్రైం అనామికాభ్యానమః
ఓం క్రౌం కనిష్ఠ కాభ్యాం నమః
ఓం క్రః కరతలకర పృష్ఠాభ్యాంనమః

### హృదయన్యాసము

ఓం క్రాంహృదయాయనమః
ఓం క్రీం శిరసేస్వాహా
ఓం క్రూం శిఖాయై వషట్
ఓం క్రైం కవచాయహుం
ఓం క్రౌం నేత్రత్రయాయవౌషట్
ఓం క్రః అస్త్రాయఫట్

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

### ధ్యానము

శ్లో । సద్యశ్ఛిన్నశిరఃకృపాణమభయం హస్తైర్వరంబిభ్రతీం
ఘోరాస్యాం శిరసాంస్రజాసురుచిరామున్ముక్తకేశావళిం
సృక్కాసృక్ప్రవహాం శ్మశాననిలయాం శ్రుత్యోశ్శవాలంకృతిం
శ్యామాంగాంకృతమేఖలాం శవకరైర్దేవీంభజే కాళికాం ।

### అథకాళీ తంత్రోక్త ధ్యానమ్

శ్లో । శివారూఢాం మహాభీమాం ఘోరదంష్ట్రాం హసన్ముఖీం
చతుర్భుజాం ఖడ్గముండవరాభయకరాం శివాం ।
ముండమాలాధరాం దేవీం లలజ్జిహ్వాం దిగంబరాం
ఏవం సం చింతయేత్కాళీం శ్మశానాలయవాసినీం ।
అన్యచ్చ –

శ్లో । కరాళవదనాం ఘోరాం ముక్తకేశీం చతుర్భుజాం ।
కాళికాం దక్షిణాం దివ్యాం ముండ మాలావిభూషితాం ।
సద్యశ్ఛిన్నశిరః ఖడ్గవామోర్ధ్వాధః కరాంబుజాం ।
అభయం వరదంచైవ దక్షిణాధోర్ధ్వ పాణికాం ।
మహామేఘ ప్రభాం శ్యామాం తథాచైవ దిగంబరాం ।
కంఠావసక్తముండాళీ గల ద్రుధిరచర్చితాం ।
కర్ణావతంసతానీత శవయుగ్మ భయానకాం ।
ఘోరదంష్ట్రాం కరాళాస్యాంపీనోన్నతపయోధరాం
శవానాం కరసంఘాతైః కృతకాంచీంహసన్ముఖీం ।
సృక్కద్వయగళ ద్రక్తధారా విస్ఫురితాననాం ।
ఘోరరూపాం మహారౌద్రీం శ్మశానాలయవాసినీం ।
దంతురాందక్షిణవ్యాప్త ముక్తలంబకచోచ్చయాం ।
శవరూప మహాదేవ హృదయోపరి సంస్థితాం ।
శివాభిర్ఘోరరూపాభిశ్చతుర్దిక్షు సమన్వితాం ।
మహాకాలేనసార్ధోర్ధ్వముపవిష్ట రతాతురాం ।
సుఖప్రసన్నవదనాం స్మేరాననసరోరుహాం ।
ఏవం సం చింతయేద్దేవీం శ్మశానాలయ వాసినీం ।
ఇతి ధ్యాత్వా లమిత్యాది మానసోపచారైః సంపూజయేత్

### మూలమంత్రము

ఓం క్రీం క్రీం క్రీం హ్రీం హ్రీం హూం హూం దక్షిణే కాళికే క్రీం క్రీం క్రీం హ్రీం హ్రీం హూం హూం స్వాహా ।

### మంత్రసిద్ధి క్రమము

శ్లో । ఏవం ధ్యాత్వా జపేల్లక్షం జుహుయాత్తద్దశాంశతః ।
ప్రసూనైః కరవీరోత్థైః పూజాయంత్రమథోచ్యతే ।
ఏవమారాధితా కాళీసిద్ధాభవతి మంత్రిణాం ।

తా॥ శ్రీమహాకాళికా మహామంత్రము భక్తి శ్రద్ధలతో లక్ష పర్యాయములు జపము చేయవలెను. తరువాత కరవీర పుష్పములతో పదివేల పర్యాయములు తాంత్రిక హోమ విధానక్రమము ననుసరించి హోమమును చేయవలయును. ఇటుపైన పురశ్చరణ విధానముననుసరించి హోమదశాంశము తర్పణమును, తర్పణ దశాంశము మార్జనమును, భూతతృప్తిని జేయవలయును. పురశ్చరణచేసే దినములలో ప్రతినిత్యము త్రికాలములయందును యథాశాస్త్రముగా పై మహాకాళికా యంత్రమునకు ఆవరణార్చనాదికములతో సమగ్రపద్ధతిని చేయుచుండవలెమును. ఈవిధముగా జేసినచో నిశ్చయముగా ఈ మహాకాళీ మహా మంత్రము సిద్ధించును.

## ౨ శ్రీ మహాకాళీ యంత్రము

ఈ మహాకాళీ యంత్రముయొక్క ప్రభావము అమోఘమైనది. ఈ కాళీ మంత్ర యంత్రముల మహిమచే శివుడు మున్నగువారలు బ్రహ్మహత్యాదిదోషములను పోగొట్టుకొనిరి.

ఈ మహాకాళీ యంత్రమును రాగిరేకుపై వేయించవలెను. యంత్ర కాగితముచే పటముగా కట్టించవలెను. యంత్రాంతర్గతమై యున్న శ్రీ మహాకాళికా దేవిని ప్రతినిత్యము "పత్రం పుష్పం తోయం ఫలం" అనురీతిని పత్రము, పుష్పము, ఫలము, ఉదకము కుంకుమమున్నగువానిని యథాశక్తిగ సమర్పించి, నమస్కరించుచు ధ్యానము చేయుచున్న యెడల క్రూర గ్రహబాధలు, సకలారిష్టములు, కర్మదోషము, దారిద్ర్యము మున్నగునవి తొలగి సమస్తములగు శుభములు సంప్రాప్తించును.

మరియు, ఈ యంత్రమును యథాశాస్త్రీయముగ పంచపూజలు చేయుచు మూలమంత్రమును యథాశక్తి జపము చేసిన యెడల భూత ప్రేత పిశాచాది బాధలు, కీర్తిఆరోగ్యములు, సకల గ్రహదోషములు, సమస్తారిష్టములు తొలగి సుఖసౌఖ్య భోగభాగ్య ఐశ్వర్యములు ఉత్సాహము సంప్రాప్తించును.

ఇంతియగాక నీయంత్రమును యథాశాస్త్రీయముగ జీవన్యాస, ప్రాణన్యాస, కళాన్యాసాదులను చేసి, ప్రాణస్థాపన మొనర్చి ఆవరణ సపర్యను గావించి "ఓం క్రీం హూం హ్రీం మహాకాళికే క్రీం క్రీం హ్రూం హ్రూం హ్రీం హ్రీం హ్రీం కామదాత్రి హ్రీం హుంఫట్ స్వాహా" అను మంత్రముతో షోడశోపచారపూజలను చేసి, యథాశక్తిగ నీ మూలమంత్రమును జపము చేసిన యెడల సర్వకార్యసిద్ధి, శత్రుహాని, శత్రువిజయము, ఐశ్వర్య సుఖభోగములు, అణిమాద్యష్టసిద్ధులు సంప్రాప్తించును. మరియు ఈ మంత్ర యంత్ర ప్రభావముచే వశ్యాది అష్టకర్మలలో నేకర్మనైనను అతి సులభముగ సాధించవచ్చును. ఈ యంత్రము యొక్క గురుతర మైన కార్యము నైనను ప్రసాదించుటలో అనన్యమైన సామర్థ్యము గలది.



## శ్రీ మహాకాళీ పంచపూజలు

శ్రీం హ్రీం క్లీం ఓం లం పృథివీతత్త్వాత్మికాయై గంధతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహాకాళ్యై పరదేవతాయై గంధం సమర్పయామి నమః

శ్రీం హ్రీం క్లీం ఓం హం ఆకాశతత్త్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహాకాళ్యై పరదేవతాయై పుష్పం సమర్పయామి నమః

శ్రీం హ్రీం క్లీం ఓం యం వాయుతత్త్వాత్మికాయై స్పర్శతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహాకాళ్యై పరదేవతాయై ధూపమాఘ్రాపయామి నమః

శ్రీం హ్రీం క్లీం ఓం వం అమృతతత్త్వాత్మికాయై అమృతతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహాకాళ్యై పరదేవతాయై దీపం దర్శయామి నమః

శ్రీం హ్రీం క్లీం ఓం వం అమృతతత్త్వాత్మికాయై అమృతతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ మహాకాళ్యై పరదేవతాయై అమృతోపహార నైవేద్యం సమర్పయామినమః

శ్రీం హ్రీం క్లీం ఓం సం సర్వతత్త్వాత్మికాయై శ్రీ మహాకాళ్యై పరదేవతాయై తాంబూలాది సర్వోపచార పూజాం సమర్పయామి నమః

### శ్రీ మహాకాళీ మంత్రజప విధానము

ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశకాలౌ సంకీర్త్య, శ్రీమాన్ అముక గోత్రః అముక నామధేయోహం ధర్మపత్నీ సమేతః మమాత్మనః సకుటుంబస్య శ్రీ మహాకాళీ పరమేశ్వరీ ప్రసన్నతా ప్రాప్తి పూర్వక శ్రీమహాకాళీ పరమేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థం మమ శ్రీ మహాకాళికా ప్రసాదేన సర్వాపన్నివారణార్థక దీర్ఘాయురారోగ్య ధనకళత్రపుత్ర పౌత్రాద్యనవచ్ఛిన్న సంతతివృద్ధి స్థిరలక్ష్మీకీర్తి లాభ శత్రుపరాజయాది సదభీష్ట ఫల సిద్ధ్యర్థం శ్రీ మహాకాళికా మంత్ర జపం కరిష్యే ।

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ మహాకాళీ పరమేశ్వరీ మంత్రస్య,
మహాభైరవఋషయేనమశ్శిరసి ।
ఉష్ణిక్ ఛందసే నమోముఖే
శ్రీ మహాకాళీ పరదేవతాయై నమోహృది ।
క్రీం బీజాయ నమో నాభౌ ।
హ్రీం శక్తయే నమోగుహ్యే ।
హ్రూం కీలకాయనమః పాదయోః ।
శ్రీ మహాకాళీపరమేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే ।

### కరన్యాసము

ఓం క్రాం హ్రాం అంగుష్ఠాభ్యాం నమః ।
ఓం క్రీం హ్రీం తర్జనీభ్యాం నమః ।
ఓం క్రూం హ్రూం మధ్యమాభ్యాం నమః ।
ఓం క్రైం హ్రైం అనామికాభ్యాంనమః ।
ఓం క్రౌం హ్రౌం కనిష్ఠికాభ్యాంనమః ।
ఓం క్రః హ్రః కరతల కరపృష్ఠాభ్యాంనమః ।

### హృదయన్యాసము

ఓం క్రాం హ్రాం హృదయాయనమః ।
ఓం క్రీం హ్రీం శిరసే స్వాహా
ఓం క్రూం హ్రూం శిఖాయై వషట్
ఓం క్రైం హ్రైం కవచాయహుం ।
ఓం క్రౌం హ్రౌం నేత్రత్రయాయవౌషట్
ఓం క్రః హ్రః అస్త్రాయఫట్

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి లోకత్రయేణ దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ సద్యశ్ఛిన్న శిరః కృపాణమభయం హస్తైర్వరం బిభ్రతీం
ఘోరాస్యాం శిరసాంస్రజా సురుచిరామున్ముక్తకేశావళీం
సృక్కాసృక్ప్రవహాం శ్మశాన నిలయాం శ్రుత్యోః శవాలంకృతిం
శ్యామాంగీం కృతమేఖలాం శవకరైః దేవీం భజే కాళికామ్

ఇతిధ్యాత్వా, మానసోపచారైస్సంపూజయేత్ ।

### మూలమంత్రము

ఓం క్రీం హూం హ్రీం మహాకాళికే క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం కామదాత్ర్యై హ్రీం ఫట్ స్వాహా ।

### మంత్రసిద్ధి క్రమము

ఈ మహాకాళీ యంత్రమును భక్తిశ్రద్ధలతో ప్రతినిత్యము త్రికాలములయందును పూజించుచు పై మూల మంత్రమును లక్ష పర్యాయములు పురశ్చరణ విధానమనుసరించి జపము చేయవలయును. తరువాత కరవీరపుష్పములతో దశాంశము హోమమును, తద్దశాంశము తర్పణము, తద్దశాంశము మార్జనము, తద్దశాంశము భూతతృప్తిని చేసిన యెడల మంత్రసిద్ధి గలుగును.

### మంత్రప్రయోగ క్రమము

శ్లో ॥ దిగంబరో ముక్తకేశః శ్మశానస్థో యామిని ।
జపేద్యోయుత మేతస్య సర్వకామానవాప్నుయాత్ ॥

రాత్రి దిగంబరుడై జుట్టుముడి వేసుకొనకుండ జుట్టును విరియబోసుకొని, శ్మశానమునందు నిర్భయముగా నిశ్చలుడై ఏకాగ్ర ధ్యానముతో గూర్చుండి అర్ధరాత్రి కాలమునందు పదివేల పర్యాయములు మూలమంత్రమును జపము చేసిన యెడల సకల కామనా ప్రయోగములు సులభముగా సిద్ధించును.

శ్లో ॥ శవహృదయమారుహ్య నిర్వాసాః ప్రేత భూగతః
అర్కపుష్పసహస్రేణ యుక్తేన స్వీయరేతసా ।
దేవీంయః పూజయేద్భక్త్యా జపన్నేకైకశో మనుం ।
సోఽచిరేణైవ కాలేన ధరణీ ప్రభుతాం వ్రజేత్ ।

రాత్రి దిగంబరుడై ప్రేత భూమియందున్న శవముయొక్క హృదయముపై కూర్చుండి స్వీయ రేతస్సు చేరిన జిల్లేడు పుష్పములతోను భక్తితో ఒక్కొక్క పర్యాయము మూల మంత్రమును జపము చేయుచు వెయ్యి పర్యాయములు శ్రీ మహాకాళీ యంత్రమును పూజించినయెడల అతిశీఘ్రకాలములో భూనాయకుడగును.

పగటి కాలమందు హవిష్యాన్న భుజించుచు బ్రహ్మచర్య నియమములతో శ్రీ మహాకాళీదేవిని స్మరించుచు మూల మంత్రమును జపము చేయవలయును. రాత్రికాలమందు విహారమును చేయుచు లక్షపర్యాయములు మూలమంత్రమును జపము చేసిన యెడల ధరాపతియగును. ఎర్రకలువపుష్పములతో హోమము చేసిన యెడల గొప్ప ధనవంతుడగును. మారేడు పత్రములతో హోమము చేసిన యెడల రాజ్యప్రాప్తి కలుగును. ఎర్రని పుష్పములతో హోమము చేసిన యెడల గొప్ప వశీకరణ సామర్థ్యము గలుగును. మహిషాదుల రక్తముతో తర్పణము చేసిన యెడల సర్వసిద్ధులు సులభముగ గలుగును. ఈ కాళికా మంత్ర యంత్రములను సాధించువారు అణిమాదిసిద్ధులను సులభముగా పొందుటయేగాక సృష్టిస్థితి సంహారములు చేయుటయందుకూడా సామర్థ్యము గలవారగుదురు.

# శ్రీ బగళా ముఖీ యంత్రము

శ్లో ॥ అథ ప్రవక్ష్యే శత్రూణాం స్తంభినీం బగళా ముఖీం
సాధకానాం హితార్థాయ స్తంభనాయ చ వైరిణాం ।

తంత్రాంతరే: శ్లో ॥ బ్రహ్మాస్త్రం చ ప్రవక్ష్యామి సంద్యః ప్రత్యయ కారకం యస్యస్మరణ మాత్రేణ పవనోఽపి స్థిరాయతే.

ఈ బగళాముఖీదేవి శత్రుస్తంభనము చేయుటలో పేరుగన్నదైనది ఈ బగళాముఖీ యంత్రమంత్రములు శ్రీప్రసిద్ధ ప్రదములు ఈ బగళాముఖీ దేవియొక్క మంత్రయంత్రములనే బ్రహ్మాస్త్రమని వ్యవహరింతురు. ఇట్టి బ్రహ్మాస్త్ర మంత్ర యంత్రములను సిద్ధిని బొందిన సాధకుడు యీ బ్రహ్మాస్త్ర మంత్రయంత్రములను స్మరించిన మాత్రముననే వాయువుగూడ స్తంభనమగును. అనగా మనుష్యులను స్తంభింపజేయుట మిక్కిలి సులభమనివేరుగ వ్రాయనక్కరలేదు.

ఈ బగళాముఖీ యంత్రమును రాగిరేకుపై వేయించిగాని, ఈ యంత్రకాగితము వేపటముగా కట్టించిగాని యంత్రాధిష్ఠాత్రియై యున్న బ్రహ్మాస్త్ర స్వరూపిణియైన శ్రీ బగళాముఖీ దేవిని ప్రతినిత్యము ప్రాతఃకాలమునందు తప్పక ధ్యానము చేయుచు "పత్రం పుష్పం ఫలం, తోయం" అను న్యాయానుసారముగ, పత్రము, పుష్పము, ఫలము ఉదకము కుంకుమమున్నగువాటిని యథాశక్తిగ సమర్పించి నమస్కరించుచున్న యెడల శత్రుస్తంభనము, శత్రువిజయము, శత్రువశీకరణము, వ్యవహార విజయము మున్నగునవి సులభముగ గలుగును ।

మరియు నీ యంత్రమునకు యథావిధిగా పంచపూజలు ప్రతినిత్యము చేయుచు, మూలమంత్ర జపము చేయుచున్న యెడల బలవద్విరోధులతో జయము, ప్రబల శత్రుజనవశ్యము బహుక్లిష్టతరములుగనున్న వ్యవహారముల యందు జయము గలుగును.

ఇంతియగాక నీయంత్రమునకు యథాశాస్త్రముగా ప్రాణప్రతిష్ఠ - జీవన్యాస-కళాన్యాసాదులుజేసి ఓం హ్లీం బగళాముఖీ సర్వదుష్టానాం వాచం ముఖం పదం స్తంభయ జిహ్వాం కీలయ బుద్ధిం వినాశయ హ్లీం ఓం స్వాహా అను మూలమంత్రముతో



షోడశోపచార సపర్యలు గావించుచు మూలమంత్రమును యథాశక్తి జపము చేయుచున్న యెడల శత్రుసంహారనము, రాజ్యప్రాప్తి ధన, దేవతాస్తంభనములు సర్వజనవశ్యము వశీకరణ సామర్థ్యము, శత్రువులయొక్క వాక్కు, శ్రోత్ర జిహ్వ ప్రాణములకు స్తంభనము శత్రుబుద్ధివినాశనము, శత్రువులయొక్క గతి మతి జిహ్వాదులకు స్తంభనము శత్రునాశనము మున్నగునవి సులభముగా కలుగుచుండును.

శ్లో ॥ అహన ద్రావణం రామో వాతాపిం కుంభసంభవః ।

పూర్వము ఈ బ్రహ్మాస్త్ర మంత్రయంత్రాదుల ఉపాసనచే శ్రీరామచంద్రమూర్తి రావణాసురుని సంహరించెను. అగస్త్యమునీంద్రులు వాతాపియను రాక్షసుని సంహరించియున్నారు. కనుక, ఈయంత్రము శత్రుసంహారమునకు అత్యంత ప్రాముఖ్యమైనదని తంత్ర గ్రంథములు చాటుచున్నవి.

## శ్రీ బగళాముఖీ పంచపూజలు

ఓం లం పృథివీతత్వాత్మికాయై గంధతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై బ్రహ్మాస్త్రరూపిణ్యై శ్రీ బగళా ముఖీదేవ్యై గంధం సమర్పయామినమః

ఓం హం ఆకాశతత్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై బ్రహ్మాస్త్రరూపిణ్యై శ్రీ బగళాముఖీ దేవ్యై పుష్పం సమర్పయామి నమః

ఓంయం వాయుతత్వాత్మికాయై స్పర్శతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై బ్రహ్మాస్త్రస్వరూపిణ్యై శ్రీబగళాముఖీ దేవ్యై ధూపమాఘ్రాపయామినమః

ఓం రం వహ్నితత్వాత్మికాయై తైజసతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై బ్రహ్మాస్త్రస్వరూపిణ్యై శ్రీ బగళాముఖీదేవ్యై దీపందర్శయామి నమః

ఓంవం అమృత తత్వాత్మికాయై అమృత తన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై బ్రహ్మాస్త్రస్వరూపిణ్యై శ్రీ బగళాముఖీదేవ్యై అమృతోపహార నైవేద్యం సమర్పయామినమః

ఓం సం సర్వతత్వాత్మికాయై సర్వతన్మాత్ర ప్రకృత్యా నందాత్మికాయై బ్రహ్మాస్త్ర స్వరూపిణ్యై శ్రీ బగళాముఖీ దేవ్యై తాంబూలాదిసర్వోపచార పూజాంసమర్పయామి నమః

## శ్రీ బగళాముఖీమంత్ర జపవిధానము

ఆచమ్య ప్రాణానాయమ్య, దేశకాలౌ సంకీర్త్య, శ్రీమానాముక గోత్రఃఅముక నామధేయోహం మమాఽత్మనః సకుటుంబస్య శ్రీ బగళాముఖీ ప్రసన్నతా ప్రాప్త్యర్థం శ్రీ బగళాముఖీ ప్రసాదేన మమ శత్రూణాం, దుష్టానాం నిందకానాం, కుమతీనాం, కుతార్కికానాం, ప్రతివాదీనాం, సర్వేషాంవాక్పదముఖ జిహ్వాగతి చేష్టాది స్తంభనార్థ సిద్ధ్యర్థం మమ లోకేషు సభాయాం యానవ్యవహారే శత్రుసంఘే సర్వత్రజయవిజయప్రాప్త్యర్థం శ్రీ బగళాముఖీమహామంత్ర జపం కరిష్యే ॥

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీబగళాముఖీ మహామంత్రస్య,
నారద భగవాన్ ఋషయేనమ శిరసి ।
బృహతీ ఛందసే నమోముఖే
శ్రీ బగళాముఖీ పరదేవతాయై నమోహృదయే ।
హ్లీం బీజాయ నమోనాభౌ ।
స్వాహాశక్తయే నమోగుహ్యే
శత్రుస్తంభిన్యైనమః కీలకాయనమః పాదయోః ।
మమ శ్రీ బ్రహ్మాస్త్ర స్వరూపిణీ శ్రీ బగళాముఖీప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే ।

### కరన్యాసము

ఓం హ్లీం అంగుష్ఠాభ్యాం నమః ।
బగళాముఖీ తర్జనీభ్యాం నమః ।
సర్వదుష్టానాం మధ్యమాభ్యాంనమః ।
వాచం ముఖం పదం స్తంభయ అనామికాభ్యాంనమః ।
జిహ్వాం కీలయ కనిష్ఠికాభ్యాం నమః ।
బుద్ధిం వినాశయ హ్లీం ఓం స్వాహా
కరతలకరపృష్ఠాభ్యాం నమః ।

### హృదయన్యాసము

ఓం హ్లీంహృదయాయనమః ।
బగళాముఖీ శిరసే స్వాహా ।
సర్వదుష్టానాం శిఖాయై వషట్ ।
వాచం ముఖం పదం స్తంభయ కవచాయహుం
జిహ్వాం కీలయ నేత్రత్రయాయవౌషట్
బుద్ధిం వినాశయహ్లీం ఓం స్వాహా అస్త్రాయఫట్

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ సౌవర్ణాసన సంస్థితాం త్రినయనాం పీతాంశుకోల్లాసినీం
హేమాభాంగ రుచిం శశాంక మకుటాం సచ్చంపక స్రగ్యుతాం
హస్తైర్ముద్గర పాశబద్ధరసనాం సంబిభ్రతీం భూషణైః
వ్యాప్తాంగీం వరదాయినీం త్రిజగతాం సంస్తంభినీం చింతయే

తంత్రాంతరే–

శ్లో ॥ మధ్యేసుధాబ్ధి మణి మండపరత్న వేది
సింహాసనోపరిగతాం పరిపీతవర్ణాం ।
పీతాంబరాభరణ మాల్యవిభూషితాంగీం
దేవీం నమామి ధృతముద్గరవైరి జిహ్వాం ।

శ్లో ॥ జిహ్వా గ్రమాదాయకరేణ దేవీం
వామేనశత్రూన్ పరిపీడయంతీం ।
గదాభిఘాతేన చ దక్షిణేన
పీతాంబరాఢ్యాం ద్విభుజాం నమామి ।

ఏవం ధ్యాత్వా మానసోప చారైస్తు పూజ యేత్

### మూలమంత్రము

ఓం హ్లీం బగళాముఖీ సర్వదుష్టానాం వాచం ముఖం పదం స్తంభయజిహ్వాం కీలయ బుద్ధిం వినాశయ హ్లీం ఓం స్వాహా ।

### మంత్రసిద్ధి క్రమము

శ్లో ॥ ఏవం ధ్యాత్వాజపేల్లక్ష మయుతం చంపకోద్భవైః ।
కుసుమైః ర్జుహుయాత్ సిద్ధే పూర్వోక్తే పూజయేదిమాం
ఏవం సిద్ధమనుర్మంత్రీ స్తంభయేద్దేవతానపి ॥

# శ్రీ భద్రకాళీ యంత్రము

ఈ భద్రకాళీ మహాయంత్రము అత్యద్భుతమైన మహిమ గలది. ఈ యంత్రమును రాగి రేకుపై వేయించిగాని, ఈ యంత్రాగితమునే పటముగా కట్టించిగాని, ప్రతినిత్యము, యంత్రాధిష్ఠానియై యున్న శ్రీ భద్రకాళీ దేవికి "పత్రం పుష్పం ఫలం తోయం" అనురీతిగ పత్రము, పుష్పము, ఫలము, ఉదకము కుంకుమ మున్నగు వానిని యథాశక్తిగ సమర్పించి, నమస్కరించుచు ధ్యానము చేయుచున్న యెడల సమస్త కోరికలు నెరవేరుటయే గాక, భూత ప్రేత పిశాచాది బాధలు తొలగును. మరియు శత్రువిజయము, వ్యవహార విజయము మున్నగునవి సంప్రాప్తించును.

మరియు, ఈ యంత్రమునకు యథావిధిగా పంచ పూజలు ప్రతినిత్యము జేయుచు, మూలమంత్రమును జపము చేయుచున్న యెడల వివిధములగు కష్టనష్టములు, భయము, దీర్ఘ అనారోగ్యములు, కఠినతరమగు గ్రహబాధలు, బ్రహ్మరాక్షసాదులవలన గలుగు పీడలు మున్నగునవి తొలగి ఆరోగ్య సౌఖ్య జయలాభములు గలుగును.

ఇంతియగాక నీయంత్రమునకు యథాశాస్త్రముగ ప్రాణప్రతిష్ఠాదు లొనర్చి ఓం హ్రాం కాళి మహాభద్రకాళి అం హ్రీం క్రోం కిలికిలే ఫట్ స్వాహా అను మూలమంత్రముతో షోడశోపచార పూజలుచేయుచూ ,మూలమంత్రము జపము చేయువారలకు జయము, సౌఖ్యము, బ్రహ్మరాక్షస పిశాచాది గ్రహబాధానివృత్తి, శత్రుహాని, శత్రువిజయము, సర్వకార్యసిద్ధి మున్నగు ఫలములు కలుగును. పై ప్రకారము యథా శాస్త్రీయముగా నీ భద్రకాళీ మంత్రయంత్రాదులనుపాసించువారిని దర్శించిన మాత్రముననే సర్వోపద్రవములు భూత ప్రేత పిశాచాది బాధలు తొలగిపోవును. ఈ యంత్రమును రాగిరేకుపై చెక్కించి యీ యంత్రముపై భద్రకాళీ విగ్రహమును యథాశాస్త్రముగా పెట్టి ప్రతిష్ఠాపన చేసిన యెడల నవోట్లు ప్రదక్షిణము చేయువారలకు దీర్ఘరోగములు భూత ప్రేత, పిశాచ, బ్రహ్మరాక్షసాది బాధలు, అపస్మారము తొలగిపోవును.



## శ్రీ భద్రకాళీ పంచపూజలు

ఓం లం పృథివీతత్వాత్మికాయై గంధతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ భద్రకాళీ పరదేవతాయై గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్వాత్మికాయై శబ్దతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ భద్రకాళీ పరదేవతాయై పుష్పం సమర్పయామి నమః

ఓం యం వాయుతత్వాత్మికాయై స్పర్శతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ భద్రకాళీ పరదేవతాయై ధూపమా ఘ్రాపయామి నమః

ఓం రం వహ్నితత్వాత్మికాయై తైజసతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ భద్రకాళీ పరాదేవతాయై దీపందర్శయామి నమః

ఓం వం అమృత తత్వాత్మికాయై అమృతతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ భద్రకాళీ పరదేవతాయై అమృతోపహార నైవేద్యం సమర్పయామి నమః

ఓం సం సర్వతత్వాత్మికాయై సర్వతన్మాత్ర ప్రకృత్యానందాత్మికాయై శ్రీ భద్రకాళీ పరాదేవతాయై సర్వోపచార పూజాం సమర్పయామి నమః ।

### శ్రీ భద్రకాళీ మంత్ర జపవిధానము

ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశకాలౌసంకీర్త్య, మమ ఆత్మనః సకుటుంబస్య శ్రీ భద్రకాళీ ప్రసన్నతా ప్రాప్తి పూర్వక శ్రీ భద్రకాళీ ప్రసాద సిద్ధ్యర్థం సకలైశ్వర్యసిద్ధ్యర్థం శ్రీ భద్రకాళీ మహామంత్ర జపం కరిష్యే॥

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ భద్రకాళీ మహామంత్రస్య ।
భైరవ ఋషయే నమశ్శిరసి.
ఉష్ణిక్ ఛందసే నమోముఖే ।
శ్రీ భద్రకాళీ పరదేవతాయై నమో హృది
క్రీం బీజాయనమోనాభౌ
హ్రీం శ్తయే నమో గుహ్యే ।
క్లీం కీలకాయనమః పాదయోః ।
శ్రీ భద్రకాళీ పరదేవతా ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే ।

### కరన్యాసము

ఓం క్రాం అంగుష్ఠాభ్యాం నమః
ఓం క్రీం తర్జనీభ్యాం నమః
ఓం క్రూం మధ్యమాభ్యాం నమః
ఓం క్రైం అనామికాభ్యాంనమః
ఓం క్రౌం కనిష్ఠి కాభ్యాంనమః
ఓం క్రః కరతలకర పృష్ఠాభ్యాంనమః

### హృదయన్యాసము

ఓం క్రాంహృదయాయనమః
ఓం క్రీం శిరసేస్వాహా
ఓం క్రూం శిఖాయై వషట్
ఓం క్రైం కవచాయహుం
ఓం క్రౌం నేత్రత్రయాయవౌషట్
ఓం క్రః అస్త్రాయఫట్

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి లోకత్రయేణ దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ క్షుత్క్షామాకోటరాక్షీ మసిమలినముఖీ ముక్తకేశీరుదంతీ ।
నాహంతృప్తావదంతీ జగదఖిలమిదం గ్రాసమేకంకరోమి
హస్తాభ్యాం ధారయంతీ జ్వలదనలశిఖా సన్నిభం పాశముగ్రం
దంతైర్జంబూఫలాభైః పరిహరతుభయం పాతుమాం భద్రకాళీ
ఇతి ధ్యాత్వాలమిత్యాది పంచపూజాం విధాయ, జపంకుర్యాత్ ।

### మూలమంత్రము

ఓం హ్రాం కాళి మహాభద్రకాళి ఆం హ్రీం క్రోం కిలికిలే ఫట్ స్వాహా ।

### మంత్రసిద్ధి క్రమము

శ్లో ॥ ఏవం ధ్యాత్వాజపేల్లక్షం జపాంతే తద్దశాంశతః ।
ప్రసూనైః కరవీరోత్థైః పూజాయంత్ర మథోచ్యతే ।
ఏవమారాధితా కాళీసిద్ధాభవతి మంత్రిణాం ।

లో మూలమంత్రమును లక్ష పర్యాయములు జపము చేయ వలయును. పిమ్మట కరవీర పుష్పములతో పదివేల పర్యాయములు యథాశాస్త్రముగ హోమము చేయవలయును. తరువాత హోమ దశాంశము తర్పణము, తర్పణ దశాంశము భూరి తృప్తిని చేయవలయును. పురశ్చరణచేయు దినములలో ప్రతి నిత్యము త్రికాలములయందును యథావిధిగ యంత్రమునకు సపర్యను జేయుచుండ వలయును. ఈ ప్రకారముగా చేయుట వలన మంత్రసిద్ధి యగును.

### మంత్రప్రయోజన క్రమము

శ్లో ॥ తతః ప్రయోగాన్కుర్వీత మహాభయవినాశనాన్ ।
ఆత్మనోఽ న్యస్య వాప్యర్థే శ్రీ ప్రసిద్ధ ప్రదాయకాన్ ।
సద్యోమదనవాపం సక్తాన్ యః ప్రజపేన్మనుం
అయుతం సోఽచిరాదేవ వాక్పతేః సమతామియాత్

లా. మంత్రసిద్ధియైన పిమ్మట ప్రయోజనములను పొందింపవలయును. ఈ భద్రకాళీ మంత్ర ప్రయోగములు భైరవునిచే చెప్పబడినవి. ఐశ్వర్యమును ప్రసాదించు ప్రయోగములను గాని, యోగ్యమైన కోరికలను పొందించు ప్రయోగములను గాని, ఆత్మార్థముగాని, పరార్థముగాని పొందించవచ్చును. మదనమందిరమును తదేక దృష్టితో యోగ్యముగా జూచుచు పదివేల పర్యాయములు మూల మంత్రమును జపము చేసిన యెడల శ్రీప్రకారములో బృహస్పతితో సమానమైన విద్యావంతుడగును.

శ్లో ॥ దిగంబరోముక్తకేశః శ్మశానస్థోఽర్ధయామిని ।
జపేల్లోక్షయుతమేతస్య భవేయుస్సర్వకామనాః ।

లా. అర్ధరాత్రి కాలమందు దిగంబరుడై, జుట్టు విరియబోసుకొని శ్మశానమందు కూర్చుండి నిర్భయముగా పదివేల పర్యాయములు మూలమంత్రమును జపము చేసిన యెడల కోరికలు సులభముగ సాధ్యమగును.

ఈ మూలమంత్రమును 128 పర్యాయములు జపముచేసి, భస్మమును అభిమంత్రించి, ఆ భస్మమును ధరింపజేసిన సమస్త దృష్టి దోషములు, జ్వరాద్యుపద్రవములు నశించును.

ఈ భద్రకాళీ యంత్రమునకు యథావిధిగ సపర్యనుచేసి, పిమ్మట ఒక కుంభమునందు ఉదకముపోసి, యా యుదకమును మూలమంత్రముతో 1128 పర్యాయములు అభిమంత్రించి, యా యుదకమున స్నానము జేయించిన సమస్త భూత, ప్రేత పిశాచాదిబాధలు, అభిచారిక దోషములు శమించును.

ఈ యంత్రమును భూర్జపత్రము పైగాని, రాగిరేకు పైగాని వ్రాసి యథావిధిగా ప్రాణప్రతిష్ఠ - షోడశోపచారము చేసి ఆయంత్రమును ధరించిన విరోధులను గ్రహబాధలు, రోగములు, అభిచారిక దోషములు, అరిష్టములు తొలగును.

## ౨ శ్రీ మహా సరస్వతీ యంత్రము

"చత్వారి వాక్పరిమితాపదాని తానివిదుర్బ్రాహ్మణాయే మనీషిణాం. గుహాత్రీణి నిహితా నేం గయంతి తురీయం వాచో మనుష్యావదన్తి" అను ఋగ్వేద ప్రమాణము చొప్పున పరా-పశ్యన్తి మధ్యమా - వైఖరీ రూపములను పొందిన శ్రీ మహా సరస్వతీదేవి "చింతామణి జ్ఞాననీల ఘటకిణ్యంత రిక్షతః మహత్యాద్యాశ్చ సప్తైవసరస్వత్యః ప్రకీర్తితాః (మేరుతంత్రం) "అను వ్యాఖ్యానుసారము 1. చింతామణి సరస్వతి 2. జ్ఞానసరస్వతి. 3. నీలసరస్వతి. 4. ఘటసరస్వతి. 5. కిణి సరస్వతి. 6. అంతరిక్షసరస్వతి. 7. మహాసరస్వతి అను రూపములను పొందియున్నది. ఈ సరస్వతీ యంత్రము విద్యలను, ఐశ్వర్యములను ప్రసాదించుటలో అత్యుత్తమైన సదని వేరుగ వ్రాయనక్కరలేదు. ఈ యంత్రమును రాగి రేకుపై చేయించిగాని! ఈ యంత్రకాగితమునే పటముగా కట్టించిగాని, ఈ యంత్రాధిష్ఠాత్రియైన శ్రీ సరస్వతీదేవికి "పత్రం పుష్పం. ఫలం తో" యంత్ అనురీతిని పత్రము, పుష్పము. ఫలము, ఉదకము కుంకుమ మున్నగువానిని యథాశక్తిగ సమర్పించి నమస్కారము చేయుచు ధ్యానము చేయుచున్న యెడల మేధాశక్తి, బుద్ధికుశలత. సూక్ష్మగ్రాహకత్వము, విద్యాభివృద్ధి. పరీక్షలయందు విజయము మున్నగునవి గల్గును సమస్త కోరికలు సిద్ధించును.

ఇంతియగాక ప్రతినిత్యము ప్రాతఃకాలము నందు పంచ పూజలు చేసి మూలమంత్రమునుయథాశక్తిగ జపము చేయుచున్న యెడల ధీశక్తి ఇంద్రియ పటుత్వము. మేధాశక్తి, జ్ఞానవృద్ధి ఆరోగ్యము మున్నగునవి కలుగును.

మరియు యథాశాస్త్రముగ ప్రాణప్రతిష్ఠ జీవన్యాస, కళాన్యాసాదులొనర్చి "ఓం హ్రీం హ్స్రైం హ్రీం ఓం సరస్వత్యైస్వాహా" అనుమూలమంత్రముతో షోడశోపచార పూజలు చేయుచు మూలమంత్రమును యథాశక్తిని జపించుచున్న యెడల విద్యావంతులు, జ్ఞానవంతులు నగుచు బ్రహ్మవర్చస్కులు. ఓజోవంతులు, తేజోవంతులై ప్రకాశించుచుందురు.



# శ్రీ సరస్వతీ యంత్రము

మూలమంత్రము

"ఓం హ్రీం శ్రైం హ్రీం ఓం ఐం క్లీం సౌః సరస్వత్యై స్వాహా"

ఈ సరస్వతీ యంత్రమును రాగిరేకుపై వేయించిగాని, లేదా ఈ యంత్రకాగితము నే పటముగా కట్టించిగాని, ఈ యంత్రాధిష్ఠాత్రియైన శ్రీ సరస్వతీ దేవిని "పత్రం పుష్పం ఫలం తోయం" అను విధానమున పత్రము, పుష్పము, ఫలము, జలము, కుంకుమ మున్నగువానిని యథా శక్తిగ సమర్పించి, నమస్కారము చేయుచు, మూలమంత్రమును జపించుచున్న యెడల మేధా శక్తి, సూక్ష్మగ్రాహకత్వము, వక్తృత్వము, బుద్ధి కౌశల్యము, విద్యాభివృద్ధి, పరీక్షలయందు విజయము మున్నగునవి గలుగుచు సమస్త కోరికలు నెరవేరును.

ఇంతియగాక ప్రతినిత్యము తదియాష్టమయముల యందు యథావిధిగా పూజలు చేసి మూలమంత్రమును యథాశక్తిగ జపము చేయుచున్నయెడల ధీశక్తి–మేధావృద్ధి, ఇంద్రియ పటుత్వము, తేజస్సు, బలము, ఆరోగ్యము, జ్ఞానవృద్ధి రస భావ భాసురమగు వాక్పటుత్వ వాచా లత్వములు, విమర్శన జ్ఞానము, పరీక్షలయందు విజయము విద్యాప్రాప్తి సమయస్ఫూర్తి మున్నగునవి లభించును.

మరియు యథాశాస్త్రముగ ప్రాణప్రతిష్ఠలో సర్వ మూల మంత్రములో షోడశోపచార పూజలు చేయువారు విద్యావంతులు, మేధావంతులు, జ్ఞానవంతులు యగుచు బ్రహ్మవర్చస్సులై ప్రకాశించుచుందురు. మరియు యీ యంత్రమును పూజించుట వలన విద్యా ప్రాప్తి, మేధావృద్ధి, సమయస్ఫూర్తి, ధారణా శక్తి, గద్యపద్యరచనా చాతుర్యము, వాక్సిద్ధి, వక్తృత్వము మున్నగునవి సులభముగా సంప్రాప్తమగును.



# శ్రీ లక్ష్మీ గణేశమహాయంత్రము

మూలమంత్రము :- "ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే వశ మానయ స్వాహా"

"ఓం సర్వవిఘ్న[illegible] బాధితే" అనుశ్రుతి ప్రకారము ఈ యంత్రమును, రాగిరేకుపై వేయించిగాని, ఈ యంత్రకాగితమునే పటముగా కట్టించిగాని, ఈ యంత్రాధిష్ఠానమై యున్న శ్రీ లక్ష్మీగణేశునకు "పత్రం పుష్పం ఫలం తోయం" అనురీతిగా పత్రము, పుష్పము, ఫలము, ఉదకము మున్నగునవి యథాశక్తిగ సమర్పించి, నమస్కరించి మూలమంత్రమును జపించుచున్న యెడల సకలవిఘ్నములు తొలగును వివిధ కోరికలు నెరవేరును. ఇంటియందు ప్రతినిత్యము ప్రాతఃకాలమందు యథావిధిగా పంచపూజలు చేసి మూలమంత్రమును జపించువారు సర్వ కార్య విజయమును విఘ్న నివృత్తిని, ఐశ్వర్య వృద్ధిని, సంతతిని, గౌరవమును బడయుచుందురు.

మరియు యథాశాస్త్రముగ ప్రాణప్రతిష్ఠాదు లొనర్చి పై మూలమంత్రమును షోడశోపచార పూజలు చేయువారు వివిధములగు ఐశ్వర్య సుఖభోగములను, సర్వజన ప్రియత్వమును, సభాజయమును సర్వోపద్రవ నివృత్తిని, ఆరోగ్యమును శత్రువిజయమును పొందుదురు.



# శ్రీ సుబ్రహ్మణ్య యంత్రము

ఈ సుబ్రహ్మణ్యయంత్రము సర్వవిధములగు సంతానదోషములను పోగొట్టుటలో సత్యుత్తమమైనది. మరియు నీయంత్ర ప్రభావముచే యెట్టి కఠినతరమైన కార్యము నైనను సులభముగా సాధింపవచ్చును.

ఈ యంత్రమును ఒక రాగిరేకుపై వేయించి గాని ఈ యంత్రరాగిరేకును వేపటముగా కల్పించి గాని ఈయంత్రాధిష్ఠానమై యున్న శ్రీసుబ్రహ్మణ్యేశ్వరుని ప్రతినిత్యము ప్రాతఃకాలము నందు మనసులోన ధ్యానించుచు "పత్రం పుష్పం ఫలం తోయం" అను శాస్త్రానుసారము పత్రం పుష్పం ఫలం ఉదకము కుంకుమ మున్నగువానిని సమర్పించి నమస్కరించుచున్న యెడల స్త్రీ పురుషులకు గల సంతాన సంబంధమగు దోషములు నివృత్తియై సంతానమును బడయుదురు.

మరియు నీ యంత్రమునకు యథావిధిగా పంచపూజలను చేయుచూ మూలమంత్రమును యథాశక్తిగ జపము చేయుచున్న యెడల సమస్తములగు వ్యాధులు సంతానదోషములు నశించుటయేకాక సమస్త కార్యములు సులభముగ సిద్ధించును

ఇంతియుగాక నీయంత్రమునకు జీవన్యాస ప్రాణన్యాస కళాన్యాసాదులను విధి విహితముగ జరిపి, ప్రాణ ప్రతిష్ఠను జేసి, "ఓం సాంశరవణభవ" అనుమూలమంత్రముతో షోడశోపచారపూజలు చేసి, పిమ్మట మూలమంత్రమును యథాశాస్త్రీయముగ జపముచేసిన యెడల సమస్త కోరికలు సిద్ధించును. సంతానదోషములు నశించి దీర్ఘాయుష్మంతమగు సంతానము గలుగును. అపార్శ్వవ్యాధులు, దీర్ఘ వ్యాధులు నశించి ఆరోగ్యము సంప్రాప్తించును.

ఈ యంత్రమును సుబ్రహ్మణ్య విగ్రహముల దిగువను యథాశాస్త్రముగ ప్రతిష్ఠ జేసిన యెడల సమస్త శుభములు, అభివృద్ధి సంతానసౌభాగ్యాది వృద్ధియు గలుగును.



# శ్రీ సుబ్రహ్మణ్య పంచ పూజలు

ఓం హాం శరవణభవ ఓం లం పృథివీతత్త్వాత్మనే గంధతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ గంధం సమర్పయామి నమః

ఓం హాం శరవణభవ ఓం హం ఆకాశతత్త్వాత్మనే శబ్దతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ సుబ్రహ్మణ్యే శ్వరాయ పుష్పం సమర్పయామి నమః

ఓం హాం శరవణభవ ఓం యం వాయుతత్త్వాత్మనే స్పర్శతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ ధూపమా ఘ్రాపయామి నమః

ఓం హాం శరవణభవ ఓం రం వహ్నితత్త్వాత్మనే తైజస తన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ దీపందర్శయామి నమః

ఓం హాం శరవణభవ ఓం వం అమృత తన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాయ అమృతోప హార నైవేద్యం సమర్పయామి నమః ।

ఓం హాం శరవణభవ ఓం సం సర్వతత్త్వాత్మనే సర్వతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీసుబ్రహ్మణ్యేశ్వరాయతాంబూలాది సర్వోపచార పూజాం సమర్పయామినమః

## సుబ్రహ్మణ్య మంత్రజపవిధానము

ఆచమ్య ప్రాణా నాయమ్య, దేశకాలౌ సంకీర్త్య, శ్రీమాన్ అముక గోత్రః అముక నామధేయో ధర్మపత్నీ సమేతోఽహం మమాత్మనస్య కుటుంబస్య జన్మ జన్మాంతరోపార్జిత కాయిక వాచిక మానసిక సాంసర్గిక చతుర్విధ పాతక మహాపాతక ఉపపాతక దురితక్షయద్వారా సుబ్రహ్మణ్యేశ్వర ప్రసాదేన సర్వాపన్నివృత్తి పూర్వక దీర్ఘాయుర్విపుల ధన కళత్ర పుత్ర పౌత్రాద్యనవచ్ఛిన్న సంతతి వృద్ధి స్థిరలక్ష్మీ కీర్తిలాభ శత్రుపరాజయాది సదభీష్టఫల సిద్ధ్యర్థం శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర మహామంత్ర జపం కరిష్యే ॥

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీసుబ్రహ్మణ్యేశ్వర మహామంత్రస్య,
ఈశ్వర ఋషయేనమః శిరసి ।
సం శ్రీ ఛందసే నమోముఖే
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరో దేవతాయై నమోహృదయే ।
ఓం హాం బీజాయ నమో నాభౌ ।
ఓం శరవణభవ శక్తయే నమోగు హ్యే ।
ఓం స్వాహా కీలకాయనమః పాదయోః ।
శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే ।

### కరన్యాసము

ఓం శరవణభవ హాం అంగుష్ఠాభ్యాం నమః ।
ఓం శరవణభవ హీం తర్జనీభ్యాం నమః ।
ఓం శరవణ భవహూం మధ్యమాభ్యాంనమః ।
ఓం శరవణభవ హైం అనామి కాభ్యాంనమః ।
ఓం శరవణ భవ హౌం కనిష్ఠ కాభ్యాంనమః ।
ఓం శరవణభవ హః కరతలకరపృష్ఠాభ్యాంనమః ॥

### హృదయన్యాసము

ఓం శరవణభవ హాం హృదయాయనమః ।
ఓం శరవణభవ హీం శిరసే స్వాహా ।
ఓం శరవణభవ హూం శిఖాయై వషట్ ।
ఓం శరవణభవ హైం కవచాయహుం
ఓం శరవణభవ హౌం నేత్రత్రయాయవౌషట్
ఓం శరవణభవ హః అస్త్రాయఫట్

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ షడ్వక్త్రంశిఖివాహనం త్రినయనం చిత్రాంబరాలంకృతం
శక్తిం వజ్రమసిం త్రిశూల మభయం ఖేటం ధనుశ్చక్రకం
పాశం కుక్కుట మంకుశం చవరదం, దోర్భిర్దధానంసదా
ధ్యాయేదీప్సిత సిద్ధిదం శివసుతం వందే సురారాధితం ।
ఇతిధ్యాత్వా, మానసోపచారైఃపూజయేత్

### మూలమంత్రము

ఓం హాం శరవణభవ.

### మంత్రాంతరము

ఓం క్రీం శ్రీం హ్రీం ఐం ఈం హాం శరవణభవ సుబ్రహ్మణ్యాయనమః

### మంత్రసిద్ధిక్రమము

ఈ సుబ్రహ్మణ్య యంత్రమును యథాశాస్త్రీయముగా పూజించుచు మూలమంత్రమును పురశ్చరణ నియమముల ననుసరించి లక్షసంఖ్యాయుతముల జపము, జపదశాంశము హోమము, హోమదశాంశము తర్పణము, తర్పణ దశాంశము మార్జనము, తద్దశాంశము భూతతృప్తియు జేసిన యెడల మంత్రసిద్ధియగును. మంత్రసిద్ధియైన పిమ్మట కామ్య కర్మను సాధించవలయును.

### మంత్ర ప్రయోగానుక్రమము

ఈ సుబ్రహ్మణ్య యంత్రమును రాగి రేకు పైగాని, వెండి రేకుపైగాని యథావిధిగా వేసి ప్రాణప్రతిష్ఠ స్థాపనాదులు చేసి యంత్రవీర్యసిద్ధికై మూలమంత్రమును 10000 పర్యాయములు జపము చేసి ఆ జపమును యంత్రమునకు ధారాదత్తము చేసి ఆ యంత్రమును ధరించినయెడల పలు విధములగు సంధ్యా దోషములు, సంతాననష్టములు తొలగి దీర్ఘాయుష్మములు సంతానము గలుగును.

ఈ యంత్రమును ప్రతినిత్యము పూజించుచు మకర ఎర్రపుష్పము లతో హోమము చేసిన యెడల సర్వము వశ్యమగును. గుగ్గిలముతో హోమము చేసినయెడల గ్రహభూత ప్రేతపిశాచాది బాధలుతొలగును. ఆజ్యము తిలలు కలిపి హోమము చేసిన యెడల దీర్ఘవ్యాధులు అసాధ్య వ్యాధులు తొలగును.

ఈ యంత్రమును రాగిరేకుపై వేయించి జీవన్యాస ప్రాణన్యాస కళాన్యాసాదులను చేసి, ప్రాణ ప్రతిష్ఠను జేసియంత్ర చైతన్య ప్రాప్తికిని బలవీర్య వృద్ధికిని మూలమంత్రమును 40000 పర్యాయములుజపము. జపదశాంశము సంపాతాజ్యహోమమును చేసి యంత్రమునకు ధారాదత్తముచేసి ఆ యంత్రమును సుబ్రహ్మణ్య విగ్రహము క్రిందను యథాశాస్త్రీయముగా స్థాపించిన యెడల జన్మజన్మాంతరములనుండి సంప్రాప్తమైన కర్మ దోషములు, నాగదోషములు మున్నగు సమస్తదోషములు నశించి ఆరోగ్యము, ఐశ్వర్యము స్థిరసంతానము గలుగును.

మరియు ప్రతినిత్యము పురశ్చరణవిధితో మంత్ర యంత్ర సిద్ధిని జేసికొన్నయెడల అనంతమైన సర్వశుభములు గలుగును. యంత్రమును గ్రామదేవతా ఆలయమునందు ప్రతిష్ఠించిన ఆ గ్రామమునందుగూడా సైతశుభములుగలుగును. ఆగ్రామము సర్వవిధముల అభివృద్ధిగా నుండును.

# శ్రీ వీరభద్ర యంత్రము

ఈ వీరభద్రయంత్రము శ్రీఘ్రసిద్ధి ప్రదమైనది. దీనిని పెక్కుండ్రు పూజించి గొప్ప ఉపద్రవములనుండి విముక్తులైయున్నారు. ఈ యంత్రమును రాగి రేకుపై వేయించవలెను. ఈ యంత్రరాజితమునే పటముగా కల్పించవలెను. ప్రతిదినము పూజించి మూలమంత్రమును జపము చేయువారు శ్రీ వీరభద్రుని అనుగ్రహము వలన సమస్త కోరికలను పడయుచుందురు. మరియు శత్రుబాధలనుండి విముక్తులగుదురు. ఈ యంత్రమునకు యథాశాస్త్రముగ ప్రాణప్రతిష్ఠ చేసి 40000 జపమును దశాంశము హోమమును తర్పణ మార్జనాదికములను చేసి ఆ పిదప ఈ యంత్రమునకు ధారాదత్తము చేసి ధరించినయెడల వివిధ రోగములు నివృత్తి అగును. అత్యున్నతస్థానములో నున్నవారు. ప్రబల శత్రుసృష్టి శత్రుభయములు కలవారు క్లిష్టతరమగు వ్యాజ్యములు గలవారు ఈ యంత్రమును ధరించిన సర్వత్రసుఖము, శత్రు విజయము, వ్యవహారవిజయము మున్నగు వానిని సులభముగ పడయుదురు.

ఈ యంత్రమునకు "పత్రం పుష్పం ఫలం తోయం" అన్నట్లు యథాశక్తిని పత్రము, పుష్పము, ఉదకము, గంధము తాంబూలములున్నగువానిని సమర్పించి నమస్కారముచేసి ప్రతినిత్యము ప్రార్థించుచున్న యెడల శత్రు విజయము, మనశ్శాంతి కలుగును. మరియు ఈ యంత్రమునకు యథావిధిగ పంచపూజలు చేసి ప్రతినిత్యము మూలమంత్రమును జపము చేయువారలకు వాంఛాసిద్ధి, శత్రువిజయము, కార్యసిద్ధి రాజపూజ్యత మున్నగునవి కలుగును. ఇంతియేగాక ప్రతినిత్యము యథాశాస్త్రముగ, షోడశోపచార పూజలను జేయుచూ 'ఓం హ్రాం హ్రీం హ్రూం ఘోరాయ ఘోరతరాయ మహారౌద్రాయ వీరభద్రాయ జ్వాలామాలినే సర్వ దుష్టాపసంహర్త్రే హుం ఫట్ స్వాహా" అను మూలమంత్రమును జపముచేయుచుండిన అతిశీఘ్రమైన శత్రుపురము సులభముగ జయించుట మహోన్నాంఛాసిద్ధి భూతప్రేతపిశాచాది గ్రహబాధలు తొలగుట, గౌరవము యశోవృద్ధి కలుగును.



## శ్రీ వీరభద్ర పంచపూజలు

ఓం లం పృథివీతత్త్వాత్మనే గంధతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ వీరభద్రాయ గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్త్వాత్మనే శబ్దతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ వీరభద్రాయ పుష్పం సమర్పయామి నమః

ఓం యం వాయుతత్త్వాత్మనే స్పర్శతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ వీరభద్రాయ ధూపమాఘ్రాపయామి నమః

ఓం రం వహ్ని తత్త్వాత్మనే తైజసతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ వీరభద్రాయ దీపం సందర్శయామి నమః

ఓం వం అమృతతత్త్వాత్మనే అమృతతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ వీరభద్రాయ అమృతోపహార నైవేద్యం సమర్పయామి నమః

ఓం సం సర్వతత్త్వాత్మనే సర్వతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ వీరభద్రాయ సర్వోపచారపూజాం సమర్పయామి నమః ।

## శ్రీ వీరభద్రమంత్ర జపవిధానము

ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశ కాలౌ సంకీర్త్య, శ్రీమాన్ అముక గోత్రః అముక నామధేయోఽహం శ్రీ వీరభద్ర ప్రసన్న తాప్రాప్తి పూర్వక శ్రీ వీరభద్ర ప్రసాదసిద్ధ్యర్థం శ్రీ వీరభద్ర ప్రసాదేన సర్వాపన్నివృత్తిపూర్వకదీర్ఘాయురారోగ్య ధన కళత్రపుత్ర పౌత్రాద్యనవచ్ఛిన్న సంతతివృద్ధి స్థిరలక్ష్మీ కీర్తి లాభశత్రుపరాజయాదిసదభీష్టఫలసిద్ధ్యర్థం మమ లోకే సభాయాం రాజద్వారే వ్యవహారే శత్రుసంఘే సర్వత్ర యశో విజయ ప్రాప్త్యర్థం శ్రీ వీరభద్రమహామంత్రజపం కరిష్యే । తతః గురు ప్రార్థనం కరిష్యే ।

శ్లో ॥ వందే గురుపదద్వంద్వ మవాఙ్మానసగోచరం ।
రక్తశుక్ల ప్రభామిశ్రమతర్క్యం త్రైపురం మహః ।

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ వీరభద్ర మహామంత్రస్య ।
పరబ్రహ్మ ఋషయే నమః శిరసి,
శ్రీ వీరభద్రో దేవతాయై నమో హృది ।
ఓం బీజాయ నమో నాభౌ
స్వాహా శక్తయే నమో గుహ్యే ।
సర్వదుష్టసంహారణాయ కీలకాయ నమః పాదయోః
శ్రీ వీరభద్ర ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగాయ నమః సర్వాంగే ।

### కరన్యాసము

ఓం హ్రాం హ్రీం హ్రూం అంగుష్ఠాభ్యాం నమః
ఘోరాయ ఘోరతరాయ తర్జనీభ్యాం నమః
మహారౌద్రాయ మధ్యమాభ్యాం నమః
వీరభద్రాయ జ్వాలా మాలినే అనామికాభ్యాం నమః
సర్వదుష్టాన్ సంహర్త్రే కనిష్ఠికాభ్యాం నమః
హుం ఫట్ స్వాహా కరతల కర పృష్ఠాభ్యాం నమః

### హృదయన్యాసము

ఓం హ్రాం హ్రీం హ్రూం హృదయాయ నమః
ఘోరాయ ఘోరతరాయ శిరసే స్వాహా
మహారౌద్రాయ శిఖాయై వషట్
వీరభద్రాయ జ్వాలామాలినే కవచాయ హుం
సర్వదుష్టాన్ సంహర్త్రే నేత్రత్రయాయ వౌషట్
హుం ఫట్ స్వాహా అస్త్రాయ ఫట్

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి లోకత్రయేణ దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ విద్యుత్ప్రభాలోచనముగ్రకేశం
బాలేందుదంష్ట్రాయుతశోభితాననం
సునీలగాత్రం జటయావృతాస్యం ।
వక్త్రం లలాటేక్షిత త్రిపుండ్రం ।
ఇతి ధ్యాత్వా మానసోపచారైస్సంపూజయేత్ ।

### మూలమంత్రము

ఓం హ్రాం హ్రీం హ్రూం ఘోరాయ ఘోరతరాయ మహారౌద్రాయ వీరభద్రాయ జ్వాలామాలినే సర్వదుష్టాన్ సంహర్త్రే హుంఫట్ స్వాహా ।

### మంత్రసిద్ధి క్రమము

ప్రతినిత్యము ఉదయాస్తమయములయందు యథావిధిగా శ్రీ వీరభద్రయంత్రమును పూజించుచు, మూలమంత్రమును లక్షపర్యాయములు జపమును, తద్దశాంశము హోమమును, తద్దశాంశము తర్పణ మార్జన భూతతృప్తులను చేసినయెడల మంత్రసిద్ధియగును. ఈ వీరభద్ర మహాసిద్ధికి మంత్రపురశ్చరణమును జేయుదినములలో బ్రహ్మచర్యవ్రతస్థుడై యుండవలయును.

### మంత్ర ప్రయోజన క్రమము

ఈ యంత్రమును ప్రతినిత్యము పూజించుచు యంత్రవీర్య సిద్ధికిని, చైతన్య ప్రాప్తికిని 40000 పర్యాయములు మూలమంత్ర జపమును, తద్దశాంశము హోమమును, యథావిధిగ తర్పణమార్జనాదులను చేసి, ఆ జపాదికములను యంత్రమునకు ధారాదత్తము చేసి, ఆ యంత్రమును ధరించిన యెడల సకలోపద్రవములు నివృత్తియగును. మరియు శత్రువిజయము వ్యవహారములలో విజయము మున్నగునవి గలుగును.

ఈ యంత్రమును ప్రతినిత్యము పూజించుచు, పదివేల పర్యాయములు మూలమంత్రమును జపము చేసి, జలము నభిమంత్రించి యాజలమును గ్రహ భూత ప్రేత పిశాచాద్యావేశితులయిన వారికి స్నానము చేయించిన యెడల గ్రహభూత ప్రేత పిశాచాదులవలన గలిగిన ఉపద్రవములు, బాధలు తొలగును. ఈ యంత్రమును పూజ చేసి 20000 పర్యాయములు భస్మమును అభిమంత్రించి ఆ భస్మమును భూతజ్వరాదులు గల వారిచే ధరింపచేసిన భూతజ్వరము నివారణమగును.

ఈ యంత్రమునకు ప్రాణ ప్రతిష్ఠ - జీవ న్యాస కళాన్యాసాదులను యథావిధిగా జేసి యంత్రవీర్య సిద్ధికై మూలమంత్రమును 21000 పర్యాయములు జపము జేసి ఆ యంత్రమును గ్రామ మధ్యమునందు స్థాపనము చేసిన యెడల ఆ గ్రామములో గల ఉపద్రవములు గ్రహారిష్టాదులు పశువులు, ప్రజలు మున్నగు వారికి గల ఆధిభౌతిక దుఃఖములు, వ్యాధులు మున్నగునవి తొలగును. ఈ యంత్రమును స్థాపించిన పిమ్మట, మా గుప్త వాస్తులో వ్రాయబడిన ప్రకారము గ్రామదిగ్బంధనము చేసినయెడల ఆ గ్రామము సర్వప్రకారముల వృద్ధినొందును. ఆ గ్రామమందు ప్రజలు పశువులు మున్నగు వివిధ జీవరాసులు సౌఖ్యవంతములుగాను, ఆరోగ్యవంతములుగాను వృద్ధి ప్రదములుగాను యుండును.

# శ్రీ ఆంజనేయ యంత్రము

ఈ ఆంజనేయ యంత్రము అత్యద్భుతమైన మహిమగలది. ఈ యంత్రమును రాగిరేకుపై వేయించిగాని, ఈ యంత్రకాగితమునే పటముగా కట్టించిగాని, ప్రతినిత్యము యంత్రాధిష్ఠానమై యున్న శ్రీ ఆంజనేయస్వామికి "పత్రం పుష్పం ఫలం తోయం" అను రీతిగ పత్రము పుష్పము, ఫలము, ఉదకము, గంధము, గంగ సిందూరము మున్నగునవి యథాశక్తిగ సమర్పించి నమస్కరించి ధ్యానము చేసినయెడల సమస్త కోరికలు నెరవేరును. భూతప్రేత పిశాచాది బాధలు తొలగును. శత్రు విజయము, వ్యవహారవిజయము మున్నగునవి సంప్రాప్తమగును మరియు ఈ యంత్రమునకు యథావిధిగా పంచపూజలు చేసి మూలమంత్రమును యథాశక్తిని జపము చేసిన యెడల వివిధము లగు కష్టములు, దీర్ఘకాల రోగ్యములు, శత్రుభయము, బ్రహ్మ రాక్షసాది క్షుద్రశక్తుల గ్రహబాధలు మున్నగునవి. తొలగిపోయి ఆరోగ్యజయములను బడయుదురు.

ఇంతియేగాక ఈ యంత్రమునకు యథాశాస్త్రముగ ప్రాణప్రతిష్ఠాదులోనర్చి "హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః హనుమతే నమః" అను మూలమంత్రముతో షోడశోపచార పూజలు చేయుచు మంత్ర జపమును చేయు వారలకు సర్వకార్యసిద్ధి సౌఖ్యము, జయము, పిశాచ బ్రహ్మరాక్షసాది బాధానివృత్తి, శత్రుహాని, శత్రువిజయము మున్నగునవి అద్భుతముగా శీఘ్రకాలములో తప్పక కలుగును. పై ప్రకారము యథాశాస్త్రముగా ఇట్టి ఆంజనేయ మంత్ర యంత్రాదులను పూజించువారిని దర్శించిన మాత్రమున భూత ప్రేత పిశాచాది బాధలు, ఉపద్రవములు మున్నగునవి తొలగిపోవును. మిక్కిలి ఆశ్చర్యముగానుండును. ఈ ఆంజనేయ యంత్రమును రాగిరేకుపై చెక్కించి ఆ యంత్రముపైన ఆంజనేయ విగ్రహమును యథాశాస్త్రముగా పెట్టి ప్రతిష్ఠాపన చేసిన యెడల నచ్చోట ప్రదక్షిణము చేయువారలకు సమస్తరోగములు దీర్ఘరోగములు, భూత ప్రేత పిశాచ బ్రహ్మ రాక్షసాది బాధలు తొలగిపోవును.



## శ్రీ స్వప్నాంజనేయ పంచపూజలు

ఓం లం పృథ్వి తత్వాత్మనే గంధతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీ స్వప్నాంజనేయాయ గంధః సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్వాత్మనే శబ్దతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ స్వప్నాంజనేయాయ పుష్పం సమర్పయామి

ఓం యం వాయుతత్వాత్మనే స్పర్శతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీ స్వప్నాంజనేయాయ ధూపమా ఘ్రాపయామి నమః

ఓం రం వహ్ని తత్వాత్మనే తైజసతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ స్వప్నాంజనేయాయ దీపంసం దర్శయామి నమః

ఓం వం అమృతతత్వాత్మనే అమృతతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీ స్వప్నాంజనేయాయ అమృతోప హార నైవేద్యం సమర్పయామి నమః

ఓం సం సర్వతత్వాత్మనే సర్వతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ స్వప్నాంజనేయాయ తాంబూలాది సర్వోప చార పూజాంసమర్పయామి నమః ।

## శ్రీ స్వప్నాంజనేయ మంత్ర జపవిధానము

ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశ కాలౌ సంకీర్త్య. శ్రీమానాముక గోత్రః అముక శర్మ వర్మాదిరహం మమ మాత్మానః శ్రీస్వప్నాంజనేయ ప్రసన్నతా ప్రాప్తి పూర్వక శ్రీస్వప్నాంజనేయ ప్రసాదసిద్ధ్యర్థం శ్రీ స్వప్నాంజనేయ ప్రసాదేనమమాత్మనః సకుటుంబస్య కాయిక వాచిక మానసిక సాంసర్గిక చతుర్విధపాతక నివృత్తిద్వారా ధర్మార్థకామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థసిద్ధ్యర్థం, మమ పురస్థిత సరాణాం స్వప్న కాలాంత సదా భూతభవిష్య ద్వర్తమాన కాలత్రయ వృత్తాంతపరిజ్ఞానసిద్ధ్యర్థం, దూరదృష్టి దూరశ్రవణ సమాగతా నాగత వర్తమాన విజ్ఞాన ప్రబోధనార్థం శ్రీ స్వప్నాంజనేయ మహామంత్రము జపిష్యే

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ స్వప్నాంజనేయ మహామంత్రస్య ।
ఓం బ్రహ్మణే ఋషయే నమః శిరసి.
ఓం గాయత్రీ ఛందసే నమోముఖే ।
శ్రీ స్వప్న హనుమాన్ దేవతా హృది ।
ఓం బీజాయ నమో నాభౌ ।
స్వాహా శక్తయే నమో గుహ్యే ।
హ్రీం కీలకాయనమః పాదయోః
మమ శ్రీ స్వప్నాంజనేయ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే ।

### కరన్యాసము

ఓం హ్రీం అంగుష్ఠాభ్యాంనమః
దూరదృష్టి సమాగతానాగత వర్తమాన తర్జనీభ్యాం నమః
సర్వలోక వృత్తాన్తం మధ్యమాభ్యాం నమః
హనుమన్ అనామి కాభ్యాం నమః
మమ దేహిదేహి కనిష్ఠి కాభ్యాంనమః
స్వాహా కరతలకర పృష్ఠాభ్యాంనమః ।

### హృదయన్యాసము

ఓం హ్రీం హృదయాయనమః
దూరదృష్టి సమాగతానాగత వర్తమాన శిరసేస్వాహా
సర్వలోక వృత్తాన్తం శిఖాయై వషట్
హనుమన్ కవచాయహుం
మమదేహిదేహి నేత్రత్రయాయవౌషట్
స్వాహా అస్త్రాయఫట్

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితిలోక త్రయేణ దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ సమాగతానాగత వర్తమాన
వృత్తాన్త విజ్ఞాన ధరా త్రిలోక్యాః,
దూరశ్రుతిం దూరగతిం సదృష్టిం
స్వప్నేహనుమన్ మమ దేహి నిత్యం ।
ఏవం ధ్యాత్వాలమిత్యాది మానసోపచారైస్సంపూజయేత్ ।

### మూలమంత్రము

ఓం హ్రీం దూరదృష్టి సమాగతానాగత వర్తమాన సర్వలోక వృత్తాన్త విజ్ఞానం హనుమన్ మమదేహిస్వాహా ।

### మాలామంత్రము

ఓం హ్రీం దూర దృష్టిదూరశ్రవణ సమాగతానాగత వర్తమాన సర్వలోక వృత్తాన్త విజ్ఞానం హ్రీం హనుమన్ మమ దేహిమమ సకల జనానాం భూతభవిష్యద్వర్తమాన కాలత్రయవృత్తాన్తం నిత్యం ప్రబోధయ ప్రబోధయ హ్రీం ఓం స్వాహా ।

### మంత్రసిద్ధిక్రమము

శ్లో ॥ లక్షమేకం జపేన్మంత్రం పురశ్చర్యావిధానతః ।
హవేత్పలా శపుష్పైశ్చ దశాంశం విధివాతతః
ఏవం సిద్ధ మనుర్మంత్రీ కామ్యకర్మణియోజయేత్

తా. ప్రతినిత్యము యథాశాస్త్రయముగా శ్రీస్వప్నాంజనేయ యంత్రమునకు సపర్యలుచేసి పురశ్చరణ విధివిధానము ననుసరించి మూలమంత్రమును ఒక లక్ష పర్యాయములు జపము చేయవలయును పిమ్మట జపదశాంశము మోదుగ పుష్పంతో హోమమును, హోమదశాంశము తర్పణమును తర్పణ దశాంశము మార్జనమును మార్జనదశాంశము విప్రభోజనమును చేయవలయును. ఇట్లొనర్చినయెడల మంత్రసిద్ధియగును. మంత్రసిద్ధియైన పిమ్మటనే కామ్యమునందు వినియోగింపవలయును. గాని మంత్రసిద్ధిగాక పూర్వము దానిని ఇతరులకు తెలుపకూడదు. ఇట్లుగాక తెలుపుట ప్రారంభించిన మంత్ర సిద్ధిగాక పోవుటచే కొలది దినములకే ఆ శక్తి తగ్గిపోగలదు. కనుక మంత్రసిద్ధియైన పిమ్మట ఇతరులకు భూతభవిష్యద్వర్తమానములయందలి శుభాశుభములను ప్రదర్శించుటకై కామ్యకర్మలను సాధించవలయును.

### మంత్ర ప్రయోజనక్రమము

మంత్రసిద్ధిని పొందిన సాధకుడు ప్రతినిత్యము ప్రాతః కాలము నందుస్వప్నాంజనేయయంత్రమునకు షోడశోపచార పూజలుచేసి, మూలమంత్రమును 128 పర్యాయములు జపముచేసి, నియతవ్రతబద్ధుడై యుండవలయును. ఇతరులు వచ్చి సాధకుని స్వప్నచేసిన వెంటనే మూలమంత్రమును స్మరించి ధ్యానము చేసినయెడల వారిభూతభవిష్యద్వర్తమానములను శ్రీ స్వప్నాంజనేయస్వామి ప్రబోధించిన ప్రకారము తెలుపవలయును.

రాత్రి కాలమునందు శ్రీ స్వప్నాంజనేయ స్వామిని ధ్యానముచేసి, మూలమంత్రమును ౧౨౮ పర్యాయములు జపము చేసి పిమ్మట వార్య విషయమును స్మరించుచు నిద్రపోయిన యెడల స్వప్నమందుగూడ శ్రీఆంజనేయస్వామి ప్రత్యక్షమై న వార్యవిషయమును గూర్చిన భూతభవిష్యద్వర్తమాన కాలములయందు గలుగు సమస్త శుభాశుభములను స్పష్టముగా తెలుపును. మంత్రసిద్ధియగు వరకు బ్రహ్మచర్య వ్రతము

# శ్రీ మృత్యుంజయయంత్రము

## మూలమంత్రము

"ఓం హౌం ఓం జూం సః భూర్భువస్సువః త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం । ఉర్వారుకమివ బంధనా న్మృత్యోర్ముక్షీయ మామృతాత్ భూర్భువస్సువరోం జూం సః హౌం ఓం"

శ్లో॥ మహామృత్యుంజయం యంత్రందురితాపన్నివారణం। యంత్రప్రాప్య భార్గవశ్శుంభోర్కృతాన్ దైత్యాన జీవయత్। అనుటచే ఈ మృత్యుంజయ యంత్రము వివిధములగు దురితములను, ఆపత్తులను తొలగించి ఆరోగ్యమును, ఆయుర్దాయములను గలుగ చేయును ఈ యంత్రమహిమచే భార్గవ మహాముని మృత్యుంజయ మంత్రమును పఠించి మృత్యుంజయానుగ్రహముబడసి చచ్చిపోయిన రాక్షసులను కూడ అనేక పర్యాయములు బ్రతికింపజేసెను. కనుక ఈ మహామృత్యుంజయ యంత్రమును రాగి రేకుపై వేయించిగాని, ఈ యంత్రకాగితమునే పటముగా కట్టించిగాని, ప్రతినిత్యము ప్రాతఃకాలమందు ఈ యంత్రాధిష్ఠానమై యున్న శ్రీ మృత్యుంజయ దేవునకు "పత్రం పుష్పం ఫలం తోయం" అను విధిగా పత్రము, పుష్పము, ఫలము, ఉదకము, మున్నగునవి సమర్పించి, మూలమంత్రమును 100 సార్లు జపించుచున్నచో సమస్తవ్యాధులు, కష్టములు, జన్మ, అష్టమ ద్వాదశ స్థానములలో సంచరించుచున్న పగ్రహ దోషములున్నగునవి తొలగిపోవును. ఈ యంత్రమునకు యథావిధిగా పంచపూజలు చేసి మూలమంత్రమును యథాశక్తి జపించిన యెడల దీర్ఘవ్యాధులు తొలగును అపమృత్యువును జయించవచ్చును. ఈ యంత్రమునకు యథా శాస్త్రముగా ప్రాణప్రతిష్ఠాదు లొనర్చి మూలమంత్రముతో షోడశోపచార పూజలు చేయుచు మంత్రజపము చేయువారలు అపమృత్యువును జయించి దీర్ఘాయుర్దాయము గలవారగుదురు.



## శ్రీ దక్షిణామూర్తి యంత్రము

"దక్షిణామూర్తి" అనగా పరమశివుని అవతారములలో ఒక అవతారపు పేరు. ఈ దక్షిణామూర్తి యంత్రమును రాగిరేకుపై వేయించవలెను. ఈ యంత్రకాగితమునే పటముగా కట్టించి గాని ప్రతినిత్యము ప్రాతఃకాలమందు యంత్రాధిష్ఠానమై యున్న శ్రీ దక్షిణామూర్తి దేవునకు "పత్రం పుష్పం ఫలం తోయం" అను రీతిని పత్రము, పుష్పము, పండు, ఉదకము మున్నగు వానిని యథాశక్తిగా సమర్పించి, నమస్కరించి ధ్యానము చేసిన యెడల సమస్త కోరికలు నెరవేరును. విద్యా ప్రాప్తి, ఐశ్వర్యప్రాప్తి, యశో గౌరవములు కలుగును. మరియు ఈ యంత్రమునకు యథావిధిగా పంచ పూజలుచేసి, మూల మంత్రమును యథాశక్తిగ జపించిన యెడల వివిధములగు కష్టనష్టములు తొలగి ఐశ్వర్య వంతుడును, విద్యావంతుడును, గొప్పయశస్సు గాంచినవాడును, మేధావియు నగును.

ఇతియుగాక, ఈ యంత్రమునకు యథా శాస్త్రముగా ప్రాణ ప్రతిష్ఠాదులొనర్చి "ఓం నమో భగవతే దక్షిణామూర్తయే మహ్యం మేధాం ప్రయచ్ఛ స్వాహా" అను మూలమంత్రముతో షోడశోపచార పూజలు చేయుము. మంత్రజపము చేయువారలు ఐశ్వర్యవంతులు విద్యావంతులునై ప్రకాశించుచుందురు. యంత్ర పూజవలన సులభముగ ఐశ్వర్య విద్యలను పొందవచ్చును.



శ్రీ

# ౧ హయగ్రీవ మహాయంత్రము

ఈ యంత్రమును రాగిరేకునందు చెక్కించి పీఠము నందమర్చి ప్రతిదినమును స్నానముచేసి గంధపుష్పాక్షత నివేదనముల షోడశోపచార పూజచేయుచు ౧౦౦౦౮ చొప్పున శ్రీహయగ్రీవ మహామంత్రమును ౧౦౮ చొప్పున గాయత్రీ మహామంత్రమును జపించుచు లక్ష జపము పూర్తిచేసిన వారు మంత్రసిద్ధి పొంది విద్యావేత్తలయి సంపత్తులను అనుభవించగలరు.



శ్రీ

# లక్ష్మీనారాయణ యంత్రము

ఈ లక్ష్మీనారాయణ యంత్రము అత్యుత్తమమై నదియు అష్టైశ్వర్య ప్రదమైనదియు, వివిధాపత్తులను తొలగించునదియు నగును. ఈ లక్ష్మీనారాయణ యంత్రమును రాగిరేకుపై చేయించవలెను. ఈ యంత్ర కాగితమును పటముగా కట్టించవలెను ఈ యంత్రాధిష్ఠానమై యున్న శ్రీ లక్ష్మీనారాయణులకు "పత్రం పుష్పం, ఫలం, తోయం" అనున్యాయానుసారముగ పత్రపుష్ప ఫల చందనోదకములను యథాశక్తిగ సమర్పించి, నమస్కారము చేయుచు ధ్యానముచేయుచున్న యెడల దరిద్రులకుగూడ ఐశ్వర్యము సంప్రాప్తమగును. ఇంతియగాక, ఈ మంత్రమునకు యథావిధిగా పంచపూజలుచేసి మూల మంత్రమును యథాశక్తిని జపముచేయుచున్న యెడల వివిధములగు కష్టనష్టములుతొలగి ధనాదాయము గలుగును ఋణవిముక్తినొంది ఐశ్వర్యవంతు లగుదురు. మరియు పలువిధములగు ఆపదలనుండి విముక్తులై సౌఖ్యారోగ్యైశ్వర్య వంతులగుదురు. ఇంతియగాక యీ యంత్రము నకు యథాశాస్త్రముగా ప్రాణ ప్రతిష్ఠాదులొనర్చి 'ఓం హ్రీం హ్రీం శ్రీం శ్రీం లక్ష్మీ నారాయణాయ నమః' అనుమూలమంత్రముతో షోడశోపచార పూజలు చేయువారలకు దారిద్ర్యనిర్మూలనము, ధన కనక వస్తు వాహనాద్య ఖండైశ్వర్య ప్రాప్తి, సర్వ కామ్య సాధనము, సౌఖ్యారోగ్య విజయములు మున్నగునవి సం ప్రాప్తించును. ఈ యంత్రమును ప్రతి మానవుడు ముఖ్యముగా గృహమందుంచుకొని ప్రతినిత్యము పూజచేయుచున్న యెడల ఇహ పర సౌఖ్యములను పొందువాడగును.

## శ్రీ లక్ష్మీ నారాయణ పంచపూజలు

ఓం హ్రీం హ్రీం శ్రీం శ్రీం లక్ష్మీనారాయణాయ ఓం లం పృథివీ తత్త్వాత్మికంగంధం సమర్పయామి నమః

ఓం హ్రీం హ్రీం శ్రీం శ్రీం లక్ష్మీనారాయణాయ ఓం హం ఆకాశతత్త్వాత్మికం పుష్పం సమర్పయామినమః

ఓం హ్రీం హ్రీం శ్రీం శ్రీం లక్ష్మీనారాయణాయ ఓం యం వాయుతత్త్వాత్మికం ధూపమాఘ్రాపయామి నమః



# శ్రీ కుబేర యంత్రము

ఈ కుబేర యంత్రమును రాగి రేకుపై చెక్కించిగాని, ఈయంత్ర కాగితమునే పటముగా కట్టించిగాని ప్రతిదినము పూజించి, మూలమంత్రమును జపము చేయువారు కుబేరుని అనుగ్రహమువలన గొప్పఐశ్వర్య వంతులగుదురు. దారిద్ర్యము నుండి విముక్తులగుదురు. ఈ కుబేర యంత్రమునకు యథాశాస్త్రీయముగా ప్రాణప్రతిష్ఠాదు లొనర్చి 40000లు జపమును 4000 హోమమును, తిలలు ఆజ్యములతో హోమము చేసి, పిమ్మట 1008 పర్యాయములు పంచాహుత్యాఖ్య హోమమును చేసినపిమ్మట నాయంత్రమును వ్యాపార స్థానముల యందుగాని, ధనాగారములయందు గాని పెట్టినయెడల వచ్చుట ధనవృద్ధి యగుటయేగాక అక్షయముగా ధనముండును. మరియు వ్యాపారాదుల యందు ఆకస్మికముగా అత్యధిక ధనాదిప్రాప్తులు కల్గును. ఈయంత్ర సహాయముతో నిక్షిప్తాది ధనప్రాప్తినిగూడ పొందవచ్చును.

ఈయంత్రమునకు "పత్రం పుష్పం తోయం" అన్నట్లు యథాశక్తిని పత్ర పుష్ప ఫల తాంబూలాదులను సమర్పించి నమస్కారముచేసి, ప్రతినిత్యము ప్రార్థించుచున్న యెడల ఋణవిముక్తి, ఆర్థికదుస్థితి, ధనహీనత మనోవికలత్వము తొలగిపోవును. మరియు ధన సంపాదనమును, వృత్తిలేనివారికి వృత్తిని సమకూర్చును. ఈ యంత్రమునకు యథావిధిగ పంచపూజలు చేసి ప్రతినిత్యము మూలమంత్రమును జపము చేయు వారలకు వాంఛాసిద్ధి, గౌరవము, రాజపూజ్యత ధనార్జనము, ఋణవిముక్తి ఆర్థిక సౌఖ్యము మున్నగునవి కలుగును మరియు ప్రతినిత్యము షోడశోపచార పూజలు చేయుచు యథారీతిగ మూలమంత్రమును జపము చేయువారు కుబేరునితో సమానమైన ఐశ్వర్యవంతులగుదురు. ఇది అద్భుతమైన మహిమగలదని విశేషించి వ్రాయుట అతిశయోక్తి అగును.

## కుబేర పంచపూజలు

ఓం లం పృథివీ తత్వాత్మనే గంధతన్మాత్ర ప్రకృత్యా నందాత్మ కాయ శ్రీ కుబేరాయ గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్వాత్మనే శబ్దతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీ కుబేరాయ పుష్పం సమర్పయామి నమః

ఓం యం వాయుతత్వాత్మనే స్పర్శతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీకుబేరాయ ధూపమాఘ్రాపయామి నమః



# శ్రీ దత్తాత్రేయ యంత్రము

దత్తాత్రేయుడనగా బ్రహ్మవిష్ణు శివాత్మకమైన మూర్తి త్రయ స్వరూపుడు గనుక నీదత్తాత్రేయ యంత్రము అత్య ద్భుతమైన మహిమ గలదని వేరుగ వ్రాయనక్కరలేదు. ఈ యంత్రమును పూజించిన ప్రాచీనులు గొప్పగొప్పతత్వస్థితిని బడసియున్నారు.

ఈ యంత్రమును రాగిరేకుపై వేయించిగాని ఈ యంత్రరాగితమునే పటముగా కల్పించిగాని ప్రతినిత్యము యంత్రా ధిష్ఠాతయైన శ్రీ దత్తాత్రేయ భగవానునకు "పత్రం పుష్పం ఫలం తోయం" అనురీతిని పత్రము, పుష్పం, ఫలము ఉదకము, కుంకుమమున్నగువానిని యథాశక్తిగ సమర్పించి నమస్కరించుచు ధ్యానము చేసిన యెడల సమస్తకోరికలు నెరవేరుచుండును. ఐశ్వర్యము, వ్యవహార విజయము మున్నగునవి గలుగును.

మరియు యీ యంత్రమునకు యథావిధిగ ప్రతి నిత్యము ఉదయాస్తమయములందు పంచపూజలను చేయుచు మూల మంత్రమును జపముచేసిన యెడల వివిధకష్టనష్టములు తొలగి శత్రునాశనము విజయము ఐశ్వర్యము గలుగును. సమస్త కోరికలు నెరవేరును.

ఇంతియగాక నీ యంత్రమునకు యథాశాస్త్రముగ జీవన్యాస ప్రాణన్యాస కళాన్యాస ప్రాణ ప్రతిష్ఠాదులొనర్చి ఆవరణ సపర్యను చేసి "ఓం హ్రీం పరబ్రహ్మ పరమాత్మను హరిహర బ్రహ్మేంద్రాయ దత్తాత్రేయాయ స్వాహా" అను మంత్రముతో షోడశోపచార సపర్యలు చేసి, మూలమంత్రమును యథాశాస్త్రీయముగ జపము చేయుచున్న యెడల ఎట్టి కఠిన తరమగు కార్యమునైనను సులభముగ సాధించు సామర్థ్యము ఏర్పడును. ఈ యంత్రపూజను చేయుచు మూలమంత్రమును జపము చేయువారికి వశీకరణాది అష్టకర్మలలో చెప్పబడిన తంత్రములు, యక్షిణీతంత్రము ఘుటికా పాదుకాది సిద్ధులు, అంజనాదిసిద్ధులు సులభముగా సిద్ధించును. ఈ దత్తాత్రేయుని అనుగ్రహము లేనిదే యేతంత్రమును సులభముగా సిద్ధింపదు.



## శ్రీ దత్తాత్రేయ పంచపూజలు

ఓం లం పృథివీ తత్త్వాత్మనే గంధతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ, శ్రీ దత్తాత్రేయాయ భగవతే గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్త్వాత్మనే శబ్ద తన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ, శ్రీ దత్తాత్రేయాయ భగవతే పుష్పం సమర్పయామి నమః

ఓం యం వాయుతత్త్వాత్మనే స్పర్శ ఆదత్తాత్రేయాయ భగవతే ధూపమాఘ్రాపయామి నమః

ఓం రం వహ్ని తత్త్వాత్మనే తైజసన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీ దత్తాత్రేయాయ భగవతే దీపం దర్శయామి నమః

ఓం వం అమృతతత్త్వాత్మనే అమృతతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీదత్తాత్రేయాయ భగవతే అమృతోపహార నివేదనం సమర్పయామి నమః

ఓం సం సర్వతత్త్వాత్మనే సర్వతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీ దత్తాత్రేయాయ భగవతే తాంబూలాది సర్వోపచార పూజాం సమర్పయామినమః

## శ్రీ దత్తాత్రేయ మంత్ర జపవిధానము

ఆచమ్య, ప్రాణానాయమ్య దేశ కాలౌ సంకీర్త్య, శ్రీమాన ముకగోత్రఃఅముక నామధేయో ఽ హం మమాత్మన స్సకుటుంబస్య శ్రీ దత్తాత్రేయ ప్రసన్న తాప్రాప్తి పూర్వక శ్రీ దత్తాత్రేయ ప్రసాదసిద్ధ్యర్థం, మమ శ్రీ దత్తాత్రేయ ప్రసాదేన సర్వాప న్నివృత్తిపూర్వక దీర్ఘాయుర్విపుల ధన పుత్ర పౌత్రాద్యన వచ్ఛిన్న సంతతివృద్ధి స్థిరలక్ష్మీ కీర్తి లాభ శత్రుపరాజయాది సదభీష్ట ఫలసిద్ధ్యర్థం శ్రీ దత్తాత్రేయ మహామంత్ర జపం కరిష్యే

### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ దత్తాత్రేయ మహామంత్రస్య ।
బ్రహ్మ ఋషయే నమశ్శిరసి ।
పంక్తిచ్ఛందసేనమో ముఖే ।
శ్రీ దత్తాత్రేయాయ భగవతే దేవతాయై నమోహృది
ఆం బీజాయనమోగుహ్యే ।
హ్రీం శక్తయే నమో గుహ్యే ।
క్రోం కీలకాయనమః పాదయోః ।

శ్రీ దత్తాత్రేయ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగాయ నమస్సర్వాంగే ।

### కరన్యాసము

అం కం ఖం గం ఘం ఙం ఆం అంగుష్ఠాభ్యాం నమః
ఇం చం ఛం జం ఝం ఞం ఈం తర్జనీభ్యాం నమః
ఉం టం ఠం డం ఢం ణం ఊం మధ్యమాభ్యాం నమః
ఏం తం థం దం ధం నం ఐం అనామికాభ్యాంనమః
ఓం పం ఫం బం భం మం ఔం కనిష్ఠి కాభ్యాం నమః
అం యం రం ల వం శ షం సం హం ళం క్షం అః కరతలకరపృష్ఠాభ్యాం నమః

### హృదయన్యాసము

అం కం ఖం గం ఘం ఙం ఆం హృదయాయనమః
ఇం చం ఛం జం ఝం ఞం ఈం శిరసే స్వాహా
ఉం టం ఠం డం ఢం ణం ఊం శిఖాయై వషట్ ।
ఏం తం థం దం ధం న ఐం కవచాయ హుం ।
ఓం పం ఫం బంభం మంఔం నేత్రత్రయాయవౌషట్ ।
అం యం రం లం వం శం షం సం హం ళం క్షం అః అస్త్రాయఫట్ ।

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి లోకత్రయేణ దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ జటాధరం పాండురాంగం శూలహస్తం కృపానిధిం
సర్వరోగహర దేవం దత్తాత్రేయ మహం భజే ।

### మూల మంత్రము

ఓం హ్రీం పరబ్రహ్మపరమాత్మనే హరి హరబ్రహ్మం రూపాయదత్తాత్రేయాయ స్వాహా ॥

### మంత్రసిద్ధి కర మంత్రము

ఓం ఆం హ్రీం క్రోం ఓంఐం ఓం హ్రీం ఓం హ్రాం ఓం ఓం నమో దత్తాత్రేయాయ బ్రహ్మ విష్ణు శివాత్మకాయ త్రిగుణాత్మనే సర్వమంత్ర యంత్ర తంత్ర సిద్ధిం కురుకురు కాళి కాళి దర్శయ హ్రీం ఓం స్వాహా ॥

### మంత్రసిద్ధి కరమగు వేరొక మంత్రము

ఓం హ్రీం ఆం హ్రీం క్రోం పరబ్రహ్మ పరమాత్మనే నమః ఉత్పత్తిస్థితి ప్రళయకరాయ బ్రహ్మ హరిహరాయ త్రిగుణాత్మనే సర్వకౌతుకాని దర్శయదర్శయ దత్తాత్రేయాయ నమః మంత్ర యంత్ర తంత్ర సిద్ధిం కురుకురు స్వాహా ॥ ఓం హ్రీం ఓం హ్రీం ఓం నమో దత్తాత్రేయాయ సర్వ భూతాదివారాయ మానసిద్ధిం కురుకురు స్వాహా ॥

### మంత్ర సిద్ధి క్రమము

అస్య పునశ్చరణం లక్షత్రయజపః, తద్దశాంశో మృత హోమః, తద్దశాంశేన తర్పణమార్జన బ్రాహ్మణభోజనాని కుర్యాత్, ఏవంకృతే మంత్రసిద్ధిర్భవతి, సిద్ధేమంత్రే ప్రయోగాన్ సాధయేత

ఈ మంత్రములలో యే మంత్రమునైనను మూడు లక్షల పర్యాయములు జపము, తద్దశాంశము మృతహోమము తద్దశాంశము తర్పణము, తద్దశాంశము మార్జనము, తద్దశాంశము బ్రాహ్మణ భోజనాదులు యథాశాస్త్రీయముగ జేసినయెడల మంత్రసిద్ధి యగును. మంత్రసిద్ధియైన పిమ్మట ప్రయోగములను సాధింప వలయును.

### మంత్ర ప్రయోగవిధి క్రమము

బహుళ అష్టమి మొదలు చతుర్దశివరకు ప్రతినిత్యము భక్తి శ్రద్ధలతో యథాశాస్త్రీయముగ, యెనిమిది వేల పర్యాయములు జపము చేయుచు, బహుస్తముచే తద్దశాంశము మార్జనము, తద్దశాంశము బ్రాహ్మణభోజనాదులు యథాశాస్త్రీయముగ చేసినయెడల మంత్ర సిద్ధియగును. మంత్రసిద్ధియైన పిమ్మట ప్రయోగమును సాధింప వలయును.

బహుళ అష్టమి మొదలు చతుర్దశి వరకు ప్రతినిత్యము భక్తిశ్రద్ధలతో యథాశాస్త్రీయముగ, యెనిమిదివేల పర్యాయములు జపము చేయుచు, బహుస్తమున తద్దశాంశము హోమమును తద్దశాంశము తర్పణము చేసినయెడల ధనము దాన్యము సంతానము సౌభాగ్యము ఆరోగ్యము గలుగును.

ఈ దత్తాత్రేయ మంత్రయంత్రములెన్నియో సాధనలుగలవు। వానిని గురువులవల్లగాని తంత్రములందుండిగాని సేకరించుకొనవలయును ।

ఓం వం అమృతతత్త్వాత్మనే అమృతతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీధన్వంతరయే అమృతోపహార నివేదనం సమర్పయామి నమః

ఓం సం సర్వతత్త్వాత్మనే సర్వతన్మాత్ర ప్రకృత్యానందాత్మకాయ శ్రీ ధన్వంతరయే తాంబూలాది సర్వోపచారపూజాం సమర్పయామి నమః

### శ్రీ ధన్వంతరీ మంత్రజప విధానము

అస్య శ్రీ ధన్వంతరీ మహామంత్రస్య ।
నారాయణ భగవాన్ ఋషయే నమశ్శిరసి ।
పంక్తిచ్ఛందసే నమో ముఖే ।
శ్రీ ధన్వంతరిర్భగవాన్ దేవతాయై నమోహృదయే ।
ఓం వం బీజాయనమః నాభౌ ।
ఓం హ్రీం శక్తయే నమోగుహ్యే ।
ఓం స్వాహా కీలకాయనమః పాదయోః
శ్రీ ధన్వంతరీ ప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగాయ నమస్సర్వాంగే ।

### కరన్యాసము

ఓం హ్రాం వాం అంగుష్ఠాభ్యాం నమః
ఓం హ్రీం వీం తర్జనీభ్యాం నమః
ఓం హ్రూం వూం మధ్యమాభ్యాం నమః
ఓం హ్రైం వైం అనామికాభ్యాం నమః
ఓం హ్రౌం వౌం కనిష్ఠికాభ్యాం నమః
ఓం హ్రః వః కరతలకరపృష్ఠాభ్యాం నమః

### హృదయ న్యాసము

ఓం హ్రాం వాం హృదయాయనమః
ఓం హ్రీం వీం శిరసే స్వాహా
ఓం హ్రూం వూం శిఖాయై వషట్
ఓం హ్రైం వైం కవచాయహుం
ఓం హ్రౌం వౌం నేత్రత్రయాయ వౌషట్
ఓం హ్రః వః అస్త్రాయఫట్

### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితి లోకత్రయేణ దిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ సిన్ధోరున్మ త్యమానా దమృత కృతకరః కో ఒ పి దేవోస్య దీయ
ప్రాజ్యం పీయూషకోశం శతశతముదితైః ప్రాణలోకస్య తారేత్
కర్వే ఒ క్యస్మింశ్చ భూయః ప్రసదమృతరహింగా మతా శివ్యపర్త్రే
తస్యర్థస్య తరిల్నో వ్యసనురతి తమః శ్రీ ధన్వోంరానిరామా ।

### మూల మంత్రము

ఓం హ్రీం వం ధన్వంతరయే అమృతహస్తాయ సర్వరోగ నివారణాయ వం హ్రీం ఓం స్వాహా ॥

### మంత్రాంతరము

ఓం హ్రీం వం ధన్వంతరయే ఓం హాం వీం హ్రూం అమృత కలశహస్తాయ హ్రీం హ్రీం సర్వవ్యాధివిధ్వంసనాయ సకల జనవందితాయ హ్రీం ఓం స్వాహా ॥

### మంత్రసిద్ధి క్రమము

ఈ మంత్రములలోనే మంత్రమైనను మూడు లక్షల పర్యాయములు పురశ్చరణము చేసిన మంత్రసిద్ధి యగును. అనగా ప్రతినిత్యము యంత్రమునకు యథాశాస్త్రీయముగ పూజను చేయుచు మూలమంత్ర జపమును, జపదశాంశము హోమమును హోమదశాంశము తర్పణమును, తర్పణదశాంశ మార్జనమును, మార్జన దశాంశము భూతతృప్తిని చేయవలయును. ఇట్లొనర్చిన మంత్రసిద్ధి యగును. మంత్రసిద్ధియైన పిమ్మట కార్యములను సాధింపవలయును.

### మంత్రప్రయోగ క్రమము

ప్రతినిత్యము యంత్రమును పూజించుచు గుగ్గిలముతో హోమము చేసినయెడల సాధారణ వ్యాధులన్నియు తొలగి పోవును. తిలలు ఆజ్యము హోమము చేసిన యెడల అజీర్ణ వ్యాధులు దీర్ఘవ్యాధులు నశించిపోవును. తెల్ల తామరపుష్పములతో హోమము చేసిన యెడల క్షయవ్యాధి తొలగిపోవును.

ఈ యంత్రమును రాగిరేకుపై చేయించి యథాశాస్త్రీయముగ ప్రాణప్రతిష్ఠా పూజాదికములను చేయించి యంత్ర సిద్ధికై పదివేల పర్యాయములు మూలమంత్రమును జపము చేసి, జపదశాంశము సంపాతాజ్య హోమము చేసి యంత్రమునకు ధారదత్తముచేసి, ఆ యంత్రమును ఒక తాయెత్తులో పెట్టిగాని కడియములో పెట్టి కుడిభుజమున ధరించిన యెడల సమస్త వ్యాధులు, అసాధ్య వ్యాధులు, దీర్ఘవ్యాధులు తొలగి శీఘ్రముగా ఆరోగ్యము సంప్రాప్తించును.

(255 పేజీ తరువాయి)

ప్రతివాడు ఆత్మానుభవం కలిగి జన్మరాకుండా చేసికోవడానికే, అట్టి ఆత్మసాక్షాత్కారానికే మొదటి మెట్టు 'యమం' యమంలో ఒకటియే అపరిగ్రహం. మనుష్యులు తమ అక్కరకు మించి ఒక పూచిక పుల్లయినా వాడరాదు. అదే అపరిగ్రహం. అపరిగ్రహం ఆత్మసాక్షాత్కారానికి సాధనం. కడుపునకు కూడు, త్రాగడానికి నీరు, ఉనికికి ఒక పూరిపాక, కట్టుకోవడానికి ఒక గుడ్డ. ఇవి ముఖ్యావసరాలు. ప్రాణాలు కాపాడుకోవడానికి ఈ నాలుగున్నూ పరికరాలు. ఇవి అన్నీ భూమినుండే ఉత్పన్నమవుతవి. కడకు మనము కలిసేదికూడా ఆ భూమిలోనే. ప్రస్తుతం మనకు దొరికే ఈ వస్తువులను పొదుపుగా వాడుకోవాలి. మాన రక్షణకోసం మనం బట్టలు కట్టుకుంటాం. పత్తితో నేయబడిన బట్టలతో, మనకు ఆప్రయోజనం తీరుతుంది. ఆడంబరంగా ఉండాలని వెలగల దుస్తులను కట్టుకోకపోతే యేమి? అట్లా కట్టుకుంటేనే కాని ఇతరులు గౌరవంతో చూడరని దురభిప్రాయం కాక, ఇందుకు వేరే కారణం ఉందా? ఒక కుటుంబం, వెలగల బట్టలకై చేసే ఖర్చుతో దాదాపు అయిదు కుటుంబాలకు కావలసిన సాధారణమైన బట్టలుదొరుకుతవి. ఆడంబరం కోసం కట్టే బట్టలు పట్టుబట్టలే అయి వుంటే, అవి మనకు పాపాన్ని ప్రోగుచేసి పెడతవి. పట్టుబట్టలకు ఒకటింటికి లక్షలాది జీవాలను చంపాలి. మనము కట్టుకొనే బట్టలు సాధ్యమయినంతవరకు హింసచేయకుండా ఉండే ఉపాయాల వల్ల ఉత్పత్తి అయేవిగా చూచుకోవాలి. మనము కట్టే బట్టలు సాధారణులందరూ కట్టుకొనేటటువంటివిగాను ఉండాలి.

# శ్రీ ధన్వంతరీ యంత్రము

ఈ ధన్వంతరీ యంత్రము ఆరోగ్యమును ప్రసాదించుటలో అత్యుత్తమమైనది. ఈ ధన్వంతరీ యంత్రమును ఒక రాగిరేకుపై చెక్కించిగాని ఈ యంత్ర కాగితము పటముగా కట్టించి గాని ప్రతినిత్యము ఉదయాస్తమయము లందు యంత్రాధిష్ఠితయై యున్న ధన్వంతరీ భగవానునకు "పత్రం పుష్పం ఫలం తోయం" అను శాస్త్రానుసారము భక్తిశ్రద్ధలతో పత్రము, పుష్పము, ఫలము, ఉదకము, అక్షతలుమున్నగు వానిని సమర్పించి నమస్కరించు చున్న యెడల దీర్ఘవ్యాధులు, పలువిధములగు అనారోగ్యములు నశించి సుఖము గలుగును.

ఇంతియేకాక ఈ యంత్రమునకు యథావిధిగా పంచపూజలు చేసి మూలమంత్రమునుజపము చేయు చున్న యెడల యెట్టికఠినతరమైన వ్యాధులున్నను నశించును మరియు సుఖము మహోత్సాహముగలుగును.

మరియు నీ యంత్రమునకు ప్రాణవ్యాసము జీవ వ్యాసము, కళావ్యాసము మున్నగునవి చేసి, యథాశాస్త్రీయముగ ప్రాణ స్థాపనాదులొనర్చి "ఓం హ్రీం వం ధన్వంతరయే ఓం వాం ఓం హ్రూం అమృత కలశహస్తాయ హ్రీం హ్రీం సర్వవ్యాధి నిర్మూలనాయ సకలజనవందితాయ హ్రీం ఓం స్వాహా" అను మూలమంత్రముతో షోడశోపచార పూజలను చేయుచు మూల మంత్రమును యథాశక్తి జపముచేయుచున్న యెడల సమస్త వ్యాధులు, దీర్ఘవ్యాధులు, అసాధ్యవ్యాధులు నివృత్తియగును. ఈ యంత్ర పూజా జపాదులు యెవరిపేరుతో చేసినవారికి అసాధ్యమైన వ్యాధులు కూడా తొలగిపోవును. దీనిని వైద్యులు చేయుట సర్వదా శ్రేయస్కరము.



## శ్రీ ధన్వంతరీ పంచపూజలు

ఓం లం పృథివీతత్త్వాత్మనే గంధతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీ ధన్వంతరయే గంధం సమర్పయామి నమః

ఓం హం ఆకాశతత్త్వాత్మనే శబ్దతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీ ధన్వంతరయే పుష్పం సమర్పయామి నమః

ఓం యం వాయుతత్త్వాత్మనే స్పర్శతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీధన్వంతరయే ధూపమాఘ్రాపయామి నమః

ఓం రం వహ్ని తత్త్వాత్మనే తైజసతన్మాత్ర ప్రకృత్యా నందాత్మకాయ శ్రీ ధన్వంతరయే దీపం దర్శయామి నమః

## స్వర్ణాకర్షణ శ్రీ భైరవ పంచపూజలు

ఓం నమోభగవతే స్వర్ణాకర్షణ భైరవాయ ఓం లం పృథివీ తత్త్వాత్మకం గంధం సమర్పయామి నమః

ఓం నమో భగవతే స్వర్ణాకర్షణ భైరవాయ ఓం హం ఆకాశతత్త్వాత్మకం పుష్పం సమర్పయామినమః

ఓం నమో భగవతే స్వర్ణ కర్షణభైరవాయం ఓం యంవాయుతత్త్వాత్మకం ధూపమాఘ్రాపయామినమః ।

ఓం నమో భగవతే స్వర్ణాకర్షణ భైరవాయ ఓం రం వహ్ని తత్త్వాత్మకం దీపం దర్శయామినమః

ఓం నమోభగవతేస్వర్ణాకర్షణ భైరవాయఓం వం అమృత తత్త్వాత్మకం అమృతోపహార నైవేద్యం సమర్పయామి నమః

ఓం నమోభగవతే స్వర్ణాకర్షణ భైరవాయ ఓం సం సర్వతత్త్వాత్మకం సర్వోపచార పూజాం సమర్పయామినమః

### శ్రీ భైరవ మంత్ర జప విధానము

ఆచమ్య, ప్రాణాయామమ్య,దేశకాలౌ సంకీర్త్య మమా ఉత్పన్న సకలయింబన్య శ్రీ స్వర్ణాకర్షణ భైరవ ప్రసాదేన సకలైశ్వర్య ప్రాప్త్యర్థం శ్రీ స్వర్ణాకర్షణ సిద్ధ్యర్థం శ్రీ స్వర్ణాకర్షణ మంత్రజపం కరిష్యే ।

తత్ర గురు ప్రార్థనం కరిష్యే ।

శ్లో ॥ వందేగురు పదద్వంద్వ మవాఙ్మన సగోచరం ।
రక్తశుక్ల ప్రభామిశ్రమతర్క్యం త్రైపురంమహః ।

#### ఋష్యాదిన్యాసము

అస్య శ్రీ స్వర్ణాకర్షణ భైరవమహామంత్రస్య ।
బ్రహ్మఋషయే నమః శిరసి
పంక్తిశ్ఛందసే నమః ముఖే ।
శ్రీ స్వర్ణాకర్షణ భైరవ దేవతాయై నమః హృది ।
హ్రీం బీజాయ నమః నాభౌ ।
హ్రీం శక్తయే నమః గుహ్యే ।
శ్రీం కీలకాయనమః పాదయోః ।

వం హ్రీం శ్రీం స్వర్ణాకర్షణ భైరవ ప్రసాదసిద్ధ్యర్థం స్వర్ణరాశిప్రాప్తయే స్వర్ణాకర్షణ భైరవ మంత్రజపేవినియోగః

#### కరన్యాసము

వం హ్రీం శ్రీం వం శ్రీం ఆపదుద్ధారణాయ అంగుష్ఠాభ్యాం నమః హ్రాం హ్రీం హ్రూం అజామలబద్ధాయ తర్జనీభ్యాం నమః లోకేశ్వరాయ మధ్యమాభ్యాం నమః
స్వర్ణాకర్షణ భైరవాయ అనామికాభ్యాం నమః
మమ దారిద్ర్య విద్వేషణాయ కనిష్ఠికాభ్యాం నమః
మహాభైరవాయనమః శ్రీం హ్రీం వం కరతలకరపృష్ఠాభ్యాం నమః ।

#### హృదయన్యాసము

వం హ్రీం శ్రీం వం శ్రీం ఆపదుద్ధరణాయ హృదయాయనమః
హ్రాం హ్రీం హ్రూం అజామలబద్ధాయ శిరసేస్వాహా ।
లోకేశ్వరాయ శిఖాయై వషట్ ।
స్వర్ణాకర్షణ భైరవాయ కవచాయహుం ।
మమ దారిద్ర్య విద్వేషణాయ నేత్రత్రయాయ వౌషట్
మహాభైరవాయ నమః శ్రీం హ్రీం వం అస్త్రాయఫట్

#### దిగ్బంధనము

ఓం భూర్భువస్సువరోమితిదిగ్బంధః

#### ధ్యానము

శ్లో ॥ పీతవర్ణం చతుర్బాహుం త్రినేత్రం పీతవాససం।
అక్షయ స్వర్ణమాణిక్యం తటిత్పూరిత పాత్రకం
అభీప్సితం మహాశూలం తోమరం చామరద్వయం।
సర్వాభరణ సంపన్నంముక్తాహారోప శోభితం ।
మదోన్మత్తం సుఖాసీనం భక్తానాం చ వరప్రదం ।
సంతతం చింతయే దృశ్యం భైరవం సర్వసిద్ధిదం।
పారిజాత ద్రుమకాంతారస్థితే మణిమండపే ।
సింహాసనగతం ధ్యాయేద్భైరవం స్వర్ణదాయినం ।

శ్లో ॥ గాంగేయ పాత్రం ఢమరుం త్రిశూలం
వరంకరైస్సందధతం త్రినేత్రం,
దేవ్యాయుతం తప్త సువర్ణవర్ణ
స్వర్ణాకృతిం భైరవమాశ్రయామి ।

ఇతిధ్యాత్వా మానసోపచారై స్సంపూజయేత్ ।

#### మూల మంత్రము

వం హ్రీం శ్రీం వం శ్రీం ఆపదుద్ధారణాయ హ్రాం హ్రీం హ్రూం అజామలబద్ధాయ లోకేశ్వరాయ స్వర్ణాకర్షణభైరవాయ మమ దారిద్ర్య విద్వేషణాయ మహాభైరవాయ నమః శ్రీం హ్రీం వం.

#### మంత్రసిద్ధి క్రమము

శ్లో ॥ లక్షం జపే ద్దశాంశేన పాయసైర్హూయ యాత్యధీః ।
దశాంశం తర్పయేత్త క్షీరైర్మార్జయేత్స దశాంశతం ।
బ్రాహ్మణభోజనయే త్తస్మాన్మంత్రసిద్ధిర్న సంశయః

తా ॥ ఈ యంత్రమును యథాశాస్త్రముగ ప్రతినిత్యము పూజించుచు, బ్రహ్మచర్య ప్రతిష్ఠితో పురశ్చరణ నియమముల ననుసరించుచు లక్షపర్యాయములు జపమును, పదివేల పర్యాయములు గోక్షీరములతో తయారుచేయబడిన పాయసముతో హోమమును, వెయ్యిపర్యాయములు, గోక్షీరములతో తర్పణమును, తిరుగ వెయ్యిపర్యాయములు పాయసముతో హోమమును, అంత్యములో బ్రాహ్మణ భోజనమును యథావిధిగ చేసిన యెడల మంత్రసిద్ధి యగును.

#### మంత్రప్రయోజన క్రమము

శ్లో ॥ ఏవం సిద్ధీకృతేమంత్ర మయుతం ప్రజపేన్మనుం
దారిద్ర్యం దూరముత్సృజ్య జాయతే ధనదోపమః ।
కరవీరైర్జాతిపుష్పైర్వా పాటలసంభవైః
రక్తపైర్హోమయాత్సౌభాగ్యంచసమవాప్నుతే ।
సిద్ధద్రవ్యేణ జుహుయాత్ అల్పసిద్ధైవ సిద్ధయః
పాయసే హవిజుహుయాల్లభ్యతే సకలంఫలం ।
ఆజ్యంచ జుహుయాత్తైవ ఐహికాముష్మికం ఫలం ।
మంత్రసిద్ధించ లభతే చంద్రనాదేంద్రవైః క్రమాత్ ।

తా ॥ పై విధముగా మంత్రసిద్ధిని పొందినపిమ్మట 1000 పర్యాయములు మూలమంత్రమును జపము చేసినచో దారిద్ర్యము తొలగి ఐశ్వర్యము సంప్రాప్తించును. కరవీర పుష్పములతో గాని జాజి పుష్పములతోగాని, పొగడ పుష్పములతో గాని దానిమ్మ పుష్పములతోగాని, ఇతరములగు మందార మున్నగు ఎర్రని పుష్పములతో గాని హోమము చేసినయెడల సౌభాగ్యము గలుగును. సిద్ధద్రవ్యముచే హోమము చేసినయెడల అష్టసిద్ధులు సంప్రాప్తించును. పాయసముతో హోమము చేసిన యెడల సకలములగు శుభములు కలుగును. ఆజ్యముతో హోమము చేసినయెడల ఐహికాముష్మిక ఫలములుకలుగును.

మరియు ఈ భైరవమంత్రమును ప్రతినిత్యము పూజించుచు మూలమంత్రమును జపముచేయుచున్న యెడల సర్వసిద్ధి-లసిద్ధి అణిమాద్యష్టసిద్ధులు మున్నగునవి సులభముగ సంప్రాప్తించునని తంత్రకారులమతము.

### పంచ పూజలు

ఓం ఐం హ్రీం క్లీం శ్రీ చండికా పరదేవతాయై ఓం లం పృథివీ తత్త్వాత్మకం గంధం సమర్పయామి నమః

ఓం ఐం హ్రీం క్లీం శ్రీ చండికా దేవతాయై ఓం హం ఆకాశ తత్త్వాత్మక పుష్పం సమర్పయామి నమః ।

ఓం ఐం హ్రీం క్లీం శ్రీ చండికా పరదేవతాయై ఓం యం వాయు తత్త్వాత్మకం ధూపమాఘ్రాపయామి నమః ।

ఓం ఐం హ్రీం క్లీం శ్రీ చండికా పరదేవతాయై ఓం రం వహ్ని తత్త్వాత్మకం దీపం దర్శయామి నమః ।

ఓం ఐం హ్రీం క్లీం శ్రీ చండికా పరదేవతాయై ఓం వం అమృత తత్త్వాత్మకం నైవేద్యం సమర్పయామి నమః ।

ఓం ఐం హ్రీం క్లీం శ్రీ చండికా పరదేవతాయై ఓం సం సర్వ తత్త్వాత్మకం తాంబూలాది సర్వోపచారాన్ పరికల్పయామినమః । ఈ ప్రకారముగా పంచపూజలుచేసి సంకల్పము చెప్పవలెను.

### శ్రీ చండికా పరదేవతా మంత్రజప సంకల్ప విధానము

ఆచమ్య ప్రాణానాయమ్య, దేశకాలౌసంకీర్త్య. శ్రీ మానాముక గోత్రః అముక శర్మాహం మమాత్మనః సకుటుంబస్య ప్రారబ్ధసంచితాది జ్ఞాతా జ్ఞాత పాపక్షయద్వారా మమశరీరే వర్తమాన వర్తిష్యమాణ వాత పిత్తశ్లేష్మోద్భవ నానావ్యాధి బాధానివారణ ద్వారక సంపూర్ణారోగ్య సిద్ధ్యర్థం శ్రీ చండికా పరదేవతా దర్శనలాభార్థం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీ స్వరూపధర చండికా పరదేవతా ప్రసాదేన మమాత్మనః కుటుంబస్య సర్వాపన్ని వారణార్థం దీర్ఘాయు ష్యవిపులైశ్వర్య పుత్రపౌత్రా ద్యభివృద్ధ్యర్థం రాజస్థానే సభాయాంవా వివాదే మమ విజయార్థం మమ శత్రుభిః క్రియమాణ కరిష్యమాణ సకలాభిచారిక మంత్ర యంత్ర తంత్ర ప్రయోగనాశనార్థం మమాత్మనః సకుటుంబస్య ధర్మార్థకామమోక్ష చతుర్విధ పురుషార్థ ఫలసిద్ధ్యర్థం, స్థిరలక్ష్మీ సత్కీర్తిలాభాది మమ సర్వ మనోభీష్ట సిద్ధ్యర్థం శ్రీ మచ్చండీ నవార్ణ మహామంత్ర జప మహంకరిష్యే ।

### శ్రీ గురు ప్రార్థన

శ్లో ॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురు సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥

త్వత్ప్రసాదా దహం దేవ కృతకృత్యో ఽ స్మి సర్వదా మాయామృత్యుమహాపాశాద్విముక్తోస్మి శివోఽస్మ్యహం ।

విఘ్ననివారణార్థం శ్రీ గణపతిధ్యానమ్

శ్లో ॥ ఉద్యద్దినేశ్వరరుచిం నిజహస్త పద్మైః
పాశాంకుశాభయ వరాన్దధతం గజాస్యమ్ ।
రక్తాంబరం సకల విఘ్నహరం గణేశం ।
ధ్యాయేత్ప్రసన్న మఖిలాభరణా భిరామమ్ ॥

### అథ ఋష్యాదిన్యాసః

ఓం అస్య శ్రీ నవార్ణ మంత్రస్య బ్రహ్మ విష్ణు మహేశ్వరాఋషయః । గాయత్ర్యుష్ణి గనుష్టుభ శ్ఛందాంసి । మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యః । దేవతాః । నందజా శాకంభరీ భీమాః శక్తయః । రక్తదంతికా దుర్గాభ్రామర్యో బీజాని । హ్రీం కీలకం । అగ్ని వాయుసూర్యాస్తత్త్వాని । కార్య సిద్ధ్యర్థేవినియోగః । ఓం బ్రహ్మ విష్ణు మహేశ్వర ఋషిభ్యోనమః శిరసి । గాయత్ర్యుష్ణి గనుష్టుప్ఛందోభ్యోనమః ముఖే । మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీ దేవతాభ్యోనమః హృది । నందజాశాకంభరీ భీమా శక్తిభ్యోనమః దక్షిణస్తనే । రక్తదంతికా దుర్గాభ్రామరీ బీజేభ్యోనమః వామస్తనే । హ్రీం కీలకాయనమః నాభౌ । అగ్నివాయు సూర్యతత్త్వే భ్యోనమః హృది । మమ అముక కార్య సిద్ధ్యర్థం జపే వినియోగాయనమః సర్వాంగే ఇతి ఋష్యాదిన్యాసః

### మూల మంత్రము

ఓం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే.

తరువాత ఈ దిగువ పేర్కొనబడిన విధముగా న్యాసము చేయవలయును.

మాతృ కాన్యాసము ః ఓం ఐం అం ఆం కం ఖం గం ఘం ఙం ఇం ఈం హృదయాయనమః । ఓం హ్రీం ఉం ఊం చం ఛం జం ఝం ఞం ఋం ౠం శిరసేస్వాహా ఓం క్లీం ఌం టం ఠం డం ఢం ణం ౡం శిఖాయై వషట్ ఓం చాముండా ఏం తం థం దం ధం నం ఐం కవచాయ హుం । ఓం యై ం పం ఫం బం భం మం ఔం నేత్రత్రయాయ వౌషట్ । ఓం విచ్చే అం యం రం లం వం శం షం సం హం ళం క్షం అః అస్త్రాయ ఫట్ । ఈ మాతృ కాన్యాసమును చేయుటవలన సాధకుడు దేవతా స్వరూపుడగును.

సారస్వత న్యాసము ః ఓం ఐం హ్రీం క్లీం నమః కనిష్ఠికయోః ఓం ఐం హ్రీం క్లీం నమః అనామికయోః । ఓం ఐం హ్రీం క్లీం నమః మధ్య మయోః । ఓం ఐం హ్రీం క్లీం నమః తర్జన్యోః । ఓం ఐం హ్రీం క్లీం నమః అంగుష్ఠయోః । ఓం ఐం హ్రీం క్లీం నమః కరతల కరపృష్ఠయోః । ఓం ఐం హ్రీం క్లీం నమః పృష్ఠే ఓం ఐం హ్రీం క్లీం నమః మణి బంధే । ఓం ఐం హ్రీం క్లీంనమః కూర్పరే । ఓం ఐం హ్రీం క్లీం నమః హృదయే । ఓం ఐం హ్రీం క్లీం నమః శిరసి । ఓం ఐంహ్రీం క్లీం నమః శిఖాయామ్ । ఓం ఐం హ్రీం క్లీం నమః కవచే । ఓం ఐం హ్రీం క్లీం నమః నేత్రత్రయే । ఓం ఐం హ్రీం క్లీం నమః అస్త్రే । ఈ సారస్వత న్యాసము చేయుటవలన సాధకునియొక్క బుద్ధిజాడ్యము హరించి జ్ఞానము వృద్ధియగును.

### శ్రీ చండికా నవార్ణ మంత్రమునందలి బీజాక్షరములు స్వరూప స్వభావములు

ఐం ః పూర్ణచంద్ర సమానమైన కాంతి గల్గినట్టిది; హ్రీం ః సూర్యప్రకాశతుల్యమైనది, క్లీం ః ప్రదీప్తమైన అగ్నివర్ణము కల్గినట్టిది. ఈమూడు బీజములును, జపించుచుండువారికి అనంత సుఖమునిచ్చుచుండును. చా ః మేలిమి బంగారురంగు గల్గినట్టిది. ముం ః ఎర్రటిరంగు గల్గినట్టిది. డా ః ముదురు నీలరంగు గల్గినట్టిది, మహోగ్రములైన దుఃఖము లను పోగొట్టును. యై ః నల్లటిరంగు గల్గినట్టిది శత్రువులను హరించును. వి ః తెల్లటిరంగు (పండు) కల్గినట్టిది, సిద్ధినిచ్చును. చ్చే ః పొగరంగు గల్గినట్టిది,మహావిశాలమైనది.

శ్లో ॥ ఏతానిబీజాని మాహాత్మ్యకస్య జప్యః
ప్రదద్యాః సకలార్థసిద్ధిమ్ ।

పైన పేర్కొనబడిననవబీజములు శ్రీ చండికానవార్ణ మహామంత్ర జపకులకు సకలార్థములను (కార్యములను) సిద్ధింపజేయును.

### షడంగన్యాసము

ఓం ఐం హృదయా యనమః । ఓం హ్రీం శిరసేస్వాహా । ఓం క్లీం శిఖాయై వషట్ । ఓం చాముండాయై కవచాయహుం । ఓం విచ్చే నేత్రత్రయాయవౌషట్ । ఓం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే అస్త్రాయ ఫట్ ।

### అథమంత్ర వర్ణన్యాసః

ఓం ఐం నమః శిఖాయాం । ఓం హ్రీం నమఃదక్షిణనేత్రే । ఓం క్లీం నమః వామనేత్రే । ఓం చాం నమః దక్షిణకర్ణే । ఓం నమః

వామకర్ణే। ఓం డాం నమః దక్షిణనాసాపుటే ఓం యైం నమః వామ నాసాపుటే। ఓం విం నమః వక్త్రే। ఓం చ్చేం నమః గుదే

### వ్యాపకన్యాసము

ఓం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే । అను మూలమంత్రము నుచ్చరించుచూ, పాదములనుంచి, శిరస్సువరకూ సాధకుడు తనచేతులతో స్పృశించవలెను. ఇట్లు ఎనిమిదిసార్లు చేయవలయును.

తరువాత శ్రీ చండికా పరదేవతను, మహాకాళీ మహాలక్ష్మి మహా సరస్వతీ అనుమూడు రూపములుగల దానిగా ధ్యానింప వలయును.

దిగ్బంధనము : ఓం భూర్భువస్సువరోమ్ - ఇతిదిగ్బంధః

### ధ్యానము

శ్లో ॥ ఖడ్గం చక్రగదేషు చాపపరిఘాంఛూలం భుశుండీం శిరః
శంఖం సందధతీం కరై స్త్రినయనాం
సర్వాంగ భూషావృతామ్
నీలాశ్మద్యుతి మాస్య పాదదశ కాం సేవే మహాకాళికామ్ ।
యామస్తౌత్స్వపితే హరౌ కమలజో హంతుం మధుం కైటభం

శ్లో ॥ అక్షస్రక్ పరశూగదేషుకులిశం పద్మం ధనుష్కుండికాం
దండం శక్తి మసించ చర్మజలజం ఘంటాం సురాభాజనం
శూలంపాశ సుదర్శనే చ దధతీం హస్తైః ప్రవాళ ప్రభాం
సేవే సైరిభమర్దినీ మిహ మహాలక్ష్మీం సరోజస్థితామ్ ।

శ్లో ॥ ఘంటాశూలహలాని శంఖ ముసలే చక్రం ధనుస్సాయకం
హస్తాబ్జైర్దధతీంఘనాంతవిల సచ్ఛీతాంశు తుల్యప్రభామ్ ।
గౌరీదేహసముద్భవాం త్రిజగతా మాధార భూతాం మహా
పూర్వామత్ర సరస్వతీ మనుభజే శుంభాది
దైత్యార్దినీమ్

### పీఠపూజ

ఓం మం మండూకాది పరతత్త్వాంత పీఠదేవతాభ్యోనమః । అని చెప్పుచూ యంత్రమునుంచి పీఠమును పుష్పములతో పూజించవలయును.

### పీఠశక్తి పూజ

తూర్పు దిక్కు క్రమముగా :- ఓం జయాయై నమః ఓం విజయాయై నమః ఓం అజితాయై నమః । ఓం అపరాజితాయై నమః ఓం నిత్యాయై నమః। ఓం విలాసిన్యైనమః ఓం దోగ్ర్యైనమః ఓం అఘోరాయై నమః । మధ్యే ఓం మంగళాయై నమః । అని చెప్పుచూ పుష్పములచేనవ పీఠ శక్తులను పూజించవలయును. ఓం హ్రీం వజ్రనఖదంష్ట్రాయుధాయ మహాసింహాయ ఫట్। అని చెప్పి పీఠముపై పుష్పము వేయవలయును.

తరువాత స్వర్ణము లేక తామ్రపు రేకుపైన వ్రాయబడిన శ్రీ చండికా పరదేవతా యంత్రమునకు ఆవునెయ్యిరాచి, పాలతో కడిగి, తరువాత మంచినీటితో కడిగి, స్వచ్ఛమైన వస్త్రముచే తుడిచి, పీఠముపై స్థాపించవలయును.

### యంత్ర ప్రాణ ప్రతిష్ఠ

ఓం ఆం హ్రీం క్రోం యంరం లం వం శం షం సం హం సః సో ఒ హం అస్య శ్రీ చండికాపరదేవతా సపరివార యంత్రస్య ప్రాణాఇహప్రాణాః। ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం సః సో ఒ హం అస్య శ్రీ చండికా పరదేవతా యంత్రస్య జీవఇహస్థితః। ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం సః సో ఒ హం అస్య శ్రీ చండికాపరదేవతా యంత్రస్య సర్వేంద్రియాణి ఇహస్థితాని। ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సంహం సః సో ఒహం అస్య శ్రీ చండికాదేవతా సపరివార యంత్రస్య వాఙ్మనస్త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణ పాణిపాద పాయూపస్థాని ఇహైవాగత్య సుఖంచిరంతిష్ఠన్తు స్వాహా ।" తరువాత శ్రీ చండికా పరదేవతను పై నుదహరింపబడిన విధముగా ధ్యానించవలయును.

### ఆవరణపూజ

దోసిలితో పుష్పములను తీసుకొని "ఓం సంవిన్మయే పరేదేవి పరామృత రసప్రియే । అనుజ్ఞాందేహి మేదుర్గే పరివారార్చనాయతే ।" అని చెప్పి పుష్పాంజలిని యంత్రము పై విడువవలయును.

ప్రథమావరణపూజ :- త్రికోణములో పూర్వకోణమందు -"ఓం బ్రహ్మ సరస్వతీభ్యాంనమః బ్రహ్మ సరస్వతీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః ।" నైఋతికోణమందు -"ఓం విష్ణులక్ష్మీభ్యాం నమః । విష్ణులక్ష్మీ శ్రీపాదుకాంపూజయామి తర్పయామినమః । వాయవ్య కోణమందు -"ఓం పార్వతీ శంకరాభ్యాం నమః । పార్వతీశంకర శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః" అని పూజించవలయును. తరువాత పుష్పాంజలిని పట్టించి మూలమంత్రము చదివి, "అభీష్టసిద్ధిం మే దేహి శరణాగత వత్సలే । భక్త్యా సమర్పయే తుభ్యం ప్రథమావరణార్చనమ్ ।" అని పుష్పాంజలిని యంత్రముపై విడువవలయును.

ద్వితీయావరణము :- దేవికి ఎడమవైపున - "ఓం సింహాయనమః । దేవికికుడివైపున - "ఓం మహిషాయనమః ।" అని చెప్పి పుష్పాంజలిని యంత్రముపై విడువవలయును.

తృతీయావరణము :- షట్కోణమునందు తూర్పు క్రమముగా ఓం నందజాయై నమః । నందజా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః । ఓం రక్తదంతాయై నమః । రక్తదంతా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః । ఓం శాకంభర్యై నమః । శాకంభరీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః । ఓం దుర్గాయై నమః । దుర్గా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః । ఓం భీమాయై నమః భీమా శ్రీపాదుకాం పూజ యామి తర్పయామినమః । ఓం భ్రామర్యైనమః । భ్రామరీ శ్రీ పాదుకాం పూజయామితర్పయామి నమః అని చెప్పి పుష్పాంజలిని యంత్రముపై మూలమంత్రం ద్వారా పూర్వకముగా విడువలయును.

చతుర్థావరణము :- అష్టదళకమలమునందు తూర్పుదిక్కు క్రమముగా

"ఓం బ్రాహ్మ్యైనమః । బ్రాహ్మీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః । ఓం మాహేశ్వర్యైనమః । మాహేశ్వరీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః । ఓం కౌమార్యైనమః కౌమారీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః ఓం వైష్ణవ్యైనమః । వైష్ణవీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః ఓం వారాహ్యైనమః । వారాహీ శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః । ఓం నారసింహ్యైనమః । నారసింహీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః । ఓం ఐంద్ర్యైనమః । ఐంద్రీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః ఓం చాముండాయై నమః । చాముండా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః ।

అని పూజించి, పుష్పాంజలిని మూలమంత్రం ద్వారా పూర్వకముగా యంత్రముపై విడువవలయును.

పంచమావరణము :- ఇరవైనాల్గు దళముల కమలమునందు తూర్పు క్రమముగా

## శ్రీ చండికానవార్ణ మహామంత్రమునకు అర్థము

ఓం ఐం = హే చిద్రూపిణీ మహాసరస్వతీ
హ్రీం = హే సద్రూపిణీ మహాలక్ష్మీ
క్లీం = హే ఆనందరూపిణీ మహాకాళీ
(త్వాం = నిన్ను) (అంతర్గతము)
చాముండాయై = బ్రహ్మ విద్యాప్రాప్త్యర్థము అనగా
విచ్చే = విత్ + చ + ఇ
విత్ = చిత్తు, చ = సత్తు, ఇ = ఆనందము
విచ్చే = సచ్చిదానంద సౌఖ్యలాభము కొరకు
(అనుసందధామహే = ధ్యానించుచున్నాము) (అంతర్గతం)

### మంత్ర పురశ్చరణ లేక సిద్ధి క్రమము

శ్రీ మచ్చండీ కానవార్ణ మహామంత్రమును నాలుగు లక్షలు జపము చేయవలయును. పాయసాన్నముతో పదివేలసార్లు హోమము చేయవలయును. నాలుగువేలసార్లు తర్పణము చేయవలయును. నాలుగువందల సార్లు మార్జనము చేయవలయును. నలభైమంది బ్రాహ్మణులకు భోజనములు పెట్టవలయును ఇట్లు విధిపూర్వకముగా శ్రద్ధాభక్తులతో శ్రీమచ్చండికా నవార్ణ మహామంత్రమును జపించుచుండిన యెడల సాధకునకు నిశ్చయముగా మంత్రసిద్ధిలభించి బ్రహ్మ విష్ణు మహేశ్వరతుల్యుడై సృష్టిస్థితి సంహారములు చేయగల సమర్థుడగును.

### మంత్ర ప్రయోజన క్రమము

శ్లో॥ ఏవం జపతియో మంత్రీఫలంతస్య వదామ్య హం।
వశ్యాభవంతి కామిన్యో రాజానోమహరాదయః

తా॥ పైన చెప్పనబడిన విధముగా శ్రీమచ్చండికా నవార్ణమహామంత్రమును జపించు సత్పురుషులకు స్త్రీలు వశమగుదురు. అధికారులు అనుచరులవలె వశ్యులై యుండెదరు.

శ్లో॥ న హాస్తి సర్ప దావాగ్ని చోర శత్రుభయంభవేత్।
సర్వాన్నష్ట్రయస్తస్య జాయంతే చండకాజ్ఞయా॥

తా॥ ఏనుగులు, గుఱ్ఱములు, గేదెలు మొదలగు చతుష్పాద జంతువుల వలనగాని, సర్ప,వృశ్చికాది విషప్రాణులవలనగాని, కొరివాగ్ని,దావాగ్ని బడబాగ్ని మొదలగు ఘోరాగ్నులవలనగాని, చోర,క్రూర, ఘోరతస్కరాదులవలనగాని, అంతశ్శత్రు, కపట మిత్రాది నానావిధ శత్రువులవలనగాని, ఏ విధమైన బాధ కలుగకుండా వుండును.మరియూ శ్రీ మచ్చండికానవార్ణ మహామంత్ర జపకర్తకు చండికాజ్ఞవలన ధన ధాన్యసమృద్ధి సంతానసమృద్ధి, సౌభాగ్యసమృద్ధి కలుగుచుండును.

శ్లో॥ సర్వంతి దారుణాలోగా స్సత్యం సత్యం వదంతయః।
అనేన విధినా నిత్యంయః కుర్యాచ్చండికార్చనమ్॥
తస్యతుష్టామహాలక్ష్మీర్దద్యాదద్యాత్ కృపాన్వితాత్।
మహదైశ్వర్యమతులంత్రైలోక్యే తస్యజాయతే॥

తా॥ అసాధ్యవ్యాధులన్నియూ నశించును పైన చెప్పనబడిన విధముగా ప్రతినిత్యమూ శ్రీ చండికాపరదేవతను పూజించుచుండు సాధకుని యెడల శ్రీ మహాలక్ష్మీ దేవికి దయగలిగి సాధకునకు ముల్లోకముల యందు కూడా సాటిలేనట్టి మహదైశ్వర్యమును కలుగజేయును.

శ్లో॥ తస్యస్మరణమాత్రేణ విఘ్న హానిర్భవేద్ధ్రువం
త్రిషులోకే షుయత్కించిత్ వసురాసుర దుర్లభమ్॥
తత్సర్వంతస్యమాయాతి మహాలక్ష్మీ ప్రసాదతః।
యోజపేత్ప్రయతోభక్త్యామహాలక్ష్మీంతు పూజయేత్
ననరోంల్లభతేనిత్యం పూజాఫల మనుత్తమం॥

తా॥ శ్రీ మచ్చండికానవార్ణ మహామంత్రమును స్మరించినంత మాత్రముననే సర్వవిఘ్నములు తొలగిపోవును. దేవదానవాదులకు కూడా దుర్లభమైనట్టి కార్యములు, శ్రీ మహాలక్ష్మీ దేవిదయవలన సాధకునకు నెరవేరుచుండును. అచంచలమైన భక్తితో శ్రీ చండికానవార్ణ మహామంత్రమును జపించుచుండువారికి గొప్ప గొప్ప ఫలితములు కలుగును.

శ్లో॥ సహస్ర మాత్రం మంత్రస్య పఠతీజన్మయోజపేత్॥
వాటిమాత్రేణలేపేన్మూర్ఖ కవిత్వంలభతేధ్రువమ్॥
ఆయుతంజపతేన్మర్త్య రాజబంధ వశంత్యజే॥
జపేత్తరాయిమచ్చే తయోమంత్ర శ్చండికాజ్ఞయా॥

తా॥ నాటిమాత్రోదకమునందు వీలజి, శ్రీ చండికా నవార్ణ మంత్రమును వెయ్యిసార్లు జపించినయెడల, కవిత్వము చెప్పు సామర్థ్యం కలుగును. సాధకుడు శ్రీ చండికా నవార్ణ మంత్రమును పదివేలసార్లు జపించినయెడల సంకెళ్ళు తొలగిపోయి కారాగార విమోచనము లభించును.

శ్రీ చండికా నవార్ణమంత్ర సంపుటితమైన మార్కండేయ పురాణాంతర్గతము చండీసప్తశతి. ప్రతి నిత్యమూ చదువుతూ మూలమంత్రమును జపించుచుండువారికి మనస్సునందు తలచిన కార్యము జయప్రదముగా నెరవేరుచుండును. ఇందుకుసందేహము లేదు.

శ్లో॥ చండికా ధ్యానజప్ మర్త్యోధనధాన్య యశశ్శ్రియః।
పుత్రైః పౌత్రై రుదారోగ్యైర్యుక్తో జీవేచ్ఛతం సమాః॥

తా॥ శ్రీ మచ్చండికా పరదేవతను పూజించుచుండు సాధకుడు ధన ధాన్య, కీర్తి ప్రతిష్ఠలతోడను. ఆరోగ్య పుత్ర పౌత్రాది వృద్ధి తోడను సంయుక్తుడై నూరు సంవత్సరములు సుఖముగా జీవించియుండును.

శ్లో॥ రిపవః క్షయం యాంతి తత్ప్రభావాత్ శతయోగినం
తం కరోతి మహాలక్ష్మీర్బ్రహ్మావిష్ణు శివోపమ్॥

తా॥ శ్రీ చండికా నవార్ణ మహాయంత్రపూజాపరులయొక్క శత్రువులు హాయెదరు. శ్రీ మచ్చండికానవార్ణమహామంత్రజపకుని శ్రీ మహాలక్ష్మీదేవి బ్రహ్మ, విష్ణు, శివతుల్య ప్రభావముగల వానినిగా చేయును.

### శ్రీ మచ్చండికా నవార్ణ మహా మంత్రము సిద్ధిచేసుకొన్న తరువాత షట్ప్రయోగముల యందు ఉపయోగించవలసిన మంత్రములు

వశ్య ప్రయోగము :- " షట్ ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే అముక నామానం వషట్ మేవశ్యం కురుకురుస్వాహా॥"

ఉచ్చాటన ప్రయోగము:-"ఓం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే దేవదత్తం ఫట్ ఉచ్చాటనం కురుకురు స్వాహా॥"

మోహన ప్రయోగము :- " క్లీం క్లీం ఓం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే దేవదత్తం క్లీంక్లీం మోహనం కురుకురు క్లీం క్లీం స్వాహా॥"

మారణ ప్రయోగము:- "ఓం ఐం హ్రీంక్లీం చాముండాయై విచ్చే దేవదత్తం రంరం ఖే ఖే మారయ మారయ రంరం శీఘ్రం భస్మీకురుకురు స్వాహా॥"

స్తంభన ప్రయోగము :- " ఓం ఠం ఠం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే దేవదత్తం హ్రీం వాచం ముఖం పదంస్తంభయ స్తంభయ హ్రీం జిహ్వాం కీలయ కీలయ హ్రీం బుద్ధిం వినాశయ హ్రీం ఓం ఠంఠం స్వాహా॥"

ఆకర్షణ ప్రయోగము:- "ఓం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే దేవదత్తం యంయం శీఘ్రమాకర్షయా కర్షయ స్వాహా"

ఇతి శ్రీ మచ్చండికా నవార్ణ మహామంత్రవిధిః

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం న్యాయేన మార్గేణ మహీంమహీశాః। గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు॥"

# శ్రీ చక్ర మహా యంత్ర మహిమ

ఈ శ్రీ చక్రమహాయంత్ర మహామంత్రోపాసనవలననే బ్రహ్మ, విష్ణువు, సూర్యచంద్రులు, ఇంద్రుడు, నంది కుమారస్వామి మొదలగు దేవతలు అగస్త్యుడు లోపాముద్ర, దూర్వాస..ప, మనువు మొదలగు మహర్షులు తపోమహిమాన్వితులై అత్యున్నతస్థానముల నందగలిగిరి.

ఈ శ్రీ విద్య మంత్రఫలాయకమనియూ, విద్యా రాజ్ఞియనియు చెప్పబడినది. వ్యాసవిహితముగ శ్రీ మహాత్రిపుర సుందరీ మంత్రమును, ఒక్కసారి యుచ్చరించి నంత మాత్రమున నే, అనేక జన్మార్జిత పాపసంగ్రహములు భస్మీభూతం అగుచున్నవి. ఈ త్రిపురసుందరీ మహావిద్య దేవతలకు కూడా దుర్లభం చేసినది. మిగుల రహస్యాతి రహస్యంబైనట్టిది; అందువలననే శ్లో॥ ఆత్మాదేయ శ్శిరోదేయః నదేయా షోడశాక్షరీ. అపరీక్షిత శిష్యాయ తాం నదద్యాత్కదాచన ఆనగా "ఆత్మనైనా యివ్వవచ్చును. శిరస్సునైనా యివ్వవచ్చును. కాని అపరీక్షిత శిష్యునకు, షోడ శాక్షరీ మంత్రము యివ్వదగినది కాదు." అని మహర్షులు శాసించి యున్నారు.

కలియుగములో సాధకులకు శీఘ్రసిద్ధిని ప్రసాదించు మహామంత్రయంత్రములలో శ్రీ మహాత్రిపురసుందరీ షోడశాక్షరీ మహామంత్రము అత్యుత్తమమైనది. శక్తి విశ్వాసములతో తంత్రోక్తము సారముగ ఈ మహాత్రిపురసుందరీ షోడశాక్షరీ మంత్ర యంత్రముల నుపాసించిన యెడల మంత్రసిద్ధి కలుగునని స్పష్టిగా చెప్పవచ్చును.

ఈ శ్రీ చక్రమహాయంత్రమును చక్కగా ఒక బంగారు రేకుపైగాని వెండి రేకుపైగాని, రాగి రేకుపైగాని చెక్కించి. లేదా ఈ యంత్ర కాగితముచే పటముగా కట్టించిగాని, త్రిసంధ్యల యందును శ్లో॥ బాలార్కయుత తేజసం త్రినయనాం రక్తాంబరోల్లాసినీం। నానాలంకృతి రాజమానవపుషం బాలోడురాట్ శేఖరాం। హస్తైరిక్షుధనుః సృణిం సుమశరం పాశం ముదా బిభ్రతీం। శ్రీ చక్రస్థిత సుందరీం త్రిజగతా మాధార భూతాంస్మరేత్॥ అని శ్రీచక్ర యంత్రాధిష్ఠాత్రియైన శ్రీ మహాత్రిపురసుందరీ దేవిని ధ్యానించుచూ యథాశక్తి నైవేద్యముల నర్పించుచున్న యెడల సాధకులకు ఆత్మరక్షణము, సర్వశత్రునాశనము, భూత, వేతాళ, ప్రేత, పిశాచ, రాక్షస, బ్రహ్మరాక్షసాది గ్రహబాధానివారణము, సంపూర్ణారోగ్య లాభము ఐశ్వర్యాభివృద్ధి, యోగసిద్ధియు మొదలు పెట్టినను శుభముగా జరుగుచుండును.

ఈ శ్రీ చక్రమహాయంత్రమునకు ప్రతి నిత్యమూ పంచపూజలు గావించుచూ భక్తితో నమస్కరించి, కుంకుమార్చనచే పూజించుచున్న యెడల పోయిన ఉద్యోగములు తిరిగి లభించుట, ఉన్నతాధికారులవలన ప్రోత్సాహముకలుగుట సౌఖ్యము, పుత్ర మిత్ర, బంధువర్గములచే గౌరవింపబడుట మనశ్శాంతి లభించును.

ఈ మహాత్రిపురసుందరీ షోడశీపూజను శ్రీ చక్ర మహాయంత్రమునకు ప్రాణ ప్రతిష్ఠ చేసినాక కళాన్యాసాదు లొనర్చి "ఐం శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం క ఏ ఈ ల హ్రీం హసకహల హ్రీం సకలహ్రీం సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ఓం నమః I" అను శ్రీ మహాత్రిపురసుందరీ మూలమంత్రమును యథావిధిగా జపించుచున్న యెడల అపరిమిత వశ్యాకర్షణశక్తి ఉపాస్యున పాటక ప్రదర్శనాదుల మాటలకు సమ్మోహించి యుండు ప్రజాసమూహములను మోహింపజేయు శక్తి మంత్రం రాజకీయోద్యోగుల, న్యాయాధికారుల వశ్యాకర్షణము, తద్వారా సివిల్, క్రిమినల్ మున్నగు కోర్టు వ్యవహారములలో విజయము, సర్వాపమృత్యువులు తొలగిపోవుట, ఇతరకృత మారణ ద్వేషణాద్యాభిచారిక మంత్రప్రయోగములు నిర్వీర్యములగుట, ఎట్టి ఘోర ప్రమాదములు వచ్చినను హానికలుగకుండా తప్పించుకొనగల శక్తి అలంకారాల హైడ్రోజన్ బాంబు మొదలయిన ఆధునిక మారణాస్త్రముల నుండి ఉద్భవించు అణుశక్తిని నిర్వీర్య మొనరించుటయే గాక మరియూ నేటి విజ్ఞాన శాస్త్రవేత్తలచే కని పెట్టబడబోవు యెట్టి మారణాయుధము వలనగాని హాని కలుగకుండా ఆకల్పాంతము చిరంజీవియై వర్ధిల్లుచుండగల మహాశివశక్తి శ్రీ మహాత్రిపురసుందరీదేవి ప్రసాదమువలన ఈ శ్రీ చక్రమహాయంత్ర పూజకునకు లభించును.

ఈ శ్రీ చక్ర మహాయంత్రమునకు ప్రతినిత్యమూ షోడశోపచార పూజగావించుచూ మూలమంత్ర జపతర్పణ హోమాదులతో సమగ్రముగా శ్రీ చక్ర మహాయంత్రము నర్చించుచున్న యెడల అతిమార్గ సిద్ధులు సమస్త కోరికలు సిద్ధించును.

సర్వ సిద్ధి ప్రదాయక
సర్వదోష నివారక

# శ్రీ మురళీధర మహా యంత్ర మహిమ

ఈ మహాయంత్ర ప్రభావము మహిమలచేతను భక్తి శ్రద్ధలతో శ్రీ మురళీధర శ్రీకృష్ణుని ధ్యానము చేయువారికి సమస్త కోరికలు నెరవేరును. ఈ యంత్రమును పూజించు [illegible] లభించును. శ్రీ మురళీధరయంత్ర, మహిమలు అత్యద్భుతములు. దీనియొక్క మహిమ వర్ణింపనలవి కానట్టిది. దీని ప్రభావమువల్ల త్రిలోకములను మోహింప చేయవచ్చును. సర్వ దిక్కులందును విజయము పొందవచ్చును. ధనాకర్షణ, జనాకర్షణ, గోపూజ మొదలగు వాని ఆకర్షణ మొదలగునవి కలుగు చేకూర్చ, సమస్త కోరికలు సిద్ధించును. అంతేగాక కలిదోషమువల్ల సంభవించెడి సమస్త దోషములు దీనిని పూజించుటవల్ల తొలగిపోవును. కలియుగమందలి ప్రజలకు సమస్త శుభములను ఈ యంత్ర, మంత్రములు ప్రసాదించును.

ఈ యంత్రమును, మంత్రమును పూజించువారు, జపించువారు లోక శ్రేయస్సును లోకక్షేమమును కోరెడివారై యున్నారు. ప్రపంచ క్షేమమును, శ్రేయస్సును యీ యంత్రమును పూజించెడి సాధకుడు ఆశించును. "చతుర్వ ర్గార్థ్యానాం విహాకుటుంబ పుత్ర మిత్ర కళత్ర బంధు జనానాం సర్వేషాం శ్రియం దేహి యశోదేహి పుత్రాన్ దేహి ధనం దేహి రక్షరక్ష సకల సౌభాగ్య దివ్యజ్ఞాన ఇష్టకామ్యార్థ ఫలసిద్ధిం కురుకురు"

ఈ యంత్రమును పూజించెడి సాధకుడు యంత్రాధిష్ఠాతయైన శ్రీ మురళీధరుని నాల్గు వర్ణములందు జన్మించినవారికి కుటుంబసహితముగవారి పుత్ర, మిత్ర, కళత్ర బంధువు లందరికిని శ్రేయస్సును, కీర్తిని, సంతతిని ధనమును ఇచ్చి కాపాడి సమస్త సౌభాగ్యములను దివ్యజ్ఞానమును ప్రసాదించి, కోరినకోర్కెలన్నింటిని నెరవేర్చ వలసినదిగా ప్రార్థించు చున్నాడు. ఇంతటి విశాల భావముతో కూడియున్న ఈ యంత్ర ప్రభావము వర్ణనాతీతమని తెలిసికొనవలెను. ఈ మహాయంత్రమును ఒకరాగి రేకుపై చెక్కించిగాని లేదా ఈ యంత్ర కాగితమునే పటముగా కట్టించిగాని ప్రతి నిత్యము ఈ యంత్రము సందర్శించియున్న శ్రీ మురళీధరస్వామికి "పత్రం పుష్పం ఫలం తోయం" అన్నట్లు భక్తిశ్రద్ధలతో శ్రీ మురళీధరస్వామి రూపమును, యీ యంత్ర స్వరూపమును మనస్సునందే స్మరించుచూ, ధ్యానించుచూ నిత్యంమైన అనన్య భక్తి శ్రద్ధలతో పత్రం, పుష్పం ఫలం ఉదకం అక్షతలు మున్నగునవాని సమర్పించి

శ్లో॥ ఓంకార వర్ణాత్మకం విశ్వమూర్తిం బ్రహ్మాది
లోకైర్వినుత పాద పద్మమ్ ।
శ్రీ ద్వారకాంతాఖ్య పురాధి వాసం శ్రీ వేణుగోపాల
మహం స్మరామి తమ్ ॥ ౧

శ్లో॥ వరార్చితం శ్రీ మధురాపురీ స్థితం
వర్ణాక్షమాలా ముకుటాధరం వరమ్ ।
నారాది తీర్థైకకులైశ్చ సేవితం శ్రీ వేణుగోపాల
మహం స్మరామి తమ్ ॥ ౨

శ్లో॥ మోక్షప్రదం భోగకరం యతిప్రియం వైరాగ్యసిద్ధి
ప్రదమాత్మ వేదినే ।
అష్టాంగయోగా ధ్యానమాది సిద్ధిదం శ్రీ వేణుగోపాల
మహం స్మరామితమ్ ॥ ౩

శ్లో॥ నామార్థ బోధంచ వ నీతలో ఋవంపాహమాది
తీర్థాంచిత పాద పంకజమ్ ।
భామాపతిం సుందరమశ్మి ప్రియం శ్రీ వేణుగోపాల
మహం స్మరామితమ్ ॥ ౪

శ్లో॥ రాజత్ప్రభా మండల మండితాంగకం పీతాంబరం
తంచదదేహ భాస్వరం ।
శ్రీ వేణునాదైర్వరరోగ నాశనం శ్రీ వేణుగోపాల మహం
స్మరామితమ్ ॥ ౫

శ్లో॥ యక్షేశ్వరై స్సిద్ధగణైశ్చ పూజితం
గంధర్వసంఘై స్సురసామతి ప్రియమ్ ।
శ్రీ గోపిక వ్యాకుళం మనోహరం శ్రీ వేణుగోపాల
మహం స్మరామి తమ్ ॥ ౬

శ్లో॥ బాహ్యార్థ సంశోధి నిధానభిధానం శ్రీ యోగి
హృత్పంకజ చిత్తభానుమ్ ।
శ్రీ సచ్చిదిష్టం మురళీధరం తం శ్రీ వేణుగోపాల
మహం స్మరామి తమ్ ॥ ౭

శ్లో॥ యతీశ్వరారాధిత నిజరూపం భాగ్యైశ్చ
వ్యాప్తైస్తథ్యైశ్చ రత్నమయైః ।
లక్ష్మీ సమాశ్రిత దివ్యమూర్తిం శ్రీ వేణుగోపాల
మహం స్మరామితమ్ ॥ ౮

అని స్మరించి నమస్కరించిన యెడల సమస్తమైన కోరికలు నెరవేరును. శత్రు విజయము ఆత్మరక్షణము, వివిధవ్యాధి నిర్మూలనము, భూత ప్రేత పిశాచాది బాధా నిర్మూలనము, దారిద్ర్య నాశనము, భోగభాగ్య ఐశ్వర్యములు, అపమృత్యు జయము సర్వజనవశీకరణము మున్నగునవి కలుగును. మరియు ఈ యంత్రమును యథావిధిగా కామబీజముతో కూడిన కేశవనామములతో పూజచేయుచూ "క్లీం వేణుగోపాల చరణౌ శరణం ప్రపద్యే" అను మూలమంత్రమును భక్తి శ్రద్ధలతో జపము చేయువారికి సమస్తశుభములు ప్రాప్తించును. ఈ యంత్రము సర్వదేవతాత్మకము, కాన దేవతలందరు యిచ్చెడి ఫలములన్నింటిని యిచ్చునట్టిదై యున్నది. ఈ విధిగను విధానములు ననుసరించిన ఈ యంత్ర ప్రభావమునకు ఎట్టి మహాపాంతరమైనను సులభముగా నెరవేరును.

### గురు ప్రార్థన

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

### గణపతి ప్రార్థన

శ్లో॥ గజాననం భూతగణాది సేవితం
కపిత్థ జంబూ ఫలసార భక్షణమ్ ।
ఉమాసుతం శోక వినాశకారణం
నమామి విఘ్నేశ్వర పాదపంకజం ॥

### శ్రీ మురళీధర యంత్ర పూజ

క్లీం కేశవాయ నమః, క్లీం నారాయణాయ నమః క్లీం మాధవాయ నమః, క్లీం గోవిందాయనమః, క్లీం విష్ణవే నమః, క్లీం మధుసూదనాయ నమః, క్లీం త్రివిక్రమాయ నమః, క్లీం వామనాయ నమః క్లీం శ్రీధరాయ నమః, క్లీం హృషీకేశాయనమః, క్లీం పద్మనాభాయ నమః, క్లీం దామోదరాయ నమః, క్లీం వాసుదేవాయ నమః, క్లీం సంకర్షణాయ నమః క్లీం ప్రద్యుమ్నాయ నమః, క్లీం అనిరుద్ధాయ నమః, క్లీం పురుషోత్తమాయనమః, క్లీం అధోక్షజాయనమః, క్లీం నారసింహాయనమః, క్లీం అచ్యుతాయనమః, క్లీం జనార్దనాయ నమః, క్లీం ఉపేంద్రాయ నమః, క్లీం హరయే నమః, క్లీం శ్రీకృష్ణాయనమః - అని పుష్పములతో గాని, అక్షతలతో గాని యంత్రమును పూజించవలెను.

### ధ్యానము

శ్లో॥ కస్తూరీతిలకం లలాటఫలకే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్,
సర్వాంగే హరిచందనంచ కలయన్ కంఠేచ ముక్తావళిం
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥

### మూల మంత్రము

క్లీం వేణుగోపాల చరణౌ శరణం ప్రపద్యే.

### వేరొక మంత్రము

క్లీం కృష్ణాయ వాసుదేవాయ దేవకీనందనాయ నందగోపకుమారాయ గోవిందాయ నమోనమః

### మరియొక మంత్రము

ఓం నమోభగవతే వాసుదేవాయ.

భద్రం మృత్యోర్మృత్యుం నమామ్యహం" అనెడి మంత్రమును జపించుచో శత్రువిజయము, శత్రు పరాజయము, అసాధ్య రోగములు కూడ నివారణమగును. భూత ప్రేత పిశాచ బ్రహ్మరాక్షసాది వివిధ గ్రహజన్యమగు ఉపద్రవములు, మహా ద్రవిడాదుల దుష్టప్రయోగ బాధలు తొలగిపోవును.

ఈ మురళీధర మహామంత్రమును భక్తి శ్రద్ధలతో యథావిధిగా పూజించి, శ్రీ మురళీధర మూలమంత్రమును జపించిన అనంతరము "ఐం శ్రీం హ్రీం సరస్వత్యైనమోనమః" అనెడి మంత్రమును జపించుచో జ్ఞానవృద్ధి పాండిత్యము, కవిత్వము చెప్పగలుగుట, తెలివితేటలు మొదలగునవి సిద్ధించును

ఈ మురళీధర మహాయంత్రమును ప్రతినిత్యము పూజించుచూ శ్రీ మురళీధర మూలమంత్రమును జపించిన తరువాత "ఓం నమో విష్ణవే జయనారసింహా" అనెడి మంత్రమును జపము చేసిన యెడల కార్యసిద్ధి, మనశ్శాంతి, సర్వత్ర విజయము, ఆరోగ్యము ఐశ్వర్యవృద్ధి మొదలగునవి లభించును.

ఈ మురళీధర మహాయంత్రమును యథావిధిగా పూజించి శ్రీ మురళీధర మూలమంత్రమును జపించిన పిమ్మట "శ్రీం హ్రీం ఐం శ్రీ మహాద్యా శ్రీ మహాలక్ష్మ్యై నమోనమః" అనెడి మంత్రమును జపము చేయువారల ఐశ్వర్యవృద్ధి, సర్వవిధముల ధనాదాయము, యశస్సు, స్థిరాస్తి సంపాదనము మున్నగునవి కలుగుటయే గాక సమస్త సంపదలు లభించును.

ఈ మురళీధర మహాయంత్రమును భక్తిశ్రద్ధలతో పూజించి శ్రీ మురళీధర మూలమంత్రమును జపించిన అనంతరము "ఓం నమోనారాయణాయ" అను మంత్రమును జపించిన యెడల కార్యసిద్ధి, ఆధిపత్యము, పలుకుబడి, ప్రజావశీకరణము, నాయకత్వములు లభించును.

ఈ మురళీధర మహాయంత్రమును యథావిధిగా పూజించి శ్రీ మురళీధర మూలమంత్రమును జపించిన తరువాత "క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ రుక్మిణీశాయనమః" అనెడి మంత్రమును జపించినచో సర్వజనవశీకరణ, కార్యసిద్ధియు లభించును.

శ్రీ మురళీధర యంత్ర విధానము సంపూర్ణము.

# శ్రీ సుదర్శన మహాచక్ర యంత్రము

### మూలమంత్రము

"ఉగ్రం వీరం మహావిష్ణుం, జ్వలంతం, సర్వతో ముఖం
నృసింహం భీషణం భద్రం మృత్యోర్మృత్యుం నమామ్యహం.

### యంత్రతంత్ర మహిమలు

పూర్వకాలంలో దేవతలందరికీ, మృత్యువును, పాప కర్మలను జూచి మహాభయము కలిగి బ్రహ్మదేవుని సన్నిధికివెళ్ళి స్తోత్రము చేసి తప్పించుకొనే తరుణోపాయము తెలుపవలసినదిగా ప్రార్థించిరి. అప్పుడు బ్రహ్మదేవుడు దేవతల యందు దయగలవాడై శ్రీ సుదర్శన నరసింహ, మహామంత్ర, మహాయంత్రములు ఉపదేశించిరి. ఈ మహామంత్ర యంత్ర జపపూజాదులు దేవతలు చేసి పాపభయాలు మృత్యుభయాలు లేకుండా సౌఖ్యంగా నుండిరి. గాన ఈ మహామంత్ర యంత్ర జపపూజాదులు చేయువారు వారి వారి పూర్వజన్మ పాపముల నుండి విముక్తిపొంది దీర్ఘాయుర్దాయవంతులై పుత్రపౌత్రాభివృద్ధిగా ఐశ్వర్యవంతులై సౌఖ్యముగా నుండెదరు.

### యంత్రమంత్ర ప్రయోజనము

ఈ మహాయంత్రముగల రాగిరేకును పటముగా కట్టించుకొని గృహములలోను, విద్యాలయములలోను, మిల్లులు, ఫ్యాక్టరీలు మొదలైన వానియందు పూజించుకొని పుష్పములతో అలంకరించి నమస్కరించుచువారి కార్యక్రమముల పై వెళ్ళుచుండిన యెడల గ్రహదోషాలు తొలగిపోయి ఎంత కఠినమైన కార్యములైనా సునాయాసముగా నెరవేరును. శత్రువులపై అఖండవిజయము, కీర్తి, గౌరవము లభించును. ధనవృద్ధి కుటుంబవృద్ధి కలిగి సౌఖ్యముగా నుండెదరు.

### మంత్రసిద్ధిక్రమము ప్రయోజనము

ఈయంత్రమును పటముగా కట్టి పూజించుకొనవచ్చును. లేదు రాగిరేకు మీద చెక్కించి పూజించుకొనవచ్చును. ప్రతి రోజూ ఈ మహాయంత్రమును పుష్పాక్షతలతో పూజించుచు మూలమంత్రమును రోజుకు వెయ్యిసార్లు చొప్పున జపించుచు ఒక లక్ష మంత్రజపము చేసి, హోమము తర్పణమార్జనాదులు చేసి యథాశక్తిగా అన్నదానము చేసినవారలకు మంత్రసిద్ధి లభించును. మంత్రసిద్ధి పొందినవారు లోకములో విరాజిలు సంపూర్ణారోగ్యముతో దీర్ఘాయుర్దాయముతో ఐశ్వర్యవంతులుగా నుండి అంత్యమునందు విష్ణుసాన్నిధ్యం పొందెదరు.

ప్రతి రోజూ వెయ్యి మూలమంత్రములను జపించలేనివారు, రోజుకి నూటయెనిమిది మూలమంత్రములను యంత్రమునందు కూర్చుని జపించువారుండో పటికబెల్లమో కొబ్బరికాయయో కొట్టి నైవేద్యము చెల్లించుచున్న యెడల వారివారి సమస్త కోర్కెలు సులభముగా నెరవేరును. ఉద్యోగ వృత్తి వ్యాపారాదుల యందు గొప్ప అభివృద్ధి కలుగును. ఆకస్మిక ధనలాభము అధిక ధనలాభము కలుగును. సభా పూజ్యత కీర్తి ప్రతిష్ఠలు లభించును.

ఈ యంత్రమును విస్తృతిగా చక్కగా తెల్లకాగితము మీద వ్రాసుకొని లేదా పలచని రాగి లేదా వెండి లేదా బంగారం ఏదైనా ఒక రేకుమీద [illegible] చక్కగా వ్రాసి పూజాస్థలములో వుంచి గంధం పుష్పాక్షతలతో పూజించుచు రోజుకి నూట ఎనిమిది మూలమంత్రముల చొప్పున నలభై రోజులు జపము చేసి యంత్రమును తీసి జాగ్రత్తగా మడిచి రాగి లేదా వెండి లేదా బంగారం ఏదైనా ఒక దానితో చేసిన తాయెత్తునందు పెట్టి [illegible] చేసి పురుషులైన కుడిచేతి దండకు, స్త్రీలైన మెడలో ధరించిన యెడల గొప్ప శక్తివంతులై అద్భుతమైన కార్యములను సునాయాసముగాసాధించెదరు. సభలయందు పూజించబడెదరు. కఠినమైన శత్రువులు మిత్రులగుదురు. భూత, ప్రేత, పిశాచాదులు, దీర్ఘరోగములు దరిచేరవు. ప్రయాణములయందు ప్రమాదములకు గురికారు. అకాలమరణాలు దరిచేరవు. చిల్లంగి, చేతబడి పరయంత్ర పరతంత్రాది బాధలుండవు. ప్రయత్నించే ప్రతి పని లాభించును.

గొప్పధనవంతులయ్యెదరు. పుత్రపౌత్రాభివృద్ధిగా ఐశ్వర్యవంతులై సుఖసంతోషములతో వృద్ధిచెందుదురు. ఈ మహాయంత్రమునకు రెండవ ప్రక్కనున్న శ్రీ అష్టముఖగండభేరుడ జ్వాలానృసింహ మహా యంత్రమునకు వ్రాయబడిన మూలమంత్రమును కూడా ఈ మూలమంత్రముతో పాటు జపించుచుండిన యెడల గొప్ప అద్భుతమైన మహాశక్తిపరులయ్యెదరు. బ్రహ్మహత్య భ్రూణహత్యాది మహాపాతకములు నశించి పోవును. స్త్రీ పురుషాది సర్వజన వశీకరణ, సర్వశత్రువులు తమకుతామే లొంగిపోవుట, పలుకుబడి, ఉన్నతపదవులు, సభాపూజ్యత, ఆకస్మిక ధనలాభము, కుటుంబవృద్ధి పరస్త్రీలాస్యులయందు అభివృద్ధి యిత్యాది మహోన్నత ఫలితములు కలుగును. ఈ మహా యంత్రములు మానవులందరికి కల్ప వృక్షముల వంటివి.

# శ్రీ స్వయంవరకళా మహాయంత్ర మహిమ

### మూల మంత్రము

"ఓం హ్రీం యోగిని యోగిని యోగేశ్వరి యోగేశ్వరి యోగ భయంకరి సకలస్థావర జంగమస్యముఖం హృదయం మమవశమాకర్ష యాకర్షయ స్వాహా ।

### ధ్యానము

శ్లో॥ ఓం శంభుం జగన్మోహనరూప పూర్ణాం ।
విలోక్య లజ్జాకులితాం సితాఢ్యామ్ ।
మధూ కమాలాం స్వపతీకరాభ్యాం ।
సంబిభ్రతీ మద్రిసుతాం భజామి ॥

ఈ స్వయంవర కళామహాయంత్రము యొక్క ప్రభావము అద్భుతమైనది. ఈ మహామంత్రము వశ్యాకర్షణ సామర్థ్యమును, ఐశ్వర్యమును ప్రసాదించుటలో అత్యుత్తమమైనది. మరియును శ్రీ స్వయంవర కళామహాయంత్ర, మంత్రముల నుపాసించి, అనేక మహర్షులు, దేవగంధర్వాప్సరసాదులు వశపర్చుకొని, అపరిమిత కీర్తిని పొందియున్నారు. ఈ స్వయంవర కళామహాయంత్ర మంత్రములను సేవించు సాధకుడు, సర్వ రాజ, మంత్రిపుంగవాదులను, సర్వ స్త్రీ పురుషాదులను సకలస్థావర, జంగమ ప్రాణులను అద్భుతముగా వశపర్చుకొన గల్గుదురు.

ఈస్వయంవర కళామహాయంత్రమును ఒక బంగారు రేకుపైగాని, వెండి రేకుపైగాని ఒక రాగిరేకుపైగాని చక్కగా చెక్కించి లేదా ఈ యంత్రకాగిత మునే పటముగా కట్టించిగాని, ప్రతినిత్యమూ ఉదయం సాయంత్రముల కుంకుమాక్షతలచే పూజించి యధాశక్తి నైవేద్యాదులు సమర్పించిన యెడల ఐశ్వర్యము విజయము వశీకరణ సామర్థ్యము కలుగును.

మరియూ ఈ స్వయంవర కళామహాయంత్రమునకు త్రిసంధ్యల యందున్నూ పంచ పూజలు గావించుచూ, ఈ మహాయంత్రాధిష్ఠాత్రియై యున్న శ్రీ స్వయంవర కళామహాదేవికి "పత్రం, పుష్పం, ఫలం తోయం" అన్నట్లు యధాశక్తి నారికేళ కదళీ ఫలాదులు నైవేద్యము గావించిన యెడల ఆరోగ్యాభివృద్ధి సర్వకార్యముల యందు జయము, శత్రువులు పరాభూతులగుట, సంఘగౌరవము, వృత్తి వ్యాపారాదులయందు అభివృద్ధి సంసార సౌఖ్యము, కళత్రపుత్ర మిత్రాదులు తనమాట జవదాటకుండుట సమస్త భోగభాగ్యాభివృద్ధి కలుగును.

శ్రీ స్వయంవర కళాదేవియే ఈ మహాయంత్ర మని అభేదముగా దలంచి, "శంభుం జగన్మోహనరూప పూర్ణాం విలోక్యం లజ్జాకులితాం సితాఢ్యాం । మధూ కమాలాం స్వపతీక రాభ్యాం సంబిభ్రతీ మద్రిసుతాం భజామి ।" అని ధ్యానించి ప్రాణన్యాస, జీవన్యాస, కళాన్యాసాదు లొనర్చి, పుష్పాంజలి సమర్పించి, మధుశర్కరా మిశ్రిత గోక్షీరంబులను, గోఘృతయుత సూపాది సంయుత శాల్యన్నంబును నైవేద్యంబు సమర్పించినయెడల శ్రీ స్వయంవరా కరుణాకటాక్షము వలన, లక్ష్మి, టమారా, గజకర్ణ, గోకర్ణ..ఇంద్రజాల, మహేంద్రజాలాది మహా విద్యలు సాధకునకు కరతలామలకము లగును.

శ్రీ స్వయంవర కళాదేవి మహాయంత్రమును రక్తవస్త్రంతో పూజించుచూ "ఓం హ్రీం యోగిని యోగిని యోగేశ్వరి యోగేశ్వరి యోగభయంకరి సకల స్థావర జంగమస్య ముఖం హృదయం మమ వశమాకర్షయా కర్షయస్వాహా" అనుమూల మంత్రముతో, తంత్రోక్తానుసారము, నిర్ణీత సంఖ్యాప్రకారము జపము పూర్తిచేసి, తేనె నెయ్యి పంచదారతో కలిపిన పరిపేలాలను హోమము గావించిన యెడల శ్రీ స్వయంవర కళాదేవి ప్రసాదమువలన సద్గుణ వతియు పతిభక్తి యుతయు, సాలంకార వస్త్రాభరణాది కనకసంపన్నయు నగు కన్యక వివాహార్థము లభించును. మరియూ చిరకాలమునుండి వివాహము గాకుండా యుండెడు, యువతీ యువకులు ఈ స్వయంవర కళామహాయంత్రమునకు ప్రతి నిత్యమూ, పంచపూజలు గావించి, ధ్యానించుచున్న యెడల అతిశీఘ్రకాలములోనే అనుకూల సంబంధములు కుదిరి వారి వారి మనోభీష్టములకు అనుగుణముగా వివాహము జరుగును.

ఈ స్వయంవర కళామహాయంత్రమునకు నిత్యము షోడశోపచారపూజ గావించుచూ, హవనముతో హోమము చేయుచున్న యెడల సర్వజనవశ్యము, సర్వరాజ పురుష రాజకీయోద్యోగులు వశులగుట, తద్వారా సివిల్, క్రిమినల్, మున్నగు కోర్టు వ్యవహారములలో న్యాయస్థానముల యందు విజయము, సర్వైశ్వర్యాభివృద్ధి, సర్వసౌభాగ్యాభివృద్ధి, సర్వమనో భీష్టములు నెరవేరుట మొదలైన మహాఫలములు కలుగును. సర్వజనులను వశ్యాకర్షణ చేయుటలో ఈ స్వయంవర కళాయంత్ర, మంత్రములు అద్వితీయమైనవి. సర్వసౌఖ్యాది సిద్ధిరస్తు.

సర్వేజనాస్సుఖినో భవన్తు తథాస్తు.

# శ్రీ పంచముఖీ హనుమన్మహా యంత్ర మహిమ

### మూల మంత్రము

ఓం హ్రాం క్రీం హ్స్ఫ్రేం గ్లౌం హ్స్రాం శ్రీం హ్రీం హరి మర్కట మర్కటాయ వం వం వం వం వం వషట్ స్వాహా ఓం హ్రీం క్రోం ఆంజనేయాయ నమః ।

### వశ్యమంత్రము

ఓం శ్రీం హ్రీం క్ష్లీం హరి మర్కట మర్కటాయ వం వం వం వం వం సర్వజనం మే వశ్యాకర్షణం కురు కురు వషట్ స్వాహా ।

ఈ పంచముఖీ హనుమన్మహామంత్ర యంత్రములు అపూర్వమైనవి. ఈ పంచముఖ ఆంజనేయ మహాయంత్రమును సందర్శించినంత మాత్రముననే అమితోత్సాహము, మనశ్శాంతి, మనోభీష్టసిద్ధి కలుగును. ఈ యంత్రమును రాగిరేకుపైనగాని, వెండిరేకుపైనగాని, బంగారు రేకుపైనగాని చక్కగా చెక్కించుకుని లేదా ఈ మంత్ర కాగితమునే పటముగా కట్టించుకొని పూజాపీఠమునందుంచుకొని పూజించవలెను.

పైన వ్రాసిన మూలమంత్రమును ప్రతిరోజూ ప్రాతఃకాలమందు భక్తి శ్రద్ధలతో 108 సార్లు జపించు కొనుచుండిన యెడల శత్రువిజయము సివిల్ క్రిమినల్ మున్నగు కోర్టు వ్యవహారములయందు, విజయము, కీర్తి, పెద్ద పెద్ద ఉద్యోగుల ఆదరణ లభించును. ఆరోగ్యాభివృద్ధి ఐశ్వర్యవృద్ధి, సంతతివృద్ధి కలుగును. మరియు పైన వ్రాసిన వశ్య మంత్రమును కూడా ప్రతిరోజూ విడువకుండా 108 సార్లు జపించుకొనుచుండిన యెడల స్త్రీపురుషాది సర్వజనులు వీరిని చూచినంతమాత్రముననే వశ్యులై వీరికి కావలసిన ఎంతటి కష్టమైన కార్యములైనను సులభముగా చేసి పెట్టుచుండెదరు. రాజసభల యందు గౌరవము పూజ్యత లభించును. వ్యాపారము వృత్తిఉద్యోగముల యందు అద్భుతముగా అభివృద్ధి కలుగును. జయము యశస్సు లభించును.

మరియు ఈ యంత్రమును పలుచని రాగిరేకుపైగాని లేదా కాగితముపైనగాని, కుంకుమపువ్వు రసముతోగాని, ఎర్ర సిరాతో కుంకుమపువ్వురసము కలిపిన దానితో గాని వ్రాసి చక్కగా మడిచి రాగితాయెత్తునందు పెట్టి కుడిచేతికి ధరించి మంత్రజపము చేయుచున్న యెడల గొప్ప ఫలితములు గలుగును. మూలమంత్రమును గ్రహణసమయములో నదీజలమునందు తూర్పు ముఖముగా నిలుచుండి 1008 సార్లు జపించిన యెడల మంత్రశక్తి వృద్ధియై సర్వమనోభీష్టములు తలచిన మాత్రముననే నెరవేరును.

### మంత్రసిద్ధి క్రమము

ఈ యంత్రమును ముప్ఫై ఆరులక్షల సార్లు దీక్షతో జపించిన సిద్ధించును. నదులయందుగాని చెరువుల యందుగాని బొడ్డులోతు నీటిలో నిలుచుండి మంత్రమును ఒక నియమం ప్రకారము జపించిన యెడల అతి తొందరలోనే మంత్రసిద్ధి కలుగును. లేదా స్వగృహములోనే పూజాపీఠమునందు యంత్రము నుంచి రెండు ప్రక్కల యందు నేతితోగాని కొబ్బరినూనెతోగాని దీపములుంచి యంత్రమును పూజించి మంత్ర జపము చేయుచు జపము పూర్తిఅయిన పిమ్మట పెసరపప్పు బియ్యము కలిపి నెయ్యి బెల్లం కలిపి వండిన అన్నముగాని లేదా పెసరపప్పు బియ్యం కలిపివండిన పులగము గాని నివేదన చేసి తాను భుజించవలెను. మంత్రజపమును దీక్షతో సిద్ధికొరకు చేయువారు బ్రహ్మచర్య మవలంబించవలెను.

ఈ పంచముఖీ హనుమన్మహా మంత్రమును 36 లక్షలు జపించి, తర్పణాంశం పాలు, పెరుగు, నెయ్యితో కలిపిన పక్షముగాని అరటిపండ్లనుగాని మామిడిపండ్లు మాదీఫలములతో గాని విధి ప్రకారము హోమము చేసి యిరవై యిద్దరు బ్రాహ్మణులకు భోజనము పెట్టినయెడల మంత్రసిద్ధి కలుగును. ఇందువలన బ్రహ్మరాక్షస, శాకినీ, ఢాకినీ మొదలగు సమస్త బాధలు మహా విషములు ఒక నిమిషములోనే నశింపుచేయగల సమస్తశక్తులు లభించును. సాధకుడు గొప్ప ఐశ్వర్య వంతుడగును. సాక్షాత్తు ఆంజనేయుని అంతవాడగును. మూలమంత్రముతో అభి మంత్రించ బడిన మంచినీటిని త్రాగించిన యెడల విభూతిని తిలకముగా పెట్టిన యెడల విషములు సర్వభూత ప్రేత పిశాచబాధలు, దీర్ఘవ్యాధులు, చంటిపిల్లల జ్వరములు సమస్త వ్యాధులు సమస్త భయములు నిస్సంశయముగా హరించిపోవును.

వశ్యమంత్రముతో అన్నపానీయములను నూట ఎనిమిది సార్లు అభిమంత్రించి ఎవరికి తినిపించి త్రాగించెదరో వారు వశ్యులై యుండెదరు. ఈశాన్య దిక్కుగా వ్యాపించిన గరుగచెట్టు యొక్క వేరును తీసుకువచ్చి ఆ వేరుతో అంగుష్ఠ పరిమాణం గల ఆంజనేయుని బొమ్మను తయారు చేయించి ప్రాణ ప్రతిష్ఠాదులు చేసి గంధసిందూరములతో పూజించి మూలమంత్రము 108 సార్లు జపించి, యెవరి గృహము యొక్క సింహద్వారము యెదురుగుండా భూమిలో పాతిపెట్టబడునో ఆ ఇంటియందు చోరబాధలు, గృహారిష్టములు గ్రహబాధలు విషజంతువుల బాధలుకలుగవు. ఆగృహము పుత్ర పౌత్రాభివృద్ధిగా వర్ధిల్లును ఐశ్వర్యవంతులై సుఖజీవనము చేసెదరు.

# శ్రీ మహామృత్యుంజయ యంత్ర మహిమ

## మూల మంత్రము

"ఓం హౌం ఓం జూం సః భూర్భువః స్వః త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం । ఉర్వారుకమివ బంధనా న్మృత్యోర్ముక్షీయ మామృతాత్ స్వః భువః భూః ఓం సః జూం హౌం ఓం"

## ధ్యానం

శ్లో ॥ హస్తాంభోజయుగస్థ కుంభయుగళా దుద్ధృత్య తోయం శిరః, సించంతం కరయోర్యుగేన దధతం స్వాంకేన కుంభౌ కరే। అక్షస్రఙ్ మృగహస్త మంబుజగతం మూర్ధస్థచంద్రస్రవ, త్పీయూషార్ద్రతనుం భజే సగిరిజం మృత్యుంజయం త్ర్యంబకమ్

శ్రీ మహామృత్యుంజయ యంత్రము ప్రత్యక్షఫలము నొసంగునట్టిదియై యున్నది "ఆయుః కామాయమానేన ధర్మార్థ సుఖసాధనమ్" అను వచనానుసారము ధర్మార్థ కామ మోక్షములనెడి చతుర్విధ పురుషార్థములను సంగ్రహించుకొనుట ప్రతి మానవునకు కర్తవ్యమై యున్నది. అట్టి పురుషార్థ ఫలములను సంతృప్తికరముగ సమృద్ధిగా పొందుటకు, ఆయుర్దాయ మత్యంతా వశ్యకంబై యున్నది. సర్వజనవాంఛితం బైనట్టి ఆయుర్దాయమును, అపమృత్యువుల పాలుగాకుండా రక్షించుటకున్నూ దేహధారులకు సృష్టికర్త యొసంగిన యాయుర్దాయమును పెంపొందించుటకున్నూ, శ్రీ మహామృత్యుంజయ మంత్ర, యంత్రపూజా విధానములు, పరమకారుణికోత్తముడగు శ్రీ పార్వతీ నాధునిచే ఈ భూలోక వాసులకు ప్రసాదించబడి యున్నవి. దైత్య గురువగు శ్రీ శుక్రాచార్యులవారు ఈ మహామృత్యుంజయ యంత్ర మంత్ర సిద్ధులను, శ్రీ పరమేశ్వరునిచేతననుగ్రహింప బడినవారై కోటానుకోట్ల మృత దానవులను పునర్జీవితుల గావించిరి.

ఈ మహామృత్యుంజయ యంత్రమును చక్కగా ఒక బంగారురేకుపైగాని, ఒక వెండిరేకుపైగాని లేక ఒక రాగిరేకుపైగాని, భూర్జపత్రముపైగాని లిఖించి లేదా ఈయంత్ర కాగితమునే పటముగా కట్టించిగాని, భక్తిశ్రద్ధలతో నమస్కరించి, పై సుదహరించిన ధ్యానశ్లోకముతో శ్రీ మహామృత్యుంజయమూర్తిని ధ్యానించి పత్రం, పుష్పం, ఫలం తోయం అను న్యాయాను సారముగా యథాశక్తి నైవేద్యాదులు సమర్పించిన యెడల జ్వరాది సర్వరోగములు హరించి ఆరోగ్యము కల్గును.

ఈ మహాయంత్ర రాజమును ప్రతినిత్యమూ ఉదయం సాయంత్రముల యందు కుంకుమాక్షతలచే పూజించి, ఈ మహాయంత్రాధిష్ఠితుడై యున్న శ్రీ మహామృత్యుంజయేశ్వరుని స్మరించి, ఈ మహాయంత్ర రూపమునే శ్రీ మహా మృత్యుంజయమూర్తిగా దలంచి పంచపూజలు గావించుచున్న యెడల అపమృత్యువు పోయి ఆయుర్దాయ మధికమగును. భూత ప్రేత, పిశాచ, రాక్షస, బ్రహ్మరాక్షసాది గ్రహావేశ బాధలు తొలగును. సర్వకార్యములు నిర్విఘ్నముగా కొనసాగును.

ఈ మహామృత్యుంజయ యంత్రమునకు జీవన్యాస, ప్రాణన్యాస, కళాన్యాసాదులొనర్చి త్రిసంధ్యలయందున్నూ పుష్పములచే పూజించి నారికేళాది ఫల నైవేద్యంబు సమర్పించి "ఓం మృత్యుంజయ మహారుద్ర త్రాహిమాం శరణాగతం జన్మ మృత్యు జరారోగైః పీడితం కర్మబంధనైః । తావకః త్వద్గత ప్రాణః త్వచ్చిత్తోహం సదామృడ ।" అని ధ్యానించిన యెడల పూర్వజన్మకృత పాపకర్మంబులు నశించి సర్వరోగహరణంబై సంపూర్ణారోగ్యంబులు లభించును. కళత్ర సౌఖ్యంబు కలుగును. పుత్రపౌత్రాభి వృద్ధికలుగును. బంధు మిత్రాదులు వశీభూతు లగుదురు. సంఘములో గౌరవాదరములు లభించును.

ఈ మహామృత్యుంజయ యంత్రమునకు ప్రతినిత్యమూ షోడశోపచార సహిత పూజగావించుచూ సాధకుడు శ్రద్ధాభక్తులు కలవాడై "ఓం హౌం ఓం జూం సః భూర్భువః స్వః త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం । ఉర్వారుకమివ బంధ నాన్మృత్యోర్ముక్షీయమామృతాత్ స్వః భువః భూః జూం సః హౌం ఓం" అను మూలమంత్రమును తంత్రోక్తానుసారముగ యథావిధిగ జపించుచూ నెయ్యి పాలతో ప్రతి నిత్యమూ జపదశాంశము హోమము చేయుచున్న యెడల జలగండము, అగ్ని గండము సర్పగండము, బస్సు సైకిల్సు మోటార్లు మొదలగు గండములు, ప్రమాదములు, పిడుగుపాటు, ఎలక్ట్రిక్ కరెంటుషాకు మొదలయిన అపమృత్యు భయము లన్నియునూ తొలగిపోవును.

మరియు సాధకుడు నియమబద్ధుడై ఈ మహామృత్యుం జయ యంత్రమును ప్రతినిత్యమూ భక్తిశ్రద్ధలతో పూజించుచూ మోదుగ చెట్టు సమిధలు త్రిమ్మధుర ముక్కలతో హోమము చేయుచున్న యెడల కర్మరాహిత్యము కలిగి మృత్యువునను జయించినవాడై అనేకవేల సంవత్సరములు సూర్యచంద్రాదులుండు పర్యంతము చిరంజీవిగా వర్ధిల్లును.

ఈ మహామృత్యుంజయయంత్ర పూజకునకు పరమంత్ర కృత అభిచారాది భయంబు లుండనేరవు. శత్రువులు నశించి పోయెదరు. రాజస్థానముల యందు బహిరంగ సభలయందు వాక్చాతుర్యము ప్రజాకర్షణ కలుగును.

మరియూ యీ మహామృత్యుంజయ యంత్రమును ప్రతినిత్యమూ పంచోపచారములచే పూజించుచూ, సాధకుడు త్రిమ్మధుర, మర్రిసమిధలు నువ్వులు గరికపోచ పాలు, నెయ్యి, పరమాన్నము ఈ ద్రవ్యములతో హోమము చేయుచూ ప్రతినిత్యమూ ఎనిమిదిమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టుచున్న యెడల శత్రుకృత ఉచ్చాటన, మారణాది ప్రయోగములు పటాపంచలై పోవును. సాధకునకు సర్వసంపదలు లభించును.

శ్రీ మహామృత్యుంజయ యంత్రమును త్రికాలముల యందు షోడశోపచార విధిసహితముగా పూజించి, ద్వాదశావరణ సహిత్యల నొనరించి తంత్రోక్తానుసారము మూలమంత్రమును జపించి, రాజపురుష, మంత్రి పుంగవాదుల దర్శనమును చేసినయెడల వాక్సిద్ధియును, సభారంజన మోహనము కలిగి తద్వారా సివిల్ క్రిమినల్ వ్యవహారములలో న్యాయ స్థానముల యందు విజయము లభించును. సమస్తలోక భాగ్యములు కరతలా మలకములై యుండును. సర్వమనోవాంఛా సఫలత్వము కలు గును. కళత్ర, పుత్రమిత్రాదుల ఆదరమును పొందుచూ,

